# అరుణతార

సాహిత్య సాంస్కృతిక మాస పత్రిక

సంపుటి : 34 సంచిక : 284 జనవరి-మార్చి 2011

ఈ సంచిక వెల : రు 25 పేజీలు : 116



పోలీసు కాల్పుల్లో చనిపోయిన ఎర్రయ్య భార్య, పిల్లలు

## ప్రజల ఆకాంక్షను గౌరవిస్తూ తెలంగాణ రాష్ట్రాన్ని వెంటనే ఏర్పాటుచేయాలి!

## సామ్రాజ్యవాద అనుకూల, ప్రజా వ్యతిరేక, పర్యావరణ విధ్వంసకర ప్రాజెక్టులను వెంటనే నిలిపివేయాలి!



బుల్లెట్ గాయాల బారిన పడిన ఖగపతి తల్లిదండ్రులు

## తెలంగాణ సాధనకు ప్రజా ఉద్యమాలే మార్గం అన్న అంశంపై 10 జనవరి, 2011న విరసం సభ దృశ్యాలు




ప్రొ. కె. జయశంకర్




రత్నమాల, గీతాంజలి, వరవరరావు, కాశీం




ప్రజాకళా మండలి బృందం - ప్రభాకర్, కోటి, జాన్, తదితరులు, సుదర్శన్ (విరసం)

## ఫిబ్రవరి 20, 2011న కావలిలో జరిగిన కె.వి.ఆర్. తొలి స్మారకోపన్యాస సభ దృశ్యాలు



వకుళాభరణం రామకృష్ణ, చలసాని ప్రసాద్



కె.వి.ఆర్. స్మారకోపన్యాసానికి హాజరైనవారు

KLVA101M152

అరుణతార
సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక

సంపుటి : 34 ✦ సంచిక : 284 ✦ జనవరి - మార్చి 2011

సంపాదకుడు
**చలసాని ప్రసాద్**

✧ ✧ ✧

వర్కింగ్ ఎడిటర్
**డి.వి. రామకృష్ణా రావు**
ఎం.ఐ.జి. - 14, ఎ.పి.ఐ.ఐ.సి. కాలనీ,
కార్బైడ్ కంపెనీ ఎదురుగా,
మౌలాలి, హైదరాబాద్ - 500040
* **కేవలం పోస్ట్, బుక్‌పోస్ట్ ల ద్వారా**
రచనలు పై చిరునామాకూ,
* **ఇ-మెయిల్ ద్వారా**
arunatara1977@gmail.com,
raamki70@gmail.com
లకూ రచనలు పంపవచ్చు

✧ ✧ ✧

**కొరియర్, రిజిస్టర్డ్ పోస్ట్ ల ద్వారా**
రచనలు పంపితే...
**టి. కృష్ణాబాయి**
9-19-3, సి.బి.ఎం. కాంపౌండ్
విశాఖపట్నం - 530 003

✧ ✧ ✧

**మేనేజర్**
**ఎస్. రవికుమార్**
5-1307, దొరసానిపల్లె రోడ్,
ప్రొద్దుటూరు, కడప జిల్లా - 516360
సెల్ : 9866021257

✧ ✧ ✧

**విరసం కార్యదర్శి చిరునామా**
**పాణి**
50-348, L 19 B II,
అరోరా నగర్,
బి క్యాంప్, కర్నూల్ - 2

ఈ సంచిక వెల : రు. 25

## సంపాదక లేఖ...

- చలసాని ప్రసాద్

ఆంధ్రా గవర్నమెంటా, పెంటా
ఆగు ఆగు మై బోల్తాహూం
నిఖాయించు మరి, తమాయించు నీ
శవం మీద మై చల్తా హుం

అన్నాడు మహాకవి శ్రీశ్రీ. ఆయన ఈ విషయం 1971లోనే చెప్పినవి. ఇవాళ కాకరపల్లిలో నిప్పులాంటి నిజంలాగ అందరికీ కనబడుతోంది. ఇది రవిశాస్త్రిగారన్నట్లు ఆంధ్రా గవర్నమెంటు ప్రజలమీద ప్రభుత్వమే కాని ప్రజల ప్రభుత్వం కాదు. ఈ ప్రభుత్వం ఇవాళ ప్రజలమీద పైశాచిక తాండవం చేస్తోంది. ఈ నైశాచర నాటకానికి తెరదించాలి.

నిన్న సోంపేటలో - నేడు కాకరపల్లిలో నాలుగు నిండు ప్రాణాలని పొట్టనబెట్టుకొంది. వేలాది మందిని లాఠీ దెబ్బలకు గురి చేసింది. ప్రజల మీద ఈ ప్రభుత్వం అమానుష హత్యాకాండ కొనసాగిస్తోంది.

తమ జీవితాలకు ఆసరా చూపించమని, తమ బతుకులను బుగ్గిపాలు చెయ్యొద్దని ప్రజలు వీధుల్లోకి వచ్చి, ప్రాణాలకు తెగించి మరీ పోరాడుతున్నారు. ఇవాళ ప్రజల ముందు ప్రభుత్వం దోషిగా నిలబడింది. ప్రజల మీద దారుణ మారణ హత్యాకాండకు ఒడిగట్టి ఈ దుర్మార్గ కాంగ్రెసు ప్రభుత్వం ఎంత త్వరగా గద్దె దిగితే అంత మంచిది.

ఇటు రాష్ట్ర ప్రభుత్వం, అటు కేంద్ర ప్రభుత్వం కూడా అమెరికా అడుగులకు మడుగులొత్తుతున్నాయి. విదేశీ హిరణ్యాకాంక్షుల ఖజానా నింపడానికి స్వదేశీ హిరణ్యకశిపులు ప్రజలను వేటాడుతున్నారు. ఈ వేటకి మూడు ముద్దు పేర్లున్నాయి - గ్లోబలైజేషన్, లిబరలైజేషన్, ప్రైవేటయిజేషన్. ఈ మూడూ - ఒకప్పుడు చాపకింద నీరులా ఉండేవి. తర్వాత జేబులో తేలులాగా మారాయి. ఇప్పుడు నట్టింటి నాగుబాముల్లాగా మనల్ని కాటు వేస్తున్నాయి.

ఈ విష సర్పాల తోకలని తెగకోసి, నడుములు విరగకొట్టి, కోరలు పీకితేనేగానీ మన దేశ ప్రజలు బతికి బట్ట కట్టలేరు. ఈ విషపు విధానాలకు ప్రతిరూపమే ఇప్పటి థర్మల్‌ప్లాంట్లు. వీటిని సమూలంగా పెరికివేస్తేనే మన దేశ ప్రజల మనుగడ సజావుగా కొనసాగుతుంది.

ప్రజలపై అమానుషంగా కాల్పులు జరిపి, నెత్తుటి కూడు తింటూ, ప్రజల జీవితాలతో చెలగాటం ఆడుతున్న పోలీస్ ఆఫీసర్ల మీద బహిరంగ విచారణ జరిపించాలి.

పోలీసు కాల్పులను విరసం తీవ్రంగా ఖండిస్తోంది.
నేలకొరిగిన అమర వీరులకు లాల్ సలామ్.
పోలీసుల రాజ్యమిది - పోలింగొక బూటకం
ఫాసిజమై మారుతోంది - ప్రజాస్వామ్య నాటకం - శ్రీశ్రీ
కళింగ సీమ ప్రజానీకానిక విరసం వెన్నుదన్ను.

## ఈ సంచికలో...




చందాలు, బకాయిలు మనియార్డర్, డి.డి.ల రూపంలో మేనేజర్‌కు పంపించండి.
డి.డి.లను ఎస్. రవికుమార్, ప్రొద్దుటూరు పేర తీయండి.
విడి సంచిక వెల : రు. 10, సంవత్సర చందా : రు. 100, జీవితచందా : రు. 1000

**కవర్‌పేజీలపై ఫొటోలు :** గీతాంజలి, రాంకి, నెల్లూరు యూనిట్

వ్యాసం

# ప్రజలు - ప్రభుత్వాలు

- చలసాని ప్రసాద్

ఇవాళ అటు కేంద్రంలోనూ, ఇటు రాష్ట్రంలోను ఉన్నవి ప్రజల మీద ప్రభుత్వాలే గాని ప్రజా ప్రభుత్వాలు కావు. దొంగనోట్లకే, దొంగ ఓట్లకే పుట్టి, పెరిగి బతికి బట్ట కడుతున్న ఈ సంకర ప్రభుత్వాలు చావు తెలివి తేటలు ప్రదర్శిస్తున్నాయి. దాదాపు రెండు దశాబ్దాలుగా మూడు ముద నష్టాలు మనలని పీల్చి పిప్పి చేస్తున్నాయి. అందరికి తెలిసినవే అవి. అందరి నోళ్ళల్లోనూ నానుతున్నవే కూడా. వాటి పేర్లే ప్రపంచీకరణ, సరళీకరణ, ప్రైవేటీకరణ. ఇవి ఒకప్పుడు చాపకింద నీరు - పిమ్మట జేబులో తేళ్ళు - ఇప్పుడు నట్టింటి నాగుబాములు. మాయల ఫకీరు ప్రాణాలు సప్త సముద్రాల అవతల, మర్రిచెట్టు తొర్రలో బంగారు చిలకలో దాగి ఉన్నట్లు. ఈ మూడు ముదనష్టాల ప్రాణాలు కూడా అమెరికా అనే శతకోటి పడగల పాములో దాగి ఉన్నాయి. ఆ విష సర్పం అమెరికా ఇవాళ ఒబామా అడుగులకు మడుగులొత్తడంలో మన పాలకులు మైమరిచిపోతున్నారు. ఒబామా నాగస్వరం ఊదుతున్నాడు.

అలనాడు తెల్లవాడు మనలని నిలువు దోపిడీ చేశాడు. కానీ ఇవాళ ఒబామా నేలనీ, నీటినీ, గాలిని కూడా కబ్జా చేస్తున్నాడు. ఒబామా పగటి దొరగ. దేనికైనా తెగిస్తాడు, స్వదేశీ, విదేశీ షావుకార్లు తోడుదొంగలు బాగా కుమ్మక్కయిపోయారు.

ఎక్కడ దాకానో ఎందుకు కళింగసీమనే తీసుకుందాం. విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలకి ఉమ్మడి పేరు కళింగ సీమ. ఇక్కడ ప్రజలు సముద్ర తీరాన్నీ, నేలనీ, అడవులనీ, కొండలనీ నమ్ముకుని బతుకుతున్నారు. తాగడానికి నీళ్ళు కూడా లేని ప్రజల నెత్తురునే నీళ్ళుగా తాగుతున్నారిక్కడ ప్రభువులు.

గంగవరం గ్రామం పేరు అందరి నోళ్ళల్లోనూ నానింది. ఇది మత్స్యకారులపల్లె. వేటాడి బతుకున్నారు. యానం వాళ్ళ జీవనాధారం. చుక్క పొడూకాడే వేచి గంగమ్మతల్లికి దండాలు పెడుతూ కెరటాలపై తేలిపోతూ, చాలా దూరం వెళతారు. వాళ్ళ నోటికాడ కూడు తీసేసి ఇక్కడ మన ప్రభువులు పోర్టు నిర్మాణం చేపట్టారు. మత్స్యకారుల పొట్టలు కొట్టారు. వాళ్ళ జీవనాధారం పోయింది. ప్రజలు ఎదిరించారు. ప్రభువులు తుపాకులు పేల్చారు. బోడిపల్లి నూకరాజు నెత్తురు నేలమీద ఒలికింది (27, మార్చి 2006న). మన దేశ సంపదని విదేశీ గుత్తదారులకు ధారాదత్తం చేయడమే ఈ ప్రభుత్వం పని. బాక్సైట్ తప్ప నేల కోసం వేదాంత కంపెనీ వలలో చిక్కుకున్నారు. గిరిజనులు తిరగబడ్డారు. వాన్‌పల్లిలో (20, ఆగస్ట్ 2007) పన్నెండు మంది మహిళలను పోలీస్ పాములు దారుణంగా కాటువేశాయి. సిగ్గువిడిచిన ప్రభుత్వాలుకిమ్మన లేదు, రాష్ట్ర వ్యాప్తంగా ఆందోళన జరిగినా పెడ చెవిన పెట్టింది ప్రభుత్వం. అక్కడితో ఆగలేదు. మళ్లీ భల్లుగూడ (22, జనవరి 2010న)లో వాళ్ళు గిరిజన మహిళలపై ఘాతుకం జరిపారు.

గ్లోబలైజేషన్‌లో భాగంగా థర్మల్ విద్యుత్ --- నైశాచర నాటకం ఆడి పైశాచిక తాండవం చేస్తున్నాయి. సోంపేట (14, జూలై 2010)లో థర్మల్ దయ్యాలకి వ్యతిరేకంగా పోరాడుతున్న ప్రజలపైన పోలీసులు కాల్పులు జరిపారు. ముగ్గురు చనిపోయారు. ఎందరో గాయపడ్డారు. ఏడాది తిరకుండానే కాకరాపల్లి (28, ఫిబ్రవరి 2011)లో పోలీసులు కాల్పులు జరిపారు. ఇద్దరు చనిపోయారు ఎందరో గాయపడ్డారు. ఈ ఖాకీ ప్రభుత్వాలవి అన్నీ కాక లెక్కలే. ప్రజలు నిలవ నీడ లేక, పట్టెడన్నం లేక నానా ఆగచాట్లు పడుతున్నారు. పంటభూములు నీట మునిగిపోయాయి. పండిన ధాన్యం మొలకెత్తి, నల్లగా మారిపోయింది. ఎందుకూ పనికి రాకుండా పోయింది. ఇక ఆ భూముల్లో ఏ పంటా పండదు. ఏటా అవసరాలకి సరిపడా ధాన్యం, అపరాలు పండేవి. నూనె, ఉప్పు తప్ప ఇంకేమీ కొనాల్సిన పని ఉండేది కాదు. ఇక బతకడమెలాగ అనేది పెద్ద ప్రశ్నగా మిగిలిపోయింది.

తంపర భూముల్లో మత్స్యసంపద బాగా ఉండేది. వడ్డితాంద్ర జనానికి జీవనాధారం చేపలే. ఇప్పుడిక చేపలు బతికే పరిస్థితే లేదు. మరి వాళ్ళ బతుకులు ఏంకావాలి? వాళ్ళ కాళ్ళ కింద నేల కదిలిపోతోంటే మత్స్యకార మహిళలూ, రైతు కూలీలు కర్రలతో తిరగబడ్డారు. 60 ఏళ్ళ చంద్రమ్మ గట్టిగా ఎదుర్కొంది. మరి కడుపు మంట అలాంటిది. "ఎలాగన్నా ఈ ప్రాజెక్టు ఆపించండి నాయనలారా!" అని మొత్తుకుంటున్నారు.

దేశవ్యాప్తంగాను, మన రాష్ట్రంలోనూ ముఖ్యంగా కళింగసీమలో థర్మల్ దయ్యాల్ని పారద్రోలాలి. చీపురు కట్టలతో తరిమికొట్టాలి. ప్రత్యేక ఆర్థిక మండాలాలు అశేష ప్రజానీకానికి ఉరితాళ్ళు. కోస్టల్ కారిడార్ (ఇచ్ఛాపురం నుంచి కాకినాడ మాగ తడ వరకు) తక్షణం నిలిపివేయాలి.

థర్మల్ ప్లాంటులు సోలార్ ఎనర్జీతో కరెంటు లాగాలి. భారీ ప్రాజెక్టుల బదులు చిన్న చిన్న ప్రాజెక్టులు కట్టాలి.

ఇవాళ మన దేశాలలో ఉన్నవారికీ, లేనివారికీ మధ్య వ్యత్యాసం హిమాలయాలంత ఎత్తు పెరిగిపోయింది. దీనివలన సామాజిక సామరస్యం దెబ్బతింటుంది. హాహాకారాలు చెలరేగుతాయి. తీవ్రమైన సంక్షోభం ముంచుకొస్తుంది.

ఏనాటి నుంచి మాటలోనే మిగిలిపోయిన భూసంస్కరణలు

వ్యాసం

# ధర్మలాంధ్ర డబ్బైయ్యారు సోంపేటలు

- బమ్మిడి జగదీశ్వర రావు

మన రాష్ట్రంలో డబ్బైయ్యారు సోంపేటల్ని సిద్ధం చేసింది ప్రభుత్వం. 'కాకరాపల్లి' ఇవాళ 'రెండో సోంపేట'గా మనముందు కొచ్చి నిరూపించుకుంది. కోస్తాతీరప్రాంతమంతా అణుథర్మల్ విద్యుత్ కుంపట్లు రాజేసే నేపథ్యంలో ఒక్కో మనిషిని విద్యుత్ కుంపటిగా ప్రభుత్వమే తయారుచేస్తోంది. సోంపేట కాల్పుల్లో ముగ్గురు చనిపోయి అనేకమంది తీవ్రగాయాల పాలైన ఏడు నెలలా పదకొండు రోజులకే ప్రభుత్వం ఉగ్గబట్టలేక పోయింది. సోంపేట పరిణామాల్ని పరిగణనలోకి తీసుకోకుండా, ప్రజాభీష్టానికి తలొగ్గకుండా ఎన్.సి.సి. స్థానే ఈస్ట్‌కోస్ట్ కంపెనీకి ఊడిగం చెయ్యదలచుకుంది. అందుకు ప్రజల్ని మరోసారి పరీక్షించ దలచుకుంది. ఉత్తరాంధ్ర ప్రయోగశాలలో మరో ప్రయోగం చేసి ప్రయత్నం చేసి భవిష్యత్తును తెలుసుకోవాలనుకుంది. భవిష్యత్తులో ప్రజలు తిరుగుబాటు చెయ్యకూడదని అనుకుంది. అందుకనే ఈసారి అదే శ్రీకాకుళం జిల్లాలో సంతబొమ్మాళి మండలం వడ్డితాండ్ర గ్రామంలోకి పోలీసు మూకల్ని దింపి భీభత్సం సృష్టించింది. అంతకన్నా ముందు శాంతి యుతంగా నిరాహారదీక్షలు చేస్తూ నిరసన చేస్తున్నవారి దీక్షాశిబిరాన్ని తొలగించి కవ్వింపు చర్యలకు పాల్పడింది. 194 రోజులుగా సాగుతున్న నిరాహారదీక్షపై ఒక్కసారిగా విరుచుకుపడింది కాక, శిబిరం దాటి ఊళ్ళోకి వీథుల్లోకి చివరకు తలుపులు బద్దలు కొట్టి ఇళ్ళలోకి పోలీసులై, పొగబాంబులై లాఠీలై తూటాలై... మనుషుల శరీరాల్లోకి బుల్లెట్లై దూరిపోయి ప్రాణాలు తీసిందీ ప్రభుత్వం. ముగ్గురు చనిపోయారు, కాదు చంపబడ్డారు. ఇవన్నీ చూడలేక సావిత్రమ్మ గుండెపోటుతో చనిపోయింది. అనేక మందికి తీవ్రగాయాలయ్యాయి. సాక్ష్యంగా బుల్లెట్లు ఇంకా ఒంట్లోనే ఉన్నాయి. కొందరి పరిస్థితి విషమంగా ఉంది. బతికి బట్టకట్టిన వాళ్ళకి తినడానికి తిండి లేదు, కంటి మీద కునుకులేదు. ఊర్లోకి రావడానికి లేదు, ఊరు విడిచి పోవడానికి లేదు. ఖాకీల దిగ్బంధనం. వేలమంది ఖాకీలతో ఊరి చుట్టూ ఊళ్ళలోని మనుషుల చుట్టూ కంచెలైనారు. తలదాచుకుందికి ఇళ్ళూ లేవు. భాష్పవాయువు ప్రయోగించడంతో ఊళ్ళోని ఇళ్ళన్నీ తగలబడిపోయాయి. పొలాల్లోని వరి కుప్పలూ బూడిదయ్యాయి. పిల్లా పాపా ముసలీ ముతకా ఆడా మగా తేడాలేకుండా అందర్నీ చితకబాది అరెస్టు చేసి ఎత్తుకెళ్ళారు. ఇది ఒక్క వడ్డితాండ్ర పరిస్థితే కాదు, చుట్టు పక్కల పదహారు గ్రామాలను ఇలానే కట్టడి చేసారు. అప్రకటిత ఖర్ఫ్యూ విధించారు. బాధితులకు అన్నం అందివ్వకుండా అడ్డుకున్నారు. ఇదంతా ఎందుకు చేస్తున్నారు? ప్రజలు శాంతియుతంగా గాంధీ మార్గంలో నడిస్తే, ప్రభుత్వం గాడ్సే మార్గాన్ని ఎందుకు ఎంచుకున్నది? రేపు 'మూడో సోంపేట' తలెత్త కూడదని! అందుకే శత్రుదేశమ్మీద దండెత్తినట్టు అమాయకుపు ప్రజల మీద దండెత్తారు. శాంతి శాంతి అంటూ అశాంతిని సృష్టించి అలజడిని రేపారు. అమాయకపు ప్రజల్ని ఆందోళనకారులుగా, ఉద్యమకారులుగా మలిచారు.

ఇవి అనుకోకుండా జరిగిన కాల్పులు కావు. అంతా పథకం ప్రకారమే జరిగినట్టు జరిగిన ఘటనలు రుజువు చేస్తున్నాయి. ఆరేడు నెలల నిరసన నిరాహారదీక్షల నేపథ్యమూ ఉంది. ప్రజాభిప్రాయ సేకరణలో ప్రజల గొంతు నొక్కేసారు. ఆర్.డి.వో.కు వినతి పత్రం సమిష్టిగా సమర్పించుకున్నారు. ఫలితం లేక పోయింది. ప్రాజెక్టు కోసం ప్రత్యామ్నాయ రోడ్లు వేసుకున్నారు. దాంతో సాగు తాగు నీటి ఇబ్బందిని అధిగమించడానికని మరో ప్రత్యామ్నాయం లేక ఆ ప్రత్యామ్నాయ రోడ్లన్ని ప్రజలు తవ్వేసారు. మరో పక్క ఈస్ట్‌కోస్ట్ కంపెనీ పవర్ ప్రాజెక్టు పనులు ప్రారంభిస్తే ప్రజలు సహాయనిరాకరణ చేసారు. ప్రభుత్వం 144 సెక్షన్ విధించింది. గడిచిన కార్య కారణాల్ని పక్కన పెడితే 'యుద్ధం' మొదలై ఐదు రోజులైంది. ఈ సమయం తక్కువేం కాదు, పరిస్థితుల్ని బట్టి పోలీసులు అతిచొరవను ఆపి సంయమనం పాటించి ఉంటే, సోంపేట అనుభవాన్ని ఆరేడు నెలల క్రితమే చూసిన కలెక్టరుగాని, ఆ తర్వాత వచ్చిన ఎస్.పి.గాని ఎటువంటి సామరస్య శాంతియుత వాతావరణాన్ని ఏర్పాటు చెయ్యడానికీ ప్రయత్నించలేదు. ఎందుకంటే తాము ప్రభుత్వం చేతి పనిముట్లుగా చేతులు కట్టుకున్నారు. కాని ప్రజలు తమ బతుకులు బుగ్గి చేస్తుంటే చేతులు

---

తక్షణం. అమలు జరిపాలి. మన దేశంలో భూమి చాలా కీలకమయిన సమస్య. దీనిని పరిష్కరించకపోతే వేసిన గొంగళి వేసిన చోటే ఉంటుంది.

**కొసమెరుపు**

మన స్వదేశీ కుబేరులు విదేశీ ఖజానాల్లో లక్షా యాభైవేల కోట్ల డబ్బు దాచుకున్నారు. ఆ డబ్బంతా తెచ్చి దానిని మన జాతీయ సంపదగా మారిస్తే 60 కోట్ల మంది భారతీయులకు ఉద్యోగాలు కల్పించవచ్చు, 30 సంవత్సరాల పాటు చిల్లిగవ్వ పన్నువేయకుండా బడ్జెట్ రూపొందించవచ్చు. సాంఘిక సంక్షేమ పథకాలని నడిపించవచ్చు. మన దేశంలో 60 సంవత్సరాలపాటు ప్రతి ఒక్కరికీ 2000 రూపాయల జీతం ఇవ్వవచ్చు. మన దేశంలోని ప్రతి పల్లె నించి ఢిల్లీకి 4 లైనుల రహదారులు నిర్మించవచ్చు.

అంగట్లో అన్నీ ఉన్నాయి, కానీ అందరి నోళ్ళల్లోనూ శని ఉంది. ఒకే ఒక్క కారణం మన ప్రభుత్వాల చేతగాని తనం.

కట్టుకోలేరు కదా? కొంపకి నిప్పు పెడితే ఆర్పుకున్నంత సహజంగా అడ్డుకున్నారు.

మామూలు మనుషులైన మత్స్యకారులు ఆందోళన కారులుగా ఉద్యమకారులుగా ఉన్నట్టుండి ఎందుకు మారారు? మార్చిందెవరు? వారి ఆందోళన ఏమిటి? థర్మల్ పవర్ ప్లాంటు వస్తే తమ బతుకులు బుగ్గయి పోతాయని గాలీ నీరూ నేలా కలుషితమవుతుందని, చివరకు తమ జీవనాధారమైన సముద్ర తీరంలోని చేపల వేటకూ దూరమై పోతామని రోగాల బారిన పడతామని వాస్తవాల్ని తెలుసుకున్నారు. తమకు సేవకులుగా ఉంటామని ఓట్లు రాల్చుకు వెళ్ళిన వాళ్ళే తమ ఇష్టా ఇష్టాలతో సంబంధం లేకుండా నిర్బంధపు అభివృద్ధి(?)ని హింసతోనైనా సరే సాధించ దలచుకున్నారని స్థానికులకు అర్థమైంది. శాంతికి అవకాశం లేదని, నిరాహార దీక్షలు చెల్లవని బోధపడి పోయింది. నోటి ముందు కూడు... కళ్ళ ముందు బతుకు బుగ్గయి పోతుంటే రాక్షస మూకతో తలపడడానికి రాళ్ళు కారాలూ కర్రలూ ఆయుధాలయ్యాయి. అవస్థల్లోంచి దిక్కు తోచని స్థితిలో, తప్పనిసరి పరిస్థితుల్లో తిరగబడ్డారు. సముద్రాన్ని ఈదేసిన మత్స్యకారులు ఒడ్డు మీది బతుకుని ఈదేద్దామనుకుని ఆశపడి ఆవేశపడి శవాలుగా క్షతగాత్రులుగా చివరకు నేరస్తులుగా నిలబడ్డారు.

ఎకరాభూమి వదులుకుంటే ఐదువేలు ఇస్తామన్నప్పుడూ ప్రాణాలు తీసి ఐదు లక్షలు ఎక్స్‌గ్రేషియా ఇస్తామన్నప్పుడూ ప్రభుత్వం మానవీయ కోణాన్ని వదిలేసి అంగబలంతో కూడిన అర్థబలంతో సమస్యను పరిష్కరించాలనుకుంటోంది. అందుకే జరిగిన కథే జరుగుతోంది. అప్పుడు సోంపేట కాల్పులప్పుడూ ఇప్పుడు కాకరాపల్లి కాల్పులప్పుడూ యథావిధిగా నేతలూ వారికింది అధికారులూ దురదృష్టమన్నారు. ఖండించారు. రేపటికి కాలం కన్నెప్ప మూస్తుందని అనుకుంటున్నారు. ఆ ధైర్యంతోనే ఆనాడే ఓ అడుగు ముందుకేసిన మంత్రి ధర్మాన 'ఏవో కొన్ని ఘటనలు జరిగినంత మాత్రాన ప్రభుత్వ పారిశ్రామిక విధానాలు మారిపోయే అవకాశం లేదు' అని స్పష్టం చేసారు. ఆ మాటలోని నీతి దమన నీతేనని వేరే చెప్పక్కర్లేదు. పోని ప్రజలైనా శాంతి మార్గాన పోకూడదా? అంటే అందుకూ సోంపేటే సాక్ష్యం. అప్పటికీ 453 రోజులకు పైగా కడుపులు కాల్చుకుంటూ సోంపేటలో నిరాహారదీక్షలు కొనసాగుతూనే ఉన్నాయి. అసెంబ్లీ సమావేశాల సందర్భంగా పాలక ప్రతిపక్ష నేతలందర్నీ సోంపేట నుండి హైదరాబాదు వచ్చిన పర్యావరణ పరిరక్షణ సమితి వేడుకోళ్ళూ, విజ్ఞాపనలూ చేసుకుంది. ముఖ్యమంత్రితో సహా. ఒక్కరున్న ఓ పార్టీనేత మాట్లాడితే రాజ్యాంగ పరిరక్షణేధ్యేయమన్న తను ముఖ్యమంత్రితో చెప్పండి సార్ అంటే 'మేం బ్రోకర్లలా కనిపిస్తున్నామా?' అని ఎదురు ప్రశ్న వేసాడు. ఎవరినుంచీ ఆశించిన జవాబు రాలేదు. రాదు. పార్టీ కార్యాలయాలన్నీ తిరిగి తిరిగి సోంపేటకు తిరిగి వెళ్ళి పోయింది పర్యావరణ పరిరక్షణ సమితి. అసెంబ్లీలో థర్మల్ విద్యుత్ కేంద్రాల విషయం అంటరానిదై పోయింది. ఇప్పుడు 'కాకరాపల్లి' ఘటన జరిగింది కాబట్టి అసెంబ్లీలో ప్రస్తావన కొచ్చింది. తప్పితే ప్రజల గోడు వినేదెవరు? మాట్లాడే దెవరు? పట్టించుకొనే దెవరు? శాంతంగా ప్రశాంతంగా బతకడం ప్రజలకు ఇష్టం లేదా? దీని వెనుక ఎవరి ప్రయోజనాలున్నాయో వేరే చెప్పనవసరం లేదు. సామాన్యులను దోచి మాన్యులకు పెట్టడం ఓ ప్రణాళికా బద్ధమైన విధానం. అందుకే వేల ఎకరాలని ఎక్కడికక్కడ ప్రజలనుండి మధ్యపెట్టో కాదంటే బలవంతాన లాక్కోనో బడాబాబులకు ధారాదత్తం చేస్తూ 'ప్రభుత్వం' అంటే ప్రజలు కాదని ముసుగు తీసేసి తేట తెల్లం చేస్తున్నాయి. తెలుసుకున్న ప్రజలు తెగిస్తే ప్రభుత్వం భరించలేకపోతోంది.

ఒకే సందర్భం మళ్ళీ మళ్ళీ... మళ్ళీ మళ్ళీ అవే ఖండనలు. అవే సానుభూతివచనాలు. పరామర్శలూ పరిహాసపు పరిహారాలూ శవాల మెడలో దండలుగా వేస్తున్నారు. ఒకే వృత్తం. పునరావృతం! డబ్బైయ్యారు విద్యుత్ థర్మల్ ప్లాంట్లు... కోస్తా తీరం వెంబడి ప్రమాద హెచ్చరికలు ఎగురవేసారు. ఒక్కటే జీవితం. 'ఒక్క జన్మే... మళ్ళీ లేదు. ఒక్క జన్మే మళ్ళీ లేదు ఆడినా పాడినా ఓడినా పడి పోయినా ఒక్క జన్మే మళ్ళీ లేదు' అని, బతుకంటే పోరని సామాన్యులకంతా తెలిసి పోయింది. అయితే ఆ పోరాటాలకు శిక్షణని ఇచ్చేవి మన ప్రభుత్వాలే.

ఇక భవిష్యత్ చరిత్రంతా సామాన్యుల సాహసాలే! దుర్మార్గపు పాలనలో ప్రజలెప్పుడూ నేరస్తులే!!

కథ

## ఉల్లి(రూ)పాయి

**- బజరా**

అనగనగా వొక పేద
ఆ పేదకేడుగురు కుటమామట, కూలికెళ్ళారట
ఏడు సేరుల గింజలు తెచ్చారట!
గెంజికాసారట
అందులో నంజుకి వొక్క ఉల్లిపాయా లేదట
'ఉల్లిపాయా ఉల్లిపాయా నువ్వేనికి పండలేదూ?'
'సర్కారు సాటొచ్చిందీ!'
'సర్కారూ సర్కారూ నువ్వేనికి సాటొచ్చినావూ?'
'ఉల్లికి తెగులొచ్చింది'
'ఉల్లీ ఉల్లీ నీకెందుకీ తెగులొచ్చిందీ?'
'బ్లాక్ మార్కెట్లో బందించిసినారూ'
'బ్లాకు మార్కెట్టూ బ్లాకు మార్కెట్టూ ఎందుకు
బందించిసినావూ?'
'మన నాయకులకు ఆమ్యామ్యాలు ఇవ్వాలి కదా?'
'నాయకులారా నాయకులారా మీకెందుకిన్ని
ఆమ్యామ్యాలూ?'
'స్విస్సుబేంకులో డిపాజిట్టు చెయ్యాలి కదా?'
'స్విస్సుబేంకూ స్విస్సుబేంకూ డబ్బుల్నేటిసేస్తావూ?'
'నాకేటి తెలుసు? మూలుగుతున్న రూపాయి నడుగూ!'
'రూపాయీ రూపాయీ యెందుకు మూలుగుతున్నావూ?'
'ఏటికేడూ స్కాముల పంటలొచ్చి ఈ గోడౌన్లలో పడి
ఊపిరాడకపోతే మూలగనా?'
అన్నాదట రూపాయి!

నివేదిక

# కాకరపల్లి ప్రతిఘటనా పోరాటం

- గీతాంజలి

భీకర యుద్ధం తాత్కాలికంగా విరమించిన తర్వాత కూడా మళ్ళీ చేయవల్సిన యుద్ధానికి ఆయుధాలతో సమాయత్తం అవుతున్నట్లే ఉన్నాయి ఆ సిక్కోలులో గ్రామాలు. ఫిబ్రవరి 5, 6 తారీఖుల్లో ఎపిసిఎల్‌సి, కులనిర్మూలనా పోరాటా సమితి, ప్రజా కళామండలి, బహుజన చైతన్య మహిళా సమాఖ్య, చైతన్య మహిళా సంఘం, విప్లవ రచయితల సంఘం, అక్కడి స్థానిక ప్రజా సంఘాలతో కల్సి హనుమంతనాయుని పేట, వడ్డితాండ్ర, ఆకాశలక్కవరం, కాకరపల్లి, శీనపువానితోట గ్రామాలు నిజనిర్ధారణ కోసం సందర్శించినప్పుడు ఆ గ్రామాల్లోని ప్రజలు యుద్ధ విరమణ తర్వాతి గాయాలతో కన్పించారు. శారీరక గాయాల కన్నా... మానసికంగా వారు ఆందోళన, అభద్రత, భవిష్యత్తు పట్ల భయాలతో పాటు పరిస్థితిని ఎలా అయినా ఎదుర్కొని తీరాలన్న తెగింపుతో కనపడ్డారు. వడ్డితాండ్ర గ్రామంలో ఇళ్ళు వాహనాలు - వంట సామాగ్రి, గిన్నెలు, బట్టలు, కోత కోసి కుప్పలు పేర్చిన 45 ఎకరాల వరి కుప్పలు మాడి మాసై పోయాయి. ప్రజల్లో కొందరు గాయాలకు కట్టిన కట్లతో తిరుగుతున్నారు. అక్రమ కేసులు బనాయించి జైళ్ళల్లో మగ్గుతున్న బంధువులను తలపోసుకొంటున్నారు. మరికొందరు బుల్లెట్ గాయాలతో ఇంకా ఆస్పత్రులలో చికిత్స పొందుతున్న భర్తల్ని, కొడుకుల్ని వాళ్ళ బాధల్ని వలపోసుకుంటున్నారు. ఈస్ట్ కోస్ట్ ఎనర్జీ ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీ ముంచేసిన ముంపు వల్ల నాశనమై మొలకలెత్తిన వరి ధాన్యాల్ని చూస్కుంటూ కుములుతున్నారు.

ఇవన్నీ తమ గ్రామాల్లో మోసపూరిత ప్రభుత్వ విధ్వంసకర అభివృద్ధి నమూనా అయిన థర్మల్ పవర్ ప్లాంట్‌ను తమదైన ప్రజాస్వామిక పద్ధతిలో శాంతియుతంగా రిలే నిరాహార శిబిరాన్ని నిర్వహిస్తూ ఎదుర్కొంటున్నందుకు ప్రభుత్వమూ, ప్లాంట్ యాజమాన్యం కుమ్మక్కై ఆ గ్రామ ప్రజలకు ఇచ్చిన కానుకలు. వడ్డితాండ్ర గ్రామ ప్రజలు పోలీసులు తమ వరి కుప్పల మీద, ఇళ్ళమీద, తమ మీద విసిరిన బాంబుల శకలాలను తమ దేహాల మీది గాయాలతో పాటుగా దాచుకుని మాకు చూపించారు. వీరోచిత పోరాటంలో పోలీసుల తూటాలకు బలైన ఎర్రయ్య, నాగేశ్వరరావుల - భార్యలు ధనలక్ష్మి, గీరలక్ష్మి (పిల్లలు - సంతోష్, పావని) చనిపోయిన తమ భర్తల ఫోటోల ముందు ఇంకా తీయని గాజులతో ముఖాలకు రాసిన పసుపులతో దుఃఖ భారంతో కూచుని ఉన్నారు. పదో దినం అవన్నీ వారి సాంప్రదాయ పద్ధతులతో తీస్తారట. విషయం గాజులు, పూలకు సంబంధించినది కాదు. కోల్పోయిన మనుషులకు చెందినది. వాళ్ళు జీవచ్ఛవాలుగా కన్పించారు.

అసలు ఇంత దమనకాండ ఎందుకు జరిగింది? పెట్టుబడి దారుల తొత్తులుగా మారిన పాలకదళారులు అమలుపరిచిన రాజకీయ ఆర్థిక విధానాల ఫలితమే ఈ హత్యాకాండ! మనుషుల్ని చంపి వారి దేహాల మీదుగానైనా నిర్మింప పూనుకున్న పవర్ ప్లాంట్‌లు, ఆ ప్లాంట్‌లకు కావాల్సిన రోడ్లు, వాటికోసం దోపిడి చేసి గుంజుకున్న తంపర, తడి, చిత్తడి భూములు... దీన్నంతా అక్కడి స్థానిక, బాధిత ప్రజలు అడ్డుకున్నందుకేనన్నది కఠోర వాస్తవం!

> "మాంవు మా తంపరలు ఒదులకోం. ఆడోల్లమే ముందరకెల్తం బతుకో చావో తేల్చుకుంటం. డబ్బులెవలకు కావాలండీ... డబ్బులు అయిపోతాయి. భూంవి బతుకంతా ఉంటది కదండీ అన్నం పెడ్తది. డబ్బుకు మాంవు అమ్ముడుపోతే, ఊరి గురించి కొట్లాడే కొడుకు ఒస్తడా?
>
> ఆకాశ లక్కవరంలో స్త్రీలన్న మాటలివి.
>
> "మా పాకలపైన బాంబు లేసేసినారు పొగలకు బయపడి మావందరం బయటకు పరిగెత్తామండీ పోలీసులు మా ఆడోల్లను అనరాని మాటలనేసినారు అన్నీ బూతుమాటలేనండీ.... శానా మంది ఇళ్ళ నుంచి దాచిపెట్టుకున్న డబ్బులు తీసేసుకున్నారండి.
>
> మాంవు ఒండుకున్న అన్నం కూరలు కూడా వదల్లేదండీ పోలీసులు" వడ్డితాండ్ర స్త్రీలు ఆవేదనగా చెప్పుకొచ్చారు.
>
> పోలీసులు చాలా మంది గాయపడ్డవారికి ప్రభుత్వ ఆసుపత్రులలో వైద్యసాయం అందించలేదు. చాలామంది ఊరిలో ఆర్.ఎం.పి. డాక్టర్లచే వైద్యం చేయించుకుంటున్నారు.
>
> నిజమైన బుల్లెట్ గాయాల్లో మరణించిన నాగేశ్వరరావు, ఎర్రయ్యల కుటుంబాల్ని పోలీసులు శవాలివ్వడానికి కూడా చాలా వేధించారు. బయట వాళ్ళకు, మీడియా వాళ్ళకు పోస్ట్‌మార్టంలో తీసినవి రబ్బర్ బుల్లెట్‌లేనని చెప్పారని, నిజమైనవని చెబితే శవాలు కూడా అప్పచెప్పమనీ చెప్పారట.
>
> హింసను ఆపమని, క్షతగాత్రులకు తక్షణం సర్కారు ఆస్పత్రులలో వైద్య చికిత్స అందించమని బాధితులను వేధించకుండా శవాలను అప్పచెప్పమని మానవ హక్కుల కమిషన్ ఇచ్చిన ఆదేశాలను సైతం పోలీసులు లెక్క చేయలేదు.

3 సంవత్సరాల నుంచీ కాకరపల్లి ప్రజా ప్రతిఘటన, శీనపువానిపేటకు చెందిన ఎర్రయ్య, ఆకాశలక్కవరంకి చెందిన

నాగేశ్వరరావు హత్యల వెనక వాస్తవాలు కొద్దిగా వెనక్కి చరిత్రలోకి వెళ్ళి... ఆ ప్రజలే చెప్పిన వాస్తవాల్ని తెలుసుకుందాం.

శ్రీకాకుళం జిల్లాలోని సంతబొమ్మాళి మండలంలోని కాకరాపల్లిలో 3,300 ఎకరాల్లో తంపర భూములు అంటే వెట్‌ల్యాండ్స్ విస్తరించి ఉన్నాయి. ఎగువ ప్రాంతాల నుంచి వచ్చే వరద నీరు, గెడ్డల నుంచి వచ్చే నీరు సముద్రంలోకి చేరే ప్రాంతాలే ఈ తంపర ప్రాంతాలు. వీటిలో నీరు - చేపలు, రొయ్యలు సమృద్ధిగా ఉంటాయి. వడ్డితాండ్ర, ఆకాశలక్కవరం, శీనపువారిపేట, సక్కువానిపేట, అంట్లవరం, కాశీపురం పోతినాయని పేట, నవాబుపేట, హనుమంతనాయుని పేట, బృందావన్‌కాలనీ, చీరపల్లిపేట, కాశీపురం, కొత్తూరు - గొల్లవానిపేట లాంటి సంతబొమ్మాళి మండలంలోని 14 గ్రామాలల్లోని రైతులు, మత్స్యకారులకు దాదాపు 6,000 ఎకరాల్లో విస్తరించిన ఈ తంపర లేదా చిత్తడి - బీల భూములే ప్రధాన జీవనాధారం. రైతులు ప్రధానంగా వరి పండిస్తే, మత్స్యకారులు చేపలు, రొయ్యలు వేటాడి అమ్ముకొని బతుకుతారు. ఇటువంటి తంపర భూముల్లో ఈస్ట్‌కోస్ట్ ప్రైవేటు లిమిటెడ్ బొగ్గు ఆధారిత విద్యుత్ కేంద్రాన్ని ఏర్పాటు చేస్తోంది. ఇక్కడ 2,640 మెగావాట్ల సామర్థ్యంతో విద్యుత్ కేంద్రాన్ని నెలకొల్పడానికి 2008 ఏప్రిల్ 23న సంతబొమ్మాళిలో ప్రజాభిప్రాయ సేకరణ అప్పటి వై.ఎస్. ప్రభుత్వం చేసింది. అలాగే దాని పక్కనే మేఘవరం పవర్‌ప్లాంట్ 495 మెగా వాట్ల సామర్థ్యంతో నిర్మాణం జరుగుతోంది. ప్రజాభిప్రాయ సేకరణలో తీవ్ర అభ్యంతరాలు, ఆందోళనలు స్థానిక ప్రజల నుంచి వెల్లువెత్తినా గానీ అప్పటి ప్రభుత్వం ప్లాంట్ యాజమాన్యానికి తంపర భూములను కేటాయించేసింది. అసలు చాలా గ్రామాల్లో ప్రజాభిప్రాయ సేకరణే జరగలేదు! దానితో దశాబ్దాల తరబడి తంపర భూములపై ఆధారపడి జీవిస్తున్న మత్స్యకారులకు బతుకు భయం ఆవరించింది. ఇంత విస్తీర్ణంలో థర్మల్ పవర్ ప్లాంట్ నిర్మిస్తే, ఎగువ ప్రాంతాల నుంచి వచ్చే నీరు సముద్రంలోకి వెళ్ళే అవకాశం ఉండదు. దీంతో తీరానికి వెళ్ళే నీరంతా నిలిచిపోయి సంతబొమ్మాళి, టెక్కలి మండలాల్లో దాదాపు 12 వేల ఎకరాల సాగు భూమి ముంపునకు గురి అయ్యే అవకాశం ఉంది. దీంతో రైతులు, మత్స్యకారులు ప్రాజెక్టును వ్యతిరేకిస్తున్నారు. మామూలు రోజుల్లో కూడా వరద నీటి ఉధృతికి ఈ ప్రాంతంలో దాదాపు 7 వేల ఎకరాలు ముంపునకు గురి అవుతాయి.

### తంపరలను ప్లాంట్‌కోసం పూడ్చేముందు గ్రామాల్లోని ఆర్థిక, సామాజిక రాజకీయ స్థితిగతులు

సంతబొమ్మాళి మండలంలోనే ఈ తంపర భూములపై ఆధారపడి 3,500లకు పైగా మత్స్యకార కుటుంబాలు జీవిస్తున్నాయి. 1948లో పూరి జగన్నాథ్ ఫిషర్‌మెన్ కో-ఆపరేటివ్ సొసైటీని స్థాపించుకుని ప్రభుత్వం నుంచి కౌలుకి తీసుకుని తంపరలో చేపల వేటతో జీవనం సాగిస్తున్నారు. తంపరలో ఒక్క చేపల వేటే కాదు. దానిలో విస్తృతంగా తుంగలాంటి రెల్లు గడ్డి జమ్ముని కోస్కుని ఎండబెట్టుకుని పూరిళ్ళపై కప్పులకు, చాపలకు వాడుకోవడం, అమ్ముకోవడం సాగిస్తారు. చుట్టుపక్కల వ్యవసాయం చేస్కునే గ్రామాల్లోని గేదెలు, ఆవులు, మేకలు, గొర్రెలకు ఈ తంపరలో పెరిగే పచ్చిగడ్డే ఆహారం. దాన్ని మత్స్యకారులు ఆ రైతులకు అమ్ముతారు. వారి పశువుల ఆహారం కోసం ఈ తంపరలోని నీటినాధారంగా చేస్కొని దాదాపు 40 గ్రామాల చిన్న సన్నకారు రైతులు ఏ ఇబ్బంది లేకుండా వరిని పండించుకుంటున్నారు.

అలాగే చుట్టుపక్కల గ్రామాల్లో వ్యవసాయం లేనప్పుడు వ్యవసాయ కూలీలు, తంపర నీరు, సముద్రం కలిసే చోటు, వెదురు తడికెలు, నీటిని ఒడియా భాషలో 'మావులు' అంటారు. చేపలు, రొయ్యల్ని ఆపి పట్టి అమ్ముకొంటారు. వీరే కాదు మత్స్యకారులు కూడా చెరువులు ఎండిపోయినప్పుడు ప్రధానంగా తంపరల మీదనే ఆధారపడ్డారు. ఎండాకాలంలో! ఇప్పుడు ఆ తంపర నేలంతా ప్లాంట్ కోసం టన్నుల కొద్దీ మట్టితో నింపబడి ఎండగొట్టబడింది. తంపర భూమిని అలా ఆక్రమించుకుని ఫెన్సింగ్ వేసారు. తంపరలోని తుంగను - చేపల్ని - ఆ చేపల్ని తినడానికి వచ్చే పక్షుల్ని చంపడానికి రసాయన మందుల్ని వేయడంతో అన్నీ చచ్చిపోయాయి. దాంతో మత్స్యకారుల జీవనాధారం పూర్తిగా నాశనం అయ్యింది.

అంతేకాదు, ప్రాజెక్టు ఏర్పాటులో సైబీరియా నుంచి వేల సంఖ్యల్లో 120 రకాల భిన్నమైన పక్షులు - పెలికాన్ పక్షులు ఈ జిల్లాకు, ముఖ్యంగా ఈ తంపర భూములకు వలస వచ్చి తమ సంతతిని ఉత్పత్తి చేస్తాయి. ఈ పక్షులకు ప్రధాన ఆహార కేంద్రాలు ఈ తంపర భూములే. ఈ తంపర భూముల్లో రకరకాల కీటకాలు, రొయ్యలు, చేపలను ఈ పక్షులు తింటాయి. అందువల్ల జిల్లాలో ప్రసిద్ధి చెందిన పక్షుల పర్యాటక కేంద్రం, తేలినీలాపురం (పక్షుల విడిది కేంద్రం) అదృశ్యమవుతుంది.

ఇంత సులభంగా ఇన్ని వేల ఎకరాల భూములు ప్లాంట్ యాజమాన్యం ఎలా దక్కించుకుందన్న ప్రశ్న వేస్కుంటే దీని వెనకాల పాలకుల ఆర్థిక రాజకీయ ప్రయోజనాలు స్పష్టంగా కనిపిస్తాయి.

రాష్ట్ర వ్యాప్తంగా ప్రత్యేక ఆర్థిక మండలాల పేరుతో బీద, దళిత రైతాంగం నుంచి భూమిని గుంజుకునేముందు - ఫ్యాక్టరీల్లో ఉద్యోగాలు, ఇళ్ళు, ఎకరంకు లక్షల చొప్పున ధరలు అని ఆశ చూపి ఎలా గుంజుకున్నారో అవే కుట్రపూరితమైన పద్ధతుల్నే ఇక్కడా పాటించారు. పోలేపల్లిలాంటి సెజ్‌ల్లోనైతే భూమి ఇవ్వని చుక్కమ్మ, పెంటయ్య చేతికొచ్చిన పంట పొలాల్ని ఎలా పెట్రోలు పోసి, పశువులతో సహా కాల్చి స్వాధీన పర్చుకున్నారో ఇక్కడా అలాంటి దహన క్రియలు జరిపి స్వాధీన పర్చుకున్నారు.

ముఖ్యంగా ఈ ప్లాంట్ వెనకాల రెవెన్యూమంత్రి ధర్మాన ప్రసాదరావు ఉన్నట్లు ప్రజలు చెపుతున్నారు. ప్లాంట్‌లో వై.ఎస్. జగన్‌కు, అహ్మద్‌పటేల్‌కు, కె.వి.పి.కి, వై.ఎస్. బావమర్దికి, వై.ఎస్.ఆర్ అల్లుడికి వాటాలున్నాయని తెలుస్తోంది. అలాగే ఈ. ఇ.సి. ప్లాంట్‌కి

25 కి.మీ. దూరాన ఉన్న నిమ్మాడ స్వగ్రామంగా ఉన్న ఎర్రన్నాయుడి అనుచరులు బంధువర్గం, స్థానిక రాజకీయనాయకుల ఆర్థిక ప్రయోజనాల కోసం ప్రజల ప్రాణాలు పణంగా పెట్టి ప్లాంట్ యాజమాన్యానికి కొమ్ముకాస్తున్నారని స్థానిక ప్రజల ఆరోపణ. వాస్తవం కూడా!

ఈ పవర్‌ప్లాంట్ మొదలు కావడానికి ముందు ధర్మాన ప్రసాదరావు 14 గ్రామాలు తిరుగుతూ ప్రజల్లో ప్లాంట్ నిర్మాణం గురించి, నిర్మాణం వల్ల స్థానిక ప్రజలకు ఒనగూడే ఆర్థిక సామాజిక ప్రయోజనాల గురించి అబద్ధాలు ప్రచారం చేసాడు. కుటుంబానికి పక్కా ఇల్లు, 30-40 వేల ఆర్థిక సాయం చేస్తామని, పవర్‌ప్లాంట్‌లో కుటుంబానికి ఒక ఉద్యోగం ఇప్పిస్తామని చెప్తూ పోయాడు. అలాగే మత్స్యకారులకు తంపరల్లాంటి వాటర్ ట్యాంకులు కట్టిస్తామని చేపల పెంపకం కోసం అవి తంపరలకంటే మంచివని చెప్పడం జరిగింది. వృద్ధులకు పింఛను ప్రకటించాడు. ప్రతి గ్రామానికి తుఫాను షెల్టర్లు, మండల కేంద్రాల్లో 30 పడకల ఆస్పత్రులు కట్టిస్తామని ఆశ చూపించాడు. అలాగే తేలినీలాపురం పర్యాటక కేంద్రాన్ని అభివృద్ధి చేస్తామని ఇంకో అదనపు ప్రకటన చేయడమే కాకుండా వారితోటి కాగితాల మీద సంతకాలు, వేలిముద్రలు తీస్కుని కొన్నిగ్రామాల్లో పబ్లిక్ హియరింగ్ కూడా పెట్టకుండా ప్లాంట్ పనులు ప్రారంభించారు. ఇదంతా 2008 ఏప్రిల్‌లో మొదలైంది.

**కాకరపల్లి ప్రజల ప్రతిఘటన**

సంతకాలైతే చేసారు. నాయకుల్ని నమ్మారు. నయవంచనకు గురి అయ్యారు.

తంపరలో చేపలు, రొయ్యలు, పక్షులు చావడానికి వేసిన మందువల్ల అన్నీ చచ్చిపోయాయి. మత్స్యకారులపై చావుదెబ్బపడింది. గ్రామాల్లోనే ఉంటూ సమీపంలోని తంపర్లో చేపలు పట్టుకొని బతికే మత్స్యకారులు ఇప్పుడు ఒడిశాలోని భల్లుగాం, చిలుకా సరస్సు, కోల్‌కత్తా, పక్కని పలాసలకు వెళ్ళి అక్కడ గుత్తగా చేపలు కొని అమ్ముకుని అక్కడే 2, 3 రోజులుండి వారానికి రెండుసార్లు ఇంటికొచ్చి భర్త పిల్లలతో గడుపుతున్నారు. కుటుంబాలకు దూరమయ్యారు. కొంత మంది భర్తలు దూరంగా వెళ్ళి చేపలమ్ముకుని వచ్చే భార్యల్ని అనుమానించడం, దాంతో కుటుంబ సంబంధాలు పాడవడం జరుగుతోంది. అంతకుముందు సమిష్టి విధానం ఉండేది. చేపలు తంపరలో దొరికేవి అమ్మడం, లాభం, నష్టం బాధ్యత సొసైటీ చూసుకునేది, పైసలు బాగా వచ్చేవి. కానీ ఇప్పుడు ప్రయాణం ఖర్చులు, అక్కడ ఉండడం, భోజనం ఖర్చులు, మిగుల్చుకొని రోజుకు 50-100 మధ్యలోనే సంపాదిస్తున్నారు. అది కుటుంబానికే ఏ మూలకీ సరిపోవు. అలాగే అక్కడి గ్రామాల్లోని దళితులు తంపరపైన మెలిచే రెల్లుగడ్డినమ్ముకునే వాళ్ళు... ఇప్పుడు జీవనాధారం కోల్పోయారు.

ప్లాంట్ వల్ల ముంపునకు గురైన సాగు వ్యవసాయ భూములకి దూరమైన రైతులు అయోమయంగా దిక్కులు చూస్తున్నారు. వర్షాలు / వరదలు - సముద్రపు పోటు వచ్చినా - వెళ్ళిన తర్వాత భూమి ఉండి మళ్ళీ పంటకు ఆశనిచ్చేది. తంపరా అంతే. కానీ ప్లాంట్ వచ్చి భూమినే ఎత్తుకుపోయిందని స్థానికులు ఆందోళన చెందుతున్నారు. అలాగే ఇక్కడ ధర్మాన ఆశ చూపించిన ప్లాంట్‌లో ఉద్యోగాలు బూటకమని తేలిపోయింది. 2009-2010 మధ్యలో ముంపునకు గురైన గ్రామాల్లోని యువకులకు హైదరాబాద్‌లో ఉద్యోగాలు ఇప్పిస్తామని చెప్పి వారికి ఇక్కడ హోటల్ క్లీనర్స్‌గా, కార్పెంటర్స్‌గా, లేబర్ అడ్డా కూలీలుగా మార్చారు. హైదరాబాద్‌లో తెలంగాణలోని వెనకబడ్డ ప్రాంతాల్లోని వలస కూలీలు - ఆంధ్రా ప్రాంత కూలీలు ఎక్కువగా ఉన్నారు. వీరికి హైదరాబాద్‌లో పనిలేక పస్తులుండలేక ఈ యువకులంతా మళ్ళా తమ స్వస్థలాలకు చేరుకున్నారు.

ఇదిలా ఉండగా స్థానికంగా ఏమన్నా పని దొరుకుతుందని చూసారు. ప్లాంట్‌లో ఉద్యోగాలు ఇప్పిస్తామన్న ధర్మాన మాట బూటకమని తేలింది.

కనీసం అక్కడి ప్లాంట్లలో స్థానిక రాజకీయ నాయకులు ట్రాక్టర్లు - ట్రిప్పర్లు కొని లీజుకిచ్చి చేసే వ్యాపారంలో డ్రైవర్లుగా, క్లీనర్లుగానైనా పని ఇప్పిస్తారేమోననుకుంటే వాళ్ళ అనుచరులకే ఉద్యోగాలు దక్కాయి. విశాఖ, ఒడిశా, కాకినాడ నుంచి వచ్చిన వాళ్ళే ప్లాంట్లల్లో కార్మికులుగా ఉన్నారు. వాళ్ళతోనైతే తక్కువ జీతాలకు ఎక్కువ పని చేయించుకోవచ్చని యాజమాన్యం కుట్ర. చేపల వేటకు తంపరల్లేవు. తంపర నీళ్ళమీద ఆధారపడ్డ వ్యవసాయం ఆగిపోయింది. అలాగే తంపర పూడిక వల్ల ఎగువ నీరు సముద్రంలో కలవకుండా వ్యవసాయభూముల్ని ముంచడం వలన ఎన్నో ఎకరాల పంట మునిగిపోయింది. అసలు ప్లాంట్ల వల్ల ఈ సారి వరి పంట లేదు. అక్కడ భూమి లేని వ్యవసాయాధారిత కూలీలు జీవనాధారం కోల్పోయారు - హైదరాబాద్‌లో మోసానికి గురైన స్థానిక ప్రజలు తిరిగివచ్చారు. ప్రతి ఇంటిలో పస్తులే. ఈ పరిస్థితిలో అక్కడి ప్లాంట్‌లో ఉద్యోగాల కోసం స్థానిక ప్రజలు తెగించి ర్యాలీ రూపంలో వెడితే అక్కడ ఉన్న ఒక గుడిసెను కంపెనీ యాజమాన్యమే కాల్చి ప్రజలే కాల్చారనీ ముఖ్యులైన 23 మంది నాయకులను పోలీసులతో అరెస్టు చేయించి ప్రజలను తరిమికొట్టింది. అంతేకాదు, గ్రామాల్లోని ప్రజల వ్యక్తిగత జీవితాల్లోకి జోక్యం చేస్కుంటూ అక్కడి ప్రజలపై అనేక తప్పుడు కేసులు, ముఖ్యంగా యువకులపై పెట్టడం జరిగింది. మత్స్యకారులు, రైతులపై వేధింపులు ఎక్కువైనాయి. ఇదంతా కూడా అక్కడి పవర్‌ప్లాంట్‌ను వ్యతిరేకిస్తున్న వీరిని నిర్వాసితుల్ని చేయడమే లక్ష్యంగా సాగింది.

ఎప్పుడైతే ఆకలి, దారిద్ర్యం - అక్రమకేసులు ప్లాంట్‌లో ఉద్యోగాల నిరాకరణకు గురైనారో తాము ఎంత మోసానికి గురైనారో తెల్సుకున్నారు. పోరుబాటలో పడ్డారు అయితే ఆ పోరు వారు హింసాత్మక రూపంలో చేయలేదు. శాంతియుతంగానే చేయాలనుకున్నారు. సోంపేట శాంతియుత పోరాటాన్ని ఆదర్శంగా తీస్కున్నారు. తమ జీవితాల్ని నాశనం చేసి తమని దుర్భర దారిద్ర్యంలోకి తోసేసి చంటిపిల్లలతో సహా ఆకలికి అలమటించేలా

చేస్తున్న పవర్ ప్లాంట్ వద్దని నిర్ణయించుకున్నారు. అప్పటి నుంచి హనుమంతనాయునిపేటలో ఒక నిరాహార దీక్షా శిబిరం, వడ్డితాండ్ర, కాకరపల్లి వద్ద శిబిరాలు ఏర్పర్చుకొని, 195 రోజులుగా రిలే నిరాహార దీక్షలు చేపట్టారు. 7 నెలలుగా ఈ నిరాహార దీక్ష రూపంలో ప్లాంటు నాపాలన్న డిమాండ్‌ను వ్యక్తపరుస్తున్నా ప్రభుత్వమూ, యాజమాన్యమూ పట్టించుకోలేదు. ఆఖరికి ఓపిక నశించిన ప్రజలు మహబూబ్‌నగర్‌జిల్లాలోని పోలేపల్లి అరబిందో - హెటిరో ఫార్మా కంపెనీలోకి 150 ఏళ్ళ చరిత్ర ఉన్న చింత చెట్టు కింద శిబిరం వేస్కుని - ఫ్యాక్టరీ నిర్మాణం కోసం తరలించబడ్తున్న సిమెంటు, ఇసుక, ఇనుముని లోపలికి వెళ్ళకుండా ఎలా అడ్డుకున్నారో, అలాగే కాకరపల్లి ప్రజలు ఫ్యాక్టరీ లోపలకి సిమెంటు, ఇనుము, ఇసుక, ఇటుకలు వెళ్ళే లారీలను వెళ్ళనియ్యకుండా అడ్డకోవడమే కాదు, కార్మికుల్ని కూడా లోపలికి వెళ్ళనివ్వలేదు. అన్ని వైపులా ఫ్యాక్టరీకి వెళ్ళే దారుల్ని మూసివేసారు.

ఇదే సమయంలో ఉద్యమం చేస్తున్న ప్రజలను తీవ్రమైన ఆగ్రహాందోళనలకు లోనుచేసిన సంఘటన జరిగింది. వడ్డితాండ్ర, కాకరపల్లి పంటభూములు ముంపుకు గురి అయ్యాయి. దీనిక్కారణం ఏమంటే ప్లాంట్ యాజమాన్యం కాకరపల్లి నుండి ఈస్ట్‌కోస్ట్ పవర్‌ప్లాంట్‌కు వెళ్ళే దారిలో తంపర నుండి సముద్రంలోకి ఉన్న వాగుపైన రోడ్డు వేయడం. దీనివలన భూములు ముంపునకు గురి అవడమే కాదు, ఇళ్ళల్లోకి నీరు వచ్చి ఇళ్ళు మునిగే ప్రమాదం పెరుగుతుండడంతో వడ్డితాండ్ర ప్రజలు రోడ్డు తవ్వడం మొదలుపెట్టారు. ఆ పని మొదలుపెట్టేలోగా ఆర్.డి.ఓ. వచ్చి రోడ్లు తామే తొలగిస్తామని తొందరపడద్దని చెప్పటంతో నమ్మిన వడ్డితాండ్ర ప్రజలు వెనక్కు వెళ్ళిపోయారు.

2011 ఫిబ్రవరి 16 వరకూ ప్రజలు ఆర్.డి.ఓ. రోడ్డును తొలగిస్తాడని ఎదురుచూసారు. జరగలేదు, మళ్ళీ వంచనకు గురైనామని తెల్సుకొని 17 ఫిబ్రవరి 2011న రోడ్డును తవ్వి పడేశారు. రోడ్డు తవ్విన మరునాడే అక్కడికి ఆర్.డి.ఓ. - ఎం.ఆర్.ఓ ఇద్దరూ వచ్చారు. కానీ ఆగ్రహంతో రగిలిపోతున్న ప్రజలు వారిని తరిమికొట్టారు.

శాంతియుతంగా నిరాహార దీక్షా శిబిరాలతో మొదలైన కాకరపల్లి ప్రజా ప్రతిఘటన తమ గ్రామాలను నీటముంచిన ప్లాంట్ నిర్మించిన రోడ్డును కూల్చివేయడం, తమకు మాట నిచ్చిన ప్రజా ప్రతినిధుల్ని తరిమివేయులనుకునే ఆగ్రహ రూపాన్ని సంతరించుకుంది. ఈ సమయంలోనే రాజ్యం తన పాశవిక అణిచివేతరూపాల్ని ప్రదర్శించింది. కాకరపల్లి పోలీసుల పద ఘటనలతో మారుమ్రోగి పోలీసు కాంపుగా మారిపోయింది.

సరిగ్గా ఎనిమిది రోజుల తర్వాత 25 ఫిబ్రవరి, 2011న రెండు వేలది మంది పోలీసులు నిరాహార దీక్ష శిబిరాల్ని కూల్చివేసి, ప్లాంటు పరిసర గ్రామాలను మోహరించి దిగ్బంధించారు. ప్రతి ఒక్కళ్ళను లాఠీలతో భయంకరంగా కొట్టారు. ఇళ్ళల్లోకి దూరి మరీ మనుషుల్ని పశువుల్ని కొట్టినట్లు కొట్టారు. అప్పటికే బతుకు తెరువు కోల్పోయి ఆకలితో అభద్రతతో తీవ్రమైన మానసిక ఆందోళనలతో ఉన్న ప్రజలు కర్రలు - రాళ్లతో పోలీసు మూకను ఎదిరించారు. పోలీసులు పిచ్చెక్కి ముఠా గూండాల్లా ప్రజలపై పడ్డారు. బాష్ప వాయువు - రబ్బరు బుల్లెట్లు, పొగ వెదజల్లె బాంబులు ప్రయోగించారు. అక్కడికక్కడ 150 మంది కంటే ఎక్కువ మందినే అరెస్టు చేసి జైళ్ళల్లో పెట్టారు. ఇంత జరిగినా ప్రభుత్వం - మంత్రులు, రెవెన్యూ శాఖ ఎవరూ ప్రతిస్పందిచలేరు. దీంతో 28, ఫిబ్రవరి 2011న మళ్ళీ పోలీసులు బాంబులతో గ్రామాల మీద పడ్డారు. వడ్డితాండ్ర గ్రామంలో దాదాపు 50 ఇళ్ళపై బాంబులు వేసారు. అవి కాలి దగ్ధమైపోయాయి. ప్రజలు బయటకు పరుగులు పెట్టారు. పంట పొలాల్లోని పంటల మీద బాంబులు వేస్తే అవి కాలిపోయాయి. దాదాపు 45 ఎకరాల కుప్ప కూర్చిన వరి కుప్పలు భస్మీపటలం అయిపోయాయి, ఎదురు తిరిగిన ప్రజలపై రబ్బరు బుల్లెట్ల వర్షం కురిసింది. కనురెప్పపాటులో పోలీసులు హత్యలు చేసేసారు. రాజ్యం తమకిచ్చిన తుపాకులతో! శీనపువారిపేటకు చెందిన ఎర్రయ్య, ఆకాశలక్కవరానికి చెందిన నాగేశ్వరరావు బుల్లెట్లకు మరణించారు. వందల సంఖ్యలో ప్రజలు క్షతగాత్రులయ్యారు. రక్తాలు చిందుతున్నా వెంటనే వారికి వైద్యసదుపాయాన్ని కూడా నిరాకరించి పోలీసులు చనిపోయిన వారిని పశువుల్ని ఈడ్చికెళ్ళినట్లు ఈడ్చికెళ్ళారు. వారిని అతిదగ్గర నుంచి నిజమైన బుల్లెట్లతో కాల్చారని స్థానిక ప్రజలు చెప్తున్నారు. రక్తాలోడుతూ క్షతగాత్రులు నీళ్ళడిగితే మురికి గుంటల్లోని నీటిని వారి నోట్లో పోసిన క్రూరత్వం పోలీసులది.

రాజు అనే వడ్డితాండ్రకు చెందిన మత్స్యకారుడు అక్కడి గవర్నమెంట్ ఆస్పత్రిలో మృత్యువుతో పోరాడుతున్నాడు. అలా అనేక మంది అక్కడ ప్రభుత్వాసుపత్రుల్లో ఉన్నారింకా! కాల్పులు భీకరంగా జరిగి ప్రజలు మరణించిన తర్వాతే ప్రభుత్వం స్పందించింది. మొసలి కన్నీరు కార్చి ప్రజలే పోలీసులపై కర్రలతో, మారణాయుధాలతో దాడి చేస్తే పోలీసులు ఆత్మరక్షణ కోసం కాల్పుల్సి వచ్చింది అని హోంశాఖామంత్రి సబితారెడ్డి చెబుతోంది. కాల్పులు జరుగుతున్న సందర్భంలో అసెంబ్లీలో ముఖ్యమంత్రి దగ్గర్నుంచి ఏ ప్రజా ప్రతినిధి స్పందించలేదు, ఖండించలేదు. ఇదీ పాలకుల దమన నీతి.

ఇదంతా అక్కడ మీడియా సాక్షిగానే జరిగింది. ఎవరి చేతుల్లో తుపాకులున్నాయో అవి ఎవరిని కాలుస్తున్నాయో, పోలీసుల లాఠీలు ఎవరిని చావబాదుతున్నాయో, ఎవరు పశువుల్లా ప్రవర్తిస్తున్నారో అన్నీ ప్రజలకు మీడియా చూపిస్తూనే ఉంది. ఈ ప్లాంట్ ఇచ్చే ఆర్థిక ప్రయోజనాల వెనకాల ఉన్న రాజకీయ దళారీలు మాత్రం నిస్సిగ్గుగా ఈ గ్రామాలు తిరిగి సంతాపాల్ని ప్రకటిస్తున్నారు.

ఈ నేపథ్యాన్నంతా అక్కడి గ్రామ ప్రజలు యుద్ధంలో పాల్గొన్న స్త్రీలు, పురుషులు, వృద్ధులు మాకు ఆవేశంతో, ఆవేదనతో చెప్పుకుంటూ వచ్చారు. వాళ్ళు ప్రయోగించిన భాష, పద ప్రయోగాల ఆవేశకావేశాల ముఖ చిత్రణలు వాళ్ళ పోరాట రూపానికి ఎర్ర రంగునద్దాయి.

హనుమంతరాయని పేటలో ప్రజల శిబిరాన్ని పోలీసులు

కూల్చివేశారు.

అక్కడే అంట్లవరం గ్రామస్తులు కూడా కలిసారు. కోళ్ళ చిన్నారావు కాళ్ళమీద విపరీతంగా కొట్టారు - బుల్లెట్ గాయాలైనాయి. ఆ గాయాలకు కట్టు కట్టుకొని తిరుగుతున్నాడు. వ్యవసాయ కూలి. ఊర్లో ఇంకా కొర్నాల చిట్టిబాబు, మండల అజిస్స్, కిట్ల అప్పన్నలకు బుల్లెట్ గాయాలయ్యాయని, ఇంకా గవర్నమెంట్ ఆసుపత్రిలో చికిత్స పొందుతున్నారని చెప్పాడు. కాల్పుల తర్వాత గ్రామంలో 144 సెక్షన్ పెట్టారన్నాడు.

దండి చెన్నారయ్యకు 20 ఎకరాల పట్టా భూమి ఉంది. ప్లాంట్ తెచ్చిన ముంపు వలన మొలకలు నాశనమై పెట్టిన పెట్టుబడి అంతా పోయిందని వాపోయాడు. పరపతి చిన్నయ్యకు కడుపులోకి బుల్లెట్లు వెళ్ళి కడుపు ఆపరేషన్ అయ్యి ఇంకా ఆసుపత్రిలోనే ఉన్నట్లు చెప్పాడు.

గిన్ని భూలచ్చిమిదేవి అనే 65 సంవత్సరాల వృద్ధురాలు తనకు 8 ఎకరాల పట్టా భూమి ఉందని అది తన కొడుకుల స్వంతమని ప్లాంట్ వాళ్ళెట్లా తీస్కుంటారని అడుగుతోంది. "మాం వు సచ్చేదంక పోరాటం చేత్తాం మాంవు సచ్చిపోయినా మా పిల్లలకు నాబం వస్తాది గందా ఫ్యాక్టరోల్లకు ఇదే చెప్పాం దెబ్బలాటలు జరిగాయి. ఎంత దొష్టం వీల్లది? మాంవేమో బూంవులు వీళ్ళకిచ్చి బిచ్చమెత్తుకోవాల... ఆల్లేమో కోటీశ్వరులైపోవాల ఇయ్యమంటే కొట్టేశినారు అని బాధగా... రోషంగానూ చెప్పింది. అంతేకాదు అక్కడి స్త్రీలు పోలీసులు తమతో ఎంత అసహ్యంగా ప్రవర్తించిందీ

చాలా ఆవేదనతో చెప్పుకొచ్చారు. శిబిరాల నించి తొలగకపోతే రేపులు చేసేస్తామన్నారంట.

అలాగే ఇళ్ళకు మగవాళ్ళకోసం వెళ్ళి... "ఏవే మీ ఆయన లేడుగా... నువ్వు నా దగ్గరకు వస్తావా అని అసభ్యంగా అడిగారని చెప్పుకొచ్చారు. వనరుల దోపిడీలో భాగంగా ముందస్తుగా ప్రాంతాలను ఖాళీ చేయించడానికి ప్రజల్ని భయభ్రాంతుల్ని చేసే క్రమంలో భాగంగా స్త్రీలపై లైంగిక అత్యాచారాలు చేస్తే త్వరగా ప్రజలు ప్రతిఘటన ఆపి వెళ్ళిపోతారని కుట్రపూరితంగా పోలీసు బలగాలకు ఇచ్చే శిక్షణలో ప్రధానమైన భాగం ఇది. దంతేవాడలో స్థానిక అటవీ వనరులను సామ్రాజ్యవాదులకు దోచిపెట్టడానికి ఆదివాసీ స్త్రీలమీద ఎస్.పి.ఓ. లు సాగించిన లైంగిక దాడులు, హత్యలు ఈ కుట్రలోని భాగాలే. అదే ఇక్కడా అమలు చెయ్యాలని చూసారు. అంట్లవరం ఊరి రైతు కొండాలి కొండ అనే రైతుకి 10 ఎకరాలు పట్టా ఉంది. దీంట్లో కొంతభాగం ఫ్యాక్టరీ వాళ్ళు తవ్వేసారు. వరి, శెనగ, నువ్వులు, జీడిమామిడి, ఉలవ, పెసర, మినుము, కూరగాయలు పండిస్తాడట. ఫ్యాక్టరీ వాళ్ళు పోలీసులతో తీవ్రంగా కొట్టించారు. "ఫ్యాక్టరీ నిలిచిన బండకాన్నించి మా బూం వులున్నాయి, ఈ ఫ్యాక్టరీ వలన ఈ సంవత్సరం మాకు వరే పండలేదు. ఇది మాకే కాదు 70 గ్రామాల్లో ఇదే పరిస్థితి. వీళ్ళ పాపాలు బయట పడ్తాయని ఫ్యాక్టరీలో మా బూవుల్లోనే గుడి కట్టించినారు." అని కొండాల కొండ వాపోయాడు.

శీనపువానిపేటలోనైతే మృత్యుచ్ఛాయలు కన్పించాయి. 30 సంవత్సరాల ఎర్రయ్య పోలీసుల కాల్పుల్లో మరణించాడు. ఆయన భార్య 25 సంవత్సరాల ధనలక్ష్మి, పాలు తాగే పిల్లవాడు సంతోష్, 12 సంవత్సరాల కూతురు పావనిలతో... దుఃఖ సముద్రంలో మాటలు కూడా రాక మౌనంగా భర్త ఫోటో పక్కన కూర్చొని ఉంది. ఆమె పక్కన ఆమె మేనత్త లక్ష్మి కూర్చొని ఉంది. "మాంవు ఇంట్లో ఉన్నాం మాకు తెలీదండి - ఈ లోపలే ఎవురో వచ్చి ఎర్రయ్య సచ్చిపోనాడని, పోలీసులు కాల్చేసినారని చెప్పారండి" అని లక్ష్మి ఆవేదనగా చెప్పింది.

కాల్పులకు ముందు ఆ గ్రామాల్లో ప్లాంటు యాజమాన్యం, ప్రభుత్వం కుమ్మక్కై చాలా క్రూరమైన పనులు చేసింది. సరిగ్గా గంగవరంలో చేసినట్లే. గంగవరంలో ఆ గ్రామ ప్రజల్ని ఖాళీ చేయించడానికి ఆస్పత్రులు, బడులు కూల్చివేసింది, మునిసిపాలిటీ సర్వీసుల్ని బందు చేసింది. నీటి సౌకర్యం తీసేసింది. కరెంటు ఆపి అంధకార బంధురం చేసింది. గ్రామానికి సముద్రానికి మధ్య ముళ్ళ కంచెలు - తుపాకులతో సెక్యూరిటీలను పెట్టి స్థానిక మత్స్యకారుల్ని సముద్రంలో చేపలు వేటాడనీయకుండా చేసి వారిని అక్కడ ఉండలేని దుర్భర పరిస్థితులకు లోను చేసి తరిమివేసింది. సరిగ్గా కాకరాపల్లిలో కూడా అదే జరిగింది. కాల్పులు జరగడానికి పది రోజుల ముందు నుంచీ చాలా పకడ్బందీగా, శీనపువారి పేట మరికొన్ని గ్రామాల్లో కరెంటు తీసేసారు, మంచినీరు ఆపివేసారు. పారిశుధ్య కార్యక్రమాలు నిలిపివేసి గ్రామాన్ని కలుషితం చేసారు. పిల్లల బళ్ళు మూసేసారు. ఆసుపత్రులకు తాళాలు వేసారు. కూరగాయలు రానియ్యకుండా చేసారు. ఒక్కగానొక్క ఆర్.ఎం.పి. డాక్టర్‌ని రానివ్వకుండా తీవ్రంగా కొట్టారు. అతనింకా ఆస్పత్రిలో చికిత్స పొందుతున్నాడు. ఎర్రయ్య గ్రామస్తులు పడ్తున్న బాధలు చూస్తూ భరించలేక... ఇదంతా ఎందుకు ఆపారని అడగడానికి పోలీసుల దగ్గర్కి వెళ్ళి అడిగాడు. అప్పటికే పిచ్చెక్కి ఉన్న పోలీసులు అతన్ని దగ్గరగా ఒరిజినల్ బుల్లెట్లతో కాల్చారట.

అతని భార్య ధనలక్ష్మి ఇంకా చాలా చిన్నది. చిన్న పిల్లలతో ఆమె భవిష్యత్తు ఏమిటి?

లక్ష్మి ఇంకా ఇలా చెప్పింది. "పేట వదిలి మాంవ్ ఎక్కడికీ ఎల్లం. ఎక్కడికో పంపిత్తే ఎట్టా బతుకుతాం? ఫ్యాక్టరీ ఒద్దు. మా కొంపలు, ఆస్తీ మాకు సాలు" అని చెప్పింది. "మీలో కొంతమంది భూములమ్ముకున్నారని అంటున్నారు నిజమేనా?" అని వాస్తవం వారి నోటి నించి విందామని విరసం సభ్యురాలు కృష్ణక్కయ్య అడిగితే వెంటనే "మాంవు బూంవులెక్కడా అమ్మకోనేదు అబద్ధం. మాకు ఉద్యోగాలు నేవు ఒక్క ఎకరం ఉన్నా సమచ్చరం అంతా బతికేస్తాం" అంది. "తంపర మీది రెల్లు వస్తుందండి. ఎండాకాలం అంతా ఆ రెల్లు గడ్డి పక్కూర్లకు పోయి కట్ట 2 రూపాయలు అమ్ముతామండీ. ఒక్కో కుటుంబం 15,000 రూపాయల నించి 20,000 దాకా సంపాయిస్తామండి. ఫ్యాక్టరీవాలు మందు పెట్నారు కదండీ తుంగ - రెల్లు - చాపలు అన్నీ సచ్చాయండీ... నేకపోతే...

పేట్లో శానామంది రెల్లుగడ్డి మీదనే బత్కుతామండీ" అంది లక్ష్మి. "చానాసార్లు ఫ్యాక్టరీకాడికి వెళ్ళామండీ అందరం..... లోనకు రానివ్వలేదండీ" అంది మళ్ళా తనే.

ఆకాశలక్కవరంలోనైతే... యువకులంతా పనిలేక తంపర భూములు పోయి ఊరి నట్టనడుమన శిబిరం వేస్కున్న గద్దె మీద ఖాళీగా కబుర్లాడుకుంటూ కన్పించారు.

"వాళ్ళని కదిలిస్తే చాలా విషయాలు చెప్పారు. "ఈ ఫ్యాక్టరీవల్ల చెట్లు కాయలు కాయడం లేదండీ - ముంపునకు గురైన మా పంట ఇదిగోండి ఎట్టా మొలకలొచ్చేసాయో" అని అరచేతుల్లో పాలథీన్ సంచుల్లో నల్లబడి, సగం మొలకలొచ్చిన ధాన్యం చూపించారు వాళ్ళు.

"ఇంత చిన్న ఊర్ల మీద పోలీసులు దెయ్యాలంటి జీపుల్లో రావాలాండీ... ఆ జీపులు కూడ ఎంత స్పీడుగా నడిపేవారోనండీ. ఆ స్పీడుకీ మా పేటలోని తొమ్మిదేళ్ళ కుర్రాడు జీపు కింద పడి సచ్చిపోనాడండీ. అది బయట పెట్టకుండా తొక్కేసినారండి. ఇప్పటిదాకా సంతబొమ్మాళికి టిడిపి వాళ్ళెవ్వరూ రాలేదండీ. మొన్న చంద్రబాబు వచ్చి ఫ్యాక్టరీ ఆపేస్తామని చెప్పిపోనాడు. టిడిపి నించే లచ్చింనాయుడు కలెక్టర్‌కాడికి పోయి ఫ్యాక్టరీ ఆపద్దని చెప్పినాడంట.... వీళ్ళ రాజకీయాలు ఇట్టాగుంటాయండీ" అని కొంచెం చదువుకున్న పెద్దాయన చెప్పాడు.

ఆకాశలక్కవరంలో 30 సంవత్సరాల నాగేశ్వరరావుకు బీర్జాలకు గుండు తగిలిందట. భార్య గీరలక్ష్మికి 26 సంవత్సరాలు. భార్య భర్తలిద్దరు కూలీకి వెళ్తారు. రోజు ఇద్దరూ కల్సి 250 రూపాయలు సంపాయిస్తారట. 6సంవత్సరాల, 2 సంవత్సరాల చిన్న పాపలున్నారు.

గర్భిణీ స్త్రీ నొప్పులు పడ్తున్నా పోలీసులు ఊరిని అష్ట దిగ్బంధనం చేసి బయటకు వెళ్ళనివ్వలేదట.

అక్కడ యువకుల్ని పలకరిస్తే..

"ఈ పాటికి మా భూవుల్లో పనిచేస్కునేటోల్లం. ఆ ఫ్యాక్టరీ బూఁవి మా బూఁవే! చిత్తడి నేలని పోరంబోకు బూఁవి అని కలెక్టరు దొంగ లెక్క రాసిచ్చినాడు. 6,000 ఎకరాల చిత్తడి బూఁవి అంటే, తంపర లాక్కున్నారండీ. ఇదసలు అంటే ఈ తంపర 3 నదుల స్టాక్ వాటరండీ (1) గరీబుల గడి (2) ఏనుగుల గడి (3) బెసిగడ్డ నాగావళి మూడు కల్సి సముద్రంలోక్కి కలుస్తాయి. ఈ ఫ్యాక్టరీ వలన సముద్రంలోకి వెళ్ళకుండా పొలాల మీదకు వెళ్తే పొలాలు మునిగిపోతాయండీ. అసలు 60 గ్రామాలకు ఈ తంపర నించే నీళ్ళు వెళ్తాయి. ఇవే పంటలకి వాడతం. ఇప్పుడు నీరు ఇవ్వడం లేదు. ఫ్యాక్టరీ మూలాన నీరు ఎక్కువై మా పొలం మీదకు వచ్చి నాశనం చేస్తాయి. అదే జరిగిందండీ ఇప్పుడు. తప్పుడు లెక్కలు చూపించి మా పొలాలు తీస్కున్నారు. మాఁవు అమ్మలేదండీ... మేం వ్యవసాయం చెస్కుంటే ఊర్లో 20 కుటుంబాలు తంపరలో చాపలు పట్కుంటారు. అంటూ మా పొలాలు, బతుకులు నాశనం అయిపోనాయి. ఇక్కడి ఎం.ఎల్.ఏ. ఎర్రన్నాయుడు, ధర్మాన, రెవెన్యూ వాళ్లు మొత్తం అందరూ అమ్ముడు పోనారండీ. ఫ్యాక్టరీకి ఎంత బూఁవి ఇచ్చినారో హద్దులు, లెక్కలు చెప్పడం లేదు. నిజానికి ప్రభుత్వమే చట్టాన్ని అతిక్రమించింది. ఫ్యాక్టరీ మేనేజిమెంటుకు చట్టాన్ని అతిక్రమించి ఇవ్వాల్సిన దానికంటే ఎక్కువ బూఁవే ఇచ్చింది, అని కొద్దిగా చదువుకున్న యువకులు చెప్పారు. వాళ్ళంతా ఇప్పుడు పనుల్లేక నిర్వ్యాపకంగా, ఊరి మధ్యలో అయోమయంగా ఉద్యమం నడిపిన శిబిరపు గద్దె మీదే మళ్ళీ పోరాటం మొదలెట్టే వాళ్ళలాగా సిద్ధంగా కూచుని ఉన్నారు.

వడ్డితాండ్ర ఊరైతే సగం కాలి మిగిలిన చీరెలాగా అన్పించింది. ఊర్లో 50 దాకా ఇళ్ళు పూర్తిగా బాంబులతో కాలిపోయి ఉన్నాయి. ఎక్కడ చూడు కాలిన వంట గిన్నెలు, వాహనాలు, సగం కాలి కుప్ప బడ్డ బట్టలూ... రాజ్య హింసారూపం స్పష్టంగా కనపడింది. మరో 50 ఇళ్ళు పాక్షికంగా కాలి ఉన్నాయి. ఇక్కడంతా మత్స్యకారులే. వీరంతా ఒడిశా ప్రాంతాల నుంచి నిజాంల కాలం నాటి నుంచి వలస వచ్చిన ఒడిశా వాళ్ళు. ఉమ్మడి ఆంధ్రలోని గంజాం జిల్లా తర్వాత శ్రీకాకుళంగా మారిందంటారు అక్కడివాళ్ళు. రాష్ట్ర విభజన జరిగిన తర్వాత ఇక్కడ ఒడిశా నించి వలస వచ్చిన ఖండ్రలు, కైతులు, ధైరోలు ఉన్నారు. ముఖ్యంగా ఖండ్రలు భాషాపరమైన మైనారిటీలుగా మారారు. వీరు అంటే ఖండ్ర జాతివాళ్ళు దేశీ మత్స్యకారులు చెరువుల్లో మాత్రమే చేపలు వేటాడుతారు. నివాస ప్రాంతానికి అంటే వడ్డితాండ్రకి 18 కి.మీలు దూరాన ఉన్న సముద్రం జోలికి పోరు వీళ్ళు. చెరువులు, తంపర భూములే వీరి జీవనాధారం. వీరు తెలుగు ఒడియా యాసలో, ఒడియా పదాలతో కలగలసి మాట్లాడుతారు. ప్రతి స్త్రీ ముఖానికి పసుపు రాస్కుంటుంది. ఈ విషయాలన్నీ అక్కడ స్థానికంగా ఈ విషయాలపై పరిశోధన చేస్తున్న సీనియర్ జర్నలిస్టు పరమేశ్వర్ చెప్పారు.

ఇక్కడ ఇళ్ళతో పాటు రైతులు కుప్ప నూర్చిన 45 ఎకరాల వరికుప్పలు పోలీసులు వేసిన బాంబులకు మాడి మసై పోయాయి. రైతులు వేల కొద్దీ పెట్టుబడి పెట్టారు. ఎం.ఆర్.ఓ. మాత్రం "అదంతా వరదలో కొట్టుకుపోయింది, మీ భూవి ఎక్కడుంది? ఎవరిది ఎంత పోయిందో చేప్తే ఇస్తాం" అంటాడట. 'ఎంత పోయిందో ఎట్టా లెక్క చెప్తాం' అంటూ రైతులు కాలి బూడిదైన ధాన్యపు రాసుల్ని చేతుల్లోక్కి తీస్కుని ఆవేదన పడ్డారు.

వడ్డితాండ్ర గ్రామంలో అడుగుపెట్టగానే... పూర్తిగా కాలిపోయిన ఇంట ముందరి ఇంట్లో ఒక 25 సంవత్సరాల స్త్రీ సంవత్సరం బాబుతో బయటకు వచ్చింది. తన భర్త పేరు ఖగపతి అని, తన పేరు లక్ష్మి అని చెప్పింది. ఖగపతికి 35 సంవత్సరాలు. పోలీసుల బుల్లెట్ల దాడిలో 3 బుల్లెట్లు తగిలాయి. ఇంకా ప్రభుత్వాసుపత్రిలోనే చికిత్స పొందుతున్నాడు. బుల్లెట్ గాయాలతో రక్తంతో తడిసిన ఖగపతి చొక్కాని అతని తల్లి తండ్రి పరిగెత్తుకుంటూ తీస్కొచ్చి చూపించారు. కొడుకు ఆనవాలు ఆ రుధిర వస్త్రం! తంపర మీది రెల్లు గడ్డితో అల్లిన మావులను వెదురు తడకలను చూపించింది లక్ష్మి. ఇవమ్ముకున్నాక ఇంకేం లేదు మాకు

అంది బాధగా.

ఆ తల్లిదండ్రులు, భార్య గాయపడి చికిత్స పొందుతున్న ఖగపతి రాక కోసం ఎదురుచూస్తున్నారు. అతను వచ్చేదాకా అతని నిశానీ రక్తంతో తడిసిన అతని చొక్కామాత్రమే... వచ్చిన ప్రతి ఒక్కరికి రాజ్యహింసకు ఆనవాలుగా ఒక జెండాను పట్టుకున్నట్లుగా అతని చొక్కాను పట్టుకుని నిలబడతాడు ఆ బీద తండ్రి!

ఫ్యాక్టరీకి ముందు 5,000 ఎకరాల తంపరలో అక్కడి చెరువుల్లో చేపలు వేటాడి అమ్ముకొంటూ తంపరపైని రెల్లుగడ్డినీ చాపలు - పూరిపాకలపై కప్పులు, చీపుర్లు చేసి అమ్ముకుంటూ ఎంతో కొంత మెరుగైన జీవితం గడుపుతున్న మత్స్యకారుల జీవితాల్లో ప్లాంటు చీకట్ని మిగిల్చింది.

"మమ్మల్ని సముద్రంలో చేపల్ని పట్కోమంటారు. వడ్డితాండ్రకి సముద్రం 18 కి.మీ. దూరాన పిల్లాపాపల్ని వదిలి రోజు అక్కడ్కి ఎట్టా పోతాం? మేం ఇక్కడే ఉంటాం. మా బత్కు ఇక్కడ్నే... మా పెద్దలు ఇక్కడ్నే చచ్చారు. మేం, మా పిల్లలు ఇక్కడ్నే పుట్టాం, ఇక్కడ్నే ఉంటాం. ఎక్కడికీ పోం" అన్నారు - వీరోచితంగా పోరాటం చేసిన ఆ వడ్డితాండ్ర స్త్రీలు! పిచ్చి కుక్కల్లా కొడ్తున్న పోలీసులకు ఎదురు తిరిగి వీరోచితంగా పోరాడిన 65 సంవత్సరాల వృద్ధురాలు చంద్రమ్మ మౌనంగా గద్దె మీద కర్ర పట్టుకుని కూర్చుంది. చేతిమీద కాళ్ళమీద పోలీసుల బుల్లెటు గాయాలు ఇంకా మానలేదు. కృష్ణక్క చంద్రమ్మని ప్రేమగా దగ్గర తీస్కొని పలకరిస్తే "మా తంపర మాక్కావాలి, మేం చేపలవేట మీద బత్కెటోల్లం.. తంపర ఫ్యాక్టరీ గుంజుకుని మమ్మల్ని సముద్రంపైకి పొమ్మంటుంది. మాకొద్దీ సముద్రం. మేం చెరువుల్లో తంపరల్లో చేపలు పట్టే వాళ్ళం.." మా తంపర భూములు మాక్కావాలి అని ఘొల్లుమంది.

25 సంవత్సరాల నిన్ని మహా చురుకైన మహిళ. "మావు సముద్రం వైపెందుకు ఎల్తాం? ఇక్కడ్నే చెరువులో తంపరలో చేపలు పట్కోని బత్కుతం... ఇక్కడ్నే ఉంటం వాళ్ళే పోవాల, ఫ్యాక్టరీ పోవాల, ఇదిగో చూడు" అంటూ చంద్రమ్మ పక్కన కూచున్న 65 సంవత్సరాల బీద బక్క మత్స్యకారుడైన కార్ల రాజుని చూపిస్తూ "ఇగో ఈన బారియ రాత్రి బంధువుల ఇంటికి పొయ్యి పొద్దున్న ఊరికి వస్తుంటే, పోలీసులు కొట్టి జైల్ల వేసినారు. ఈనకు అన్నం ఎవరు పెడ్తారు?" అని అడిగింది.

40 సంవత్సరాల మధ్య వయస్కురాలు ఆనందదామేశ... చేపల్నే కాదు జీవితాన్ని, దానిలోని సంఘర్షణనీ జీవితంలోకి కొత్తగా వచ్చి చేరిన పోరాటాల్ని, గాయాల్ని, దోపిడీని కూడా వడపోసినట్లే వచ్చిరాని తెలుగులో ఒడియా యాసలో మాట్లాడింది. ఫ్యాక్టరీకి ముందు చలి, వర్షాకాలాల్లో తంపర, చెరువుల్లో పుష్కలంగా ఎలా చేపలు పట్టి పరిసర గ్రామాలకు భల్లుగం, రంభా, కలకత్తా లాంటి ప్రాంతాలకు కూడా వెళ్ళి అమ్ముకొచ్చేవారో చెప్తూ, "చెరువులు ఎండితే... రెల్లుగడ్డి మీద బతికేటోల్లం. మా 'మావులు' మాడే తయారు చేస్కుంటాం" అంటూ చేపలు పట్టే వెదురు తడికెల్ని తెచ్చి చూపించింది. ఎంతటి కళానైపుణ్యం ఉందో ఆ వెదురు తడికల్లో. "తంపరలు సముద్రంలో కలిసే చోట అక్కడ వెదురు తడికెలు నిలబెట్టి నీరు ఆపుతాం. అందులో రొయ్యగుడ్లు, చిన్ని - పెద్ద చేపలన్నీ చిక్కుకుంటాయి. చేపల్ని అమ్ముకుంటాం. రొయ్య గుడ్లు, చిన్న చేపల్ని పెంచుతాం," అంటూ తాము ఎంత కౌశలం, నైపుణ్యంతో చేపల్ని పడతారో, పెంచుతారో, అమ్ముకొని వ్యాపారం చేస్తారో చెపుతోంటే ఆమెలోని వ్యాపార దక్షత, అనుభవం ఆమె ముఖంలో స్పష్టంగా కన్పించింది. వీళ్ళకి తంపరలను దూరం చేసి వాటిని టన్నులకొద్దీ మట్టితో ఎండబెట్టి, చేపల పెంపకం కోసం ట్యాంకులు కట్టిస్తామన్న ధర్మాన ప్రసాదరావు మీద వీళ్ళు ఆగ్రహంతో మండి పడుతున్నారు. "ఫ్యాక్టరీ రాకముందు కోల్‌కతా, పార్వతీపురం, రాయఘడ్, పలాస బళ్ళమీద లేకపోతే చేపల గంపలు నెత్తిమీద పెట్కోని నడుస్తాపోతూనే ఉంటాం. రాత్రికల్లా చేపలు అమ్ముకొని ఇంటికొస్తాం. సొసైటీలోనే పైసలు పదిమంది కల్సి పంచుకుంటాం. అప్పుడు మంచి బట్ట కట్టేవాల్లం, కడుపు నిండా తినేవాళ్ళం, ఇప్పుడు రొట్టేది, వరొన్నమేది? అంబలి తాగుతున్నాం" అని అంటుంటే ఆవేశంతో ఉన్నా... సంయమనాన్ని, హుందాతనాన్ని కోల్పోని ఆనందదామేశ బేల అయిపోయి కళ్ళనించి నీళ్ళు కారుతుంటే "మాకు ఫ్యాక్టరీలు ఒద్దు, మా తంపర మాక్కావాల" అంది మరింత ఆవేశంగా!

తాత్కాలికంగానైతే కాకరపల్లి ప్రజలు పోరు చేసి ప్లాంటును ఆపుకున్నారు, సోంపేటలోలాగా! కానీ ఇటు కాకరపల్లి కాల్పులు జరుగుతుండగానే సోంపేటలో ఆగిపోయిన ప్లాంట్‌ను మళ్ళీ తిరిగి మొదలు పెడ్తున్నామని కంపెనీ ప్రకటించడం ఎంత దుర్మార్గం? ఎంత నిస్సిగ్గుతనం? అక్కడింకా ప్రభుత్వం పోలీసులని ఉపసంహరించలేదు.

పెద్ద పెద్ద వాహనాలపై పోలీస్ అని రాసి ఉన్నాయి. వాటిల్లో మఫ్టీలో పోలీసులు ఫ్యాక్టరీ, లోపల్కి పోతూ కన్పించారు. సంతబొమ్మాళిలోని 14 గ్రామాలు నేడు పోలీసుల దిగ్బంధంలో ఉన్నాయి. ఎదిరిస్తే మరణమే అన్న సూచనలు ఇచ్చేసిన పోలీసులు మఫ్టీలో ఆరాంగా తిరుగుతున్నారు. ప్రజలు అల్లంత దూరంలో తమ తంపరలను గుంజుకున్న ఫ్యాక్టరీని బీరిపోయి చూస్తున్నారు.

ఒక్క సంత బొమ్మాళే కాదు శ్రీకాకుళం నుంచి నెల్లూరు తడవరకూ 70 థర్మల్ పవర్ ప్లాంట్స్‌కై ప్రభుత్వం అనుమతులు ఇచ్చేసింది. ఇంకెన్ని వందల గ్రామాలు ముంపునకు గురికాబోతున్నాయో... ఎన్ని వేలమంది ప్రజలు నిర్వాసితులు అవబోతున్నారో... వాళ్ళని చంపి ఫ్యాక్టరీ కింద పునాదుల్లో పాతరవెయ్యడానికి పోలీసుల చేతుల్లో తుపాకులెప్పుడూ సిద్ధంగానే ఉన్నాయి. థర్మల్ పవర్ ప్లాంట్‌లే కాదు రాష్ట్రంలోనే వెనకబడ్డ ఉత్తరాంధ్ర నేడు కెమికల్ ప్లాంట్స్ వెదజల్లె విషాలతో కమ్ముకుంటూ పర్యావరణాన్ని, ప్రజల ఆరోగ్యాల్ని దారుణంగా దెబ్బతీస్తోంది పర్యవసానంగా అక్కడ పాడేరులాంటి కెమికల్ ప్లాంట్స్ ఉన్న ఊర్లల్లో అంగవికలులైన పిల్లలు, నెలలు నిండని ప్రసవాలు, గర్భ

స్రావాలు జరుగుతుండడమే కాదు, తీవ్రమైన చర్మ వ్యాధులు వస్తూ, పెరుగుదల ఆగిపోయి 25 సంవత్సరాల యువకులు 10 సంవత్సరాల పిల్లల్లా కన్పిస్తున్నారు. సరైన సాగు నీరు లేక. అలాగే మార్చ్ 14, 2011న విశాఖలోని కొవ్వాడలోని అణువిద్యుత్ ప్లాంట్ ఒద్దే ఒద్దంటూ ప్రజలు ప్రజాస్వామికవాదులు, హక్కుల ప్రజాసంఘాలు 500 మందితో ర్యాలీ తీసినట్లు ఎచ్.ఆర్.ఎఫ్. విశాఖ సభ్యులు జె.వి. రత్నం చెప్పారు. ఇది ఆగిపోవడానికి కారణం ప్రధానమంత్రి మంచివాడైపోవడం కాదు, జపాన్‌లో జరిగిన అణువిస్ఫోటనం విస్తరిస్తున్న అణు ధార్మికత, సునామీ, భూకంపమే!

అడవిని, అటవీ సంపదైన నీరు, ఇప్పపూలు, చింతపండు, జిగురు కల్లులాంటివి, భూమి, భూమిలోని విలువైన బాక్సైట్‌లాంటి ఖనిజసంపద, సామ్రాజ్యవాద దేశాలకు అమ్ముకోవడానికి దళారీలుగా మారిన ప్రభుత్వం అడవి నుంచి ఆదివాసీలను తరిమివెయ్యడానికి ఆపరేషన్ గ్రీన్‌హంట్ పేరుతో (ఒ.జి.హెచ్) స్త్రీలపై లైంగిక అత్యాచారాలు, హత్యలు, దోపిడీలు, దహనాలు లూటీలు చేసి అడవి నించి అటవీ పుత్రుల్ని తరిమి తరిమి కొడ్తుంది.

ఆదివాసీనించి అడవిని, పేద దళిత రైతాంగం నుంచి సెజ్‌ల పేరుతో, పరిశ్రమల పేరుతో భూమిని, కోస్టల్ కారిడార్‌లు, థర్మల్ పవర్‌ప్లాంట్ల పేరుతో మత్స్యకారుల నుంచి జలవనరులనీ, సముద్రాన్ని, మల్టీ నేషనల్ కంపెనీలకు ధారాదత్తం చేయడానికి దూరం చెయ్యడం, ప్రతిఘటించే ప్రజల్ని చంపైనా వనరుల్ని సామ్రాజ్యవాద దేశాలకు అప్పచెప్పి వాటాలు మింగడం ప్రభుత్వ నిత్య సంక్షేమ కార్యక్రమం అయిపోయింది. ప్రజల కోసం సంక్షేమ కార్యక్రమాలు కాకుండా పెట్టుబడిదారీల కోసం పారిశ్రామిక వేత్తల కోసం ప్రజల వనరుల బలవంతపు దోపిడీ హత్యాకాండలే ప్రభుత్వ అభివృద్ధి నమూనా! పెట్టుబడీదారుల కోసం దేశీయ దళారులు ఇక్కడి స్థానిక రాజకీయ నాయకులతో కల్సి అమలుపరుస్తున్న విధ్వంసకరమైన అభివృద్ధిని పెంచే రాజకీయ ఆర్థిక విధానాలు కొద్దిమంది సంపన్నవర్గాలు మరింత సంపన్నం కావడానికి వారికి మరింత భూమి, మరింత సముద్రం ఎంతో అడవి, అటవీసంపద, అటవీ భూములు, వాటిలోని ఖనిజాలు కావాలి. దానికోసం లక్షలమంది రైతాంగం, దళితులు, ఆదివాసీలు బలికావాలి. ఈ రాజకీయ ఆర్థిక విధానాలకు ఒప్పుకోకపోతే వీరికి మరణమే శరణ్యం! ఎదురు తిరిగిన వారిని తుపాకీ తూటాల్తో బలి చెయ్యడమే నేటి పాలకుల పాలనా సూత్రం! సెజ్‌ల పేరుతో తమ మీద పడ్డ నయా భూస్వామ్యాన్ని ఎదుర్కొనే ప్రజా పోరాటాల మీద బాంబులు, బుల్లెట్లతో హత్యలు చేసి అణిచివేసే రాజ్యం!

ఆరోగ్యవంతమైన సాగునీటి కోసం, పర్యావరణ కాలుష్యం నుంచి తమను తాము రక్షించుకోవడం కోసం నేడు సమస్త ఉత్తరాంధ్ర ఉద్యమిస్తోంది. కాకరపల్లి నుంచి సోంపేట వరకు, శ్రీకాకుళం నుంచి నెల్లూరు వరకూ, కొత్తగా అణుధార్మిక ప్లాంటును వ్యతిరేకించిన కొవ్వాడ వరకూ జరిగే ప్రజా పోరాటాలు మొత్తం తంపర భూముల్ని కోల్పోయిన దళిత రైతాంగం, మత్స్యకారుల ఆకలి, ఆర్తనాదాలు, "మా తంపర మాక్కావాలి" అని వారు చేసే నినాదాలు, భర్తల్ని కోల్పోయిన భార్యల కన్నీళ్ళు తల్లిదండ్రుల ఆవేదన పాలకులకు అర్థం అవుతుందా? సామ్రాజ్యవాదులకు తొత్తులుగా ఉన్న పాలకవర్గం కోట్లరూపాయల వాటాల కోసం సమస్త సహజ వనరులతో సుభిక్షంగా జీవిస్తున్న ప్రజలను ఖాకీల తుపాకీ నీడల్లో అణచివెయ్యడానికే సిద్ధమవుతున్నారు తప్ప.. తమ ప్రజల మీదికే యుద్ధానికి పూనుకుంటారు తప్ప ప్రజల పక్షాన నిలబడేదెన్నడు? కాకరపల్లిలో ప్రభుత్వం చట్టాన్ని కూడా అతిక్రమించి భూ కబ్జా చేసింది. అయినా ప్రజలకు రాజ్యాంగం మీద, ప్రజాస్వామ్యం మీద, కోర్టులు చట్టాల మీద ఆశ చెదరలేదు. ఈ రోజు, ముందు, ముందు దేశమంతా సామ్రాజ్యవాదుల గుత్త పెత్తందారీ, దోపిడీ రాజ్యం పడగనీడలోకి వెళ్తున్న సమయం. సెజ్‌లు, ఓజిహెచ్‌లు, లక్షల ప్రజలను నిర్వాసితుల్ని చేసే అన్యాయపు, అనవసరపు పారిశ్రామిక కారిడార్‌లకి కరెంట్‌ను, నీటిని సప్లై చేసే ప్రయోజనం తప్ప మరేమీ లేని పోలవరంలాంటి భారీ ప్రాజెక్టులు, విద్యుత్ థర్మల్ ప్లాంట్‌లు విషపూరిత కెమికల్ ప్లాంట్‌లు, ప్రాణాంతక అణుధార్మిక ప్లాంట్‌ల నిర్మాణాలు కొద్దిమంది సామ్రాజ్యవాద పెట్టుబడీదారుల ప్రయోజనాల కోసం నిర్మించబడుతున్నాయి. లక్షల సంఖ్యలో నష్టపోతున్న దళిత రైతాంగం, ముంపునకు భారీనష్టానికి గురౌతున్న ఆదివాసీ ప్రజల్ని, నాశనమవుతున్న లక్షలాది ఎకరాల అటవీ, సాగు భూముల్ని, నదుల్ని, సముద్రాలన్ని రక్షించుకోవాల్సిన బాధ్యత మనలాంటి ప్రజాస్వామికవాదుల మీద ఉంది. ప్రజలకు రాజ్యాంగం మీద, వారిపక్కన నిలబడే మనలాంటి ప్రజాస్వామికవాదుల మీద గాఢమైన నమ్మకం ఇంకా ఉంది. సోంపేట-కాకరపల్లి మరణాలు వారిలోని పోరాట స్ఫూర్తిని ఎదిరించి గెలవాలన్న స్థైర్యాన్ని ఇంకా ఎక్కువ చేసాయి. వారికి అండగా నిలబడదాం, వారి పోరాటాల ఆరాటాల్ని అర్థం చేస్కుంటూ పవర్ ప్లాంట్‌లు, సెజ్‌లు, ఓ.జి.హెచ్.లు పోలవరం ప్రాజెక్టులు, కెమికల్ ప్లాంట్‌లు ఆపివేసి వారి భూములు వారికే దక్కేదాక పోరాడుదాం. దున్నేవానిదే భూమి కానీ భూమిలో విషం నింపేవాడిది కాదని నినదిద్దాం. కాకరపల్లి అమరుల నెత్తుటి సాక్షిగా ప్రజల పక్షాన నిలబడి పోరాడాల్సిన బాధ్యతను చివరికంటా కొనసాగిద్దాం.

మఫ్టీలో ఉన్న పోలీసులను వెనక్కి పంపితే కానీ ఆ గ్రామాల్లో శాంతియుత వాతావరణం నెలకొనదు. అలాగే, ఎర్రయ్య నాగేశ్వరరావులను హత్యచేసిన" మిగతా గ్రామస్తులని హత్య చేయబూనిన పోలీసుల పైన హత్య కేసులను నమోదు చేసి శిక్ష పడే దాకా పోరాటాన్ని ఆపకూడదు. వందల మంది కాకరపల్లి ప్రజలు అన్యాయపు తప్పుడు కేసులతో జైళ్లలో మగ్గుతున్నారు. వారి విడుదల కోసం డిమాండ్ చేయడంతో పాటు... ఈస్ట్‌కోస్ట్ థర్మల్ ప్లాంట్ "మేఘవరం ప్లాంట్‌లను --- ఆపేయాలన్న డిమాండ్‌లతో భవిష్యత్తు పోరాట రూపాన్ని తీసుకోవాలని. అలాగే ప్రజా హక్కుల సంఘాలు అన్నీ కూడా ఐక్యసంఘటనగా తయారయి కాకరపల్లి ప్లాంట్ వ్యతిరేక పోరాట కమిటీని ఏర్పర్చి దీర్ఘకాలిక ప్రణాళికతో ప్లాంట్ నిర్మాణం రద్దయ్యేంతవరకు పని చెయ్యాలి.

కరపత్రం

# తెలంగాణ సాధనకు ప్రజా ఉద్యమాలే మార్గం

- విప్లవ రచయితల సంఘం

బహిరంగ సభ : 10 జనవరి, 2011, సాయంత్రం 6 గం॥లకు, ప్రెస్‌క్లబ్, బషీర్‌బాగ్, హైదరాబాద్
అధ్యక్షత : గీతాంజలి, వక్తలు : వరవరరావు, ప్రొ.జయశంకర్, పాణి, రత్నమాల, కాశీం

"నిన్న విడిచిన పోరాటం
నేడు అందుకొనక తప్పదు"

అని శ్రీశ్రీ చెప్పిన మాట తెలంగాణ విషయంలో సంపూర్ణ సత్యం కాకపోవచ్చు. ఎందుకంటే గత 54 సంవత్సరాలుగా తెలంగాణ న్యాయం కోసం కొట్లాడుతూనే ఉంది. మరీ ముఖ్యంగా సంవత్సర కాలంగా అగ్నిగుండంలా మండుతున్నది. అయితే మరో అర్థంలో శ్రీశ్రీ మాటకు ప్రాసంగికత కూడా ఉంది. తెలంగాణ చరిత్రలోకి తొంగిచూస్తే ఈ విషయం స్పష్టమవుతుంది. తెలంగాణ కోసం మొదటిసారి 1953లో జరిగిన ముల్కీ ఉద్యమం విద్యార్థుల రక్తంలో తడిచి ఆగిపోయినది. అక్కడ విడిచిన పోరాటాన్ని అదే విద్యార్థులు 1969లో అందుకున్నారు. కాసు బ్రహ్మానందరెడ్డి రక్తదాహానికి 370 మంది యవ్వనపు కలలు అర్థాంతరంగా బలైనాయి. శ్రీకాకుళ గిరిజనులను కాల్చి చంపిన ప్రభుత్వమే తెలంగాణ ఉద్యమాన్ని అణచివేసింది. కాని విప్లవోద్యమం శ్రీకాకుళం నుంచి సిరిసిల్ల, జగిత్యాలకు వ్యాపించింది. ఇవ్వాళ దేశవ్యాపితంగా విస్తరించింది. 1969లో రెండోసారి విడిచిన తెలంగాణ పోరాటాన్ని 90వ దశకంలో విప్లవశక్తులే అందుకున్నాయి. అది 1997లో తెలంగాణ మహాసభ జరిపిన భువనగిరి సభ కావచ్చు. ఇదే సంవత్సరం డిశంబర్‌లో ఎఐపిఆర్ఎఫ్ లక్షలాది ప్రజల సమక్షంలో విడుదల చేసిన వరంగల్ డిక్లరేషన్ కావొచ్చు. దాని కొనసాగింపుగా తెలంగాణ జనసభ చేసిన పోరాటాలు, త్యాగాలు కావచ్చు. పాలకుల నూతన ఆర్థిక విధానాలకు వ్యతిరేకంగా ప్రత్యామ్నాయ స్వావలంభన ఆర్థిక విధానాలను ప్రతిపాదించింది కూడా ఈ సంస్థలే.

ఇట్లా తెలంగాణ గొంతును వినిపించినందుకు మారోజు వీరన్నను, బెల్లిలలితను, ఐలన్నను చంపిన చంద్రబాబు ప్రభుత్వం తెలంగాణ ఉద్యమంపై క్రూర నిర్బంధాన్ని ప్రయోగించింది. ఉద్యమ సంస్థలు పనిచేయలేని స్థితి వచ్చింది. సరిగ్గా ఈ సమయంలోనే తెలంగాణ కోసం ఒక రాజకీయ పార్టీ పుట్టింది. ఉద్యమాలను పక్కనపెట్టి ఓట్లు, సీట్లు, లాబీయింగ్ చుట్టూ తెలంగాణను తిప్పింది. దశాబ్దం పాటు హస్తినాపుర వీధుల్లో తెలంగాణ ఆగమైంది. పార్లమెంటరీ రాజకీయాలలో ఏ పాచిక పారక పోయేసరికి, ఎన్నికల పార్టీల నాయకత్వం పోరాటాన్ని ఆశ్రయించక తప్పలేదు. ఈ కదలికతో 2009 నవంబర్ 29 నుంచి డిశంబర్ 9 వరకు నడిచిన మలిదశ తెలంగాణ ఉద్యమాన్ని విద్యార్థులు అందుకున్నారు. నలభై వసంతాల క్రితం విడిచిన పోరాటాన్ని యువత అందుకొనక తప్పలేదు. ఈ సంవత్సర కాలంలో విరామం - పోరాటంగా నడుస్తున్న ఉద్యమం ఇప్పుడు విరామం వదిలేసి పోరాటాన్ని అందుకొనక తప్పదు. ఇదే చారిత్రక సత్యం. పోరాడే శక్తుల కర్తవ్యం కూడా.

తన నివేదిక ద్వారా అందరిని మెప్పిస్తానని గొప్పలు చెప్పుకున్న కృష్ణుడు రచ్చబండ తీర్పును తలదన్నాడు. ఈ నివేదిక వెనుక కోస్తాంధ్ర భూస్వామ్య, పెట్టుబడిదారీ శక్తుల హస్తమున్నదని ఎవరైనా అంటే అది అన్నవాళ్ల తప్పుకాదు. ఈ విషయాన్ని ఏకాంతంగా సుబ్బరామిరెడ్డి ఇంటికి వెళ్లి దుగ్గల్ నిరూపించాడు. కనుక నివేదిక ఇంతకంటే భిన్నంగా ఉంటుందని అనుకోలేం. పైగా తెలంగాణ ఇస్తే మావోయిస్టుల ప్రాబల్యం పెరిగిపోతుందనే బూచిని చూపెట్టి ఉద్యమాన్ని అణచివేయవచ్చనే సలహాను మల్టీనేషనల్ కంపెనీల హోంమంత్రికి ఇచ్చారు. ఎటు తిరిగి బహుళజాతి కంపెనీల, పెట్టుబడిదారుల ప్రయోజనాలను నెరవేర్చే పనికి అందరితో పాటు ఈ కమిటి కూడా పూనుకున్నదని నివేదికనే చెబుతున్నది. హైద్రాబాద్‌ను కేంద్రపాలిత ప్రాంతంగా చేయాలనే ఆలోచన దోపిడి బుర్రలో నుంచే వచ్చింది. తెలంగాణ ప్రజల రక్తమాంసాలతో నిర్మాణమైన నగరాన్ని హైటెక్ బాబులకు అప్పచెప్పాలనే కుట్రకు ఈ కమిటీ పూనుకున్నది. రాజధానికి యాభై కిలోమీటర్ల దూరంలో ఉన్న పాలమూరు కరువు, నల్గొండ ఫ్లోరైడ్‌ను చూడకుండా ఈ కమిటి కళ్లకు గంతలు కట్టుకొని నివేదికను రూపొందించింది.

ఈ దేశంలో సామ్రాజ్యవాదుల ప్రయోజనాలు నెరవేర్చే బంట్లు మన్మోహన్‌సింగ్, సోనియాగాంధి, చిదంబరం. మన రాష్ట్రంలో వాళ్ల ప్రయోజనాలను నెరవేర్చే స్థానికబంట్లు కోస్తాంధ్ర భూస్వాములు, పెట్టుబడిదారులు. కనుక వీళ్లందరి ప్రయోజనాలకు దెబ్బతగలకుండా నివేదికను రూపొందించే మేధోబంట్లు శ్రీకృష్ణ కమిటి సభ్యులు. అందుకే ప్రజా వ్యతిరేక రిపోర్టు ముందుకొచ్చింది. అందరు కలిసి మరోసారి నాలుగు కోట్ల తెలంగాణ ప్రజలను మోసం చేయడానికి పూనుకున్నారు. ఈ మోసాన్ని ఎండగట్టే ప్రజాఉద్యమమే తెలంగాణ రాష్ట్రాన్ని సాధిస్తుంది. ఇంకే షార్ట్‌కట్ మార్గాలు తెలంగాణ రాష్ట్రాన్ని సాధించలేవు. నిరుడు జరిగిన

వ్యాసం

# రాష్ట్ర విభజన - తెలుగు ప్రజల సంబంధాలు

- పాణి

రాష్ట్రం విడిపోనున్న ఈ తరుణంలో తెలుగువారి భవిష్యత్తు ఏమిటి? అని ప్రశ్నించుకోవడం అనుచితం ఏమీ కాదు. 'రాష్ట్రం ఏర్పడక ముందే ఈ చర్చ ఏమిటి? ఇది తెలంగాణకు పోటీ ' అని ఆ ప్రాంతం వాళ్లకు అనిపించవచ్చు. కానీ ప్రజాస్వామికవాదులు ఎవరైనా ఇప్పుడు చేయవలసిన చర్చ ఇదే.

తెలంగాణకు సంబంధించినంత వరకు పోరాటాలకు ఎన్ని మార్గాలైనా ఉండవచ్చుగాని పరిష్కారం మాత్రం ఇప్పటికి కాంగ్రెస్ అధిష్ఠానం చేతిలోనే ఉన్నది. రేప్పొద్దున కేంద్రంలో మరో పార్టీగాని, కూటమి గాని అధికారంలోకి వస్తే దాని ప్రయోజనం మీద, నిర్ణయాత్మకత మీద ఆధారపడి తెలంగాణ పరిష్కారం ఉంటుంది. మలి విడత తెలంగాణ ఉద్యమమైనా, లేదా గత డిసెంబర్ నుంచి నడుస్తున్న పోరాటమైనా తెలంగాణ ఇచ్చి తీరాల్సిన స్థితిని కల్పించాయి. ప్రజల పోరాట తీవ్రత, అందులోని ప్రజాస్వామిక ఆకాంక్ష యావత్ ప్రపంచం అంగీకరించే దశకు చేరున్నా... తెలంగాణను పాలకులు తమ పద్ధతి ప్రకారం ఇస్తే ప్రజలు తీసుకోవాల్సిందే. ప్రత్యేక రాష్ట్రాల ఆకాంక్షలోని అంతర్నిహితమైన అంశమిది. పాలకులు తెలంగాణ ఇవ్వక తప్పని స్థితి కల్పించేందుకే ఆ ప్రాంత ప్రజలు పోరాడుతున్నారు.

తెలంగాణ ప్రజల న్యాయమైన ఆకాంక్షను అడ్డుకోడానికి కోస్తా, రాయలసీమ పాలకవర్గాలు తుది పోరాటం చేస్తున్న సందర్భమిది. తెలంగాణను నిలువరించడానికి సమైక్యపాలకుల కడపటి సంగ్రామం కూడా ఇది. 1956లో ఏర్పడిన సమైక్యరాష్ట్రంలో ...లేదా ఆనాటి అర్థంలో విశాలాంధ్రలో... బందీ అయిన తెలంగాణ వేరైపోవడానికి చేస్తున్న పోరాటాన్ని అడ్డుకోడానికి గత ఇరవై ఏళ్లలో ఎదిగి వచ్చిన రాయలసీమ ప్రాంతీయ బూర్జువా శక్తులు కూడా ఇప్పుడు తోడయ్యాయి. విశాలాంధ్ర అనే కల తెలంగాణ వాళ్లకు దశాబ్దకాలంలోనే పీడకలగా పరిణమించాక ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్ష తప్పనిసరైంది. తెలుగు మాట్లాడేవాళ్లందరూ ఒక రాష్ట్రంగా ఉండాలనడంలో ఆనాడు జాతి భావన బలంగా పని చేసింది. జాతి అనే ఆధునిక స్పృహ రూపొందడానికి వెనుక చరిత్ర ఉన్నది. మద్రాసు ఉమ్మడి రాష్ట్రం కింద ఉన్న రోజుల్లో కోస్తా, రాయలసీమ ప్రజల్లో ఈ జాతి ఆకాంక్ష ఆంధ్రోద్యమంగా వ్యక్తమైంది. నైజాం పాలనలో ఉన్న తెలంగాణ ప్రజల్లో కూడా తెలుగు జాతి ఆకాంక్ష ఉద్యమరూపం తీసుకున్నది. . భాషా సంస్కృతులకు సంబంధించిన సొంతదనం కోసం తెలుగు ప్రజల ఆరాటం విశాలాంధ్ర నిర్మాణానికి ప్రాతిపదిక అయింది. దీని వల్ల ఒక మాత్ర భాషా ప్రజలందరూ ఒక రాజకీయ పాలనా యంత్రాంగం కిందికి వచ్చారు. జాతి భావనలోని ముఖ్యమైన భాషా సాంస్కృతిక ఉమ్మడి తత్వం ఫలించినట్టయింది. వలసపాలన వల్ల తెలుగు ప్రజలు వేర్వేరు పాలనా యంత్రాంగాల కిందికి వెళ్లిపోయినట్లే, వాటి మధ్య తీవ్రమైన అసమానతలు, ప్రత్యేకతలు తలెత్తాయి. అయినా తమ సొంతదనాన్ని కాపాడుకోవడం కోసమే మద్రాసు ప్రావిన్స్‌లోని కోస్తా, రాయలసీమలు; నైజాం పాలనలో ఉన్న తెలంగాణ విశాలాంధ్ర కోరుకున్నాయి.

అయితే అతి కొద్ది కాలంలోనే అంతర్గత విభేదాలు తలెత్తాయి. తెలంగాణ మాండలికానికి విశాలాంధ్రలో తీవ్ర పరాభవం జరిగింది. అంతక ముందే ఆంధ్ర రాష్ట్రంలో రాయలసీమవాళ్లకూ ఇదే అనుభవం కలిగింది. అరవ ఆధిపత్యాన్ని నిరసించడానికి ప్రేరణ అయిన తెలుగుదనం అనేది కోస్తా రాయలసీమ ప్రాంతాల అంతర్గత ఐక్యత మీద విశ్వాసం నిలుపుకోలేకపోయింది. విశాలాంధ్రలో భాగమైన తెలంగాణకు ఎక్కువ ప్రత్యేకతలు ఉన్నందువల్ల, తెలంగాణ మాండలికానికి ఎక్కువ గాయం కావడం వల్ల ఆ ప్రాంతంలో వేరైపోవాలనే ఆకాంక్ష ప్రబలంగా ముందుకు వచ్చింది.

భాషా సాంస్కృతిక విషయాల్లోనే ఇట్లా ఉంటే- ఆధునిక రాజకీయ పాలనా యంత్రాంగం కింద అన్ని ప్రాంతాల సమాన

---

విద్యార్థి, మధ్యతరగతి, ప్రజా ఉద్యమాలే రాష్ట్ర సాధనకు మార్గాలు. గ్రామస్థాయి నుంచి రాజధాని వరకు ఏ ప్రభుత్వ కార్యాలయాలు పనిచేయలేని పరిస్థితిని తీసుకురావాలి. కోస్తాంధ్ర వ్యాపారుల, పెట్టుబడిదారుల ఆర్థిక కార్యాకలాపాలను దిగ్బంధించాలి. రవాణా వ్యవస్థ నిలిచిపోవాలి. ఇట్లాంటి ఉద్యమానికి మాత్రమే కేంద్రం దిగివచ్చి తెలంగాణ రాష్ట్రాన్ని ఇస్తుంది. ఈలోపు తెలంగాణ వనరుల విధ్వంసాన్ని, దోపిడిని అడ్డుకోవాలి. తెలంగాణ కోసం కొట్లాడే వ్యక్తులు, శక్తులం ఏకం కావాలి.

తెలంగాణ ప్రజల ప్రజాస్వామిక ఆకాంక్ష ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం ఏర్పాటును 1969 నుంచి విరసం సమర్థిస్తున్నది. దానికోసం జరిగే పోరాటాలలో భాగమవుతున్నది. సాహిత్య, సాంస్కృతిక రంగాలలో విరసం తన వంతు పాత్రను నిర్వహిస్తున్నది. ఇకముందు కూడా శక్తివంచన లేకుండా విరసం తెలంగాణ రాష్ట్ర సాధన ఉద్యమానికి తన గళాన్ని, కలాన్ని అందిస్తుంది.

అభివృద్ధి అనే మరో జాతి ప్రాతిపదిక మరింత అభాసుపాలైంది. పెట్టుబడి అంటేనే అసమానత అనే మాట విశాలాంధ్ర పాలకుల ఆధ్వర్యంలో తెలుగు ప్రాంతాల మధ్య రుజువైపోయింది. ఒక మాతృభాష, సంస్కృతి, భౌగోళిక పరిధి అనేవి సిద్ధించాయి గాని స్వతంత్ర్యపాలన అనేది కోస్తా సంపన్నవర్గాల పాలనగా మారిపోయింది. భాష, సంస్కృతుల విషయంలో కూడా తీవ్రమైన వివక్ష, అసమానత కొనసాగాయి. తెలుగు ప్రజలకు ఉన్న సుదీర్ఘమైన ఉమ్మడి గతం జాతి అనే ఆధునిక స్పృహ కలిగాక ఆంధ్రరాష్ట్రం, ఆ తర్వాత ఆంధ్రప్రదేశ్ ఏర్పాటులో, దేశంలో భాషాప్రయుక్తరాష్ట్రాల ఏర్పాటుకు ప్రాతిపదిక వేసిన ఆంధ్రప్రదేశ్ ఆవిర్భావంలో తెలుగు ప్రజల జాతిభావన ఒక రూపం తీసుకున్నది. అయితే కొద్ది రోజుల్లోనే జాతి ప్రజల 'స్వతంత్ర పాలన' ఒక ప్రాంత సంపన్నవర్గాల పాలనగా, వారి దోపిడీ విధానంగా మారిపోయాక జాతి భావన సమగ్ర రూపం తీసుకోలేకపోయింది. ఆ రకంగా ఉమ్మడి మద్రాసు రాష్ట్రం నుంచి వేరైన కాలంలో, తెలంగాణతో కలిసి విశాలాంధ్ర ఏర్పడిన కాలంలో తెలుగు ప్రజల జాతి నిర్మాణ ఆకాంక్ష అర్థాంతరంగా నిలిచిపోయింది. ఆంధ్రరాష్ట్రం ఏర్పాటయ్యేటప్పుడే రాయలసీమ వాళ్లకు ఈ జాతి ఆకాంక్షతోపాటు ఈ ఐక్యత విశాలాంధ్ర పాలకుల దోపిడీకి పనికి వచ్చినంతగా వెనుకబడిన ప్రాంతాల సర్వతోముఖాభివృద్ధికి దోహదపడలేదు. అందుకే కోస్తా, రాయలసీమ బూర్జువావర్గాల స్వప్రయోజనాల కోసం ఆ ప్రాంతాల్లో సమైక్యవాదం వికృతంగా పెచ్చరిల్లింది.

ఈ మొత్తంలో 1956కు ముందు విశాలాంధ్ర కలలోని ఏ సానుకూల అంశమూ కనిపించడం లేదు. తెలుగు ప్రజలు ఎందుకు ఐక్యంగా ఉండాలో సమైక్యవాదులు చెప్పలేకపోతున్నారు. వారిలో ఆ నైతిక అర్హత ఇసుమంత కూడా లేకపోవడం ఒక అంశమైతే, వారి సమైక్యవాదంలో ఒకనాటి జాతి ఆకాంక్ష కుప్పకూలిపోయి తెలుగు ప్రజలు రెండు రాష్ట్రాలుగా చీలిపోతున్నారే... అనే విచారం కనిపించడం లేదు. సమైక్యవాదంలో ఈ విలువను ఆశించలేం. దీనిపై సాధారణ ప్రజల మనో ప్రపంచంలో ఏమున్నది? తెలుగు ప్రజలు మద్రాసు రాష్ట్రం నుంచి విడిపోయినప్పుడైనా, నైజాం రాష్ట్రంలో తెలుగు పునరుజ్జీవన చైతన్యంలోనైనా వ్యక్తమైన జాతి భావన ఆ తర్వాత సమగ్ర రూపం తీసుకొని ఉంటే తెలంగాణ వేరైపోతున్న ఈ తరుణంలో దానికి సంబంధించిన సంవేదన కనిపించేది. పెట్టుబడిలోని అసమాన స్వభావం వల్ల తెలుగు జాతి నిర్మాణం అర్థాంతరంగా నిలిచిపోయిందని, అసమగ్రంగా మిగిలిపోయిందని చెప్పుకుంటే తప్ప విడిపోయి కలిసి ఉండాలనే ఆదర్శానికి ఒక ప్రాతిపదిక దొరకదు.

జాతిగా రూపొందవలసిన ప్రజల మధ్య ఆధునిక రాజకీయ, పాలనాయంత్రాంగం చేపట్టిన అభివృద్ధి నమూనా, దాని ద్వారా ప్రాంతాల బూర్జువా వర్గాల దోపిడీ వల్ల అంతర్గత అసమానతలు పెరిగిపోయాయి. తెలంగాణ, రాయలసీమ ప్రాంతాల ప్రత్యేకతల రీత్యా కోస్తా సాధారణ ప్రజల్లో కూడా ఆ రెండు ప్రాంతాల భాషా సంస్కృతులు తక్కువ స్థాయివనే అభిప్రాయం ఎంతో కొంత ఉన్నది. అధికార మార్పిడి తర్వాత కొనసాగిన అభివృద్ధి విధానం వల్ల తలెత్తిన తీవ్రమైన ప్రాంతీయ అసమానతలు తోడై జాతి లోపలే 'మేము - మీరు' అనే గుర్తింపు పెరిగిపోయింది. ఇతర జాతుల సంబంధ బాంధవ్యాల్లో తెలుగు జాతి అనే గుర్తింపు తప్పక పని చేసేస్తుందిగాని, అది తెలుగువారి అంతస్సంబంధాల్లో అంత బలంగా ఏమీ లేదు. ఉండి ఉంటే తప్పక రాష్ట్ర విభజన సందర్భంలో అది ఏదో ఒక రూపంలో వ్యక్తమయ్యేదే. ఒక్క మాటలో చెప్పాలంటే సీమాంధ్ర బూర్జువా వర్గాల అభివృద్ధి, దోపిడీ వల్ల జాతిభావన అడుగునపడిపోయి ప్రాంతీయ అసమానతలు ముందుకు వచ్చాయి. బాబ్లీ వివాదం, కృష్ణా జలాల పంపిణీలాంటి వాటి విషయాల్లో అన్ని ప్రాంతాల బూర్జువావర్గం కూడా రాష్ట్ర ప్రయోజనాలు అనే పేరిట జాతి భావన వినిపించడం చూడవచ్చు. అంత వరకే. నిజానికి వాళ్లు చెప్పే రాష్ట్ర ప్రయోజనాలు లేదా జాతి ప్రయోజనాలు అనేవాటిలో వర్గప్రయోజనాలు కూడా ఉంటాయని గుర్తించకపోతే పాలకవర్గ వాదన సాధికారత పొందుతుంది.

ఇతర విషయాల్లో ప్రజాస్వామిక వైఖరి తీసుకోడానికి దృక్పథం, విలువలు పని చేసినట్టే జాతిలోని ఆంతరంగిక విషయాల్లో ప్రజాస్వామికంగా ఉండటానికి జాతి అనే ' మనం ' అనే గుర్తింపు ఒక అదనపు ప్రమాణంగా పని చేస్తుంది. 'మనం' అయినప్పుడు ప్రాంతాల ప్రత్యేకతల వల్ల తేడాలు, అసమానతలు, వాటి నుంచి వచ్చే కోపాలతోపాటు పరస్పరం సానుభూతి, సహానుభూతి ఉండే వీలుంది. ఆయా ప్రాంతాల పాలకవర్గాల దుర్వాదనలను అధిగమించి అది బైటికి వచ్చే అవకాశం ఉంది. అప్పుడు తెలంగాణ ప్రజల ఉద్యమం పట్ల ఇతర ప్రాంతాల సాధారణ ప్రజల్లో మానసికంగా సమ్మతి ఉండేది. కనీసం... తెలుగు జాతిగా ఒకే పాలనా యంత్రాంగం కింద ఉండాల్సిన వాళ్లం, అట్లా ఉండాలని కలలు కన్నవాళ్లం వేరైపోతున్నామనే క్షోభ ఉండేది. దీన్నుండే ఆ ప్రాంతం వేరైపోవాలనే కోరిక పట్ల ఆమోదం కూడా ఉండేది. ఆ ప్రాంతాల పాలకవర్గాలు ఎంత మాయ చేసినా జనంలో ఈ భావన ఎంతో కొంత వెల్లడయ్యేది. సమైక్యాంధ్ర అనే కృతక ఆందోళన పారలు విచ్చుకుంటూ వెళ్లితే ఆ ప్రాంతాల ప్రజల మనో ప్రపంచంలో తెలంగాణ వేర్పాటు గురించి ఏమున్నది? అని ఈ వైపు నుంచి ఆలోచించడం చాలా ముఖ్యమైన విషయం.

అట్లాగే...తెలంగాణ ప్రజల్లో, తెలంగాణ వాదుల్లో కూడా ఉత్తరాంధ్ర, పల్నాడు, రాయలసీమ ప్రాంతీయ సమస్యలపట్ల మమేకత ఉండేది. సమైక్యరాష్ట్రం ముక్కలైపోతున్న ఈ ఉద్విగ్న సంరంభంలో తప్పక ఆ గొంతులూ వినిపించవలసిందే అనే వైఖరి ఉండేది. సమైక్య చెర నుంచి తాము విముక్తం కావడానికి ఇతర ప్రాంతాల్లోని తమ జాతీయుల స్పందన పట్ల తెలంగాణ ప్రజలకు ఆసక్తి ఉండేది. ఆ స్పందనలో తెలంగాణ వేరైపోవడం గురించేగాక, ఆయా ప్రాంతాల వేర్పాటు కాంక్ష లేదా వెనుకబాటుతనం, వివక్షల గురించి కూడా ఉంటుంది. ఇవన్నీ తెలంగాణ వేరైపోవడానికి దోహదపడే అంశాలుగానేగాక, ఆ ప్రాంతాలు తనలాంటి కోరిక

వ్యక్తం చేస్తున్నందుకు సంబరం కలిగేది. ఇది తెలంగాణ ఏర్పాటుకు పనికి వచ్చే రాజకీయ సమీకరణాలుగా చూడటం కంటే మరో ప్రాంతంలోని తమ జాతీయుల ఆకాంక్షగా చూడటం బాగుంటుంది. కానీ అలాంటిదేమీ కనిపించడం లేదు. జాతి అనేది ఇతర జాతుల సంబంధాల్లో ఉండే గుర్తింపుగానే గాక తమలో తాను ఒక జాతిగా గుర్తింపు ఉంటేనే ఇది సాధ్యమవుతుంది.

అందువల్ల విడిపోతూ కలిసి ఉండడానికి తెలుగు ప్రజల మధ్య ఉన్నది ఈ మాత్రం ఉమ్మడి ప్రాతిపదికలోని బలాబలాలను గుర్తించకపోతే అది వొట్టి ఆకాంక్షగా మిగిలిపోతుంది. అన్నదమ్ముల్లా విడిపోదామనడంలో జనాంతికమైన స్ఫూర్తి ఉంటుందేమోగాని అందులో ఎలాంటి శాస్త్రీయతా ఉండదు. ఒక జాతి వేర్వేరు రాష్ట్రాలుగా విడిపోవడంలో ఉండే సంక్లిష్టతను ఇలాంటి సామెతలు, నానుడులు వ్యక్తీకరించలేవు. కృష్ణా ట్రిబ్యునల్ తీర్పు వెలువడ్డాక అందులో ఆంధ్రప్రదేశ్‌కు గతంకంటే ఎక్కువగా చూపించిన 196 టీ.ఎం.సీ.ల నీటి పంపకంలో న్యాయబద్ధమైన వైఖరి తీసుకోలేకపోతే రాష్ట్ర విభజన జరిగినా జరగకపోయినా సమస్య మాత్రం మరింత జటిలమైపోతుంది. ఇప్పటికే కోస్తా సంపన్న వర్గాలు డెల్టా పరిరక్షణ పేరుతో ఉద్యమం ప్రారంభించారు. బ్రిజేష్‌కుమార్ తీర్పు తర్వాత కోస్తా వాళ్లు కర్ణాటక వ్యతిరేక ఉద్యమాన్ని రాయలసీమ ప్రజల భుజం మీది నుంచి ఎక్కుపెట్టాలని చూస్తున్నారు. అదే సమయంలో ఇప్పుడు అదనంగా వచ్చిన 196 టీ.ఎం.సీ.ల నీరు తమకే చెందాలని కూడా కోస్తా వాళ్లు వాదిస్తూనే ఉన్నారు. ఈ సమస్యలో న్యాయబద్ధమైన పరిష్కారం లేకపోతే వెనుకబడిన ప్రాంతాలకు తీరని అన్యాయమే జరుగుతుంది. రాయలసీమ సాధారణ మనస్తత్వంలో ఇప్పటికీ అనవసరంగా తెలంగాణ పట్ల వ్యతిరేకత తప్ప సీమకు రావలసిన నీటి గురించి ఆలోచించడం లేదు. పాలమూరు, నల్గొండ జిల్లాల వాళ్లు ఈ నీటి కేటాయింపులో తమ వాటా కోరితే బహుశా తీవ్ర ప్రతిస్పందనే వస్తుంది.

రాయలసీమలో విద్యార్థి యువజనులను సమైక్యవాదులు తమ ఉద్యమంలోకి సమీకరించడానికి హైదరాబాదు సమస్యను కేంద్రం చేసుకున్నారనే విషయం తెలంగాణ వాదులుగాని, తెలంగాణను సమర్థించే ప్రజాస్వామికవాదులుగాని గుర్తించకపోతే న్యాయబద్ధంగా ఆలోచించినట్టుకాదు. హైదరాబాదు తెలంగాణదే అనే విషయంలో రెండో మాటే లేదు. రాయలసీమకు ఇన్నేళ్ల సమైక్యపాలనలో నగరం లేకపోవడం, అంతక ముందు మద్రాసు నగరంపై ఆధారపడ్డట్టే ఆ తర్వాత హైదరాబాదుపై ఆధారపడ్డటం అనే వాస్తవాన్ని పట్టించుకోకపోతే రాష్ట్ర విభజన తర్వాత రాయలసీమ వాళ్లకు మిగిలేది తెలంగాణపై ద్వేషం తప్ప మరేమీ కాదు. ఇలాంటి విషయాలపట్ల ఆయా ప్రాంతాల పాలకవర్గాలు ఎట్లాగూ విద్వేషమే రెచ్చగొడతాయి. దాన్ని చేతనైనంత తగ్గించడానికి అన్ని ప్రాంతాల ప్రజాస్వామికవాదులు ప్రయత్నించవలసి ఉంటుంది. లేకపోతే తెలంగాణ వేరైపోవడం వల్ల తమకు దురవస్థ వచ్చిందనే శాశ్వత భావన మిగతా ప్రాంత ప్రజల్లో ఏర్పడే ప్రమాదం ఉంది. అది జాతిగా తెలుగువారి మధ్య ఎన్నటికీ భర్తీగాని అఖాతాన్ని ఏర్పరుస్తుంది. జాతిగా, ప్రజలుగా ఎదుర్కొంటున్న ఇతర సమస్యలు మరుగున పడిపోవడమేగాక, వాటి పరిష్కారానికి చేయవలసిన ఉమ్మడి పోరాటానికి ఆధారమేమీ మిగలకుండా పోతుంది. అప్పుడు ఒక పెద్ద నష్టం జరుగుతుంది. రాష్ట్ర విభజన వల్ల తెలంగాణ ప్రజలకు జరిగే కొన్ని ప్రయోజనాలతోనే సరిపెట్టుకోవాల్సి వస్తుంది. అవి తప్పక కావల్సినవే. ఉదాహరణకు బ్రిజేష్‌కుమార్ ట్రిబ్యునల్ తీర్పుకు ముందే తెలంగాణ ఏర్పడి ఉంటే ఆ ప్రాంతానికి ఒక రాష్ట్ర హోదాలో నీటి కేటాయింపు ఉండేది. నాలుగు రాష్ట్రాల మధ్య పంపకాలు జరిగేవి. వీటన్నిటికంటే తెలంగాణ ప్రజల ఆత్మగౌరవం సాకారమవుతుంది. ప్రజలకు ఈడేరే ఈ ప్రయోజనాలను స్పష్టంగా చూస్తూనే ప్రత్యేక రాష్ట్ర ఉద్యమాల్లో, జాతుల ఉద్యమాల్లో అందులోని బూర్జువా వర్గ ప్రయోజనాలు కూడా ఉంటాయనే అవగాహన అవసరం. అందువల్లే ఆ ప్రాంతాల, జాతుల బూర్జువావర్గం అలాంటి ఉద్యమాల్లో తలమునకలవుతాయి. వాటిని అడ్డుకొనే ప్రాంతాల, జాతుల బూర్జువా వర్గం కూడా తన ప్రయోజనాలను , దోపిడీని, ఆధిక్యాన్ని కాపాడుకోడానికి తెగించి అడ్డుకుంటాయని వర్తమాన చరిత్ర కూడా నిరూపిస్తోంది. అయితే ఇలాంటి ఉద్యమాలను కమ్యూనిస్టులు మౌలిక పోరాటాల్లో అంతర్భాగంగా గుర్తించి వాటికి అనుగుణంగా తీర్చిదిద్దాలనుకుంటారు. ఆ ప్రయత్నం చేస్తూనే ఈ డిమాండ్ల స్వభావాన్ని సాధారణ ప్రజల వైపు నుంచి, బూర్జువా వర్గం వైపు నుంచి కూడా అంచనా వేయాలి. లేకపోతే ఆ వర్గం ప్రాంతాల మధ్య, పేద ప్రజల మధ్య తీవ్రమైన ద్వేషాన్ని పెంచిపోషిస్తాయి.

ఇప్పటికే .. తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటు గురించీ, మిగతా ప్రాంతాల సమస్యల గురించీ ఆయా ప్రాంతాల బూర్జువావర్గం చేసే వాదనలే పైచేయి సాధిస్తాయి. వాళ్ల ఎత్తులు, కుట్రలు, విద్వేషాలు మాత్రమే ఆ ప్రాంతాల ప్రజలను నడిపిస్తాయి. ఆ వర్గం చేస్తున్న వాదనల్లో స్వప్రయోజనం ఉందన్న విషయం ప్రజలకు ఎన్నటికీ తెలియకుండాపోతుంది. ఇది ఇప్పటికే చాలా జరిగిపోయింది. తెలంగాణ వ్యతిరేకంగా రాయలసీమలాంటి ప్రాంతాల్లో బూర్జువార్గ ఆలోచనలతో, వైఖరులతో సాధారణ ప్రజలు, విద్యావంతులు కూడా కలిసి నడుస్తున్నారు. అనేక సామాజిక కారణాల వల్ల సీమలో పాలకవర్గ ఆలోచనలు, ముఠా రాజకీయాలు తప్ప తమకు సొంత రాజకీయాలుంటాయని, సొంత ప్రయోజనాలుంటాయని తెలియని సీమ ప్రజలు తమ ప్రాంత సమస్యలపట్లా, మొత్తంగా జీవితాన్ని బాగు చేసుకొనే రాజకీయాలపట్ల ఆసక్తి కంటే తెలంగాణ వ్యతిరేకతకే మొగ్గు చూపే అవకాశం ఉంది. అందుకే తెలంగాణ ఇస్తే రాయలసీమ కూడా ఇవ్వాలని ఆ ప్రాంతం నాయకులూ, చదువుకున్నవాళ్లూ అంటున్నారు. ఈ రాజకీయపోటీతత్వంలో వైమనస్యం కూడా ఉంది. తెలంగాణను అడ్డుకోడానికి రాయలసీమ బూర్జువావర్గం చేయాల్సినంతా చేసి ఇక సాధ్యంకాదనుకుంటే అప్పుడు రాయలసీమ ప్రత్యేక రాష్ట్ర నినాదాన్ని అందుకోడానికి కూడా వెనుకాడదు. అప్పుడు కూడా కోస్తా సంపన్నవర్గాల దోపిడీ కంటే

చర్చ

# విగ్రహ సంస్కృతి

- వరవరరావు

ఆకలేస్తోందా నీకు?
ఆంధ్ర సంస్కృతి మహోజ్వలమైనది
తినడానికి తిండి లేదా నీకు?
తెలుగు భాష 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్'
పోలీసులు నిన్ను చితగ్గొడుతున్నారా?
మనకి అంతర్జాతీయ ఖ్యాతి అవసరం

నన్నయ గొప్పవాడు
నాకు ఆకలేస్తోంది
కృష్ణ దేవరాయల రోజుల్లో...
ఒరేయ్! నాకు ఆకలేస్తోంది
ఏ దేశమేగినా ఎందుకాలిడినా...
నీ అమ్మ! నాకాక లేస్తోందిరా!

(నారా - అపస్వరాలు, సృజన ఫిబ్రవరి 1975)

నారా పేరుతోనే మళ్ళీ వేల్చేరు నారాయణరావుగారే తెలుగు సంస్కృతి గురించి సృజన ఏప్రిల్ సంచిక (75)లో ఒక కవిత రాస్తూ 'బూర్జువా సమాజంలో గతం వర్తమానాన్ని శాసిస్తుంది. కాని కమ్యూనిస్టు సమాజంలో వర్తమానం గతాన్ని శాసిస్తుంది.' అని కమ్యూనిస్టు మానిఫెస్టో నుంచి ఉటంకించాడు. ఇప్పుడిట్లా ఈ వ్యాస ప్రయోజనం కోసం వేల్చేరును కోట్ చేయడం ఆయనకూ అభ్యంతరంగా ఉండవచ్చు గానీ వర్తమాన సందర్భానికి ఆయన గతంలోని అభిప్రాయాలు చాల ఉచితమైనవి. ముఖ్యంగా ఆయన ఈ రెండు కవితలు రాసిన సమయం కూడా వెంగళరావు ప్రభుత్వం ప్రపంచ తెలుగు మహాసభలు నిర్వహించిన సందర్భం - ప్రపంచ తెలుగు మహాసభలు ప్రభుత్వ, పాలకవర్గ సంస్కృతిని ప్రతిబింబించేవే కాని ప్రజల సంస్కృతిని ప్రతిఫలించేవికాదని శ్రీశ్రీ నాయకత్వంలో తెలుగు నేల మీద ఎందరో ప్రసిద్ధ రచయితలు పేర్కొని, బహిష్కరించి, శ్రీశ్రీ, చెరబండరాజు, ఎం.టి.ఖాన్, లోచన్ లతో పాటు పదకొండు మంది రాడికల్స్ అరెస్టయిన సందర్భం. "ఈనాడు'కు ఆదర్శప్రాయులైన ముఖ్యమంత్రులు జలగం వెంగళరావు, ఎన్.టి.రామారావు, చంద్రబాబునాయుడు' 'ఈనాడు'. 1980ల నుంచి తెలుగు నేల మీద చాలా పద్ధతిగా ప్రచారం చేసి పోషిస్తున్న దళారీ సంస్కృతి దృష్టిలో కూడ వీళ్లుముగ్గురూ, ఇటీవల వై.ఎస్.ఆర్ కూడా చాలా సమర్థవంతులైన ముఖ్యమంత్రుల కింద లెక్క. వీరిలో విశ్వనాథ శిష్యునిగానూ, నటునిగానూ నేపథ్యం ఉన్న ఎన్.టి.ఆర్‌ను కళ-సంస్కృతి తెలియనివాడని అనడానికి లేదుగానీ ఆయన ముఖ్యమంత్రి అయ్యేనాటికి ఆయనకు సంస్కృతి గురించి ఉన్న అవగాహన - అయితే ఖాకీ లేకుంటే కాషాయం. ఇటువంటి అవగాహన ఉన్న కళాకారుడు ఎంత పాసిస్టు అవుతాడో చాలాకాలం క్రితమే అమరుడు 'శారద' 'స్వాతంత్ర్య స్వరూపం' కథ ద్వారా చెప్పి ఉన్నాడు.

ఎన్.టి.ఆర్ 'ఆంధ్రుల ఆత్మగౌరవం' నినాదంగా 1983లో అధికారంలోకి వచ్చి 89 దాకా, తిరిగి 94-95లలో ముఖ్యమంత్రి అయ్యాడు. ఆయన పార్టీ పేరే తెలుగుదేశం. ఆయన పరిపాలన కాలంలో ట్యాంకుబండ్‌మీద విగ్రహాలు పెట్టాడు. ఎన్.టి.ఆర్ సినీఫక్కీ భావావేశపరుడు. ఆయన చిరకాలం మద్రాసు మెరీనా

---

తెలంగాణ వేరైపోవడం గురించే ఎక్కువ లేవదీసే ప్రమాదం ఉంది.

ఈ మొత్తంలో ఎక్కడా అన్ని ప్రాంతాల ప్రజల అవసరాలు, ఆత్మగౌరవాలు, సమాన అభివృద్ధి అనే అంశాలకు తగిన చోటు ఉండదు. ఇవ్వాళ మండుతున్న అగ్నిపర్వతంగా ఉన్న తెలంగాణను ఇంకెంత మాత్రం ఆలస్యం చేయడానికి లేదనే విషయానికి దృఢంగా కట్టుబడి ఉంటూనే, దాన్ని సాధించడానికి చేయవలసిందీ, చేయగలిగిందీ చేస్తూనే మిగతా విషయాల గురించీ మాట్లాడగలగాలి. వనరులపై స్థానికులకే హక్కు అనే ప్రజాస్వామిక సూత్రానికీ కట్టుబడి ఉంటూనే ఉమ్మడి వనరుల పంపకంలో న్యాయ భావన ప్రదర్శించాలి. నోరు బలం, కండబలం ఉన్నవారిదే న్యాయమనే స్థితిని అంగీకరించడం కష్టం. ఆ బలం ఏదైనా కావచ్చు. ఏదైనా అనర్థదాయకమే. అడిగేవారికే న్యాయం చేసేట్లయితే అది ఎన్నటికీ న్యాయం కాజాలదు.

పార్లమెంటులో బిల్లు పెట్టడం, ఆ తర్వాత తెలంగాణ ఏర్పడ్డం అనే బూర్జువా ప్రక్రియ జరగడానికి తీవ్ర వొత్తిడి చేస్తూనే మూడు ప్రాంతాల మధ్య న్యాయబద్ధమైన పంపకాలు జరగడానికి, దానికి సంబంధించిన భావజాలాన్ని, పద్ధతులను నిర్మించడంలో ప్రజాస్వామికవాదుల పాత్ర ఇప్పుడు చాలా అవసరం. విడిపోవడం గురించి గట్టిగా మాట్లాడుతూనే... తెలంగాణ వలె రేపొద్దున మరో ప్రాంతం కూడా వేరైపోతానని ఉద్యమం చేయవచ్చు... దాన్నీ సమర్థిస్తూనే పాలనా పరమైన వేర్పాటు, వనరులపై స్థానికులకే హక్కు అని నినదిస్తూనే వేర్వేరు తెలుగు ప్రాంతాల మధ్య, రెండు లేదా మూడు రాష్ట్రాలుగా విడిపోయే తెలుగు వారి మధ్య, ఉత్పత్తిలో పాల్గొంటున్న ప్రజల మధ్య సంబంధాలేమైనా ఉండాలా? ఉంటే ఎలా ఉండాలి? దాన్ని ఏ ప్రాతిపదికపై సాధించాలి? అనే ప్రయత్నం చేసినప్పుడే విడిపోయి కలిసి ఉండటానికి సానుకూల వాతావరణం ఏర్పడ్డట్టవుతుంది.

☆

బీచ్‌లో విగ్రహాలు చూసాడు. అప్పటికవి ద్రావిడ ఉద్యమానికి సంబంధించినవి. అన్నిటికన్నా ముందు మెరీనాబీచ్‌లో వచ్చింది దేవీప్రసాద్‌రాయ్ శిల్పం 'శ్రామిక సంస్కృతి'. కాలంతో పాటు సంస్కృతి దిగజారుతూపోయింది. ఎన్.టి.ఆర్.కు ఎం.జి.ఆర్ ప్రేరణ. ఆయన దృష్టిలో, ఆయనకు సాహిత్య, కళా సాంస్కృతిక విషయాల్లో సలహాలు ఇచ్చిన వారి దృష్టిలో వీళ్లంతా తెలుగు జాతి వైతాళికులు. వీళ్లల్లో నన్నయ్య, తిక్కనల గురించి తెలుగు సాహిత్య రంగంలో ఉన్న చర్చ పాల్కురికి సోమనాథుని విగ్రహం ఎందుకు లేదు అనే ప్రశ్నలోనే ఉంది. నన్నయ వైదిక, మార్గ, రాజసభ, విశిష్ట సంప్రదాయాన్ని నెలకొల్పడానికి భారతానువాదం చేసాడని, తిక్కన హరిహరా ద్వైత సమన్వయవాదం చెప్పాడని ఆగ్రహించి సోమన దేశి కవితను, జాను తెనుగును వీరశైవం ప్రబోధించడానికి ఎంచుకున్నాడు. అందుకని రాజసభకు, శిష్టాచారానికి బయట చాపకూడు ఏర్పాటు చేసి ద్విపద ఛందస్సులో కవిత్వం చెప్పాడు. ఇది ఆ కాలానికి అక్షరాల ప్రత్యామ్నాయ ప్రజా సంస్కృతి. పల్నాటి యుద్ధకాలంలో అంటే 12వ శతాబ్దంలో బ్రహ్మనాయుడు కూడా 'చాపకూడు' ఏర్పాటు చేసాడు. రాజవంశంలోనే ఆ కాలానికి ఆయన, బాల చంద్రుడు తిరుగుబాటుకు ప్రతీకలు. కానీ పాల్కురికి సోమన విగ్రహం పెట్టని ఎన్.టి.ఆర్ బ్రహ్మనాయుడు విగ్రహం 'చాపకూడు' ఏర్పాటు చేసినందుకే పెట్టాడా? 'చాపకూడు' ఏర్పాటు చేయడమంటే కులమత భేదాలు పాటించకపోవడం, కంచం పొత్తు ద్వారా బహిరంగంగా ప్రజల మధ్య కులమతాల అంతరాలు లేవని గుర్తింపచేయడం. కానీ ఎన్.టి.ఆర్. ప్రాతినిధ్యం వహిస్తున్న సామాజిక వర్గం కృష్ణా, గోదావరి నదులపై ఆనకట్టల నిర్మాణం తర్వాత తెలుగు సమాజంలోని అన్ని రంగాలపై ఆధిపత్యాన్ని పొందిన క్రమంలో ప్రత్యక్షంగా రాజకీయాధిపత్యానికి రావడం ఎన్టీఆర్‌తోనే మొదలయింది. అందుకని 'చాపకూడు' ఏర్పాటు చేసిన బ్రహ్మనాయుడు లోనయినా, హేతువాది అయిన రామస్వామి చౌదరిలోనయినా తెలంగాణవాదులకు ఒక సామాజిక వర్గమే వర్తమానంలో కనిపిస్తే అది పూర్తిగా వాళ్ళ సంకుచిత దృష్టియే కాజాలదు. అప్పటికి విస్తృత ప్రచారంలో ఉన్నమాట ఏమిటంటే ట్యాంకుబండ్ మీద విగ్రహాల్లో పాలకుల్లో, వీరుల్లో ఎన్టీఆర్ తననే చూసుకున్నాడని. అల్లూరి సీతారామరాజు సినిమా తీసే అవకాశం కృష్ణ కొట్టేశాడు గాని ఎన్.టి.ఆర్. తానే అల్లూరి సీతారామరాజు అవతారమనుకుంటే ఎవరికీ ఆశ్చర్యం కలగదు. ఆయన అప్పటికి సినిమాల్లో ఎత్తిన అవతారాలన్నీ ఎన్నికల రాజకీయ ప్రచారానికి విస్తృతంగా వాడుకున్నాడు. (పోతన పంచశత సందర్భంగా కొండపల్లి శేషగిరి రావుగారు చేసిన పోతన చిత్రంలో నేరెళ్ళ వేణుమాధవ్ గారికి ఇష్టంగానే పి.వి. నరసింహారావు కనిపించాడు. సికిందరాబాదు రాష్ట్రపతి రోడ్డులో గాంధీ విగ్రహంలో కొత్తూరి సీతయ్యగుప్త, ఇమ్లీబన్ దగ్గర సాలార్జంగ్ వంతెనపై ఛత్రపతి శివాజీ విగ్రహంలో నలాఉద్దీన్ ఓవైసీ పోలికలు కనిపిస్తాయని కన్నబిరాన్ చమత్కరించేవాడు.) అట్లా కాకపోతే ఆదివాసీల నుంచే వచ్చిన నాయకులు గున్నమ్మ (ఉత్తరాంధ్ర) గానీ కొమురం భీంగానీ ఆయన స్పృహలోనే లేరు. ఆయన వాళ్ల పేర్లు కూడా విని ఉండడు. ఆయన సాంస్కృతిక సలహాదార్లు కూడా విని ఉండరు. వాస్తవానికి దక్షిణాదిన గోండుల నుంచి తొలి తిరుగుబాటు చేసినవాడు రాంజీ గోండు. ఆయనను ఉరితీసారు. అదే ఆదిలాబాదులో సామాన్య కుటుంబం నుంచి వచ్చి మన ఊళ్లలో మన పాలన అని సాయుధ పోరాటం చేసినవాడు కొమురం భీం. స్ఫూర్తి అల్లూరి సీతారామ రాజు నుంచి కూడా పొందవచ్చుకానీ అతడు గోండుల నుంచే వచ్చిన గొప్ప దార్శనికుడు. తాను ప్రాతినిధ్యం వహించే సామాజిక వర్గం కోసం ఆదివాసుల 1/70 హక్కును రద్దు చేయచూసిన ఎన్.టి.ఆర్.కు మన్నె పోరాటం మీదనైనా, ద్వార బంధాల చంద్రయ్య, గున్నమ్మ, కొమురంభీంల మీదనైనా ప్రేమ, గౌరవం ఎందుకు ఉంటాయి? ఆయన సాంస్కృతిక అవగాహనకది పడని విషయం. ఏడు వందల సంవత్సరాల క్రితమే కప్పం చెల్లించడానికి నిరాకరించి కరువు దాడికి సిద్ధపడిన పగిడిద్ద రాజు, జంపన్న, సమ్మక్క, సారలమ్మలు దేశంలో ఆదివాసీ స్వాభిమాన పోరాటానికి తమ త్యాగాలతో వేగుచుక్కలయ్యారు. కాని మేడారం జాతరను వెలుగులోకి తెచ్చింది మాత్రం విప్లవోద్యమం, ప్రత్యేక తెలంగాణ ఉద్యమాలే.

ఇంక తెలుగు వైతాళికుల గురించి చూద్దాం - నైజాం రాష్ట్రంలో తెలుగు గౌరవాన్ని నిలపాలని కృషి చేసిన తెలంగాణ వైతాళికులందరూ ఎంతో గౌరవంతో ఆంధ్ర శబ్దమే ఉపయోగించారు. మాడపాటి హనుమంతరావు, కొమర్రాజు లక్ష్మణరావు, ఆదిరాజు వీరభద్రరావు (వీళ్లంతా ఎక్కడ పుట్టిన వాళ్లయినా నిస్సందేహంగా తెలంగాణ వైతాళికులే), సురవరం ప్రతాపరెడ్డి, అకినేపల్లి జానకిరామారావు గ్రంథాలయాలు పెట్టినా - కృష్ణదేవరాయ, శబ్దానుశాసన (నన్నయ), రాజరాజనరేంద్ర పేర్లే పెట్టి ఆంధ్ర శబ్దం జోడించారు. (దిగంబర కవుల కాలానికి వచ్చే వరకు వర్తమానం గతాన్ని ఎట్లా శాసించిందంటే 'నన్నయను రాజరాజనరేంద్రుని బొందలోనే నిద్రపోనీ' అన్నారు.) హైదరాబాదులో వేమన గ్రంథాలయం కూడా పెట్టారు. తెలంగాణ ప్రజల్ని చైతన్యవంతం చేయడానికి 'ఆంధ్ర మహాసభ' స్థాపించి ఆంధ్రోద్యమం నడిపారు. తర్వాతి తరం తెలంగాణ వైతాళికుడు వట్టికోట ఆళ్వారుస్వామి కాలికి బలపం కట్టుకుని స్థాపించిన గ్రంథమాలకు, 'దేశోద్ధారక' (కాశీనాథుని నాగేశ్వరరావు) పేరు పెట్టుకున్నాడు. ఎందుకంటే ఆంధ్ర పత్రిక ద్వారా ఆయన తెలుగు భాషా సాంస్కృతిక వికాసానికి దోహదంచేశాడనే గౌరవంతో. తెలంగాణ రచయితల సంఘం ఆంధ్ర రాష్ట్రం ఏర్పడగానే అలంపురంలో మహాసభల ప్రారంభోపన్యాసానికి సర్వేపల్లి రాధాకృష్ణను పిలిచారు. కాళోజీ 'నా గొడవ'ను శ్రీ శ్రీ ఆవిష్కరించాడు. దాశరథి సంగతి చెప్పనే అక్కర్లేదు. 'నా తెలంగాణ కోటి రతనాల వీణ' అంటూనే 'పేగులను తెంచి తీగెలుగ మార్చి' నైజాం నిరంకుశత్వాన్ని ప్రతిఘటిస్తూనే 'మహాంధ్రోద్యమం' స్వప్నాలు కన్నాడు. అప్పటి సంఖ్యను బట్టి ముక్కోటి ఆంధ్రులు ఒక్కటై ఉండాలన్నాడు. కాళోజి శ్రీశ్రీతో కలిసి 'విశాలాంధ్ర' తీర్మానం

చేశాడు, వరంగల్‌లో ఆకారం వారి తోటకు వెళ్లే దారి వెంబడి తెలంగాణవాదుల రాళ్ల వాన నుంచి తప్పించుకొని.

కాని ఏమయింది? 'మొదట ఇది తెలంగాణయే' అన్న ఆదిరాజు వీరభద్రరావుగారి ప్రామాణిక చరిత్ర ప్రకారం - ఇది తెలంగాణ కాలేదు. పుచ్చలపల్లి సుందరయ్యగారు రూపకల్పన చేసిన విశాలాంధ్ర ప్రజారాజ్యం కాలేదు, తెలుగు భాష, సంస్కృతుల గురించి ఇంత గుండెలు బాదుకుంటున్నారు - అజంత భాష అయిన తెలుగులో కాకుండా హిందీ పేరుతో ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. భాష, సంస్కృతి, చరిత్ర పట్ల గౌరవం, గర్వం ఉన్న జాతి అయితే తమిళనాడు, కేరళం, ఒడిశా అని కొంచెం ఆలస్యంగానయినా పేర్లు మార్చుకున్నాయి. ఇప్పటికీ నెహ్రూ, ఇందిరా, రాజీవ్ గాంధీల పేర్లు, విగ్రహాలు పెట్టే దళారీ పాలకులకు తెలుగు సంస్కృతి గురించి మాట్లాడే అర్హత ఉందా? (తెలుగు సంస్కృతి గురించి శాసనసభలోను మీడియాలోను పాఠాలు చెప్పే జయప్రకాశ్‌నారాయణ్ పేరు జాతీయోద్యమం నేపథ్యంలో ఆయన తల్లిదండ్రులు పెట్టింది కావచ్చు కానీ, ఆయన ఇటీవలనే పెట్టిన సంస్థ అయినా, పార్టీ అయినా తెలుగు మాటేనా? అదేదో స్వస్తిక్ పార్టీ వలెనో, బ్రహ్మకుమారీ సమాజం వలెనో వాసన వేసే ప్రజాస్వామ్య ప్రగల్భం అనిపిస్తుంది.)

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఏర్పడగానే (కన్నడ, తమిళ అన్నట్లుగా తెలుగు సాహిత్య అకాడమీకాదు!) కాళోజీ అది అంధ పరదేశ సాహిత్య అగాధమీ అని ప్రామాణికంగా వివరంగా ఎద్దేవా చేసాడు. నిజమే. హైదరాబాదు తెలుగువాళ్ళందరి రాజధాని - మూడు ప్రాంతాల ప్రజల రాజధాని - ఇప్పుడే కాదు - బ్రిటిష్‌వాళ్లకు నైజాం తెలుగు నేలను ఇవ్వడాని కన్నా ముందు, మళ్లీ 1956 నుంచి. నాలుగు వందల ఏళ్లకు పైగా సువిశాల తెలుగు భూభాగానికి, ప్రజానీకానికి రాజధాని. మరి అక్కడ ఏర్పడే తెలుగు విశ్వవిద్యాలయానికి తెలుగు వైతాళికులలో ఒకరి పేరు ఉండొద్దా. స్వయంగా తాను సేకరించిన అమూల్యమైన లిఖిత ప్రతులను, పుస్తకాలను, తన గ్రంథాలయాన్ని చిక్కడపల్లిలో గ్రంథాలయానికి ఇచ్చిన గ్రంథాలయోద్యమకర్త వట్టికోట పేరు ఉండాలా - అక్కడ ఆళ్వారుస్వామి విగ్రహం ఉండాలా? ఇతర విషయాల్లో ఏమైనా కావచ్చు కానీ, ఒక విశ్వవిద్యాలయానికి, ఒక గ్రంథాలయానికి పొట్టి శ్రీరాములు, విశ్వనాథ సత్యనారాయణ - ఎట్లా స్మరణీయులు అవుతారు అని అడిగితే సంస్కారం లేకపోవడం అవుతుందా? ఇది పొట్టి శ్రీరాములు, విశ్వనాథలపై గౌరవం లేకపోవడం అవుతుందా? ఆ గౌరవం ఉంచుకుంటూనే తెలంగాణ ప్రాతినిధ్యం సంగతేమిటి అని అడిగితే ప్రాంతీయ తత్త్వమవుతుందా?

కాటన్ దొర వల్ల ప్రయోజనాలు పొందిందంతా డెల్టా వాసులు, దక్షిణ కోస్తా జిల్లాల వాళ్లు. గోదావరి జిల్లాలు దేశానికే అన్నపూర్ణలయినా పాలమూరు వలసలు తప్పలేదు. విశాఖ, ఆదిలాబాదు జిల్లాల్లో ఆదివాసులు విషముష్టికాయలు తిని, కరువు వాతన పడి చావక తప్పలేదు. లేదా చేతనయితే కరువుదాడులు చేయక తప్పలేదు. అయినా ధవళేశ్వరం మీద ఆయన విగ్రహం పెట్టుకున్నారు కదా. నర్మదా డ్యాం నుంచి ఇందిరాసాగర్ వరకు ఇప్పుడు భారీ నీటి ప్రాజెక్టులు విధ్వంసకారకాలని చర్చ జరిగి నాగార్జునసాగర్ నిర్వాసితుల చర్చ కూడ ముందుకొచ్చింది. హీరాకుడ్ డ్యాం సందర్భంలోనే ఆర్.ఎస్.రావుగారు 'అభివృద్ధి వెలుగు నీడలు' చర్చకు పెట్టారు. ఆ దృష్టితో తూర్పు అరణ్యాల్లో అదృశ్యమైపోయిన ఆదివాసీ జాతులకు కాటన్ దొర మహాశయుడు, వైతాళికుడు కాడు దళారీ విధ్వంసకుడవుతాడు. హుస్సేన్ షా వలీ కట్టించిన హుస్సేన్ సాగర్ మీద కూడ కాటన్ విగ్రహం ఉండడం ఎన్.టి.ఆర్. వర్గ ప్రయోజనమవుతుంది గాని హైదరాబాదీల లేదా తెలంగాణ ప్రజల ప్రయోజనమవుతుందా? తెలంగాణలో, తెలంగాణేతర తెలుగు ప్రాంతాల్లో కూడా కాకతీయులు, కుతుబ్‌షాహీ, ఆసఫ్‌జాహీ పాలకులు తవ్వించిన చెరువులు, సరస్సులు, సాగరాలు ఏమయ్యాయని ఇవ్వాళ చర్చ జరుగుతున్నది. చెరువులు, వాగులు, వంకలు, కుంటలు, సహజనీటి వనర్లను ధ్వంసం చేసిన 'జలయజ్ఞం' సంస్కృతిపై చర్చ జరుగుతున్నది. తీగ లాగితే డొంకంతా కదులుతుంది.

హైదరాబాదు నగర నిర్మాత, ఈ ప్రేమనగర్ నిర్మాణానికి కారకులు, తెలంగాణ వైతాళికులు, తెలుగు ప్రజల తిరుగుబాటు ప్రతీకలు - తెలంగాణేతర ప్రాంత ప్రజలకు స్ఫూర్తి కాదా?

కులీకుతుబ్‌షా, భాగమతిలను తన నాటకంలో నార్ల చిరంజీవి చిరస్మరణీయులను చేసాడు. బందగీని 'మా భూమి' నాటకం బలాదూర్‌గా తొలి అమరుణ్ని చేసింది. సోమసుందర్ 'వజ్రాయుధం' కడివెండి దొడ్డి కొమురయ్యను కవిత్వంలో నిలిపింది. ఇందుకు కారణం తెలంగాణ ప్రజా పోరాటాలను, ప్రజా సంస్కృతిని వర్గపోరాట స్థాయిలో పరిష్కరించే ప్రత్యామ్నాయాన్ని ముందుకు తెచ్చింది, తెలంగాణయే - ముఖ్యంగా ఆంధ్ర మహాసభకాలం నుంచి - తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం మాత్రమే కాదు - పీపుల్స్‌వార్‌మావోయిస్టు పార్టీ రాజకీయ నాయకత్వం దాకా ఆంధ్రప్రదేశ్‌లోనే కాదు దేశమంతా - ఇవ్వాళనయితే ప్రపంచమంతా ఒక స్ఫూర్తి, ఒక ఉత్తేజం. నిన్న ఒక వియత్నాం వలె. ఇవ్వాళ ఒక పాలస్తీనా వలె.

కాని డెల్టా సంపన్నులు రాజకీయంగా కూడ పాలకులయ్యాక మాత్రం పాలక సంస్కృతి దళారీ సంస్కృతిని మరింత ముందుకు తీసుకపోయిన తర్వాత మాత్రం - తెలంగాణ ప్రజలు తెలుగు సంస్కృతి గురించి పాఠాలు ఈనాడు, లగడపాటి, టిజి వెంకటేశ్, జయప్రకాశ్ నారాయణ్, పరకాల ప్రభాకర్, తెలకపల్లి రవిల వంటి వారి నుంచి చెప్పించుకోవాల్సి వస్తున్నది. హైదరాబాద్ తహజీబ్‌ను ట్యాంకుబండు విగ్రహాల నుంచి నేర్చుకోవాల్సి వస్తున్నది.

గురజాడ - శ్రీశ్రీల తర్వాత ఆధునిక తెలుగు సాహిత్యానికి కేంద్రం తెలంగాణకు మారలేదా? శ్రీశ్రీకి సమకాలీనంగానే కాళోజీ, దాశరథి, వట్టికోట ఆళ్వారుస్వాములు శ్రీశ్రీని మించిన ఉద్యమ జీవులు కూడా అయి కారాగార శిక్షలను అనుభవించారే. హైదరాబాద్ సంస్కృతిని దాని ధిక్కారంలో కూడా ప్రతిఫలించినవాళ్లు దిగంబర కవులు - వాళ్ల పుస్తకాలు - ఒక

రిక్షావాలాతో, ఒక ఒళ్లమ్ముకునే స్త్రీతో ఆవిష్కరణలు చేయించారు. ఈ కుష్ఠు వ్యవస్థ మీద పాదం మోపారు. కంచికచెర్ల కోటేశుకు అంకితం చేసారు. హైదరాబాదు మహానగర రోడ్లన్నీ మహాస్వప్న పాదాలు ముద్దాడాయి. వాళ్ల కవిత్వం ఆబిడ్స్‌లోని సెంట్రల్ పాయింట్‌లో, ఇరానీ హోటళ్లలో, నగరమంతా సైకిల్ సంచారంలో, నగరంపై, నగరంలో ఆకలి, కన్నీళ్లు, నెత్తురులో ప్రభవించింది. రాంకీల, జివిఎంఆర్‌ల, కార్పోరేట్ దళారీల కనుసన్నల్లో బతికిన సంస్కృతి కాదది.

రాయలసీమలో వేమన, ఉత్తరాంధ్రలో పాణిగ్రాహి, వంగపండు, పలనాడులో నాజర్‌ను మినహాయిస్తే తెలుగుజాతి గర్వించదగిన ప్రజాకవులు, వాగ్గేయకారులు తెలంగాణ నుంచి వచ్చారు. గతాన్ని వర్తమానం శాసిస్తుందనే అర్థంలో తెలుగు జాతి వర్తమాన వేమనలు 90 ఏళ్లుగా తెలంగాణ నుంచే - తెలంగాణకే కాదు తెలుగు నేలకంతా చైతన్యాన్ని, ఉత్తేజాన్ని ఇస్తున్నారు. 'తెలంగాణ' మాటను చంద్రబాబు, యనమల రామకృష్ణుల కాలంలో నిషేధించిన శాసన సభ ఇవ్వాళ తెలుగు సంస్కృతి గురించి పాఠాలు చెప్తున్నది. హైదరాబాదులో పుట్టి పెరిగిన ముఖ్యమంత్రి తెలంగాణేతర ప్రాంతాన్ని మా ప్రాంతం అని, తెలంగాణను మీ ప్రాంతం అని మాట్లాడుతున్నాడు. తెలంగాణ గురించి ప్రశ్నల సమయంలో కూడ ప్రస్తావించడానికి అనుమతించని సభ ఇప్పుడు గంటల తరబడి చరిత్ర, సంస్కృతి పాఠాలు చెప్తున్నది - ఒక్క తెలంగాణ సభ్యుడు కూడా లేని సభలో.

ఆ రోజుల్లోనే కృష్ణదేవరాయలు తెలుగును అధికార భాషగా గుర్తించాడంటుంది కేంద్ర మానవ వనరుల మంత్రి పురంధరేశ్వరి. శ్రీనాథుని కాలంలోనైనా, గోల్కొండ పాలనకు ముందయినా తెలుగు రాజ్యంలో తెలుగు గాక మరింకేది అధికార భాషగా ఉంటుంది? పుట్టుక వల్ల కన్నడిగుడు అయినా (తుళు వంశం వాడు) పాలించింది తెలుగు నేలనే కదా - ఉస్మాన్ అలీఖాన్ ఉర్దూను అధికార భాషను చేసినట్లు, కృష్ణదేవరాయులు కన్నడంనో, తుళు భాషనో చేయలేదనా - ఆమె ఉద్దేశం. ఆమె మాత్రం విదేశీ విశ్వవిద్యాలయాలకు - కార్పోరేట్ విద్యారంగానికి, ఇంగ్లీషు మాధ్యమానికి చదువునప్పగించి కేవలం తండ్రిగారి మీది అభిమానంతో తెలుగు సంస్కృతి గురించి మాట్లాడుతుంది. కారంచేడు దళితుల హత్యాకాండ చరిత్రను మరుగుపరచి బ్రహ్మనాయుడు చాపకూడు గురించి మాట్లాడుతోంది.

ఇంతకూ ఎన్.టి.ఆర్. ట్యాంకుబండ్ మీద విగ్రహాలు పెట్టిన కాలం నుంచి కూడ వర్తమాన చరిత్ర మరో ముప్పై ఏళ్ల ముందుకు జరిగింది. అంతకు ముందు 1969లో ఫ్రెంచి విప్లవ విద్యార్థి ఉద్యమంతో పోల్చదగిన ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో 370 మంది విద్యార్థులు, యువకులు అమరులయ్యారు. అది పోరాటంలోను, త్యాగంలోను శ్రీకాకుళ రైతాంగ సాయుధ పోరాటానికి సమకాలీనంగా జరిగింది. శ్రీకాకుళోద్యమ స్ఫూర్తితో జరిగింది. శ్రీకాకుళోద్యమాన్ని గోదావరి లోయ పోరాటం పొడుగునా ఆవాహన చేసుకుంది. ఆ పోరాటం నుంచే ఇప్పటి భారత విప్లవోద్యమ నాయకత్వం వచ్చింది. జగిత్యాల - సిరిసిల్ల పోరాటాల నిర్బంధం నుంచి, కల్లోలిత ప్రాంతాల చట్టం నుంచి దీర్ఘకాలం పోరాట రాజకీయాల్లో కొనసాగలేక పోయినవాళ్ళు, కాంగ్రెస్ పాలనలోని దమననీతితో విసిగినవాళ్లు, ఇందిరాగాంధీ నుంచి సంజయ్‌గాంధీ, రాజీవ్‌గాంధీల వరకు కేంద్రం అవమానాలకు గురయిన ఎన్నికల రాజకీయాల వాళ్ళు ఎన్.టి.ఆర్. 'ఆత్మగౌరవ' నినాదం గొడుగు కింద చేరారు. ఆశ్చర్యంగా 69-72 కాలపు ప్రత్యేక తెలంగాణవాదులు తెలుగుదేశం పార్టీలో చేరారు. నిర్బంధం నుంచి ఒక ఆశ్రయం కోరేవాళ్లు, పోరాటంలో కొనసాగలేకపోయిన వాళ్ళు 'తెలుగుదేశం' ఛాయ కిందికే చేరారు.

ఎన్.టి.ఆర్. తెలుగు సంస్కృతి పునరుద్ధరణ అంతా సాహిత్య, సంగీత, లలితకళా అకాడమీలు రద్దుచేసి ప్రభుత్వంలోనే సాంస్కృతిక శాఖను ఏర్పాటు చేసి, విశ్వవిద్యాలయం ఏర్పాటు చేయడం - తెలుగు సంస్కృత పదబంధాలతో ప్రయాణ ప్రాంగణాలు, లలితకళా తోరణాలు ఏర్పాటుచేయడంగా కొనసాగింది. ప్రజా వైద్య సంస్కృతిని, హక్కుల ఉద్యమ సంస్కృతిని హత్యచేసి, టాడాతో 'ఆట, మాట, పాట' బంద్ చేసి జన నాట్యమండలి అజ్ఞాత వాసం చేసేలా సాగింది.

మెట్ట వ్యవసాయం ఎక్కువగా తెలిసిన రంగారెడ్డి జిల్లాలో వ్యవసాయ విశ్వవిద్యాలయం పెడితే చంద్రబాబు కాలానికి డెల్టా రైతు బాంధవుడు ఆచార్య రంగా పేరు దానికి అలంకార ప్రాయమవుతుంది. విద్య, వైద్యరంగాలను అనితర సాధ్యంగా ప్రైవేటీకరించిన ఎన్టీఆర్ పేరుతో వైద్య విద్యా పరిషత్ ఏర్పడుతుంది.

హైదరాబాదు నిండా ఎన్టీఆర్ స్టేడియాలు, బ్రహ్మానందరెడ్డి, వెంగళరావు పార్కులు, సంజీవరెడ్డి నగర్, వైఎస్ఆర్ విగ్రహాలు కనిపించడం మనకేమీ ఎబ్బెట్టుగా అనిపించదు. అంజయ్య ముఖ్యమంత్రిగా ఉన్నంత కాలం 'ఈనాడు' ఆయన ప్రసంగాలు ఆయన భాషలోనే ప్రచురిస్తే 'పుణ్యభూమి'లో ఆ భాషను హైదరాబాదు భాషగా వెక్కిరించడం గజ్జెల మల్లారెడ్డి వంటి పండితుని వంతు. అంజయ్యదే తెలుగుభాష అన్నందుకు దాశరథికి కూడ తెలుగు రాకుండా పోయింది. చివరకు భాషా శాస్త్రవేత్త చేకూరి రామారావు జోక్యం చేసుకొని అంజయ్యది, దాశరథిది, గజ్జెల మల్లారెడ్డిది కూడ తెలుగు భాషేనని తీర్పు చెప్పాల్సివచ్చింది.

ఈ తెలంగాణను వెక్కిరించడం ఎంత దూరం పోయిందంటే పాములపర్తి సదాశివరావుగారి 'కాకతీయ'లో పత్రికా రచనను, కళా విమర్శను నేర్చుకున్న చలసాని ప్రసాదరావు ప్రత్యేక తెలంగాణ ఉద్యమాన్ని సమర్థించినందుకు కాళోజీ, గద్దర్‌లకు తెలుగు భాష రాదని 'కబుర్లు' చెప్పే అతిశయాన్ని ప్రదర్శించాడు. కె.సి.ఆర్‌ది కూడా తెలంగాణ కాదు పొమ్మని సమైక్యవాద పాలకులంటే, కాళోజీ మాతృభాష తెలుగు కాదు పొమ్మని సమైక్యవాద రచయితలన్నారు.

శాతవాహనుల కాలపు గాథా సప్తశతిని సరళమైన తెలుగులోకి అనువాదం చేసి, వేమన మీద మొట్టమొదటిసారిగా సాధికారకమైన పరిశోధన ప్రసంగాలు చేసి, రాయలనాటి ప్రజా

జీవితం గురించి కూడా రాసిన రాళ్లపల్లి అనంత కృష్ణ శర్మగారికి తెలంగాణ సంస్కృతి పట్ల, సాహిత్యం పట్ల గౌరవం ఉండేది. అట్లే డిగ్రీలు లేకున్నా చరిత్ర పరిశోధన వల్ల ఆంధ్ర విశ్వవిద్యాలయ చరిత్ర శాఖాధిపతియైన మల్లంపల్లి సోమశేఖర శర్మగారికి తెలంగాణ ప్రాచీన చరిత్ర పట్ల, సంస్కృతి పట్ల గౌరవం ఉండేది. ఇద్దరూ ప్రతాపరెడ్డిగారి ఆంధ్రుల సాంఘిక చరిత్రను హృదయపూర్వకంగా ప్రశంసించారు. ఎటొచ్చీ 1956లో డెల్టాకు చెందిన రెండున్నర జిల్లాల రెండున్నర కులాల సంపన్న వర్గాల పాలన ఆంధ్రప్రదేశ్‌ను గుప్పిట్లోకి తీసుకున్నప్పటి నుంచి వలసాధిపత్యంగా ప్రారంభమైంది. ముఖ్యంగా నీటి పట్టులోని భూములమీద, వనరులమీద, ఉత్పత్తి మీద, శ్రమమీద ఈ దళారీ వర్గానికి అధికారం చిక్కినప్పటి నుంచి పాలక సంస్కృతి కాని దానిని చిన్నచూపు చూసే దృష్టి వచ్చింది.

శ్రీశ్రీ అరవై ఏళ్ల సభ నుంచి (1970) ప్రపంచ తెలుగు సభల (1975) దాకా సాహిత్యంలో తిరుగుబాటు జెండా పట్టుకున్న వేల్చేరు అమెరికాలో ఉంటున్నందున సాహిత్య విమర్శకు ప్రామాణికమయ్యాడు. తానా, జంపాల చౌదరి ప్రపంచ వాణిజ్య సంస్థపై దాడి మొదలు ఇరవై ఏళ్ల తెలుగు కథ వరకు, సద్దాం హుస్సేన్ మొదలు సమకాలీన సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాల వరకు - ఆంధ్రప్రదేశ్‌లో బుద్ధిజీవులు ఎలా స్పందించాలో చెప్తున్నారు. తెలుగు సంస్కృతిని అభోవిభో ఫౌండేషన్‌లు, తానాలు, ఆటాలు నిర్వచిస్తున్నాయి. లేదా ఆంధ్రప్రదేశ్‌లో తామరతంపరగా వస్తున్న కంపెనీలు నిర్ణయిస్తున్నాయి. అందరూ పరాయీ కరణ గురించి రాసే వాళ్ళే, అందరూ సామ్రాజ్యవాద సంస్కృతి మీద కలాలను కత్తులుగా దూసేవాళ్లే. ఇటువంటి సాహిత్య పోషణకంతా ముందుకు వచ్చేవి ఆ కార్పోరేటు సంస్థలే. ఇవ్వాల తెలుగు జాతి చరిత్ర, సంస్కృతి గురించి పారిశ్రామికవేత్తలు, భూకబ్జాదారులు కావూరి సాంబశివరావు, లగడపాటి రాజగోపాల్, టిజి వెంకటేశ్‌ల నుంచి పాఠాలు నేర్చుకునే స్థితిలో మాత్రం తెలంగాణ ప్రజలు లేరు. 'థింగ్స్‌ఫాల్ ఎపార్ట్' అనే నవలలో చిన్నువా అచెబీ ఒక చేత ఖడ్గం, మరొక చేత బైబిల్ పట్టుకొని వచ్చిన యూరోపియన్లతో పోలిస్తే - ఆఫ్రికన్ తెగలు అనాగరికులు, మూఢాచారాలు, విశ్వాసాలు కలవారే కావచ్చు. కాని వాళ్ల కష్టం చేసే కాళ్లు, చేతులు, ప్రేమించే మనసు, కలిగిన మనుషులు - స్వేచ్ఛా ప్రియులైన నిండు మనుషులు - ఖండిత నాగరికులు కాదంటాడు.

ఒక ఆకాంక్షను, ఒక ఆగ్రహాన్ని, ఒక ఆవేశాన్ని ఎట్లా అర్థం చేసుకోవాలి. ముఖ్యంగా బుద్ధిజీవులయిన సంస్కృతీపరులు ఎట్లా అర్థం చేసుకోవాలి - చలో అసెంబ్లీ రోజు వలెనే మిలియన్ మార్చ్ రోజు కూడా ప్రభుత్వం ఎన్ని అవరోధాలు కల్పించిందో చూస్తే పిల్లిని దినమంతా గదిలో బంధించి కొట్టిన యజమాని పోలికయే సరిపోతుంది. మొదట మిలియన్ మార్చ్ పిలుపు ఇచ్చిన తెలంగాణ పొలిటికల్ జాక్ నగరాన్ని పది లక్షల మంది ఎనిమిది దిక్కులా దిగ్బంధం చేయాలన్నది. కాని ఇంటర్మీడియట్ పరీక్షలు రాసే విద్యార్థుల, తల్లిదండ్రుల విజ్ఞప్తుల మేరకు అది మధ్యాహ్నం 1 గంట నుండి 4 గంటల వరకు మార్చుకున్నది. ఎవరికీ ఇబ్బంది కాకుండా ఆ సమయానికి ట్యాంక్‌బండ్ మీదికి చేరుకొని 4 గంటలకు ప్రతిజ్ఞా ప్రకటన చేసి ప్రశాంతంగా తిరిగిపోవాలన్నది. ఒక్కమాటలో మిలియన్ మార్చ్‌ను మినిమం మార్చ్‌గా, కేవలం ఒక ప్రతిజ్ఞా ప్రకటనగా మార్చుకొని అనుమతి కోరింది. ఒక్క మార్చ్ 10 పరీక్షను వాయిదా వేసుకొమ్మన్నది. దేనికీ అనుమతించని ప్రభుత్వం - నిజంగా పోలీసులు మార్చ్ 10న నగరాన్ని దిగ్బంధం చేసారు. అదనపు బలగాలను దించారు. ప్రదర్శకులు తమ కార్యక్రమాలను, అందులోని మార్పులను ఎప్పటికప్పుడు ప్రకటిస్తూనే ఉన్నారు. అందులో రహస్యం లేదు. దాపరికం లేదు. దాడి లేదు.

ప్రభుత్వం మాత్రం జిల్లా కేంద్రాల నుంచి మొదలుకొని రాజధాని వరకు బలగాలను మోహరించి ముళ్ల కంచెలతో, బారికేడ్లు, చెక్‌పోస్టులు ఏర్పాటు చేసి, అనుక్షణం హెచ్చరికలు జారీ చేస్తూ ప్రజలమీద మానసిక యుద్ధం ప్రకటించింది. లక్షలాది మందిని ఆపింది. రైళ్లు, బస్సులు రద్దు చేసింది. అయినా వేలాది మంది ఎన్నో అగడ్తలు, అవరోధాలు దాటి ట్యాంకుబండ్ మీదికి చేరుకున్నారు. పోలీసులు ట్యాంక్‌బండ్‌కు ఇరువైపులా మోహరించి ఆ మధ్యన కాన్‌సంట్రేషన్ క్యాంపులో వలె అక్కడికి చేరుకున్న వాళ్ళను వదిలేసారు. నాయకత్వాన్ని అరెస్టు చేసి ఘోషామహల్ స్టేడియం, బొల్లారం వంటి దూర దూర పోలీస్ స్టేషన్‌లలో నిర్బంధించారు. ఒంటి గంట నుంచి నాలుగు గంటల వరకు ప్రతిజ్ఞా పత్రం చదివించవలసిన నాయకత్వం లేదు. ప్రొ. కోదండరామ్‌ను, బిజెపి ఎం.ఎల్.ఎ.తో పాటు ఒంటిగంటకే బలవంతంగా అరెస్టు చేసి బొల్లారం తరలించారు. గడువు లోపల ఆయనను విడుదల చేయాలని ట్యాంక్‌బండ్ మీద చేరినవాళ్ళు డిమాండు చేశారు. ప్రదర్శనకారులు ఒక పోలీసు వాహనం వస్తే తగులబెట్టారు. ఇక ట్యాంక్‌బండ్ పొడవునా శత్రు చిహ్నాలు ఏమీ లేవు. శత్రు సంచారమూ లేదు. విసుగు, కోపం, అవమానం, ఆవేశంతో రగులుతున్న యువకులకు ఆ విగ్రహాలు తమ జాతి వైతాళికులని ఆ క్షణాన అనిపించలేదు. అవి కేవలం ప్రభుత్వ నిర్మాణాలనిపించింది. లేకపోతే అక్కడ హుస్సేన్ సాగర్‌లో పడకుండా కట్టిన పైపులనే తీసుకొని విగ్రహాలు పడగొట్టే సద్యో ఆవేశానికి వాళ్లు గురికారు, వాళ్లకు సిద్ధేంద్రయోగి ఎవరో, ఎర్రా ప్రగడ ఎవరో ఏమి తెలుసు! తెలంగాణ పీడిత ప్రజలకు వేమన మీద, జాషువా మీద ఏ దృష్టితో చూసినా ఏ మాత్రం కోపం ఉండే అవకాశమే లేదు. పోతన, సురవరం ప్రతాపరెడ్డి మాత్రం తమ వాళ్ళని, తెలంగాణ ఆత్మగౌరవానికి ప్రతీకలని ఇటీవల తెలంగాణ వాదుల ప్రచారం ఎక్కువగా వినిఉన్న వాళ్లే. అట్లాగే కందుకూరి, గురజాడ గురించి దళితవాదుల నుంచి కొంత విమర్శ విని ఉంటారు. (కందుకూరి, గురజాడలు వలసవాదాన్ని బలపరచారని, వాళ్లు వేమన వలె సంఘసంస్కర్తలు కాజాలరని వాదన మొదట చేసినవాడు మార్క్సిస్టు - లెనినిస్టు నాయకుడు కొల్లా వెంకయ్య, వేమన సందర్భం వేరు. బోల్షివిక్ విప్లవం కన్నా ముందరి సంఘసంస్కరణోద్యమం వేరు అని విరసం ఆయనతో

విభేదించింది. (ఫ్రెంచి విప్లవ నేపథ్యంలో గురజాడను అంచనా వేసింది)

మరీ ఇటీవల శ్రీశ్రీ శతజయంతి సందర్భంగా శ్రీశ్రీ గురించి కూడా తెలంగాణ జాతి వాదుల నుంచి కూడా తీవ్ర విమర్శలే విని ఉంటారు. తెలంగాణ సాయుధపోరాట కాలంలో ఆయన నైజాం సేవలో ఉన్నాడని, ఆయన తెలంగాణ పోరాటం గురించి ఏమీ రాయలేదని, ప్రత్యేక తెలంగాణ ఉద్యమకాలంలోనయితే వ్యతిరేకిస్తూ, సమైక్య గీతాలు రాసాడని నందిని సిధారెడ్డి, జూలూరి గౌరీశంకర్‌లు తీవ్రంగానే విమర్శించారు. చనిపోయేదాకా మహాంధ్రోదయాన్ని, సమైక్యవాదాన్ని బలపరిచిన దాశరథి ఇక్కడ పుట్టినవాడై ఎమర్జెన్సీని బలపరచినా, వెంగళరావు లోచనాల్లో ఆలోచనామృతాలు చవిచూసినా బతికిపోయాడు. శ్రీశ్రీ కూడా ఎమర్జెన్సీని లెఫ్ట్ డిక్టేటర్‌షిప్ అన్నాడు. ఇరవై సూత్రాలను బలపరిచాడు. వెంగళరావు మద్రాసు పోయినప్పుడు ఆయన గురించి ఒక మంచి మాటే అన్నాడు. ఆ తప్పులకాయనను విరసం శిక్షించింది. ఆయన అధ్యక్షపదవి కోల్పోయి సామాన్య సభ్యుడిగా ఎమర్జెన్సీ తర్వాత క్షమాపణలు చెప్పి తిరిగి చేరాడు. ఇంత సమైక్యవాదాన్ని వినిపించిన దాశరథి ఆస్థానకవి పదవిని మాత్రం ఎన్.టి.ఆర్. రద్దు చేశాడు. అది చాలా అభ్యుదయ చర్యగా జస్టిస్ పిఆర్ చౌదరి సమర్థించాడు. కాని ఆయనకు విగ్రహాలు పెట్టడం, ఎన్.టి.ఆర్. తనలో రాజాంశను, అవతారాలను చూసుకోవడం తిరోగమనవాదం అనిపించలేదు. ఇంతకూ శ్రీశ్రీ ఎక్కువకాలం కమ్యూనిస్టు పార్టీ ఫెలో ట్రావెలర్. 1955 ఎన్నికల్లో మాత్రం కమ్యూనిస్టు పార్టీకి విస్తృత ప్రచారం చేసి పిచ్చివాడయ్యాడు. కమ్యూనిస్టు పార్టీ విశాలాంధ్ర భావన ఆయనలో బలంగా ఉంది. తెలంగాణ సాయుధ పోరాటాన్ని బలపరచిన ఆరుద్ర 'త్వమేవాహమ్'కు ఆయన 'నేనింక కవిత్వం రాయకున్నా ఫర్వాలేదు' అన్నంత ప్రశంసనిచ్చాడు. తెలంగాణలో యూనియన్‌లో మిలిటరీ దాడులను, చిత్రహింసలను ఖండిస్తూ కళ్లకు కట్టినట్లు రాసిన హరీంద్రనాథ చటోపాధ్యాయ సుదీర్ఘ గీతాన్ని మొదట ఆయన సంక్షిప్తంగా అనువాదం చేసాడు. (ఆ తర్వాతే పూర్తి గీతాన్ని ఆరుద్ర అనువదించాడు) 1972లో విరసం మెజారిటీ ఓటుతో ప్రత్యేక తెలంగాణ, ఆంధ్ర ఉద్యమాలను బలపరుస్తూ తీర్మానం చేసిన తర్వాత 72 గుంటూరు సభల్లో ఆయన తెలంగాణ రాష్ట్ర ఏర్పాటును బలపరుస్తూ అధ్యక్షోపన్యాసం చేసాడు. ఇదేమీ సంజాయిషీ కాదు. 1969, 72ల నాటికి కూడా ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి ఈనాడున్నంత బహుళ జనామోదం లేదనేది ఈ సందర్భంలో గుర్తుపెట్టుకోవాలి. ఆ రోజు ఎంతో ధైర్యంగా సినారె 'వీర తెలంగాణ నాది, వేరు తెలంగాణ కాదు' అని రాయగలిగాడు. రావి నారాయణ రెడ్డి తన పుస్తకానికి దానిని మకుటంగా వేసుకున్నాడు. ఇవ్వాళ సిపిఐ ప్రత్యేక తెలంగాణ వాదాన్ని బలపరుస్తున్నది. సినారె అందుకోసం కేంద్ర సాహిత్య అకాడెమీ అవార్డు వదులుకోకపోయినా తాను ప్రత్యేక తెలంగాణ ఉద్యమాన్ని బలపరుస్తున్నానని చెప్తున్నాడు. అయినా తెలంగాణజాతి వాదులు జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, సినారెల మీద పెట్టని విమర్శ శ్రీశ్రీ, శివారెడ్డిలమీద పెడుతున్నారు. శివారెడ్డి తెలంగాణ తనకు ఉద్యమ జీవితాన్ని ఇచ్చిందని చెప్తున్నాడు. మంజీర రచయితల సంఘంతో పుట్టిన దగ్గర్నించీ మమేకమై ఉన్నాడు. దేశపతి శ్రీనివాస్ 'మేం ఇంత ప్రత్యేక తెలంగాణ ఉద్యమ వేడిలోనూ, ఖమ్మంలో శ్రీ శ్రీ విగ్రహాన్ని, సిద్దిపేటలో అన్నమయ్య విగ్రహాన్ని పెట్టుకున్నాం' అంటున్నాడు. ఖమ్మంలో శ్రీశ్రీ విగ్రహం పెట్టిన సందర్భం బలహీన స్వరంలోనైనా సమైక్యవాద వ్యక్తీకరణయే. ఏ రాజకీయాలలో ఉన్నా ఎక్కువగా వాళ్లు ఒక సామాజిక వర్గానికి చెందిన 'అభ్యుదయ'వాదులు. అంతకన్నా ఎక్కువగా శ్రీశ్రీ కవిత్వ లాలసులైన శ్రీశ్రీ ఉద్యమాభిమానులు. అయితే అక్కడ జూలూరు గౌరీశంకర్ శ్రీశ్రీ మీద చేసిందంతా దాడియే. శ్రీశ్రీ కాళోజీ పాదాల దగ్గర కూర్చొనడానికి కూడ అర్హుడు కాదన్నాడు. కాళోజీ యేమో 'వాడు రాసేసిన గీతాలు గుబాళిస్తుంటే వాడు తాగి పారేసిన సీసాల సంగతెందుకు' అంటూ జీవితంలో రామేశ్వరరావును అన్నగా గౌరవించినట్లే, సాహిత్యంలో శ్రీశ్రీని గౌరవించి తన ఇంటికి వచ్చినప్పుడు, అక్షరాల ఆయన పాదాల దగ్గర అనుంగు తమ్ముడుగా కూర్చున్నాడు. పెద్దా చిన్నా భావంతో కాదు కల్మషం లేని ప్రేమతో. శ్రీశ్రీ కూడా 1953లో అలంపురంలో 'నా గొడవ'ను అవిష్కరిస్తూ కాళోజీ అఖిలాంధ్ర కవి అన్నాడు. యుద్ధంలో పారిపోకుండా నిలిచిన లూయీ ఆరగాన్ వంటి కవి అన్నాడు.

ఏమైనా కొమురంభీం విగ్రహం ట్యాంక్‌బండ్ మీద పెట్టాలన్న డిమాండు పెరిగిన కొద్దీ ట్యాంకుబండ్‌పై విగ్రహాలు ఏ ప్రాంతం వాళ్ళవి అనే చర్చ పెరుగుతూ వచ్చింది. తెలంగాణ వాటా ఎంత అనే చర్చ వచ్చింది. అందులోనూ సామాజిక వర్గాల ప్రాతినిధ్యం చర్చ కూడా వచ్చింది. అల్లూరి సీతారామరాజు కొమురం భీం పోలికతో అల్లూరిని ఆదివాసేతరుడని తక్కువ చేయడం, దాశరథి, శ్రీశ్రీల పోలికలు, దాశరథికన్నా శ్రీశ్రీని తక్కువ చేయడం ఇవన్నీ చర్చకు వచ్చాయి. ట్యాంకుబండ్ మీద ఆంధ్రా ప్రాంతం వాళ్ల విగ్రహాలను కూలుస్తామన్న బలమైన గొంతు ఎక్కువగా వినిపించింది ఎన్.టి.ఆర్. పేరు పెట్టుకున్న కల్వకుంట్ల తారక రామారావే అనుకుంటా. స్పష్టాస్పష్టంగా విగ్రహాలు కూల్చినవారిపై ఈ ప్రభావాలన్నీ లేవనలేము.

సమైక్యవాదులు ఎంతో గర్వంగా చెప్తున్న తెలుగు జాతి, చరిత్ర, సంస్కృతులకు, ఆ మాటకొస్తే ఆదిమజాతి నాగరికతకు, బౌద్ధమతానికి ఆదిలాబాదు, కోటిలింగాల, ఎలిగందుల (కరీంనగర్), వరంగల్, గోల్కొండ, హైదరాబాదులు చిరకాలం కేంద్రాలుగా ఉన్నాయనే విషయం మరచిపోతున్నారు డెల్టా అధిపత్యపు దళారీ వలసవాదులు. గోదావరి, కృష్ణానదులు తెలంగాణ నుంచి తమ ప్రాంతంలో ప్రవేశిస్తున్న విషయం కూడా గుర్తిస్తున్నట్లు లేరు. లేకుంటే కావూరి, చిరంజీవి, చంద్రబాబు మొదలు సిపిఐ సిపిఎంల దాకా, తెలంగాణవాదులు, విప్లవ పార్టీలు (ముఖ్యంగా మావోయిస్టులు), ప్రజాస్వామ్యవాదులు, పర్యావరణవాదులు, అందరికన్నా ముఖ్యంగా తాము మునిగి

పోతామని ప్రతిఘటిస్తున్న ఆదివాసులు వ్యతిరేకించే పోలవరం ప్రాజెక్టుకు జాతీయ స్థాయి గుర్తింపు ఇవ్వాలని కేంద్రం మీద ఇంత ఒత్తిడి తేరు. పులిచింతల ప్రాజెక్టు విషయం కూడా అంతే. ఆదివాసుల జీవనశైలిపై, సంస్కృతిపై ఇంత చిన్నచూపు ఉండి వాళ్లను ఒక జాతిగా, మనుషులుగా కూడా గుర్తించని ఈ నాగరీకులు సంస్కృతి గురించి పాఠాలు చెప్తున్నారు. ఆదివాసుల పట్ల ఇది మార్కెటు వైఖరి. సంస్కృతి పట్ల ఇది దోపిడీ మార్కెటు వైఖరి. వీళ్లకు సంస్కృతి ఒక అమ్మకపు సరుకు.

ఇంకొక రకంగా చూస్తే ట్యాంకుబండ్‌పై విగ్రహాలు కూల్చిన వాళ్లు ఎంత ఆవేశపరులో అంత అమాయకులు కూడా. వాళ్ళు ఒక వైపు ట్యాంకుబండ్‌పై విగ్రహాలు పెట్టినప్పుడు ఎన్.టి.ఆర్. వాటినెట్లా తెలుగుజాతి ఆత్మగౌరవ ప్రతీకలనుకున్నాడో, ముప్పై ఏళ్ల తర్వాత వాటిని కూల్చిన వాళ్లు అట్లా తెలంగాణ స్వాభిమాన ప్రకటనకు వాటిని కూల్చడం అట్లా వ్యక్తీకరణ అనుకున్నారు. అంతే తప్ప వాళ్ల తెలంగాణ వాదంలో వివాదాంశమైన శ్రీశ్రీకి తప్ప మిగతావారికి ప్రత్యేక తెలంగాణ ఉద్యమంతో లేనాదేనా ఏముందని? వాళ్లంతా ఎప్పటి వాళ్లని. శ్రీశ్రీని కూడా భూతద్దంతో పెట్టి చూస్తే తప్ప ఎన్.టి.ఆర్. వలెనో, బ్రహ్మానందరెడ్డి వలెనో, అందరికన్నా ఎక్కువగా చంద్రబాబు, వైఎస్‌ఆర్ వలెనో ఆయన తెలంగాణ వ్యతిరేకి కాదు. ప్రత్యేక తెలంగాణ రాకుండా విగ్రహ మాత్రుడై అడ్డుపడుతున్నవాడు కాదు. అందరి కన్నా ఎక్కువగా తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకు అడ్డుపడిన ఇందిరాగాంధీ, వై.ఎస్.ఆర్‌ల విగ్రహాలు తెలంగాణ అంతటా సర్కార్ తుమ్మల వలె ప్రబలిపోతున్నాయి. ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ఉధృతంగా ఉన్నప్పుడే దానికి 2004-2009 మధ్య కాలంలో అడుగడుగునా మోకాలడ్డిన వైఎస్‌ఆర్ ప్రమాదవశాత్తు మరణించిన ఒకే ఒక కారణంతో తెలంగాణ అంతటా విగ్రహాలుగా వెలిశాడు. ప్రత్యేక తెలంగాణ కోసం ఆరువందల మంది ఆత్మహత్యలు చేసుకోవడానికన్నా ముందు ఎందరో కొందరు ఆయన కోసం కూడా ఆత్మహత్యలు చేసుకున్నారు. తెలంగాణలోనే ఎక్కువ చేసుకున్నారు. తెలంగాణలోనే యువకులు, పేదలు ఆయన కోసం ఆత్మహత్యలు చేసుకోవడం, తెలంగాణలోనే ఆయన విగ్రహాలు, ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ప్రబలంగా ఉన్న కాలంలోనే రావడం సందర్భంగా రావాలి, అసలు సంస్కృతి గురించిన నిజమైన చర్చ. ఎందుకంటే తెలుగు సంస్కృతికీ చంద్రబాబు, వైఎస్‌ఆర్‌లకూ ఏ సంబంధమూ లేదు. తెలుగు సంస్కృతి నిర్మాణంలో వాళ్లు పూచికపుల్ల కూడా దోహదం చేసింది లేదు. ఏమైనా ఉందంటే ప్రపంచ బ్యాంకు అభివృద్ధి నమూనాను అమలు చేసే క్రమంలో సామ్రాజ్యవాద ప్రపంచీకరణ అమలుచేసే వేగంలో వాళ్ల పాత్ర సంస్కృతీ విధ్వంసంలో వెలకట్టి లేనిది. ఎన్నటికైనా తెలుగు ప్రజా సంస్కృతి బహిరంగ విచారణకు పెడితే పాలకులుగా నేరస్తులుగా నిలబడవలసినవాళ్లు చంద్రబాబు, వైఎస్‌ఆర్‌లు. పాలకవర్గాలుగా జగన్, చిరంజీవిలు. చిరంజీవి ఇప్పుడైతే కిరణ్‌కుమారెడ్డితో పాటు కాంగ్రెస్ పాలక సంస్కృతిలో భాగమయ్యాడు. అయితే వైఎస్‌ఆర్ తప్ప ఇప్పుడు వీళ్లెవరూ ఇంకా విగ్రహమాత్రులు కాలేదు. మరి ప్రజలకు, ముఖ్యంగా తెలంగాణ ప్రజలకు ఎన్.టి.ఆర్. పెట్టిన విగ్రహాల మీద వచ్చినంత కోపం ఎన్.టి.ఆర్. మీద ఎందుకు రానట్లు? వైఎస్‌ఆర్ విగ్రహాల మీద అసలే ఎందుకు రానట్లు. తెలుగు తల్లి మీద ఉన్నంత కోపం కూడ, మా తెలుగుతల్లికి మల్లెపూదండ మీద ఉన్నంత కోపం కూడా వీళ్లకు ఎన్.టి.ఆర్., చంద్రబాబు, వైఎస్‌ఆర్‌ల మీద రావడం లేదు. జగన్‌ను మానుకోట రాకుండా అడ్డుకున్న వాళ్ళు, జగన్ అనుచరులపై మానుకోటలో రాళ్లేసిన వాళ్లు, వైఎస్‌ఆర్ విగ్రహాలనెట్లా పెట్టనిచ్చారు? అందునా తెలంగాణలో. ఆశ్చర్యమే. మిలియన్ మార్చ్ పొడుగునా ఎన్ని అడ్డంకులు ఎదుర్కొన్నారో తెలంగాణవాదులు అన్ని వై.ఎస్.ఆర్ వగయిరా దుర్మార్గుల విగ్రహాలు కూడా ఎదుర్కొనే ఉంటారు. తెలంగాణలో సంస్కృతి, విలువల చర్చకు రావల్సిన విషయాలు ముఖ్యంగా ఇవి. తెలంగాణలో సంస్కృతి, విలువల చర్చల్లో చర్చకు రావల్సినవి, కెసిఆర్ - లగడపాటిల 'ఐ లవ్ యూ, ఐ లవ్ యూలు, లగడపాటి ఇతర దళారీల పరిశ్రమల్లో తెలంగాణ వాదుల షేర్లు. సెజ్‌ల విషయంలో, బహుళజాతి కంపెనీల, బడా కంపెనీల విషయంలో తెలంగాణవాదుల మెతకవైఖరి. శాసనసభలకు మాసికాలు, పిండప్రదానాలు చేసే పచ్చి బ్రాహ్మణీయ సంస్కృతి. మాటిమాటికీ కే.సి.ఆర్. చండీయాగాలు, తెలంగాణ పేరుతో తెలంగాణలో ముస్లింలు, హిందూమత విశ్వాసేతరులే లేనట్లు బిజెపితో పాటు తెలంగాణవాదులు కలిసి అమలు చేస్తున్న సాంస్కృతిక కార్యక్రమాలు. ఒకప్పుడు లగడపాటి, నన్నపనేని రాజకుమారిలను కలిపి మాట్లాడిన వెకిలి భాష. స్త్రీల విషయంలో, దళితుల విషయంలో, బడుగు వర్గాల విషయంలో, శ్రమ విషయంలో ప్రదర్శించిన తీవ్ర అభ్యంతరకరమైన చిన్నచూపు. భాష - ప్రదర్శన - వ్యక్తీకరణ. తెలంగాణ సంస్కృతి పేరుతో ముస్లింలను, దళితులను, స్త్రీలను, శ్రమ జీవులను విస్మరించిన హిందూత్వ సంస్కృతి ప్రచారం. జగన్ తెలంగాణ బలపరిస్తే జగన్‌ను బళ్లారి నుంచి బయ్యారం దాకా చేసిన దోపిడిని బారాఖూన్ మాఫీ చేసే అవకాశవాద క్షమాగుణం. సోనియాగాంధీ, తెలంగాణ ఇస్తే (ఆమె తెలంగాణ ఇచ్చేది ప్రజలు తీసుకునేది అయినట్లు యజమాని పట్ల స్వామి భక్తి ప్రదర్శించే సుగుణం.) పాదాలు పాలతో కడుగుతామన్న సంస్కృతి, తుర్రేబాజ్ ఖాన్, బందగీ, మఖ్దూం, షోయిబుల్లా ఖాన్‌లలో, అశేష ముస్లిం సమాజంలో కాకుండా నిజాము నవాబులో తెలంగాణ సంస్కృతిని చూసే దొరల సంస్కృతి, రాజకీయాల్లోనే కాకుండా సాంస్కృతిక రంగంలోను ప్రబలిన వసూళ్ల సంస్కృతి, కంపెనీలను, సినిమాలను తెలంగాణ పేరుతో బ్లాక్‌మెయిలు చేసి లక్షలు, కోట్ల రూపాయలు దండుకునే సంస్కృతి, అన్నిటికన్నా మించి విగ్రహాలను కూలగొట్టడానికి రెచ్చగొట్టినవాళ్లే పెంచి పోషిస్తున్న విగ్రహ సంస్కృతి. పోస్టర్లు, ఫ్లెక్సీలు, కటవుట్లు, హోర్డింగులలో వ్యక్తమవుతున్న వ్యక్తి ఆరాధనలు. ప్రశ్నించాల్సినవి ఇవి.

విగ్రహాలను కూల్చిన సందర్భంలో సంస్కృతి చర్చకు

రావడం స్వాగతించవలసిందే. సాంస్కృతిక విషాదం గురించి కాదు. ఆధిపత్య సాంస్కృతిక దాడి నుంచి నిజానికది మొదలయింది. పాలక సంస్కృతి గురించి, వలస సంస్కృతి గురించి, అధిపత్య సంస్కృతి గురించి, దోపిడీ పీడన సంస్కృతి గురించి మాట్లాడుదాం.

- - -

విగ్రహారాధన, విగ్రహ సంస్కృతి ఎప్పుడు ఎట్లా మొదలయింది.

మతాలన్నీ మొదట విగ్రహారాధనకు వ్యతిరేకమే. వైదిక మతం అద్వైతాన్ని ప్రతిపాదించింది. ఆత్మ అఖండం, నైరూప్యం దానికి ఆకృతి లేదు. అది క్రమంగా చాతుర్వర్ణ్యంతో కూడిన హిందూ మతంగా, కులవ్యవస్థగా మారి జాషువా భాషలో మనుషులెందరయితే దేవతలందరు పుట్టుకొచ్చారు. విగ్రహారాధన ప్రారంభమైంది. అయోధ్యలోని బాబ్రీమసీదు, రామజన్మ భూమి అయి అక్కడ రామలల్లా విగ్రహం దొరికి అది ప్రజాస్వామ్య లౌకిక రాజ్యంలో హైకోర్టుకు విశ్వాసమే న్యాయంగా ప్రకటించే తీర్పుకు దారితీసింది. బాబ్రీ మసీదు స్థల వివాదం - బాబ్రీ మసీదు విధ్వంసానికే కాదు, మానవతా విలువల, విశ్వాసాల విధ్వంసానికి దారి తీసింది.

తెలంగాణలోనైతే బొడ్డెమ్మలయినా, బతుకమ్మలయినా తొమ్మిది తొమ్మిది రోజుల పండుగలుగా పూలు పేర్చి ఆఖరు రోజున నీళ్లల్లో వేసి సాగనంపుతారు. కాని తిలక్ ప్రారంభించిన గణేష్ ఉత్సవాలను అఖండ భారత్ భావనతో హిందూత్వవాదులు గణేశ్ నిమజ్జనోత్సవాలుగా మార్చారు.

హైదరాబాదులో గణేశ్ ఉత్సవ కమిటీ, ముఖ్యంగా 'టైగర్' నరేంద్ర, సంఘ పరివార్ శక్తులు వినాయక విగ్రహాల నిర్మాణాన్ని ఒక పరిశ్రమగా మార్చారు.

నెలల తరబడి హైదరాబాదు నిండా వినాయక విగ్రహాలు పోటీ పడి తయారుచేసి ఏం చేస్తారు? ఆఖరు రోజున హుస్సేన్ సాగర్‌లో పడేస్తారు. దానిని నిమజ్జనం అంటారు. ఎన్నేళ్లుగా ఇది సాగుతున్నది. హుస్సేన్‌సాగర్ కాలుష్య పంకిలమై వినాయకసాగర్ అనిపించేంతగా సాగుతున్నది.

దశాబ్దాలుగా ఈ విగ్రహ నిమజ్జన కార్యక్రమానికి మొత్తంగా సహకరిస్తున్న ప్రభుత్వ యంత్రాగం, పాలకవర్గాలు, మేధావులు, బుద్ధి జీవులు, మధ్య తరగతి ఉద్యోగులు, ఒకరేమిటి, నాస్తికులు, హేతువాదులు, పర్యావరణవాదులు, విప్లవవాదులు తప్ప ఇటువంటి విగ్రహ నిమజ్జనాలకు చిన్నప్పటి నుంచి అలవాటు పడిన యువకులెవరో అదే పని చేస్తే వీళ్లే గుండెలు బాదుకుంటున్నారు. ఏ పనికీ విఘ్నం కలగించకూడదని దేవుణ్నే నిర్మాణం చేసి నిమజ్జనం చేయడం మన సంస్కృతి అయితే జాతి వైతాళికులయిన మనుషుల విగ్రహాలను నిర్మించి నిమజ్జనం చేయడం సంస్కృతి కాకుండా పోతుందా.

బుద్ధుడు విగ్రహమైపోయాడు. శిల్పానికి, కళలకు కాణాచి అయ్యాడు. ఇస్లాం మతం ఒక్కటే ఇప్పటికీ విగ్రహారాధనను వ్యతిరేకిస్తున్నది. మొహర్రం పండుగ కూడ షియాలు జరుపుతారు కానీ సున్నీలు జరపరు. తెలకపల్లి రవికి కెసిఆర్ నైజాంను ఎంత పొగిడినా ఉస్మాన్ అలీ ఖాన్ విగ్రహాన్ని ట్యాంక్‌బండ్ మీద పెట్టించలేడని తెలిసినట్లు లేదు.

అందుకే అంత సహజంగా అక్బరలీ ఖాన్ అసెంబ్లీలో - తెలంగాణ శాసన సభ్యులు లేని శాసనసభలో తెలంగాణ ప్రజల సమస్యలు పట్టకుండా, తెలంగాణ కోసం ఆత్మహత్యలు చేసుకున్న ఆరువందల మంది ప్రాణాలు పట్టకుండా విగ్రహాలు కూల్చడం పట్టిందా అని అడిగాడు.

కమ్యూనిస్టులు లెనిన్, మావోల మృతదేహాలను భద్రపరచడం దగ్గర్నించి, విగ్రహాలు స్థాపించేదాక వ్యక్తి పూజను, విగ్రహారాధనను ప్రోత్సహించారు. అమరవీరుల స్థూపాలలో ఆకార విగ్రహాలు లేవు. కానీ, సుత్తీ కొడవలి స్ఫూర్తి త్యాగాల ఆదర్శాలు ఉన్నాయి.

మనుషుల జీవితాలు కూలిపోతుంటే, ప్రాణాలు పేలిపోతుంటే పట్టనివాళ్లు విగ్రహాలు విధ్వంసం కావడం గురించి గుండెలు బాదుకోవడం గురించి కూడా కొందరు ఆలోచనపరులు మాట్లాడుతున్నారు.

సునామీ, భూకంపాలకన్నా అణు విధ్వంసం, ప్రజల, పోనీ కొందరు అవేశపరుల, ఇంకా పోనీ కొందరు అసాంఘిక శక్తుల చేతుల్లో విగ్రహ విధ్వంసంకన్నా, దేశంలో పాలకులు ఒక విధానంగా అమలు చేస్తున్న అభివృద్ధి అనే విధ్వంసం నిజంగా ఇవ్వాళ మనం చర్చించుకోవాల్సిన జాతీయ సాంస్కృతిక విధ్వంసం. ఎంతో ఆందోళనతో, తీవ్రతతో, ఆగ్రహంతో చర్చించుకోవాల్సిన ప్రజా సాంస్కృతిక విధ్వంసం. అది స్వయంగా మన్మోహన్‌సింగ్ మొదలు ఆ పాలక శ్రేణిలో ఆఖరి మనిషి వరకు ప్రజలపైకి నిత్యం అనుక్షణం అమలుచేస్తున్న విధ్వంసం.

- - -

విగ్రహారాధన ఉన్నట్లే విగ్రహ విధ్వంసం కూడా, బహుశా ఆరాధనతో పాటే ప్రారంభమైంది. ఆస్తికత్వంతో పాటే నాస్తికత్వం ప్రారంభమైనట్లు. తెలుగు నేల మీద మనం ఎక్కువ వినకపోవచ్చుగానీ పెరియార్ ఉద్యమంలో అప్పటి మద్రాసు రాష్ట్రంలో ఇది ఉధృతంగా సాగింది. హిందూ దేవుళ్లను చామరాలతో బ్రాహ్మణులు ఊరేగిస్తే చెప్పుదెబ్బలతో పెరియార్ ఊరేగించాడు. ప్రజల్లో నాస్తికత్వం ప్రచారం చేయడానికి దేవుడు అనే భావం పట్ల భయభక్తులు పోవడానికి ప్రజల్లో బహిరంగంగా అవి కేవలం రాతి బొమ్మలు, పటాలు, లోహ విగ్రహాలు - వాటికేవరాలిచ్చే, శాపాలు పెట్టే శక్తి లేదు అని నిరూపించడానికి చాలా నిర్భయంగా చాలా ప్రదర్శనలు చేసేవాడు.

రాజకీయాల్లో గాంధీతో పాటు భగత్‌సింగ్ ప్రభావం కూడా ప్రారంభమైంది కనుక ఆనాడే యశపాల్ గాంధీవాద శవ పరీక్ష అని రాసాడు.

పారిశ్రామిక విప్లవం వచ్చి పెట్టుబడిదారీ విధానం యంత్రాలు వచ్చినాక యంత్ర భూతముల కోరలు తోమే శ్రామికులు తాము పరాయీకరింపబడుతున్నామనే భావానికి

గురయి ఎదురుగా పెట్టుబడి కాక యంత్రం కనిపిస్తుంది గనుక యూరప్‌లో యంత్ర విధ్వంస కార్యక్రమం కూడా పెద్ద ఎత్తున సాగింది. యూరోపియన్ కాల్పనికవాద సాహిత్యమంతా వీటి ప్రతిఫలనాలు మనం చూడవచ్చు.

1966లో చైనాలో వచ్చిన శ్రామిక వర్గ సాంస్కృతిక విప్లవం విప్లవ రాజకీయాల్లో విగ్రహ విధ్వంసనను ప్రవేశపెట్టింది. కన్‌ఫ్యూషియస్ మొదలు షేక్స్పియర్ వరకు సాంస్కృతిక విప్లవం భావించిన బూర్జువా భావజాలాన్నంతా నిషేధించారు. అయితే విచిత్రంగా మావోసూక్తులు (రెడ్ బుక్) తప్ప మరేమీ చదువొద్దని, పుస్తకాల పురుగులయితే మూర్ఖులవుతారని, చైర్మన్ మావో బొమ్మలు తప్ప మరేమీ పెట్టవద్దని స్వయంగా వైస్ చైర్మన్ లిన్ పియావో ప్రచారం చేసి మావోయే మందలించవలసినంతగా మావోకల్ట్‌ను ప్రోత్సహించాడు. శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవంలో ఇది వామపక్ష పిడివాదం (లెఫ్ట్ సెక్టేరియనిజం)కు దారి తీస్తుందని చైనా కమ్యూనిస్టు పార్టీ పదవ కాంగ్రెస్ తీర్మానించవలసి వచ్చింది.

ఈ ప్రభావంతోనే ప్రారంభమైన నక్సల్బరీ పోరాటంలో కూడా ఈ రెండు ధోరణులు చూడవచ్చు. ఒకవైపు చైనా చైర్మన్ మన చైర్మన్ అంటూనే మరొకవైపు గాంధీ, రవీంద్రుడు, రామమోహనరాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్‌ల విగ్రహాలు పగలగొట్టడం జరిగింది.

అసంకల్పితంగానే కావచ్చు. దిగంబర కవుల్లో ఈ విగ్రహ విధ్వంస భావాలు బలంగా కనిపిస్తాయి. చెరబండరాజు 'ఈ దేశం మరోసారి మోసపోకూడదు' 'జగద్గురువులు వస్తున్నారు జాగ్రత్త' వంటి దిక్‌లలో మొత్తం గతాన్ని నిరాకరించే దిగంబర కవుల ధోరణి ఈ యువతరాన్ని చాలా ప్రభావితం చేసింది.

ఈ విగ్రహ విధ్వంసం వల్ల ఒక మేలు ఏం జరిగిందంటే పునర్వికాస పిత (ఫాదర్ ఆఫ్ రినైజాన్స్)గా భావించబడుతున్న రాజారామ్‌మోహన్‌రాయ్ సతీసహగమనం ఇంగ్లిషు వారి సహకారంతో మాన్పించిన సంఘసంస్కర్త కావచ్చు కానీ ఆయన నీలిమందు తోటల్లో కార్మికులను వేధించిన జమీందారు, బ్రిటిష్ అనుకూల బుద్ధిజీవి అని కూడ నక్సల్బరీతరం చరిత్రకారుడైన సుమంతా బెనర్జీ రాసాడు. జాతి పునర్వికాసానికి ఆద్యుడు జ్యోతి బాపూలే అవుతాడుగానీ రాజారాంమోహన్‌రాయ్ ఎట్లా అవుతాడనే చర్చ సబల్టరన్ చరిత్రకారులతో ప్రారంభమై, ఇప్పుడయితే బహుళ జనాదరణను పొందింది.

అట్లే విద్యా సంస్కరణల విషయంలో ఈశ్వరచంద్ర విద్యాసాగర్ ఏమొచ్చె, గిజుభాయి వంటివాళ్లు లేరా అనే చర్చ మొదలయింది. రాను రాను గాంధీ కస్తూర్బాల స్థానం కనీసం సామాజిక మార్పు చర్చల్లో జ్యోతిబాపూలే, సావిత్రీ బాపూలేల వైపు మారుతున్నది. ఇంక గాంధీకన్నా బాబా సాహెబ్ అంబేద్కర్ ఎక్కువ ప్రజాదరణ పొందడం, దేశంలో గాంధీ విగ్రహాలకన్నా అంబేద్కర్ విగ్రహాల స్థాపన ఎక్కువ జరగడం చూస్తూనే ఉన్నాం. పంజాబ్ వంటి చోట్ల, భగత్‌సింగ్ గాంధీజీ కన్నా ఎంతో ఎక్కువగా ఆమోదింపబడిన మార్పు కూడా వచ్చింది.

చారు మజుందార్‌తో పాటు సిపిఐఎంఎల్ స్థాపకుల్లో ఒకడైన సరోజ్‌దత్త తాను సంపాదకత్వం వహించిన దేశబ్రతి (బెంగాలీ) లిబరేషన్ (ఇంగ్లిషు) పత్రికల్లో గాంధీ, సుభాష్‌చంద్రబోస్, వంటి వారిపై తీవ్రమైన విమర్శలు చేసాడు. ఆ రచనలను ఆ రోజుల్లోనే (70-72) తెలుగులోకి ఆలూరి భుజంగరావుగారు అనువదించారు. అవి బహుళ ప్రచారాన్ని పొందాయి. అట్లే హన్సరాజ్ రహబర్ (నక్సల్బరీ తొలితరం రచయిత) గాంధీ బేనఖాబ్, గాలిబ్ బేనఖాబ్, నెహ్రూ బేనఖాబ్ అని రాసిన పుస్తకాలు హిందీ, ఉర్దూ భాషల్లో సంచలనాలు సృష్టించాయి.

ఎవరి విషయం ఎట్లా ఉన్నా రవీంద్రుని గురించి, గాలిబ్ గురించి అట్లా రాయడం నాకు కూడా సున్నితమైన బాధ కలిగించింది. కాని రవీంద్రుని గురించి ఆ విమర్శనాత్మక ధోరణి లేకపోతే బెంగాలీ సాహిత్యంలో సమర్‌సేన్ (తర్వాతకాలంలో ఫ్రాంటియర్ పత్రిక సంస్థాపక సంపాదకుడు) నాయకత్వంలో భూకీ పీడీ కవులు వచ్చి ఉండేవారు కాదు. విశ్వనాథ, కృష్ణశాస్త్రి ప్రభావాల నుంచి శ్రీశ్రీతో పాటు తెలుగు సాహిత్యం బయట పడినట్లుగా రవీంద్రుని నుంచి బెంగాలీ సాహిత్యం బయటపడి ఉండేది కాదు.

మళ్లీ గాలిబ్, రవీంద్రుని వంటి వాళ్ల పునర్మూల్యాంకనం, అట్లే సామ్రాజ్యవాద ప్రపంచీకరణ అభివృద్ధి నమూనా సందర్భంగా స్వావలంబన అభివృద్ధి నమూనా సందర్భంగా గాంధీ, లోహియాల ఆలోచనలు, చర్చలు ఇవాళ జరుగుతున్నాయి. సామ్రాజ్యవాద ప్రపంచీకరణను వ్యతిరేకించే రాజకీయ శక్తుల్లో ఇవ్వాళ మావోయిస్టులు, విప్లవ శక్తులతో పాటు మనం గాంధీ, లోహియా, సర్వోదయ, పర్యావరణవాదులను కూడా చూస్తున్నాం. గడ్డి వేళ్ల స్థాయిలో పని చేస్తున్న దళిత, ఆదివాసీ, ముస్లిం మైనారిటీ ఉద్యమాలను చూస్తున్నాం. ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ప్రజాస్వామికంగా మిలిటెంట్‌గా జరగాలనడంలో భావం ఇదే. అందుకే అమెరికాలో నీగ్రోల మిలియన్ మార్చ్, చైనాలో మావో నాయకత్వంలోని 'లాంగ్ మార్చ్' (ఇది స్పష్టంగా వర్గపోరాటంలో భాగంగా సుదీర్ఘకాలం జరిగి విప్లవ విజయానికి దోహదం చేసిన ఒక అపూర్వ ప్రయోగం. మిలియన్ మార్చ్‌ను దానితో పోల్చడం లేదుగానీ మిలియన్ మార్చ్ సందర్భంగా కొందరయినా చైతన్యం కలిగిన, చరిత్ర తెలిసిన కార్యకర్తలు లాంగ్‌మార్చ్‌ను, దండి ఉప్పు సత్యాగ్రహాన్ని ఉద్యమకారులను ఉత్తేజపరచడానికి గుర్తుచేసారు.), గాంధీజీ దండియాత్ర 'మిలియన్ మార్చ్'కు ఒక సుదూరమయిన ఆదర్శాలు.

ఎమర్జెన్సీ దాక కూడ తెలుగు నేల మీద అక్కడక్కడ గాంధీ విగ్రహాల విధ్వంసం జరిగింది. (ఎమర్జెన్సీలో ఒక విప్లవ జంట బెజవాడలో గాంధీ విగ్రహాన్ని కూల్చి ఏలూరు కాలువలో పడేసి అరెస్టయింది) ముఖ్యంగా కాగజ్‌నగర్‌లో ఒక వేకువ గాంధీ విగ్రహాన్ని విధ్వంసం చేసిన కేసులో అక్కడ ప్రభుత్వ పాఠశాలలో ఉపాధ్యాయులుగా పనిచేస్తున్న వేణుగోపాల్, (తర్వాత కాలంలో సుప్రసిద్ధ హిందీ కవి) తేజ్ రాజేందర్ సింగ్‌లను, వారి శిష్యుడయిన తుషార్‌కాంత్ భట్టాచార్యను ముద్దాయిలను చేసి విచారించారు. తుషార్‌కాంత్ భట్టాచార్య మావోయిస్ట్ నాయకుడుగా మారాడు. విప్లవ సాహిత్యానికి జరిగిన మేలు ఏమిటంటే వేణుగోపాల్, తేజ్

రాజేందర్‌సింగ్‌లు (ఈ ఇద్దరిదీ పురానా షహర్) ఎం.టి.ఖాన్‌తో కలిసి 'అంటార్కిటికా' అనే పేరుతో విప్లవ కవితల గోడపత్రికను వెలువరించారు. దిగంబర కవులు (65-68) మార్చ్-ఝుంఝుల (70) మధ్యకాలంలో విరసం ఏర్పడడానికి ముందుగా ఒక కర్టెన్ రైజర్‌గా వచ్చిన సంచలన కవితా పత్రం ఇది.

ఎమర్జెన్సీలో ఇందిరాగాంధీని వ్యతిరేకించిన ప్రతి ఒక్కరూ జైలు పాలుకావడం వల్లనో, గాంధేయులైన జయప్రకాశ్ నారాయణ్ నాయకత్వంలోని వాళ్లు కూడా నక్సలైట్లతో పాటు జైలు పాలయినందునో, అట్లే లోహియావాదులంతా జైలు పాలయినందునో కానీ ఎమర్జెన్సీ తర్వాత విస్తృతమైన ప్రజాస్వామిక అవగాహనతో గాంధీ విగ్రహ విధ్వంస కార్యక్రమం మరుగునపడి ఇందిరా నియంతృత్వానికి వ్యతిరేకంగా కలిసి పనిచేసే పరిమిత ప్రాతిపదిక ఏర్పడింది సైద్ధాంతికమైన పోరాటం చేస్తూనే. ఇటువంటిదే ఈ రోజు కూడా చూస్తున్నాం.

- - -

విగ్రహాలు కూలగొట్టడానికి, ధ్వంసం చేయడానికి, లేదా ఏదో రూపంతో అవమాన పరచడానికి వచ్చే ప్రతిక్రియలో మరో సున్నితమైన పార్శ్వం కూడా ఉందని ఒప్పుకోకపోతే ఇది వాదన కొరకు వాదనే అవుతుంది. కె. శ్రీనివాస్ రాసినట్లు విగ్రహాలు కూలిన రాత్రి ట్యాంక్‌బండ్ మీద వీచిన గాలిలో ఏదో సన్నని వేదన కూడా ఉంది. విగ్రహం చుట్టూ ఒక భావజాలం, ఒక సెంటిమెంటు, కొన్ని విలువలు, స్ఫూర్తి లేకపోతే కనీసం జన బాహుళ్యానికి, భావుకులకు లేకపోతే ఈ విగ్రహాలు కూలగొట్టయినా మావాళ్ల విగ్రహాలు పెట్టుకుంటామనే సవాళ్లు రావు. అల్లూరి సీతారామరాజుకు కొమురంభీంను పోటీగా నిలబెట్టడం జరగదు. కొమురంభీం విగ్రహం పెట్టాలనే డిమాండు ఒక ఉద్యమమై ఇప్పటికీ ఆదిలాబాద్ మొదలు పాలమూరు వరకు అది ఆచరణ రూపాన్ని పొందదు.

ఏ విగ్రహ విశ్వాసం లేని ఇస్లాం మతంలోనే కాశ్మీర్‌లో హజ్రత్ బాల్ అదృశ్యమైందని (మహమ్మదు ప్రవక్త కేశాలు) దేశ వ్యాప్తమైన ఉద్రిక్త ఉద్యమానికి దారి తీసింది. అట్లే బుద్ధుని దంతాల గురించి. త్యాగరాజు సీతారాముల విగ్రహాలను ఆయన అన్నయ్య కావేరీలో పారేసిన కథ ఎట్లా ఉన్నా 1949లో బాబ్రీ మసీదులో బాలరాముని విగ్రహాలే ఇవ్వాళ హిందుత్వ ఉగ్రవాద నిర్మాణానికి, విధ్వంసానికి నాయకత్వం వహిస్తున్నాయి.

ఇవన్నీ ఒక ఎత్తు. ఒక ఆత్మగౌరవం, ఒక స్వాభిమానం విగ్రహంలో చూసుకోవడం ఒక ఎత్తు. అది బాబాసాహెబ్ అంబేద్కర్ విగ్రహం. ఎక్కడ ఆ విగ్రహానికి చిన్న అవమానం జరిగినా ఎంత భావోద్రిక్తతతో సమాజం స్పందిస్తుందో ఎన్నో సందర్భాల్లో చూసాం. ఒక చరిత్రకు, ఉద్యమానికి కారణమైన బొంబాయిలోని ఘట్‌కోపర్‌లో రమాబాయినగర్‌లో అంబేద్కర్ విగ్రహానికి ఎవరో అసాంఘిక శక్తులు చెప్పులదండ వేస్తే దాని ప్రకంపనాలను ఇప్పటికీ చూస్తున్నాం. 1997లో ఈ దుశ్చర్య జరిగితే దేశవ్యాప్తమైన నిరసన వచ్చింది. రమాబాయి నగర్‌లో నిరసనకారులపై పోలీసు కాల్పులు జరిగి పదకొండు మంది చనిపోయారు, గాయపడినవారిని పోలీసులు పట్టించుకోలేదు లేదా అమానుషంగా లాక్కుపోయి వ్యాన్‌లలో పడేసి ఆసుపత్రిలో తోసేసారు. ఆ దృశ్యాన్ని చూసి ప్రజా కళాకారుడు విలాస్ గోగ్రే ఉరిబెట్టుకొని చనిపోయాడు. విద్రోహి అనే ఒక సాహిత్య, సాంస్కృతిక సంస్థ ఏర్పడింది. ఖైర్లాంజీ సంఘటన తర్వాత అది రిపబ్లిక్ పాంథర్స్‌గా మారింది. అప్పటి నుంచి ఇప్పటి వరకు దళిత, ముస్లిం శక్తుల ఐక్యతకు ఒక బలమైన సంఘటితశక్తి అయింది. విలాస్ గోగ్రే ఆత్మహత్యతో విచలితుడయి 'విద్రోహి'ని స్థాపించిన సుధీర్‌ధావ్లే ఇప్పుడు మహారాష్ట్రలో రిపబ్లిక్ పాంథర్స్ నాయకుడుగా నాగపూర్ జైల్లో రాజద్రోహంతో సహా ఎన్నో కేసులు ఎదుర్కొంటున్నాడు.

ముఖ్యంగా దళిత అస్తిత్వ ఉద్యమానికి అంబేద్కర్ విగ్రహమేకాదు, ఆయన అధ్యక్షుడుగా రచింపబడిన 'రాజ్యాంగం' కూడ ఒక 'పవిత్ర' గ్రంథంగా కనిపించడాన్ని బట్టి చూస్తే మనుషుల కదలికలకు ప్రేరణలయిన కొన్ని ప్రతీకలు, సంకేతాలు ఉంటాయి - అని, అవి హేతువుకు, తర్కానికి లొంగేవి కావని, అవి భావోద్వేగానికి సంబంధించిన అంశాలని అంగీకరించాల్సి ఉంటుంది.

బ్రాహ్మణ, క్షత్రియ దేవుళ్లకేగానీ, శూద్ర, దళిత దేవుళ్లకు విగ్రహాలు లేవు. సమ్మక్క, సారలమ్మవి గద్దెలే. కట్ట మైసమ్మ, పోచమ్మ, ఎల్లమ్మ వంటి దేవతలకు స్పష్టమైన రూపాలు లేవు. కాన్ని బ్రాహ్మణీయ సంస్కృతి అనుకరణలో అందరికీ విగ్రహారాధన ఒక అస్తిత్వ చిహ్నమైంది. ఇప్పుడు విగ్రహాలు కూలుస్తున్న వాళ్లంతా విగ్రహారాధకులే.

విగ్రహాలు కూలగొట్టడంలోనూ ఈ భావోద్వేగాలు పనిచేసాయి. విగ్రహాల ఆధారంగా జాతి వైతాళికుల చర్చ చేయడంలోనూ ఈ భావోద్వేగాలు పని చేస్తున్నాయి. భావోద్వేగాలు లేకుండా కేవలం స్వార్థ ప్రయోజనంతోనే భావోద్వేగాలను రెచ్చగొట్టే సంస్కృతీ చర్చను కూడ చూస్తూనే ఉన్నాం.

రష్యాలో సోషల్ సామ్రాజ్యవాదం మీద వ్యతిరేకత సుత్తీకొడవలి జెండాను, మార్క్స్, లెనిన్ విగ్రహాలను కూల్చడంగా అంటే కమ్యూనిస్టు పార్టీ అని చెప్పుకుంటున్న పాలకవర్గం మీది వ్యతిరేకత కమ్యూనిజం మీద వ్యతిరేకతగా బయటపడింది. దళారీ పాలకుల మీద వ్యతిరేకత ఆంధ్ర అనే మాట, ప్రాంతం మీద వ్యతిరేకతగా బయటపడడం పాలకులు కూడా కోరుకునే 'అసమ్మతి' ఆమోదాన్నే కాదు, అసమ్మతిని కూడా ఉత్పత్తి చేయడం ఇవ్వాళ సామ్రాజ్యవాద ప్రపంచీకరణ తాజా ఆయుధం.

ఇది ఒక సందర్భంగా శ్రామిక సంస్కృతిని, ప్రజా సంస్కృతిని, పోరాట సంస్కృతిని గౌరవించే ఒక చర్చ వైషమ్యాలకు, విద్వేషాలకు, సంకుచితత్వాలకు ఏమాత్రం తావు లేకుండా నిర్వహించవలసిన బాధ్యత కూడా ప్రజా ఉద్యమాల మీద ఉన్నది. అందుకు వివేకం కలవారికి విమర్శకన్నా స్వవిమర్శ చాలా అవసరం. చరిత్రగతిని విస్మరించకుండా ఎంత మూలాలకు వెళ్లయినా నిష్కర్షగా మాట్లాడుకోవచ్చు.

వ్యాసం

# తెలంగాణ డిమాండ్ ప్రజలదే కాని....

- సి. కాశీం

1969లో మొదటిసారి ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం కోసం ప్రజలందరు అద్భుతమైన మిలిటెంట్ పోరాటాన్ని నడిపారు. తొమ్మిది నెలలు భూమి ఆకాశాన్ని ఏకం చేశారు. తెలంగాణలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ కార్యకలాపాలను జరగకుండా చేశారు. రావిశాస్త్రి మాటల్లో చెప్పాలంటే పోలీసుల చేత ప్రభుత్వాన్ని నడిపారు. కాని కాసు బ్రహ్మానందరెడ్డి రక్తదాహానికి 370 మంది విద్యార్థి, యువజనులు బలయ్యారు. ఉవ్వెత్తున ఎగిసిన ఉద్యమం నిర్బంధం వలన ఆగిపోయింది. కాని చెన్నారెడ్డి లాంటి రాజకీయ నాయకులకు అవకాశాలను మాత్రం కల్పించింది. అంతే కాకుండా నక్సల్బరీ, శ్రీకాకుళం పోరాటాల ప్రభావంతో తెలంగాణలో విప్లవోద్యమానికి విత్తనాలను చల్లింది. ఇవాల్టి మావోయిస్టు పార్టీకి మెరికల్లాంటి నాయకత్వాన్ని అందించింది.

ఈ ఉద్యమం జరుగుతున్న సమయంలో అప్పుడప్పుడే తెలుగు నేలలో పురుడు పోసుకుంటున్న సిపిఐ(ఎంఎల్) పార్టీలో తెలంగాణపై తీవ్రమైన చర్చ జరిగింది. ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి మద్దతు ఇవ్వాలని కొందరు, ఇవ్వకూడదని మరికొందరు వాదించారు. ఇక రివిజనిస్టులుగా ఉన్న సిపిఐ, సిపిఎం పార్టీలు "ఇది బూర్జువ, భూస్వామ్య వర్గాలు కొనసాగిస్తున్న ఉద్యమం, మార్క్సిజం ఒక జాతి సమైక్యతను బలపరుస్తుంది కాని విచ్ఛిన్నతను బలపర్చదు. అలా బలపర్చడం మార్క్సిజానికి వ్యతిరేకం కనుక ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి మద్దతు ఇవ్వరాదని" నిర్ణయించాయి. సిపిఐ(ఎంఎల్)లోని ఒక వర్గం దాదాపు సిపిఐ, సిపిఎం పార్టీల ఆలోచననే బలపర్చుతూ 'ప్రత్యేక రాష్ట్ర ఉద్యమాలు దేశంలో నడుస్తున్న వ్యవసాయ విప్లవాన్ని పక్కదారి పట్టిస్తాయి'. కాబట్టి ఈ ఉద్యమాన్ని వ్యతిరేకించాలనే నిర్ణయానికి వచ్చారు. సిపిఐ(ఎంఎల్)లోని చారుమజుందార్ ఆలోచనాపరులే ప్రత్యేక తెలంగాణ ఉద్యమాన్ని బలపర్చారు. దానికోసం కె.జి.సత్యమూర్తి, కొండపల్లి సీతారామయ్య, అట్లూరి రంగారావు, రాంనర్సయ్య లాంటి వాళ్ళు శ్రీకాకుళ సంఘీభావ కమిటీ తరపున తెలంగాణకు మద్దతుగా కరపత్రం వేశారు. మిగతా మార్క్సిస్టు, లెనినిస్టు పార్టీలు తెలంగాణ ఉద్యమాన్ని వ్యతిరేకించాయి. ఈ ఉద్యమాన్ని వర్గపోరాటానికి నష్టం చేసేదిగా భావించాయి.

ఇక 1996లో ప్రారంభమైన మలిదశ ప్రత్యేక తెలంగాణ ఉద్యమాన్ని వరంగల్ డిక్లరేషన్ ద్వారా ముందుకు నడిపిన చరిత్ర పీపుల్స్‌వార్ పార్టీది. ఈ క్రమంలోనే జనశక్తి పార్టీ కూడా తెలంగాణ ఉద్యమానికి మద్దతు ఇచ్చింది. ప్రజాపంథా పార్టీ పాత అవగాహననే(1969) కొనసాగిస్తూ చాలారోజుల తర్వాత 2009లో తెలంగాణ కోసం పనిచేయాలని నిర్ణయించుకున్నది. సిపిఐ పార్టీ 1969 నాటి అవగాహనను మార్చుకొని 2011లో ప్రత్యక్ష కార్యాచరణకు దిగింది. సిపిఎం మాత్రం 1969 నాటి అవగాహననే కొనసాగిస్తూ భాషా ప్రయుక్త రాష్ట్రాల సిద్ధాంతాన్ని వల్లిస్తున్నది.

ఈ చరిత్ర ఇలా ఉండగా ఇటీవల విప్లవ శిబిరంలో "ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర డిమాండ్" బూర్జువా డిమాండే అని ఒక సైద్ధాంతిక చర్చ మొదలైంది. దీనిని అర్థం చేసుకోవడానికి తాత్విక స్థాయిలోకి వెళ్లి ఆలోచిస్తే... 'బూర్జువా' అనే శబ్దం 'బర్గ్' అను జర్మన్ శబ్దం నుంచి పుట్టింది. బర్గ్ అంటే కోట అని అర్థం. లేదా పట్టణం అని అంటారు. మధ్య యుగాలలో 'బర్గర్లు' లేదా బర్గెస్‌లు పట్టణాలలో వ్యాపారం చేస్తూ గాని, వృత్తి యజమానులుగా ఉంటూగానీ ధనం సంపాదించేవారు. వీళ్ళు తమ వ్యాపార అభివృద్ధికి నిత్యం ఫ్యూడల్స్‌తో పోరాడుతూ ఉండేవారు. ఇక ఆధునిక యుగంలో పారిశ్రామిక పెట్టుబడిదారులే నాటి బర్గర్లు. ఈ పెట్టుబడిదారులే బాగా అభివృద్ధి చెందిన దేశాలలో సొంత ఆస్తులు కలిగిన ఇతర వర్గాలను తమ పెత్తనం కిందికి తెచ్చుకున్నారు. కనుకనే నేడు పెట్టుబడిదారీ దేశాలలో పాలకవర్గాల వారిని 'బూర్జువా వర్గం' అని పిలుస్తున్నారు. కాని కమ్యూనిస్టు పార్టీ ప్రణాళికలో మాత్రం ఫ్యాక్టరీ యజమానుల్ని, వీరి ఉపాంగాలుగా ఉండే వారిని మాత్రమే 'బూర్జువా వర్గం' అని నిర్వచించారు.

పరిశ్రమలు, వాణిజ్య సంస్థలు, భూములు ఇతర ఉత్పత్తి సాధనాల యజమానులుగా కార్మికుల శ్రమ శక్తిని దోపిడిచేసి లాభాలను ఆర్జించే వర్గమే 'బూర్జువా వర్గం' అని ఇంకో రకమైన విశ్లేషణ ఉంది. మార్క్సిస్టులు పెట్టుబడిదారులను ఉద్దేశించి ఉపయోగించే పదమే 'బూర్జువా వర్గం'. కార్మికవర్గాన్ని వ్యతిరేకించే శక్తులందరినీ కమ్యూనిస్టులు పెట్టుబడిదారులని, బూర్జువాలనీ వ్యవహరిస్తారని ప్రముఖ జర్నలిస్టు కట్టా శేఖర్‌రెడ్డి చెప్పారు. 'బూర్జువా వర్గం' అంటే ఎవరనే ఈ అవగాహనతో ప్రత్యేక తెలంగాణ ఉద్యమం బూర్జువా ఉద్యమమా? కాదా? అనే మీమాంసను నివృత్తి చేసుకోవచ్చు. ఒక్క తెలంగాణ ఉద్యమమే కాదు, ప్రపంచ వ్యాపితంగా జరుగుతున్న ప్రాంతీయ, జాతుల ఉద్యమాలను అర్థం చేసుకోవడానికి ఈ అవగాహన పనికొస్తుంది.

ఈ అవగాహనను విస్తృతం చేసుకోవడానికి కామ్రేడ్ లెనిన్ చెప్పిన మాటలను గుర్తుచేసుకోవడం అవసరం. "పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందుతూ ఉన్న పరిస్థితులలో జాతుల సమస్యపై జరిగే పోరాటం బూర్జువా వర్గాల మధ్య జరిగే పోరాటమే. కొన్ని సందర్భాలలో జాతుల ఉద్యమంలోకి కార్మిక వర్గాన్ని కూడా బూర్జువా వర్గం ఆకర్షించగల్గుతుంది. అలాంటప్పుడు పైకి జాతి మొత్తం యొక్క పోరాటంగా అది వ్యక్తమవుతుంది. కాని వాస్తవానికి అది బయటికి కనిపించే లక్షణం మాత్రమే. సారాంశంలో అది ఎప్పుడూ బూర్జువా పోరాటమే. ప్రధానంగా బూర్జువాజీ

ప్రయోజనాల కొరకు జరిగే పోరాటమే" ఆధిపత్య జాతి వలన అణగదొక్కబడుతున్న జాతిలోని బూర్జువాజీకి ఎంత నష్టం జరుగుతుందో, కార్మిక వర్గానికి కూడా అంతే నష్టం జరుగుతుంది. కనుక జాతుల, ప్రాంతీయ ఉద్యమాలలో కార్మికవర్గం తప్పనిసరి పాల్గొనాలని కూడా లెనిన్ చెప్పాడు. ఇట్లాంటి పోరాటాలన్నీ కూడా సామ్రాజ్యవాదాన్ని బలహీన పర్చేవి కావడం వలన కూడా కార్మికవర్గం ఆ పోరాటాలలో అగ్రభాగాన ఉండాలని కూడా ఆయన భావించాడు.

ఈ వెలుగులో ప్రత్యేక తెలంగాణ ఉద్యమాన్ని పరిశీలిస్తే సారాంశంలో ఇది బూర్జువా ప్రజాస్వామిక డిమాండే. వ్యవస్థలో సమూల మార్పు జరగకుండా, దోపిడి వర్గాలకు ఉపయోగపడే రాజ్యాంగం మారకుండా, ప్రస్తుతమున్న రాజ్యాంగ చట్రంలోనే ప్రత్యేక రాష్ట్రం ఏర్పడుతుంది. ఉత్పత్తి సంబంధాలలో కూడా మార్పు జరుగదు. కనుక పాత ఉత్పత్తి సంబంధాలలో మార్పు జరగడానికి ఉపయోగపడని ఏ ఉద్యమమైనా బూర్జువా ప్రజాస్వామిక ఉద్యమమే. తెలంగాణ రాష్ట్రం ఏర్పడాలంటే ఆర్టికల్ మూడు ప్రకారం పార్లమెంట్‌లో బిల్లు పెట్టి ఆమోదిస్తే సరిపోతుంది. కొత్త రాష్ట్రం ఏర్పడుతుంది. ప్రజలకేమీ అధికారం రాదు. ఉద్యమానికి నాయకత్వం వహించిన బూర్జువా శక్తులే కొత్త రాష్ట్రంలో అధికారంలోకి వస్తాయి. కాకపోతే రాష్ట్రం ఏర్పడటం వలన నీళ్లు, నిధులు, నియామకాలలో ప్రజల భాగస్వామ్యం కూడా కొంత పెరుగుతుంది. కనుకనే కార్మికవర్గం ప్రయోజనాలు కూడా ఈ విధంగా నెరవేరుతాయి. అంతిమంగా ప్రజలు విముక్తి చెందాలంటే విప్లవమే మార్గమవుతుంది.

ఇన్ని పరిమితులున్నప్పటికీ తెలంగాణ ఉద్యమంలో ఎన్నడూ లేనంతగా ప్రజల భాగస్వామ్యం విపరీతంగా పెరిగింది. ఏక వ్యక్తి నాయకత్వం లేని స్థితి కన్పిస్తున్నది. విప్లవ శక్తులు, వ్యక్తుల భాగస్వామ్యం కూడా గణనీయంగా ఉంది. ప్రజలు స్వచ్ఛందంగా ఉద్యమంలో కదులుతున్నారు. కాకపోతే కార్మికవర్గం నాయకత్వం వహించే స్థితి లేదు. అనివార్యంగా మళ్ళీ బూర్జువావర్గమే నాయకత్వం వహిస్తున్నది. కొన్ని సందర్భాలలో పెటీ బూర్జువా వర్గం(విద్యార్థులు, మధ్యతరగతి, ఉద్యోగులు) చేతుల్లో కూడా నాయకత్వం ఉంటుంది. ఇందులో అధికంగా బూర్జువా వర్గం ప్రయోజనాలు ఉండటం వలన ఉద్యమాన్ని తమ స్వంతం చేసుకోవడానికి ఆ వర్గాలు ప్రయత్నిస్తున్నాయి. కోస్తాంధ్ర కార్మికవర్గం, మెజారిటీ ప్రజలు సమైక్య రాష్ట్ర నినాదానికి దూరంగా ఉన్నారు. కాని తెలంగాణలోని అన్ని వర్గాల, కులాల, మతాల ప్రజలు తెలంగాణ ఉద్యమంలో ఏదో రూపంలో మమేకమవుతున్నారు. అయితే సారాంశంలో బలమైన కోస్తాంధ్ర బూర్జువావర్గానికి బలహీనమైన తెలంగాణ బూర్జువావర్గానికి మధ్య పోరాటంగానే తెలంగాణ ఉద్యమం ఉంది. లగడపాటి, రాయపాటి, కావూరి, జీవికె, జీఎంఆర్, సుబ్బిరామిరెడ్డి, రామోజీ మొదలైన తిమింగలాల వంటి కోస్తాంధ్ర బూర్జువా వర్గంతో తెలంగాణ బూర్జువా వర్గం గత 50 ఏళ్ల నుంచి పోటీ పడలేకపోతున్నది. కనుక ప్రత్యేక తెలంగాణ అనే ప్రజల ఆకాంక్షను వాడుకొని తెలంగాణలో అధికారం సంపాదించి తమ వర్గ ప్రయోజనాలను కాపాడటం కోసం తెలంగాణ ఉద్యమంలో పాల్గొంటున్నారు.

తెలంగాణ ప్రజల మౌలిక సమస్యలు మాత్రం ప్రజాస్వామిక తెలంగాణలోనే పరిష్కారమవుతాయి. కార్మిక వర్గ నాయకత్వంలో విప్లవకర వర్గాలైన రైతాంగం, పెటీబూర్జువా, జాతీయ బూర్జువాలను ఏకం చేసి పోరాడటం ద్వారానే ఇది సాధ్యమవుతుంది. ప్రజల సంపద, భూమి, ఫ్యాక్టరీలు, సహజ వనరులు, పెట్టుబడిని ప్రజలు స్వాధీనం చేసుకోవడం ద్వారానే తెలంగాణ ప్రజల జీవితాలలో మార్పు వస్తుంది. ఇట్లాంటి వ్యవస్థాగత మార్పుల కోసం జరిగే పోరాటం కార్మికవర్గం నాయకత్వంలో నడుస్తుంది. కనుక దీనిని బూర్జువా ఉద్యమం అని ఎట్టి పరిస్థితులలో అనలేము. కాని పైన చెప్పిన వ్యవస్థా గత మార్పులేవి జరగకుండా కేవలం భౌగోళిక తెలంగాణ కోసం జరుగుతున్న ప్రస్తుత పోరాటం సైద్ధాంతికంగా బూర్జువా ప్రజాస్వామిక ఉద్యమమే. కాని తెలంగాణ రాష్ట్రం కావాలనే డిమాండ్ మాత్రం ప్రజలదే.

1996 తర్వాత ప్రత్యేక తెలంగాణ ఉద్యమం మొదట్లో కార్మిక వర్గ స్వభావం కలిగిన వ్యక్తులు, శక్తులతో మొదలైంది. తెలంగాణ జనసభ, తెలంగాణ స్టూడెంట్స్ ఫ్రంట్(టిఎస్ఎఫ్) ఈ స్వభావంతోనే పనిచేసాయి. కాని విప్లవకర వర్గాలను, కార్మికులను కూడగట్టటంలో చాలా పరిమితులు ఏర్పడ్డాయి. మొత్తం తెలంగాణ ఉద్యమానికి నాయకత్వం వహించే అవకాశాన్ని పాలకవర్గాలు ఈ సంస్థలకు ఇవ్వలేదు. తీవ్ర నిర్బంధం ప్రయోగించి అణచివేసాయి. సరిగ్గా ఈ సమయంలోనే (2001) తెలంగాణ బూర్జువా వర్గాల ప్రయోజనాలను నెరవేర్చే తెలంగాణ రాష్ట్రసమితి(టిఆర్ఎస్) ఏర్పడింది. ఇక తెలంగాణ ఉద్యమం దాదాపు ఈ శక్తుల చేతుల్లోకి వెళ్లింది. మధ్యలో(2009) పెటీ బూర్జువా శక్తులైన ఉద్యోగులు, విద్యార్థులు ఈ ఉద్యమంలో కదిలారు. కాని వీరి చేతుల్లోకి కూడా నాయకత్వం రాలేదు. ఇవాళ(2011)తెలంగాణ ఉద్యమం గ్రామాలలోకి చేరిన మాట వాస్తవం. ప్రజలలో తెలంగాణ కావాలనే ఆకాంక్ష బలంగా ఉంది. కాని ఈ ప్రజలు నిర్మాణాలలో లేరు. కార్మికవర్గం నాయకత్వం వహించకపోవటం వలన ఉద్యమం నిర్మాణ రాహిత్యంగా జరుగుతున్నది. ఇట్లాంటి వినిర్మాణ లక్షణమే ఉద్యమ స్వభావానికి అద్దం పడుతుంది.

ఫ్యూడలిజం నిర్మూలించబడి పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందే క్రమంలో పెట్టుబడిదారులే ప్రజలను సమైక్యం చేస్తారు. తమ మార్కెట్ అవసరం కోసం ప్రజలలో జాతీయ భావాన్ని పెంపొందింప చేస్తారు. ఈ వరసలోనే జాతుల, ప్రాంతీయ ఉద్యమాలు వస్తాయి. వీటికి బూర్జువా వర్గం నాయకత్వం వహిస్తుందని ఇప్పటివరకు ఉన్న సైద్ధాంతిక అవగాహన. కాని ఫ్యూడలిజం పూర్తిగా నాశనం కాని, పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందని అర్ధవలస, అర్ధ భూస్వామ్య స్వభావం కలిగిన మన దేశంలో జరిగే జాతుల, ప్రాంతీయ ఉద్యమాలన్నీ బూర్జువా ఉద్యమాలని, వాటి నాయకత్వం బూర్జువా నాయకత్వమని నిర్ధారణ చేయడంలో కొన్ని పరిమితులు, మినహాయింపులు ఉంటాయేమో ఆలోచించాలి. తెలంగాణ ఉద్యమం కూడా అలాంటిదే.

కమిటీకి లేఖ

(ముస్లింలు తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకు వ్యతిరేకమని శ్రీకృష్ణ కమిటీ వ్యాఖ్యానించిన నేపథ్యంలో)

# శ్రీకృష్ణ కమిటీకి ...

- వరంగల్ ముస్లిం ప్రతినిధులు

అనువాదం: ఎం.ఎ. బాసిత్

ప్రియమైన అయ్యా,

విషయం : - ఆంధ్రప్రదేశ్‌లో ముస్లింల సమస్యలు - తెలంగాణ రాష్ట్ర పునరుద్ధరణకై విజ్ఞప్తి సమర్పించడం - గురించి.

సందర్భం:- తేది: 15-02-2010 నాటి మీ పత్రికా ప్రకటన.

పై విషయ సందర్భాలననుసరించి తెలంగాణలోని వరంగల్ జిల్లాకు చెందిన ముస్లింలం మీ దయార్ద్ర పరిశీలనకు సమర్పించుకొను విన్నపం ఏమనగా :

1956లో ఆంధ్రలో బలవంతంగా కలుపుకున్న తెలంగాణ రాష్ట్రాన్ని పునరుద్ధరించుట ద్వారా ప్రత్యేక తెలంగాణ రాష్ట్రాన్ని ఏర్పాటు చేయడానికి కేంద్ర ప్రభుత్వానికి సిఫారసు చేయాలని జస్టిస్ శ్రీక్రిష్ణ కమిటీకి మా విజ్ఞప్తి.

ఎందుకంటె, తెలంగాణ ప్రజల అభీష్టానికి, ఫజల్ అలీ కమిషన్ చేసిన సిఫారసులకు భిన్నంగా ఆంధ్రప్రదేశ్‌లో తెలంగాణ విలీనం జరిగింది కాబట్టి. తెలంగాణ ప్రజలు తల్గొగ్గే విధంగానే "పెద్ద మనుషుల ఒప్పందం" రూపకల్పన చేయడం జరిగింది. కాబట్టే ఆ పెద్ద మనుషుల ఒప్పందపు ఏ ఒక్క అక్షరం గాని, దాని స్ఫూర్తిగాని ఆంధ్రపాలకులు ఏనాడు అమలు చేయలేదు. అట్లా ఎప్పుడైతే అమలు కాలేదో, ఆ విలీనం కూడ రద్దై యథాపూర్వ స్థితి పునరుద్ధరించబడాలి.

కాబట్టి తెలంగాణ ప్రజలు తెలంగాణ రాష్ట్ర పునరుద్ధరణను కోరుతున్నారు. అంతేగాని ఆంధ్రప్రదేశ్ నుండి ఏదో పనిగట్టుకొని విడిపోవాలని కాదు.

పైగా 1956 కు పూర్వం విడిగానే హైదరబాద్ రాష్ట్రాన్ని మేం కలిగి ఉన్న స్థితిలో ఆంధ్రరాష్ట్ర ప్రజలు 1, నవంబర్, 1956 న మాతో కలిసిపోయారు. అప్పటి నుండి వాళ్లు తెలంగాణను లూటీ చేస్తున్నారు. ఇప్పుడు మేం ఆంధ్రతో కలిసి జీవించాలని అనుకోవడం లేదు. దయచేసి "మా తెలంగాణ మాకు వాపసు ఇచ్చెయ్యండి".

తెలంగాణ ప్రజలకు జరిగిన తీవ్ర అన్యాయాలు:-

1. తెలంగాణ రాబడినంత లూటీ చేసిన ఆంధ్రులు:- ఈ కింది దత్తాంశం ద్వారా దీన్ని విశ్లేషించవచ్చు. ఈ వివరాలు స్వయంగా అప్పటి ఆర్థిక మంత్రి రోశయ్య గారు శాసన సభా వేదిక మీద 2007 మార్చిన బడ్జెట్ సమావేశాల సందర్భంగాగ, ఐదుగురు శాసనసభ్యులు ప్రాంతాల వారిగా రెవెన్యూ వివరాలు సమర్పించాలని అడిగినపుడు, ముందుంచినవి. ఆ వివరాల్ని పట్టిక - 3 లో (రాబడి), 4లో (ఖర్చు) చూడవచ్చును

క్రోడీకరించిన సమాచారాన్ని బట్టి స్పష్టమయ్యేదేంటంటే ఆంధ్ర, రాయలసీమ ప్రాంతాలలో ప్రణాళిక బద్ధంగానే ఖర్చు చేసిన మొత్తం ఆ ప్రాంతం నుంచి వసూలైన రాబడి కన్న ఎంతో ఎక్కువని, అంతే కాక ఆంధ్ర, రాయలసీమ ప్రాంతాల్లో వాళ్ల రాబడిని మించి ఖర్చు చేసిందంతా తెలంగాణ రాబడి నుంచి దోచి పెట్టిందేనని. అంటే ఆంధ్ర, రాయలసీమలో జరగుతున్న అభివృద్ధి అంతా తెలంగాణ సొమ్ముతో చేస్తున్నదేనని. ఇక్కడ, ఇంకొక విషయాన్ని గూడ గమనించాలి. హైదరాబాదు రాబడిని

పట్టిక - 3

ఎ. రాబడి

| క్రమ సంఖ్య | ప్రాంతం | సంవత్సరం వారీగా రాబడి (కోట్ల రూపాయలు) | | | |
|---|---|---|---|---|---|
| | | 2003-04 | 2004-05 | 2005-06 | 2006-07 (జనవరి, 07 నాటికి) |
| 1. | ఆంధ్ర | 2796 | 3494 | 3702 | 3690 |
| 2. | రాయలసీమ | 730 | 867 | 1004 | 987 |
| 3. | తెలంగాణ | 5565 | 4725 | 5935 | 6093 |
| 4. | రాజధాని (హైదరాబాద్) | 5095 | 8311 | 9708 | 9319 |
| | **మొత్తం** | 14186 | 17397 | 20349 | 20089 |
| | ఇతరాలు | 3220 | 3283 | 4055 | 4980 |
| | **పెద్ద మొత్తం** | 17406 | 20680 | 24404 | 25067 |

మూలం :- శాసన సభా ఆవాస విభాగం నెం. 7406 (నక్షత్రం గుర్తు కలగినవి), తొమ్మిదో ఆంధ్రప్రదేశ్ శాసన సభా సమావేశాల తాలూకు

పట్టిక - 4

## బి. ఖర్చు (వ్యయం)

| క్రమ సంఖ్య | ప్రాంతం | సంవత్సరం వారీగా ప్రణాళికా వ్యయం (కోట్ల రూపాయలు) | | | |
|---|---|---|---|---|---|
| | | 2003-04 | 2004-05 | 2005-06 | 2006-07 (జనవరి, 07 నాటికి) |
| 1. | ఆంధ్ర | 3848 | 3799 | 4532 | 3489 |
| 2. | రాయలసీమ | 2150 | 2411 | 2684 | 2881 |
| 3. | తెలంగాణ | 5158 | 5546 | 711 | 5987 |
| 4. | రాజధాని (హైదరాబాద్) | 706 | 893 | 976 | 682 |
| | **మొత్తం** | **11862** | **12649** | **15303** | **13039** |

మూలం :- శాసన సభా ఆవాస విభాగం నెం.7406 (నక్షత్రం గుర్తు కలిగినవి), తొమ్మిదో ఆంధ్రప్రదేశ్ శాసనసభా సమావేశాల తాలూకు.

విడిగా ఎందుకు చూపెడుతున్నారంటే తెలంగాణ ప్రాంతం నుంచి వాస్తవంగా వచ్చే రాబడి కంటె బాగా తగ్గించి చూపించాలనే జిత్తులమారితనం ఇందులో దాగి ఉంది. దీనిని బట్టి చూస్తే మొత్తం ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆదాయంలో 75 శాతం రాబడి తెలంగాణ నుంచే వస్తున్నది. కాని దీనిలోంచి చాలా ఎక్కువ భాగం ఆంధ్ర, రాయలసీమ ప్రాంతాలలో ఖర్చు చేయబడుతున్నది. తెలంగాణ నుంచి ఇంకెంత రాబడి ఆంధ్ర, రాయలసీమలకు తరలించబడిందో ఈ కింది సమాచారాన్ని పరిశీలించినా రుజువు అవుతుంది.

01-11-1956 నుండి 31-03-1968 వరకు తెలంగాణ అదనపు రాబడి ఆంధ్రకు నిరంతరం మళ్లింపబడుతూ వచ్చింది. అయితే అది 1956-57 లో 41.07 శాతం నుంచి మారుతూ వచ్చి 1967-68 వరకు వచ్చే సరికి సగటున 12.43 శాతానికి చేరింది.

ఆంధ్రప్రదేశ్ అవతరణ నాటికి ధవళేశ్వరం వద్ద నున్న గోదావరి ఆనకట్ట, విజయవాడ దగ్గరి కృష్ణా ఆనకట్ట అనే రెండు

## తెలంగాణ నుంచి ఆంధ్రకు తరలించబడిన అదనపు రెవెన్యూ ఆదాయం:-
## (01 నవంబరు 1956 నుండి 31 మార్చి1968 వరకు)

| సంవత్సరం | లక్షల్లో రూపాయలు | | | |
|---|---|---|---|---|
| | ఆదాయం | వ్యయం | ఆంధ్రకు తరలించబడిన అదనపు రాబడి | ఆంధ్రకు తరలించబడిన రాబడి శాతం (%) |
| 1956-57 | 1,093.88 | 644.58 | 449.30 | 41.07 |
| 1957-58 | 2,244.79 | 1,896.67 | 348.12 | 15.15 |
| 1958-59 | 2,667.18 | 2,242.16 | 424.49 | 15.92 |
| 1959-60 | 3,451.10 | 2,598.16 | 852.94 | 24.72 |
| 1960-61 | 3,352.36 | 3,000.34 | 352.02 | 10.50 |
| 1961-62 | 3,810.83 | 3,381.37 | 429.46 | 11.27 |
| 1962-63 | 4,506.55 | 3,837.69 | 668.86 | 14.84 |
| 1963-64 | 5,091.79 | 4,228.95 | 862.84 | 16.95 |
| 1964-65 | 5,375.91 | 4,764.70 | 611.21 | 11.37 |
| 1965-66 | 6,087.29 | 5,555.39 | 531.90 | 8.74 |
| 1966-67 | 7,044.00 | 6,376.45 | 667.55 | 9.48 |
| 1967-68 | 6,720.47 | 6,526.31 | 194.16 | 2.89 |
| **మొత్తం:** | **51,446.15** | **45,053.30** | **6,392.85** | **12.43** |

మూలం : తెలంగాణ అదనపు రాబడులపై లలిత్ కుమార్ నివేదిక, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, 1969.

ఆంధ్రా భారీ నీటిపారుదల ప్రాజెక్టులు అత్యంత దయనీయ స్థితిలో ఉండి, వెంటనే బాగు చేసి, పునర్నిర్మించకపోతే మొత్తంగా పనికిరాని దశకు చేరుకొని ఉన్నవి. అప్పటి ఆంధ్రప్రభుత్వం పూర్తిగా దివాళా తీసి, వాటిని బాగు చేసుకోలేని నిస్సహాయ స్థితి, అటువంటి దుర్భర స్థితిలో తెలంగాణను ఆంధ్రలో విలీనం చేయడం వల్ల ఆంధ్రప్రాంతానికి ఎనలేని లబ్ధి చేకూరిందనేది గమనించాలి.

నూతన్నంగా ఏర్పడ్డ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో తెలంగాణకు చెందిన అదనపు రాబడి అంతా ఆంధ్రపాలక వర్గ దొరల చేతుల్లోకి వచ్చి పడింది. పైన పేర్కొన్న ఆ రెండు ప్రాజెక్టులు దాదాపు అప్పటికే మృతప్రాయమైనట్టివి, పూర్తిగా తెలంగాణ రెవెన్యూతో పునర్నిర్మించబడడమే కాక, పెద్ద మొత్తంలో ఆయకట్టు పెరిగి ఇప్పుడు 25 లక్షల ఎకరాలకు ఖరీఫ్‌లోను, అందులో దాదాపు సగం ఆయకట్టుకు రబిలోను నీటి పారుదల వసతి పెరిగి ఇబ్బడి ముబ్బడిగా లబ్ధి చేకూరింది.

తెలంగాణకు చెందిన అప్పటి ఆ ఆదాయాన్నే కనుక శ్రీరాంసాగర్ ప్రాజెక్టు మీదనే ఖర్చు చేసి ఉంటె, కనీసం సగం తెలంగాణ ప్రాంతం అయినా సుసంపన్నం అయ్యేది. బహుశా ఇప్పటి సుభిక్షమైన డెల్టా ప్రాంతం కన్న మిన్నగా. అయితే విషాదమేమంటే, శ్రీరాంసాగర్ ప్రాజెక్టు నిర్మాణాన్ని ఉద్దేశ్యపూర్వకంగా కట్టకుండా నిలువరించి, తెలంగాణ అదనపు రాబడినంత ఆంధ్ర ప్రాంతానికి మళ్లించారు. ఇప్పటికి నాల్గు దశాబ్దాలైన శ్రీరాంసాగర్ ప్రాజెక్టు పరిస్థితి "ఎక్కడ వేసిన గొంగళి అక్కడే నన్నట్లు ..."ఉంది. ప్రతిపాదిత 20 లక్షల ఎకరాల ఆయకట్టులో కనీసం 5 లక్షల ఎకరాలకు కూడా నీటి పారుదల సౌకర్యం లేదు. అది కూడా ఈనాటికీ ఒక్క పంటకే.

**2. తెలంగాణ నీటిని దోచిన ఆంధ్రోళ్లు:-**

దీనికి సంబంధించి వేరే ఎటువంటి ప్రత్యేక సమాచారం ఇవ్వనక్కర లేదు. వేలాది రైతుల ఆత్మహత్యలు, ఎండి ఎడారులైన తెలంగాణ బీళ్లు ఈ నిజాన్ని రుజువు చేస్తాయి.

**3.తెలంగాణ ఉద్యోగాలు దోచిన ఆంధ్రోళ్లు:-**

దీని కోసం కూడా వేరే ప్రత్యేక దత్తాంశాన్ని సమర్పించనవసరం లేదు. తెలంగాణ కోసం వందలాది యువతీ యువకులు ప్రాణాలు తీసుకోవడాన్ని అర్థం చేసుకొంటె సరిపోతుంది. కనీసం వారి చావులతోటైన తెలంగాణ రాష్ట్రం ఏర్పడితే, మిగతా వాళ్ళకైనా ఉద్యోగాలొస్తాయన్నది వారి ఆశ.

ఇంకా చెప్పాలంటె, రెండు అసమ రాష్ట్రాల కలయిక 1956లో జరిగిందనే కనీస స్పృహ కూడా లేకుండా, మొత్తం తెలుగు భాషా ఒక్కటె అందర్ని సంపూర్ణంగా కలిపి ఉంచుతుందన్న అపోహను ముందుంచుతున్నారు. ఆంధ్రప్రదేశ్ అవతరణకు పూర్వమే తెలంగాణ రాష్ట్రానికి అదనపు రాబడి ఉందని, ఆంధ్రరాష్ట్రం లోటు బడ్జెట్‌తో ఉందన్నది విదితమే. ఆంధ్ర, మద్రాసు రాష్ట్రంలో ఉన్నందువల్ల, తెలంగాణ నిజాం పరిపాలనలో ఉన్నందువల్ల ఉమ్మడి ప్రత్యేక అస్తిత్వం లేక, ఉమ్మడి చరిత్ర లేక, ఉమ్మడి పరిపాలనా నేపథ్యం లేక, ఉమ్మడి మాండలికం లేక, ఉమ్మడి సంస్కృతి లేక, రెండు ప్రాంతాలకు ఉమ్మడి ఆహారపుటలవాట్లు కూడా లేకుండేవి. ఆంధ్ర, తెలంగాణ సంస్కృతులు భిన్నమైనవనేవి స్పష్టం. అయినా అందరు మాట్లాడేది ఒక్కటే భాషని ఆ పేరున కలిసి ఉండాలంటారు.

అయితే స్వాతంత్ర్యానికి ముందు, తెలంగాణ ప్రజలు నిజాం నిరంకుశ పాలనలో ఉండేవారన్నది తెలిసిందే. కాని ఆంధ్రప్రాంత ప్రజలు మద్రాసు ప్రావిన్సులో బ్రిటిష్ ఏలుబడిలో ఉన్నందున, ఇంగ్లిషు మీడియం చదువులు, ఉద్యోగ, ఉపాధి అవకాశాలు, పారిశ్రామీకరణ, నీటిపారుదల ప్రాజెక్టుల వంటివి అందుబాటులో ఉండేవి. ఆ క్రమంలో వాళ్లు సుభిక్షంగా, బాగా చదువుకొన్నవాళ్లుగా, వ్యాపారవేత్తలుగా, రాజకీయంగా "తెలివిమంతులుగా" రూపొందినారు. వారితో పోల్చినపుడు తెలంగాణలోని ప్రజలు చాలా వెనుకబడి, నిరక్షరాస్యులుగా ఉండిరి. అట్లా తెలంగాణ వెనుకబాటుతనం, ఆంధ్ర, తెలంగాణ సమైక్యం అయిన తర్వాత కూడ కొనసాగింది.

అయ్యా,

మూడో పరిశీలనా సూచికలోని నిబంధన, ఏదైతే, ముస్లింలతో సహా వివిధ వర్గాల ప్రజలపై ప్రభావం చూపగల స్థితికి సంబంధించిందో, దాని గురించి, ముస్లింల మనోస్థితికి సంబంధించినంత వరకు, వాళ్లు హృదయ పూర్వకంగా తెలంగాణ ఏర్పాటుకు అనుకూలంగా ఉన్నారు. ముస్లింలలోని అత్యధిక సంఖ్యాకులు తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం కోసం తమ దృఢ సమర్థతను ప్రకటించి యున్నారు.

ఈ కింది వార్తా కథనాన్ని ఉదాహరణగా మీకు నివేదిస్తున్నాం.

**సోమవారం, ఫిబ్రవరి 08, 2010.**

హైదరాబాద్: జమాతె-ఇస్లామి హింద్ (జెఐహెచ్) అను ముస్లిం సముదాయం ఆదివారం రోజు తెలంగాణ ప్రాంతానికి ప్రత్యేక రాష్ట్ర ప్రతిపత్తి అనే డిమాండ్‌ను సమర్థిస్తూ ఒక పెద్ద బహిరంగసభను నిర్వహించింది. వేలాది ముస్లింలు, బుర్ఖా వేసుకున్న ముస్లిం మహిళలు, బాలికలతో సహా సభకు హాజరయ్యారు. ముస్లింలకు చెందిన ప్రధాన రాజకీయ పార్టీ అయిన మజ్లిస్ ఇత్తేహాదుల్ ముస్లిమీన్ (ఎంఐఎం) కూడ ఈ విషయం మీద మౌనంగా ఉన్న దశలో ఇక్కడి నిజాం కాలేజి మైదానంలో సభ నిర్వహించడం ద్వారా జెఐహెచ్ ఉద్యమంలో చేరిపోయింది. సభకు ఆంధ్రప్రదేశ్, ఒడిశాలకు చెందిన జెఐహెచ్ శాఖలు వాటి అనుబంధసంఘాలు, స్టూడెంట్స్ ఇస్లామిక్ ఆర్గనైజేషన్ (ఎస్ఐఓ), గర్ల్స్ ఇస్లామిక్ ఆర్గనైజేషన్ (జిఐహెచ్) వంటివి హాజరైనవి. హైదరాబాద్‌కు చెందిన వేలాది ముస్లింలు

సభకు హాజరయ్యారు. విలీన సందర్భంలో ఈ ప్రాంత అభివృద్ధికోసం ఎన్నో వాగ్దానాలు కుమ్మరించినప్పటికి ఈ ప్రాంతాన్ని పాలించిన ప్రభుత్వాలు, విద్య, ఉపాధి, నీటిపారుదల, పారిశ్రామిక రంగం వంటి మౌలిక రంగాలలో నిర్లక్ష్యానికి గురి చేసాయని జెఐహెచ్ ఆంధ్రప్రదేశ్, ఒడిశా జోన్ అధ్యక్షుడు మాలిక్ మొతాసిమ్ ఖాన్ అన్నారు. అయితే ఇతర ప్రాంతాల ప్రజల ఆస్తులను, ప్రాణాలను పరిరక్షించే విధంగా శాంతియుతమైన ఉద్యమాన్ని తాము కోరుకుంటామని ఆయన అన్నారు.

"తెలంగాణకు జరిగిన అన్యాయాన్ని గురించి మాత్రమే కాక అది ఎదుర్కొంటున్న సమస్యలకు పరిష్కారం జరగాలనే ఆశతో ముస్లింలు తెలంగాణను సమర్థిస్తున్నారు."

2001 జనాభా లెక్కల ప్రకారం తెలంగాణలో ముస్లింల జనాభా 12.5% శాతంగా ఉండగా మిగతా ప్రాంతంలో 9.17 శాతం మాత్రమే ఉంది. ముస్లింలలో 61 శాతం మంది హైదరాబాద్ కాక తెలంగాణలోని మిగతా జిల్లాలో విస్తరించి ఉన్నారు. తెలంగాణ జనాభాలో సామాజికంగాను, ఆర్థికంగాను వెనుకబడ్డ ఎస్.సి., ఎస్.టి., బి.సి.లు. 86 శాతం కంటె తక్కువ కాకుండా ఉన్నారు. వారు తమ సమస్యలను తగు విధంగా ముందుంచి రాజకీయంగా నిలదొక్కుకోగలుగుతున్నారు. ముస్లింలు అట్లాంటి స్థితిలో లేరు. ప్రత్యేక తెలంగాణ ఏర్పడితే ఇటువంటి సామాజిక సమీకరణం బలోపేతం కావచ్చు.

ఏమైనప్పటికి, 90 శాతం ముస్లింలు తెలంగాణ ప్రత్యేక రాష్ట్రానికి అనుకూలంగా ఉన్నందున, తెలంగాణ అనుకూల పార్టీల నుంచి హామీలను పొందాలని కోరుకుంటున్నారు. 1948లో భారతదేశంలో హైదరాబాద్ రాష్ట్రం విలీనం తర్వాత అడ్డూ అదుపూ లేని విధంగా ముస్లింలలో పేదరికం, నిరుద్యోగిత పెరిగింది. దీనికి రాష్ట్రంలోని పాలక వర్గ పార్టీలు ముస్లింల పట్ల చూపిన వివక్ష, నిర్లక్ష్యాలే కారణం.

కొత్త రాష్ట్రంలో ముస్లింల భద్రత, రక్షణ అనేవి మరో కోణం. సమైక్య రాష్ట్రంలో ఇప్పటికే ఎన్నో మార్లు హైదరాబాద్ ఆదిలాబాద్, నిజామాబాద్ మొదలైన ప్రదేశాలలో ముస్లింలపై దాడులు జరిగాయి. ఇవి ముస్లింలలో అభద్రతను కల్గిస్తున్నాయి. ముస్లింల ధన, ప్రాణ, మాన సంరక్షణలకు సంబంధించి నూతన రాష్ట్రంలో తగినన్ని రక్షణ చర్యలు ముస్లింలకు కల్పించాలి. ఈ విషయంగా జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ వారు, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు ప్రత్యేకంగా సలహా ఇవ్వాలి.

సి.పి.ఎం., ఎం.ఐ.ఎం. వంటి పార్టీలు, తెలంగాణ రాష్ట్రం ఏర్పడితే మత ఘర్షణలు చెలరేగుతాయంటున్న విషయాన్ని కూడా మా దృష్టికి తెస్తున్నాం.

అయ్యా, మత ఘర్షణలు, మతాల మధ్య అంటుకోలేదు. వాటికి ముందస్తు పథకాలు వేసి నిర్వహిస్తున్న వారు వేరే ఉన్నారు. వాళ్ల కొంతమంది స్వప్రయోజనాలున్న రాజకీయ పార్టీలు, లేదా సంస్థలకు చెందినవారు. ఒక వేళ అప్పటి ప్రభుత్వం కనుక ఎన్.టి. రామారావు హయాంలో మాదిరిగా పటిష్ట చర్యల చేపట్టినట్లయితే వాటిని నివారించడం పెద్ద కష్టం కాదు. కాని విషాదం ఏమంటె కొన్ని రాజకీయ పార్టీల, రాజకీయ ప్రేరిత ఆసక్తుల వల్ల "మత భావనలు" మరింతగా పెరిగి దేశ సమైక్యతకు, సమగ్రతకు భంగం కల్గిస్తున్నాయి.

12 శాతం వరకు ముస్లింలు జనాభా ఏవిధంగా చూసినా తగినంత పరిమాణంలో అనగా 10 కోట్లకు పైగా సంఖ్య భారతదేశ జనాభాలో జమగూడి ఉన్నారు. కాబట్టి వారి ఆర్థిక, విద్యాపరమైన ప్రగతి అనేది దేశాభివృద్ధిలో కీలకమైంది. "గుర్తించదగినంత పెద్ద పరిమాణంలో ఉన్న మైనారిటీలను వెనుకబాటుకు, నిరక్ష్యరాస్యతకు, పేదరికానికి గురి చేసి ఏ దేశమైనా అభివృద్ధి గురించి గొప్పలు చెప్పుకోలేదు"

చాలా పెద్ద సంఖ్యలోముస్లింలలో నిరక్ష్యరాస్యులు, పేదవాళ్లు ఉన్నారు. వీరు చాలా విధాలుగా షెడ్యూల్డు కులాల కంటె వెనుకబడి ఉన్నారు. ముస్లిం స్త్రీలైతే మరింత బాగా వెనుకబడి ఉన్నారు. ఉదాహరణకు ముస్లిం స్త్రీలలో, జాతీయ స్థాయి కుటుంబ, ఆరోగ్య, సర్వే ప్రకారం, 66% నిరక్షరాస్యులు, హర్యానాలో అయితే మరీ అన్యాయంగా 98%. మరో ఆసక్తికర విషయం ఏమంటే హర్యానాలో ముస్లింలలో ఎక్కువ మంది గిరిజన (మియో) ముస్లింలు. ఈ గిరిజన ముస్లింలు మిగతా వారికంటె ఎక్కువగా వెనుకబడి ఉన్నారు. అస్సాంలో కూడా అత్యధిక శాతం ముస్లిం జనాభా, ముఖ్యంగా మహిళా నిరక్షరాస్యత 74 శాతం ఉండడం గమనార్హం. పశ్చిమ బెంగాల్, కర్ణాటక, ఢిల్లీ, మధ్యప్రదేశ్ రాష్ట్రాలలో 60 నుంచి 65 శాతం, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, గుజరాత్ రాష్ట్రాలలో 50 నుంచి 55 శాతం స్త్రీలు నిరక్షరాస్యులు.

విద్యాపరమైన వెనుకబాటుతనం, ఆర్థిక వెనుకబాటు తనానికి దారి తీస్తుంది, ఆర్థికంగా వెనుకబాటుతనం తిరిగి విద్యాపరంగా వెనుకబాటుకు దారితీస్తు అట్లా అది ఒక విషవలయంగా రూపొందింది.

ప్రభుత్వ ఉద్యోగాల్లో ముస్లింల ప్రాతినిధ్యమైతే వారి జనాభా శాతానికి మరీ దిగువగా ఉంది. అది ఐఎఎస్ స్థాయి కేడర్లలో మాత్రమే కాక దిగువ స్థాయి కేటగిరి -4 ఉద్యోగాల్లో సైతం అదే పరిస్థితి, ఇటువంటి స్థితికి కొన్ని కారణాలు ఉన్నాయి. ముస్లిం వ్యతిరేక దురభిప్రాయాలు ప్రబలి ఉండడం అందులో ఒక ముఖ్య కారణం. విద్య అసలే లేకపోవడం, శిక్షణా లోపం కూడా మరికొన్ని కారణాలు..

ముస్లింల రాజకీయ ప్రాతినిధ్యానికి సంబంధించి ఎంత తక్కువ చెప్తే అంత మంచిది. గణాంకాలు మరీ అధ్వాన్నంగా ఉన్నాయి.

ఒకప్పటి హైదరాబాద్ రాజ్యానికి, ముస్లిం ప్రభువుగా ఉండడం విధివశాత్తు జరిగిందే తప్ప, 1948 లో పోలీస్ చర్య తర్వాత

హైదరాబాద్ విమోచన జరిగి, తదనంతరం 1956 లో ఆంధ్రప్రదేశ్ అవతరణ జరిగి దాని పర్యవసానంగా ముస్లింలను, వారి ప్రయోజనాలను జమిలిగా ఒక పద్ధతి ప్రకారంగా ప్రణాళికా బద్ధంగానే ఆంధ్రోళ్లు లక్ష్యాత్మకంగా తొక్కి వేయడానికి ఆస్కారమిచ్చింది. ఈ అన్యాయపు సెగలను, పీడనల మంటను ముస్లింలు భరించవలసి వచ్చింది.

పోలీస్ చర్య, ఆ తదనంతరం ఆంధ్రప్రదేశ్ అవతరణ ఫలితంగా, 38 వేల ముస్లిం ఉద్యోగస్తులు, రాష్ట్ర ప్రభుత్వపు ఒక్క కలం పోటుతో ఉద్యోగాల్ని కోల్పోయారు. పర్యవసానంగా అసంఖ్యాకమైన కష్ట నష్టాల బారిన వాళ్ళ కుటుంబాలు పడ్డాయి. 1948 లో 41% ముస్లింలు రాష్ట్ర ప్రభుత్వంలో ఉద్యోగస్తులు ఉంటే 2006 నవంబర్‌లో సచార్ కమిటీ నివేదిక ఇచ్చే నాటికి 3 శాతానికి కుచించుకుపోయారు.

**ఉర్దూ పట్ల వివక్ష:-**

1948 తర్వాత ఒక పక్క జనాభా పెరుగుతుంటే మరోపక్క హైదరాబాద్ లో 950 ఉర్దూ మీడియం పాఠశాలలను మూసివేయడం లేదా వాటి స్థాయిని తగ్గించడం ద్వారా ముస్లింలు విద్యాపరంగా ఒక పద్ధతి ప్రకారంగా దోపిడికి గురయ్యారు.

బాధకరమేమంటే 305 ఉర్దూ మీడియం పాఠశాలలోని 990 ఉపాధ్యాయ పోస్టులను హైదరాబాద్ పాత బస్తీలో గత 12 సంవత్సరాలుగా ఖాళీగా ఉంచుతున్నారు తప్ప నింపడం లేదు. ప్రభుత్వ, ప్రభుత్వ సహాయక (ఎయిడెడ్) ఉర్దూ మీడియం పాఠశాలల్లోని దాదాపు 60% మంజూరైన పోస్టులను ప్రభుత్వ అనుమతి లేదనే మిషతో నింపలేదు. ఈ పరిస్థితి ఇలాగే కొనసాగితే 2012 సంవత్సరం నాటికి ప్రభుత్వ ఎయిడెడ్ పాఠశాలలన్నింటిని మూసివేసే ప్రమాదాన్ని ఎదుర్కోవల్సి వస్తుంది.

రాష్ట్ర ఉర్దూ అకాడమి ఏర్పడినప్పటి నుంచి ప్రాథమిక స్థాయి నుంచి ఉన్నత పట్టభద్ర స్థాయి వరకు ఉర్దూ మీడియంలో పాఠ్యపుస్తకాలను సమకూర్చడంలో విఫలం అయ్యింది. అదే సమయంలో తెలుగు అకాడమి మాత్రం తెలుగు మీడియంలో మాత్రమే కాకుండా ఆంగ్ల మాధ్యమంలో కూడా ప్రాథమిక స్థాయి నుండి స్నాతకోత్తర స్థాయి వరకు మొత్తం రాష్ట్రానికంతా సరిపడే విధంగా పాఠ్య పుస్తకాలను ప్రచురించగలుగుతున్నది.

సమైక్యాంధ్రప్రదేశ్‌లో, వేలాది ఎకరాల వక్ఫ్ భూములు దురాక్రమణకు గురికావడమే కాక ఉర్దూ భాష, ఉర్దూ పాఠశాలలు, ఒకప్పుడు ఉర్దూ యూనివర్సిటీగా ఉండిన ఉస్మానియా యూనివర్శిటీ, (అందులో చదివే విద్యార్థులు ఉర్దూ మీడియంలో ఎంబిబిఎస్ చేసేవారు) అన్యాయంగా నిర్లక్ష్యానికి గురి అయ్యాయి.

అందువల్ల రాబోయే తెలంగాణ రాష్ట్రంలో తెలుగు తర్వాత రెండో అధికార భాష హోదాను ఉర్దూకు ఇవ్వాలని మా డిమాండ్.

వక్ఫ్ ఆస్తుల లూటీ - వక్ఫ్ ఆస్తులను కొనకూడదు, అమ్మకూడదన్న సుప్రీం కోర్టు తీర్పును అత్యంత అమార్యాదకరంగా బేఖాతరు చేసారు.

ఆంధ్ర రాజకీయ నాయకుల ఆధ్వర్యంలో దాదాపు 829 ఎకరాల వక్ఫ్ భూముల్ని 444.40 కోట్ల రూపాయలకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అమ్మివేసింది. ఆంధ్రప్రదేశ్ వక్ఫ్ ట్రిబ్యునల్ బార్ ఆసోసియేషన్ వారు ట్రిబ్యునల్‌లో మంజూరై ఖాళీగా ఉన్న పోస్టుల్లోకి నియామకాలు చేయాలని 2006 లో రిట్ పిటిషన్ నెం. 2551 ద్వారా చేసుకున్న విన్నపానికి హైకోర్టు ఇచ్చిన ఉత్తర్వులను సైతం 4 ఏండ్లుగా తుంగలో తొక్కుతూ అమలు చేయడం లేదు.

హైదరాబాద్ చుట్టు ప్రక్కల ప్రాంతాల్లోని రంగారెడ్డి జిల్లాలోని 1 లక్ష కోట్ల రూపాయల విలువైన వక్ఫ్ ఆస్తుల్లోకి ఆంధ్ర రాజకీయ నాయకులు చొరబడి దురాక్రమణ చేసినా, రాష్ట్ర ప్రభుత్వం నిరోధించడంలో విఫలం అయ్యింది. అంతేకాక వక్ఫ్ బోర్డుకు మౌలిక వనరులను కూడా సమకూర్చలేదు. అదే సమయంలో కేవలం 7800 కోట్ల రూపాయల సత్యం కుంభకోణం విషయంలో ప్రభుత్వం వేగంగా కదిలి, కేవలం ఒక సంవత్సర కాలంలోనే ఫిబ్రవరి 2010 నాటికే రెడ్ హిల్స్ క్రిమినల్ కోర్టు ఆవరణలో ప్రత్యేక కోర్టు ఏర్పడి కుంభకోణం మీద పనిచేయడం ఆరంభించింది. కొట్టొచ్చినట్లు కనబడేది ఏందంటే ఇప్పటికే మంజూరైన మౌలిక వనరులను కూడా సమకూర్చక పోవడం వల్ల ఇప్పుడున్న వక్ఫ్ కోర్టు ( ట్రిబ్యునల్ ) పని విధానం తీవ్రంగా దెబ్బతింది.

ఆంధ్రప్రదేశ్‌లో అల్ప సంఖ్యాకుల సంక్షేమం కోసం చేసిన వార్షిక కేటాయింపు కేవలం 0.236 శాతం మాత్రమే. 2009-10, 2010-11 సంవత్సరాల్లో కూడా ఇదే మాదిరి. ఆ కొద్దిపాటి బడ్జెట్ కేటాయింపులోంచైనా సగం నిధులు కూడా విడుదల కావు. ఇందుకు సాక్ష్యాధారంగా 2009-10 సంవత్సరం బడ్జెట్ కేటాయింపులో కేవలం 36 శాతం నిధులు మాత్రమే విడుదల కావడాన్ని చూడవచ్చు.

అల్ప సంఖ్యాక సంక్షేమ ప్రభుత్వ విభాగం, వేర్వేరు ఇతర అల్ప సంఖ్యాక సంబంధిత శాఖల నిర్వహణను పట్టించుకొన్న నాథుడే కరువయ్యాడు. నిధులకు, మంజూరైన అవసర సిబ్బందికి నోచుకోక దిక్కూ దివాణం లేనిదయ్యింది. అల్ప సంఖ్యాక సంక్షేమ విభాగం నియంత్రణలోని అసంఖ్యాకమైన అల్పసంఖ్యాక సంస్థల్లో ఒక్క పూర్తి కాలపు ఉద్యోగి కూడా లేకపోయినందున పరిపాలన అక్షరాల అవిటిదయ్యింది.

రాష్ట్ర అల్ప సంఖ్యాక సంక్షేమ విభాగంలో మంజూరైన సిబ్బందిలోంచె 35 శాతం సిబ్బందిని నియమించలేదు. ఇంకా రాష్ట్ర అల్పసంఖ్యాక ఆర్థిక సంస్థలోను, రాష్ట్ర వక్ఫ్ బోర్డులోను మంజూరైన సిబ్బందిలో 50 శాతం సిబ్బంది నియమింపబడలేదు. రాష్ట్ర అల్పసంఖ్యాక కమిషన్ లోనైతే మంజూరి పొందిన సిబ్బందిలో ఏకంగా 65 శాతం సిబ్బంది లేనేలేరు. అల్ప సంఖ్యాకులకు సంబంధించిన అసంఖ్యాకమైన చట్టబద్ధమైన శాఖలు, బోర్డులు, అకాడమీలు తదితర సంస్థల్లో గడిచిన 12 సంవత్సరాలుగా 40కి పైగా పోస్టులు ఖాళీగా ఉన్నాయి.

దక్షిణ భారతదేశంలో ప్రత్యేకించి ఆంధ్రప్రదేశ్, కర్ణాటకలలో

ముస్లింల పరిస్థితి బాగానే ఉందన్న భావన ఉన్నప్పటికి, ఇక్కడ భౌతిక వాస్తవాలు పూర్తిగా భిన్నంగా ఉన్నాయి, ప్రత్యేకించి ఆంధ్రప్రదేశ్‌లో.

సికిందరాబాద్, హైదరాబాద్‌లలోని ముస్లింల పరిస్థితి కొంత వరకు బాగున్నట్లనిపించినప్పటికీ, అదీ, రాజధాని అయినందువల్లనే. అక్కడ్నుంచి దూరంగా పోతుఉంటే పరిస్థితి అధ్వాన్నమవుతుంది. ఇట్లాంటి ఒక కారణం వల్లనే కాంగ్రెస్ ప్రభుత్వం ముస్లింలకు 4 శాతం రిజర్వేషన్ ప్రకటించాల్సి వచ్చింది. దీన్ని ముస్లింలు స్వాగతిస్తే, మతపరమైన రిజర్వేషన్లు కల్పించరాదని బి.జె.పి. పదే పదే చేస్తున్న ఫిర్యాదుల నడుమ హైకోర్టు దాన్ని మూడుసార్లు కొట్టివేసింది. తద్వారా ముస్లింలకు దిక్కుతోచని పరిస్థితి ఏర్పడింది.

అర్థంకానిదేమంటే, మతపరంగా కానివి, ఎస్.సి., ఎస్.టి., బి.సి.ల పేరిట హిందువులకు 46% రిజర్వేషన్‌లు ఉంటే ముస్లింలకు అదీ, కేవలం 4% మాత్రమే రిజర్వేషన్లు కల్పిస్తే (9% జనాభా ఉన్నటువంటి వాళ్లకు) ఏ విధంగా మతపరంగా కల్పించినట్లు అర్థం చేసుకుంటారు? గర్భ దరిద్రులైన నిరక్షరాస్య ముస్లింలకు ప్రాధాన్యత, భాగస్వామ్యం విద్యలో, ఉపాధిలో కల్పించరాదా? అదే, అంతే పేదరికం ఉన్న హిందువుల్లోని వర్గాలకు దశాబ్దాలుగా అటువంటి ప్రత్యేక హక్కుల్ని కల్పిస్తున్నపుడు? ఎందుకు ముస్లింపట్ల ఈ వివక్షాపూరిత ధోరణి?

ముస్లిం రిజర్వేషన్ల మీద సుప్రీంకోర్టు యథాతథ స్థితిని కొనసాగిస్తూ "స్టే" ఇచ్చినప్పటికీ, తుది తీర్పు కోసం సుప్రీం కోర్టు రాజ్యాంగ ధర్మాసనం మీదికి ఇంకా రావలసి ఉంది.

ముస్లింల భావన ఏంటంటె, ముస్లింల ఓట్లు కొల్లగొట్టడానికి, కోర్టులో నిలవడానికి తగినంత సమర్థన లభించే విధంగా రూపొందిచకుండానే హడావిడిగా రిజర్వేషన్‌లు ప్రకటించారు. చట్టంలోను, ప్రభుత్వ ఉత్తర్వులలోను రాసిన తీరు (డ్రాఫ్టింగ్), ముస్లిం సంక్షేమంపట్ల చిత్తశుద్ధి లేకుండా, అత్యంత బలహీనంగా ఉంది. జస్టిస్ సచార్ కమిషన్, జస్టిస్ రంగనాథ మిశ్రా సిఫారసులకు అనుగుణంగా ముస్లింలకు రిజర్వేషన్‌లను పునరుద్ధరించాలని, ముస్లింలు కోరుతున్నారు. ఒకవేళ అందుకు రాజ్యాంగ సవరణ అవసరమైనా సరె.

ఇంకా ఐఐటి, ఎఐఇఇఇ, ఐఎఎస్, ఐపిఎస్ మొదలైన వాటికోసం పోటీపడడానికి ఆంధ్రప్రదేశ్‌లో ముస్లింలకు ఓబిసి రిజర్వేషన్లు కల్పించబడలేదు. అందువల్ల వెంటనే ముస్లింలను ఓబిసిల జాబితాలో చేర్చి 10 శాతం ఓబిసి రిజర్వేషన్‌లను జస్టిస్ రంగనాథ మిశ్రా కమిటీ సిఫారసుల మేరకు, కల్పించాలని విజ్ఞప్తి చేస్తున్నాం.

మిశ్రా కమిషన్ ప్రభుత్వ ఉద్యోగాలలో 15 శాతం అల్ప సంఖ్యాక వర్గాలన్నింటికి రిజర్వేషన్ కల్పించాలని సిఫారసు చేస్తూ అందులో విద్య, అభివృద్ధి ఫలాలలో ముస్లింలకు ప్రత్యేకించి 10 శాతం రిజర్వేషన్లను కల్పించాలని సిఫారసు చేసింది.

అఖిల భారత సర్వీసులకు సంబంధించి 326 మంది ఐఎఎస్‌లలో రాష్ట్రం నుంచి కేవలం 11 మంది ముస్లింలు మాత్రమే ఉన్నారు. అది 3.37 శాతం మాత్రమే. 165 మంది ఐపిఎస్‌లలో రాష్ట్రం నుంచి కేవలం 6 గురు అనగా 3.63 శాతం మాత్రమే ముస్లింలు ఉన్నారు. 121 మంది ఐఎఫ్‌ఎస్‌లలో రాష్ట్రం నుంచి ముగ్గురు అతి తక్కువగా మాత్రమే ముస్లింలు ఉన్నారు. గమనార్హమైన విషయం ఏమంటే, ఈ పోస్టులన్నీ కేంద్ర సర్వీసులకు సంబంధించినవి కాబట్టి వీరంతా రాష్ట్రం బయటే తమ సేవల్ని అందించాల్సి వస్తున్నది.

కొన్ని వాస్తవాల ఆధారంగా ముస్లింల ఆర్థిక స్తోమతను నిర్ధారించవచ్చు. 80 శాతం ముస్లింలకు ఇండ్లు లేవు. ఇండ్లున్న 20 శాతం ముస్లింలో 30 శాతం మందికి, పూర్వీకుల నుంచి సంక్రమించినవే. ప్రజలకు మౌలిక సౌకర్యాల అందుబాటు విషయంలో రాష్ట్ర సగటు 44 ఉండగా ముస్లింలకు సంబంధించి వేయి మంది ముస్లింలలో కేవలం 4 గురికి మాత్రమే ఉంది.

వృత్తికి సంబంధించి 45 శాతం ముస్లింలు రోడ్డు పక్కన చిన్న పాటి వ్యాపారాలు చేపట్టి ఉన్నారు. 40 శాతం మంది గడియారం రిపేరు, టెలివిజన్‌లు బాగు చేయడం, రేడియో రిపేరు, సైకిళ్లు, మోటారు సైకిళ్ల రిపేరు, వెల్డింగ్ వంటి పనులలో మగ్గిపోతున్నారు. 10 శాతం మంది వ్యవసాయ కూలీలుగా, లేదా వ్యవసాయానుబంధ కూలీలుగా లేదా హోటల్ కార్మికులుగా బతుకును నెట్టుకొస్తున్నారు. కేవలం 5 శాతం ముస్లింలు మాత్రమే డాక్టర్‌లు, ఇంజనీర్లు, లాయర్లుగా ఉన్నారు.

ఆర్థిక స్థాయి కూడ ఏమంత బాగా లేదు. 65 శాతం ముస్లింల సంపాదన నెలకు వెయ్యి రూపాయల కంటె తక్కువగా (రు. 916) ఉంది. 16 శాతం ముస్లింల నెలసరి సంపాదన 3708 రూపాయలు ఉంటున్నది. 14శాతం మందికి మాత్రమే నెలకు 3798 రూపాయల నుంచి 5000 రూపాయలలోపు సంపాదన ఉంటున్నది. కేవలం 5 శాతం మంది మాత్రమే నెలకు 5000 రూపాయలపైబడి సంపాదిస్తున్నారు.

65 శాతానికి మించి ముస్లింలు దారిద్ర్య రేఖకు దిగువన జీవిస్తున్నారు.

ముస్లింల ఆరోగ్యానికి సంబంధించి 80 శాతం ముస్లింలు ప్రభుత్వ ఆసుపత్రుల మీద ఆధారపడిఉన్నారు. 15 శాతం మంది మాత్రమే ప్రైవేటు ఆసుపత్రులకు వెళ్లగలుగుతున్నారు. కేవలం 5 శాతం మాత్రమే కార్పోరేట్ వైద్యాన్ని అందుకొనే స్తోమతను కల్గి ఉన్నారు.

రాష్ట్ర అక్షరాస్యత రేటు 64 శాతం ఉన్నప్పటికీ, ముస్లింలది కేవలం 17.7 శాతం కన్న తక్కువ మాత్రమే. స్త్రీల అక్షరాస్యత అత్యంత అట్టడుగున కేవలం 4 శాతమే.

ముస్లింల విద్య ఎంత అట్టడుగున ఉందన్నది వేరే ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. కాని వివరాలు చెప్పాల్సి వస్తే కేవలం

4.54 శాతం మాత్రమే ప్రభుత్వ ఐటిఐలలో చదువుతున్నారు. 10.75 శాతం మాత్రమే ప్రవేటు/మైనారిటీ ఐటిఐలలో చదువుతున్నారు.

కేవలం 3.3 శాతం మాత్రమే పాలిటెక్నిక్‌లలో నమోదయ్యారు. 6.42 శాతం ముస్లింలు జూనియర్ కాలేజీల్లో, 5.63 శాతం డిగ్రీ కాలేజీల్లో, 5.9 శాతం మెడికల్ కాలేజీల్లో, 1.05 శాతం మాత్రమే ఇంజనీరింగ్ కాలేజీల్లో, 4.3 శాతం పోస్ట్ గ్రాడ్యుయేట్ కాలేజీల్లో నమోదయ్యారు.

భూ యాజమాన్యానికి సంబంధించి 35 శాతం ముస్లింలు ఎటువంటి భూమి లేకుండా ఉన్నారు. 25 శాతం ఒకే ఒక్క ఎకరం, 18 శాతం మంది 1 నుండి 2.5 ఎకరాల వరకు మాత్రమే భూమి కలిగి ఉన్నారు. ఇంకో 18 శాతం 2.5 నుండి 5 ఎకరాల వరకు, కేవలం 10 శాతం మాత్రమే 5 ఎకరాలకు పై బడి భూమి కల్గి ఉన్నారు. 15 శాతం ముస్లిం స్త్రీలు మాత్రమే వేతనం ఆర్జించేస్థితిలో ఉన్నారు. 49 శాతం ముస్లిం పురుషులు కొంత వేతనంతో కూడిన ఉద్యోగాల్లో ఉన్నారు. ఇందులో కూడా వేతన వ్యత్యాసాలున్నాయన్నది పైన పేర్కొన్న వివరాల్ని బట్టి అర్థం చేసుకోవచ్చు.

పాఠశాలల్లో, విద్యా సంస్థల్లో, ముస్లింల పిల్లల నమోదుకు సంబంధించి 5-9 సంవత్సరాల వయో వర్గంలో కేవలం 45 శాతం మంది మాత్రమే నమోదై ఉన్నారు. 10-14 సంవత్సరాల వయో వర్గంలో 52 శాతం మంది పిల్లలు పాఠశాలల్లో నమోదై ఉన్నారు. 15-19 సంవత్సరాల వయో వర్గంలో 22 శాతం నమోదై ఉన్నారు. 15 సంవత్సరాల వయసు దాటిన వారిలో 30 శాతం, 20 సంవత్సరాల వయస్సు దాటిన వారిలో కేవలం 6 శాతం మాత్రమే విద్యా సంస్థల్లో నమోదై ఉన్నారు. ముస్లింల విద్యా పరమైన వెనుకబాటుకు ముస్లింలను పాక్షికంగా మాత్రమే తప్పుపట్టవచ్చు. ఎందుకంటే ఇస్లాం విద్యార్జన ప్రాముఖ్యాన్ని ఎంతగానో నొక్కి చెప్పింది. వాస్తవం ఏమంటే మహమ్మద్ ప్రవక్త స్త్రీ పురుషులందరికీ విద్యను తప్పనిసరి ఆర్జించాలని ప్రబోధించారు.

ఇంత వరకు ఈ విశాలమైన, పెద్ద రాష్ట్రంలో ప్రజల మధ్య సమైక్యత సాధ్యం కాలేకపోయింది. అభాగ్యులైన వివిధ వర్గాల ప్రజలు చిన్నాభిన్నమై ఉండిపోయారు. సాంప్రదాయకంగా వ్యవస్థీకృత వర్గాలు, విషమసంయోజిత పెద్ద రాష్ట్రాల్లో ఇప్పటికే పెద్ద ఎత్తున వనరుల మీద అదుపు కల్గి, అంగబలంతో పాటు, రాజకీయంగా ప్రభావితం చేయగలిగిన స్థితిలో ఉండి విస్తారంగా తమ ప్రయోజనాల పట్ల మాత్రమే ఆసక్తితో ఉన్నారు. మిగతా వర్గాల పట్ల ఎటువంటి ఆసక్తి లేకుండా ఉన్నారు. మరో వైపు సమసంయోజిత చిన్న రాష్ట్రాలల్లో బలహీన వర్గాలు మరింతగా కలిసిపోయి, వాళ్లు మరింతగా సంఘటితం అయి తమ గొంతుల్ని ప్రభావవంతంగా వినిపించగల్గుతారు. ఎందుకంటే వాళ్లకున్న ఉమ్మడి చరిత్ర, సంస్కృతి - సాంప్రదాయాలవల్ల వాళ్లు సులువుగా సంభాషించుకోగల్గుతారు.

అయ్యా,

సమసంయోజిత లేదా సమజాతీయంగా వర్గాలు కలిసిపోయినప్పుడు, చిన్న రాష్ట్రాలు మరింత సమర్థవంతంగా నిర్వహించబడతాయి, గణాంకాల్ని పరిశీలిస్తే పెద్ద రాష్ట్రాల అభివృద్ధి సాపేక్షికంగా నెమ్మదిగా నడుస్తున్నది. హర్యానా, చత్తీస్‌గఢ్, జార్ఖండ్ వంటి చిన్న రాష్ట్రాల పెరుగుదల పెద్ద రాష్ట్రాల నుంచి విడిపోయాక గణనీయ వేగాన్ని సంతరించుకుంది.

జాతీయ అభివృద్ధి మండలి చేత ఆలస్యంగా ఆమోదింపబడిన పదకొండో పంచవర్ష ప్రణాళిక పత్రాల్లోని గణాంకాలు, పదో పంచవర్ష ప్రణాళికలో వాటి మాతృ రాష్ట్రాలు సాధించిన గరిష్ట ఉత్పత్తికన్న తాజాగ ఏర్పడ్డ చిన్న రాష్ట్రాలు సాధించిన ఉత్పత్తి ఎక్కువని చెప్తున్నాయి. ఈ మూడు రాష్ట్రాల్లో లక్ష్యంగా పెట్టుకున్న పెరుగుదల శాతాన్ని, సాధించిన పెరుగుదల శాతాన్ని పోల్చుకున్నట్లయితే మనకీ విషయం స్పష్టమవుతుంది.

చత్తీస్‌గఢ్ లక్ష్యించిన పెరుగుదల 6.1 శాతం, సాధించిన పెరుగుదల 9.2 శాతం; జార్ఖండ్ లక్ష్యించిన పెరుగుదల 6.9 శాతం, సాధించిన పెరుగుదల 11.1 శాతం; ఉత్తరాఖండ్, లక్ష్యించిన పెరుగుదల 6.8 శాతం, సాధించిన పెరుగుదల 8.8 శాతం.

ఇందుకు భిన్నంగా పై చిన్న రాష్ట్రాల మాతృ రాష్టాల పని తీరు ఇట్లా ఉంది.

మధ్యప్రదేశ్ లక్ష్యించినది 7.0 శాతం, సాధించినది 4.3 శాతం; బీహార్, లక్ష్యించినది 6.2 శాతం; సాధించినది 4.7 శాతం; ఉత్తరప్రదేశ్ లక్ష్యించినది 7.6 శాతం; సాధించినది 4.6 శాతం.

ఈ అనుభవం, ఏమి సూచిస్తున్నదంటంటే, పెద్ద రాష్ట్రాల్లో వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి సామర్థ్యం, చిన్న రాష్ట్రాలుగా ఏర్పడకుండా అవి పెద్ద రాష్ట్రాల్లో అంతర్భాగంగా ఉన్నంత కాలం అణచివేయబడి ఉన్నవని. అంత మాత్రమే కాక బయటి నుంచి పెట్టుబడులను ఆకర్షించే విధంగా మెరుగైన ప్రణాళిక, మెరుగైన పరిపాలన, వనరుల వినియోగ సామర్థ్యాన్ని కలిగి ఉన్నాయని అర్థం అవుతున్నది.

అందువల్లనే జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం ఏర్పాటుకు కేంద్ర ప్రభుత్వానికి సిఫారసు చేయవల్సిందిగా మా విజ్ఞప్తి.

మీ విశ్వసనీయులు

**వరంగల్ ముస్లింలు**

1). ఇంకెషాఫ్ అహ్మద్ పర్వేజ్, 2). అనీస్ అహ్మద్ సిద్దీఖి, 3). డా. మొహమ్మద్ జుబేర్, 4). డా. షేఖ్ ఖలీల్-ఉర్-రహమాన్, 5). డా. ఫిరోజ్, 6). మొహమ్మద్ జలీల్ ఖాన్, 7). మొహమ్మద్ రియాజ్, 8). డా. రజామాలిక్ ఖాన్, 9). అక్బర్ మొహిద్దీన్ జియా, 10). బర్కత్ బారి, 11). షేక్ మసియుద్దీన్ అహ్మద్, 12). డా. మొహమ్మద్ మస్లియుద్దీన్

చరిత్ర పుటల్లోంచి ....

# వరంగల్ డిక్లరేషన్

*(ప్రత్యేక తెలంగాణ - ప్రజాస్వామిక ఆకాంక్షలు అనే అంశం మీద ఎ.ఐ.పి.ఆర్.ఎఫ్. వరంగల్‌లో 28, 29 డిసెంబర్ 1997 తేదీలలో నిర్వహించిన సదస్సు, ఊరేగింపు, బహిరంగ సభల సందర్భంగా తెలంగాణ రాష్ట్ర సాధన కొరకు ఎ.ఐ.పి.ఆర్.ఎఫ్., వివిధ ప్రజాసంఘాలు, ప్రజాస్వామికవాదులు, మేధావులు ఆమోదించి విడుదల చేసిన ప్రకటన.)*

తెలంగాణ ప్రాంతం గత నాలుగు దశాబ్దాలుగా తీవ్రమైన అన్యాయానికి గురువుతూ వచ్చింది. నిజాం నిరంకుశ పాలనలో మగ్గిపోయిన తెలంగాణ ప్రజలు ఆంధ్రప్రదేశ్‌లో తమకు న్యాయం జరుగుతుందని ఆనాడే భావించలేదు. వాళ్ళ మనస్సుల్లో ఉన్న అనుమానాలను పోగొట్టడానికి పెద్ద మనుషుల ఒప్పందం రూపంలో కొన్ని హామీలను ఇవ్వాల్సి వచ్చింది. ఆనాటి నుంచి ఈనాటి వరకు రాష్ట్ర పాలకులెవ్వరూ ఆ హామీలను అమలు చేసిన పాపాన పోలేదు.

1968-69ల్లోనే తెలంగాణ రాష్ట్రం కావాలని ఈ ప్రాంత ప్రజలు పోరాటం చేసారు. 370 మంది యువకులు తమ ప్రాణాలను బలిదానం చేసారు. ఆనాటి నాయకత్వం తన స్వార్థ ప్రయోజనాలకు లోబడి పోవడంతో ప్రజల ఆశలు వమ్మయ్యాయి. ఈ మధ్యకాలంలో తెలంగాణ ప్రాంతం మరింత అన్యాయానికీ, మరింత దోపిడీకి గురయింది.

ఈ అన్యాయానికీ, దోపిడీకి చరమ గీతం పాడాలని తెలంగాణ ప్రజలు మరోసారి పోరాట మార్గంలోకి వచ్చారు. ఇవాళ తెలంగాణ రాష్ట్రం కావాలని డిమాండు చేస్తూ ఎన్నో వేదికలు, సంస్థలు ఏర్పడ్డాయి. కొంత మంది తెలంగాణా పేరు మీద పార్టీలనే స్థాపించారు. తెలంగాణాకు జరిగిన అన్యాయాన్నీ, ఇక్కడి ప్రజల మీద అమలవుతున్న దోపిడీ దౌర్జన్యాలనూ ఎండగడుతూ వీటిలో కొన్ని సంఘాలు తెలంగాణ రాష్ట్ర సాధన కొరకు పోరాటం చేయడానికి ముందుకు వస్తున్నాయి.

తెలంగాణ ప్రాంతం ఎందుచేత వెనుకబడి పోయిందో, ఏ రాజకీయార్థిక విధానాలు ఈ వెనుకబాటుతనానికీ, దోపిడీకి కారణమో తెలుసుకోవాలి. ఆంధ్రప్రదేశ్ నుండి తెలంగాణ భౌగోళికంగా వేరుపడి ఒక ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడి రాజకీయార్థిక విధానాల్లో మార్పు రాకపోతే అలాంటి ప్రత్యేక రాష్ట్రం వల్ల ప్రజలకు లాభించేది ఏమీ ఉండదు. అధికారంలో ఉండేవారిలో మార్పు వచ్చి, విధానాల్లో మార్పు రాకపోతే అది ఏవిధంగా నిజమైన మార్పు కాదో మన అనుభవంలో ఇప్పటికే ఉంది.

తెలంగాణ ప్రాంతంలోని వనరులను దోపిడీ చేసి, ప్రజలను పీడించి తమ పబ్బం గడుపుకుంటున్న శక్తులను అర్థం చేసుకోవాలి. ఇలాంటి శక్తులకు వ్యతిరేకంగా పోరాటం చేయడం ద్వారా, ప్రత్యామ్నాయ విధానాలను రూపొందించుకోవడం ద్వారా ఈ ప్రాంత ప్రజలు తమ సమాజాన్ని, తమ జీవితాలను మార్చుకోవాలి.

ఈ విషయాలను గమనంలో ఉంచుకొని ఈ ప్రాంత ప్రజల మౌలిక జీవితావసరాలను తీర్చే విధంగా, ప్రాథమిక హక్కులను ఇచ్చే విధంగా తెలంగాణ రాష్ట్రం ఏర్పడాలని మేం కోరుతున్నాం. ఈ లక్ష్య సాధన కొరకు మనకుండవలసిన అవగాహనను, మనం నెరవేర్చవలసిన కర్తవ్యాలను వరంగల్ డిక్లరేషన్‌గా ప్రజల ముందుకు తెస్తున్నాం.

## ప్రజాస్వామ్య తెలంగాణ

తెలంగాణా ప్రాంతంలో విస్తారమైన సహజ వనరులున్నాయి. లక్షలాది ఎకరాల వ్యవసాయ భూములకు సాగునీటిని అందించి సస్యశ్యామలం చేయడానికి అవసరమైన జీవనదులు అందుబాటులో ఉన్నాయి. కాని ఈ ప్రాంతంలో వ్యవసాయం అభివృద్ధి చెందలేదు. కరువు కాటకాలు తాండవిస్తున్నాయి. పారిశ్రామిక ప్రగతి జరగలేదు. ఉన్న పరిశ్రమలను మూసివేసారు. తిండి, బట్ట, ఇల్లు వంటి కనీస జీవితావసరాల కొరకు పోరాడుతున్న తెలంగాణ ప్రజల మీద ప్రభుత్వం, పాలక వర్గాలు ఉక్కుపాదాన్ని మోపి అణచి వేస్తున్నాయి. దేశంలోనూ, విదేశాల్లోనూ ఉన్న బడా పారిశ్రామికవేత్తలకూ, వాళ్ళ రాజకీయ శక్తులకూ దళారులుగా ఉన్న వలస రాజకీయార్థిక శక్తులు, స్థానిక భూస్వామ్య రాజకీయార్థిక శక్తులు ఈ ప్రాంత ప్రజల ప్రస్తుత పరిస్థితికి కారణం. ఇలాంటి విషయాల జోలికి పోకుండా కేవలం తెలంగాణా రాష్ట్రం గురించి మాత్రమే మాట్లాడేవాళ్ళు ప్రజలను మభ్యపెడుతున్నారు. వీళ్ళపట్ల ప్రజలు అప్రమత్తంగా ఉండాలి. తమ మౌలికమైన సమస్యలకు మౌలికమైన పరిష్కారాలను కోరుతూ ప్రజలు పోరాడాలి.

అభివృద్ధికి నోచుకోకుండా ఉన్న తెలంగాణలో కూడా ఒక ప్రాంతానికీ మరో ప్రాంతానికీ మధ్య తేడా ఉంది. ఒక ప్రజా సముదాయానికి మరో ప్రజా సముదాయానికి మధ్య తేడా ఉంది. ఈ ప్రాంతంలో ఎక్కడైనా అభివృద్ధి జరిగితే అది ఈ ప్రాంత ప్రజల అనుభవంలోకి రాకుండా పోతున్నది. కనుక ఇలాంటి అన్ని సమస్యలకు, అందరి సమస్యలకు మనకు తెలంగాణలో పరిష్కారం దొరకాలి. మనకు ప్రజాస్వామ్య తెలంగాణ కావాలి.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పరిపాలనా వ్యయాన్ని ఆంధ్ర, తెలంగాణ ప్రాంతాలు 2:1 నిష్పత్తిలో భరించాలనీ, మిగిలిన తెలంగాణ ప్రాంత ఆదాయాన్ని ఈ ప్రాంత అభివృద్ధికే ఖర్చు చేయాలనీ పెద్ద మనుషుల ఒప్పందంలో చెప్పారు. తెలంగాణ ప్రాంతపు విద్యావకాశాలను ఈ ప్రాంతపు విద్యార్థులకే పూర్తిగా కేటాయిస్తామని, లేదా రాష్ట్రంలోని విద్యాసంస్థల సీట్లలో మూడవ వంతు సీట్లను ఈ ప్రాంతపు విద్యార్థులకు ఇస్తామన్నారు. ముల్కీ నిబంధనలను అమలుచేస్తామని అన్నారు. తెలంగాణ ప్రాంతపు ప్రణాళికలు, నీటి పారుదల, వ్యవసాయం, పారిశ్రామికాభివృద్ధి, ఉద్యోగ వ్యవహారాల్లో నిర్ణయాలను తెలంగాణ ప్రాంతీయ మండలి

తీసుకోవాలన్నారు. ఈ మండలి అనుమతి లేకుండా ఈ ప్రాంతపు వ్యవసాయ భూములను అమ్మకూడదని, కొనగూడదని అన్నారు. అయితే ఇవేవీ అమలు కాలేదు.

దీని ఫలితంగా తలెత్తిన ప్రత్యేక తెలంగాణ ఉద్యమం, ముల్కీ నిబంధనలను సుప్రీం కోర్టు సమర్థించిన సమయంలో తలెత్తిన జై ఆంధ్ర ఉద్యమం 1973లో ఆరు సూత్రాల పథకాన్ని ప్రకటించడానికి కారణమయ్యాయి. రాష్ట్ర పాలకులు ఈ ఆరు సూత్రాల పథకాలన్ని కూడ ఎప్పుడూ చిత్తశుద్ధితో అమలు చేయలేదు. ముల్కీ నిబంధనల్లో సడలింపు తేవడంతో, జంటనగరాలను ఫ్రీజోన్ చేయడంతో, ఈ ప్రాంత ప్రజలకు మరింత అన్యాయమే జరిగింది. ఆరు సూత్రాల పథకాన్ని ఉల్లంఘించడం వల్ల తెలంగాణ ప్రాంతాల్లోకి సుమారు 60వేల మంది తెలంగాణేతర ఉద్యోగులు వచ్చారని, వారిని తెలంగాణ ప్రాంతం నుండి బదిలీ చేస్తామని 1985లో ప్రభుత్వం జీ.ఓ. తీసి కూడా దాన్ని అమలు చేయలేదు.

జీవనదులైన కృష్ణా, గోదావరి ఇక్కడ ప్రవహిస్తున్నాయి. అడవులు, బొగ్గు, సున్నపురాయి, కలప, గ్రానైట్ మొదలైన వాటితో ఈ ప్రాంతం సుసంపన్నమైంది. ఈ సంపదలేవీ తెలంగాణ ప్రజలకు దక్కడం లేదు. పక్కనే జీవనదులు ప్రవహిస్తున్నప్పటికీ ఈ ప్రాంత భూములు బీళ్ళవుతున్నాయి. ఈ ప్రాంతపు భూములను ముంపుకు గురిచేసి, ప్రజలను నిర్వాసితులను చేసి కృష్ణా, గోదావరి నదుల మీద కడుతున్న ప్రాజెక్టులు కోస్తాంధ్ర సంపన్న భూస్వాముల భూములను సస్యశ్యామలం చేస్తున్నాయి. ఇక్కడ పరిశ్రమలను స్థాపించకుండా, లభిస్తున్న వనరులను బయటికి తరలించడంతో పారిశ్రామిక ప్రగతి లేకుండాపోయింది. ఈ ప్రాంతంలో ఎంతో కాలం నుండి ఉన్న డి.బి.ఆర్. మిల్లు, అంతర్గాం మిల్లు, సిర్పూర్ సర్‌సిల్క్ మిల్లు, సిరిసిల్లా రాజరాజేశ్వరి మిల్లు, ఆల్విన్ ఆటో యూనిట్, రిపబ్లిక్ ఫోర్జ్ కంపెనీ, మిర్యాలగూడ చక్కెర మిల్లు, హైదరాబాద్ థర్మల్ ప్రాజెక్ట్ ఇప్పటికే మూతపడ్డాయి. ఇందులో కొన్ని పరిశ్రమల గురించి ఈ తరానికి తెలియనే తెలియదు. బోధన్, మెదక్ చక్కెర మిల్లులు, రామగుండం ఎరువుల కర్మాగారం, ఆజాంజాహి మిల్లు మూతపడడానికి సిద్ధంగా ఉన్నాయి. ఈ ప్రాంతంలో నడుస్తున్న కొద్దిపాటి పరిశ్రమల్లోనయినా, జంటనగరాల్లోని ప్రభుత్వాఫీసుల్లోనయినా కింది స్థాయి ఉద్యోగాల్లో మాత్రమే స్థానికులు కనిపిస్తారు. కమలాపూర్ రేయాన్స్ ఫ్యాక్టరీ వంటి పరిశ్రమలు అక్కడి అటవీ సంపదను కొల్లగొడుతున్నాయి గాని స్థానిక ఆదివాసులకు ఎలాంటి బ్రతుకుదెరువును చూపడం లేదు.

తెలంగాణ ప్రాంతంలో సాగు నీటి వసతి ఉన్న కొద్దిపాటి భూములు స్థానిక రైతులకు దక్కకుండా పోతున్నాయి. సాగునీటి కాలువలు లేనిచోట బావుల మీద ఆధారపడి వ్యవసాయం చేద్దామనుకున్న వారికి కరెంటు దొరకదు. దొరికినా లోఓల్టేజి. ఈ ప్రాంతంలో ఉత్పత్తి అవుతున్న కరెంటు ఈ ప్రాంతంలో ఉపయోగానికి రాదు. వీటికి తోడు అనావృష్టి ఈ ప్రాంత రైతుల జీవితాలతో చెలగాటమాడుతున్నది. తినడానికి తిండి లేక, చేయడానికి పని లేక లక్షల సంఖ్యలో ప్రజలు వలసపోతారు. తమ కాళ్ళ కింది భూమి కదిలిపోయి, అడవి మీద హక్కు కోల్పోయి ఆదివాసులు అలమటిస్తున్నారు. గోదావరి లోయ వెంబడి ఆదివాసుల చేతుల్లో ఉన్న వేలాది ఎకరాల నల్లరేగడి భూములను కబ్జా చేసుకొని వలస పెత్తందార్లు, భూస్వాములు తిష్ఠ వేసారు. హైదరాబాద్, రంగారెడ్డి, మహబూబ్‌నగర్, మెదక్, నల్గొండ జిల్లాల్లో జంటనగరాలకు చుట్టుపక్కల వందల, వేల ఎకరాల భూమినంతా వ్యవసాయ క్షేత్రాల కొరకు, పండ్ల తోటల కొరకు రియల్ ఎస్టేట్ వ్యాపారం కొరకు కోస్తాంధ్ర సంపన్న వర్గాలు ఆక్రమించుకున్నాయి. జంటనగరాల్లో, ఈ ప్రాంతంలోని ఇతర జిల్లాల్లో ముస్లిం మైనారిటీలు దారుణమైన వివక్షకు, అణచివేతకు గురయ్యారు. కనీస అవసరాలు కూడ తీరని పేదరికంలోకి నెట్టి వేయబడ్డారు. దళితులు, బహుజనులు, స్త్రీలు సామాజిక ఉత్పత్తిలో సమానత్వ హోదా లేక, సాటి మనుషులుగా గౌరవం లేక వివక్షకు గురయ్యారు. తెలంగాణ భాష, మాండలిక వ్యక్తీకరణ, సంస్కృతి అవమానానికి, ఎగతాళికి గురయ్యాయి.

కనీస అవసరాల కొరకు, జీవించే హక్కు కొరకు పోరాడుతున్న తెలంగాణ ప్రజలు రాజ్యహింస ఉక్కుపాదం కింద నలిగిపోతున్నారు. పోలీసు క్యాంపులు పెట్టి, సరిహద్దు భద్రతా దళాలను, పారా మిలిటరీ బలగాలను రప్పించి, ఇక్కడి ప్రజలను బూటకపు ఎన్‌కౌంటర్లలో విచ్చలవిడిగా చంపుతున్నారు. గ్రామాల్లో, పట్టణాల్లో పేద ప్రజల మీద పాశవికమైన దమనకాండను అమలు చేస్తూ మొత్తం తెలంగాణ ప్రాంతాన్ని ఒక నిర్బంధ శిబిరంగా మార్చివేసారు.

కోస్తాంధ్ర ప్రాంతానికి చెందిన అగ్రకుల సంపన్నవర్గం తెలంగాణ జనజీవాలను పీల్చివేస్తున్నది. దేశంలోని బడా పారిశ్రామికవేత్తలు దీనికి అండగా ఉన్నారు. వెనుకబడిన ప్రాంతపు వనరులను దోపిడీ చేస్తూ, అక్కడి ప్రజలను అణచివేతకు గురి చేస్తూ, ఒక చిన్న వర్గ దోపిడీ కూటమి సంపదలను పోగు చేసుకునే, విలాసాలతో జీవించే ఈ అభివృద్ధి విధానాన్ని బహుళజాతి గుత్త సంస్థలు, ప్రపంచబ్యాంకు నిర్దేశిస్తున్నాయి. ఇది సామ్రాజ్యవాద రాజకీయార్థిక విధానం. ఏ చిన్న పని చేయాలన్నా ప్రపంచ బ్యాంకు నుండి అప్పుతేవడం మన పాలకులకు ఒక పద్ధతిగా మారిపోయింది. అప్పులిస్తున్న ప్రంచబ్యాంకు మన ఆర్థిక పారిశ్రామిక విధానాలలో సామ్రాజ్యవాద ప్రపంచ మార్కెట్‌కు అవసరమైన మార్పులు చేయాలని షరతులు విధిస్తున్నది. అప్పు తీసుకున్నప్పుడు ఇలాంటి షరతులను పాటించక తప్పదని మన పాలకులు బాహాటంగానే చెపుతున్నారు. సరళీకృత ఆర్థిక విధానం, నూతన పారిశ్రామిక విధానం మనకు అలాగే వచ్చాయి. వీటన్నింటికి ప్రైవేటీకరణ ఇరుసులాంటిది. పరిశ్రమలు, విద్య, వైద్యం, విద్యుత్తు, రవాణా, కమ్యూనికేషన్లు, బ్యాంకింగ్ వంటి అనేక కీలక రంగాలు ఇప్పటికే ప్రైవేటీకరణ వలలో చిక్కుకున్నాయి. సంపన్న వర్గాలకు మాత్రమే ప్రయోజనాన్ని కల్పించే హైటెక్నాలజీ, కంప్యూటర్ వ్యవస్థ

ప్రైవేటీకరణకు తోడయ్యాయి. అభివృద్ధికి ఇంతకంటే మించి మరో మార్గం లేదని సామ్రాజ్యవాద మార్కెట్ సంస్కృతి మనల్ని నమ్మించడానికి ప్రయత్నిస్తున్నది. ఈ అభివృద్ధి విధానం, ఈ సంస్కృతి ఇవాళ ప్రజలకు ప్రధాన శత్రువులు. ఈ రకమైన దోపిడీ అభివృద్ధి విధానానికి తెలంగాణ ప్రాంతంతో పాటు, రాయలసీమ, ఉత్తరాంధ్ర, కోస్తాంధ్రలోని మెట్ట ప్రాంతాలు కూడా బలయ్యాయి.

తెలంగాణ రాష్ట్రం కొరకు పోరాడే ప్రజలు కోస్తాంధ్ర ప్రజలకు గాని, రాయలసీమ, ఉత్తరాంధ్ర ప్రజలకు గాని వ్యతిరేకం కాదు. సాగునీరు, కరువు, తదితర సమస్యల మీద పోరాటం చేస్తున్న రాయలసీమ ప్రజలకు తెలంగాణ ప్రజలు సంఘీభావాన్ని ప్రకటిస్తున్నారు. ఈ ప్రాంత ప్రజలు తమ సమస్యల పరిష్కారం కొరకు చేస్తున్న పోరాటంలో ఇతర ప్రాంతాల ప్రజలందరి మద్దతును కోరుతున్నారు.

గత నాలుగు దశాబ్దాల పాటు ఆంధ్రప్రదేశ్‌లో అధికారంలో ఉన్న కాంగ్రెస్, తెలుగుదేశం ప్రభుత్వాలు, ఆ పార్టీలు తెలంగాణ ప్రజలకు జరిగిన అన్యాయాలకు బాధ్యత వహించాలి. ఈ ప్రాంత ప్రజలకు జరిగిన అన్యాయాలకు కారణాలను సరిగా గుర్తించకుండా తెలంగాణ రాష్ట్ర ఉద్యమాన్ని వ్యతిరేకిస్తున్న పార్టీలు ప్రజలను ఇంకా మభ్యపుచ్చడానికే ప్రయత్నిస్తున్నాయి.

చిన్న రాష్ట్రాల ఏర్పాటు కావాలని కోరుతూ తెలంగాణ రాష్ట్ర ఉద్యమానికి పూనుకున్న బి.జె.పి. వైఖరి వాస్తవానికి ఫెడరల్ రాజ్య వ్యవస్థకు, ప్రజాస్వామ్యానికి విరుద్ధమైనది. ప్రజల ప్రజాస్వామిక హక్కుల పట్లగాని, స్వావలంబన అభివృద్ధి విధానం పట్లగాని దానికి చిత్తశుద్ధి లేదు. దేశ భక్తి గురించి, స్వదేశీ గురించి గొంతు చించుకునే బి.జె.పి. సామ్రాజ్యవాదానికి బంటుగా పనిచేయడానికి వెనుకాడదని తాను అధికారంలోకి వచ్చిన రాష్ట్రాలలో అది నిరూపించుకున్నది. మహారాష్ట్రలో ఎన్‌రాన్‌కు ఇచ్చిన అనుమతి ఇందుకు ఒక ఉదాహరణ. బలహీనమైన చిన్న రాష్ట్రాలతో, బలమైన కేంద్రంతో భారత సంపన్న పారిశ్రామిక భూస్వామ్య వర్గాల ఏజెంట్‌గా సామ్రాజ్యవాదానికి మన దేశంలో మార్కెట్ సృష్టించి సేవ చేయాలనే బి.జె.పి. ప్రణాళికలో అది చెపుతున్న తెలంగాణ రాష్ట్రం ఒక భాగం. బి.జె.పి. లక్ష్యం నెరవేరితే ప్రజలు మరింత దోపిడీ పీడనలకు గురవుతారు. బి.జె.పి. పాచిక పారకుండా చూడవలసిన బాధ్యత ప్రజలమీద, సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాస్వామిక శక్తుల మీద ఉంది.

ఇప్పుడు ప్రభుత్వాలకు వస్తున్న ఆదాయంలో 70% కేంద్రానికి, 30% రాష్ట్రాలకు చెందుతున్నది. తలసరి ఆదాయం తక్కువగా ఉన్న రాష్ట్రాలకు ఈ పంపిణీ వల్ల వచ్చే వాటా శాతం పెరుగుతుంది. తెలంగాణ ప్రాంతంలో ఉన్న వెనుకబాటుతనం, పేదరికం కారణంగా తలసరి ఆదాయం తగ్గి ఆంధ్రప్రదేశ్‌కు పంపిణీ అవుతున్న నిధుల శాతం ఎక్కువగానే ఉంది. తెలంగాణ వలన వస్తున్న ఈ అదనపు కేటాయింపులు మాత్రం తెలంగాణ అభివృద్ధికి దక్కడం లేదు. ప్రపంచ బ్యాంకు నుండి తెస్తున్న అప్పులతో చేపడుతున్న పనులు కూడా అత్యధికంగా ఆంధ్రప్రాంతంలోనే ఉంటున్నాయి. ఈ అప్పుల భారం, వాటి మీద వడ్డీ భారం మాత్రం తెలంగాణ ప్రజలు కూడా మోస్తున్నారు. ఇకపై తెలంగాణకు ప్రపంచ బ్యాంకుగానీ మరే ఇతర సామ్రాజ్యవాద సంస్థల నుండి గానీ అప్పులు వద్దు. అలాగే ఇప్పటికే తెచ్చిన అప్పుల భారం కూడా తెలంగాణ ప్రజలు మోయరు.

కేంద్ర రాష్ట్ర సంబంధాలు ఫెడరల్ విధానంలోకి మారవలసిన అవసరం ఉంది. అధికారాలలోగాని, నిధుల పంపిణీలోగాని అత్యధిక భాగం రాష్ట్రాలకే చెందాలి. కేంద్ర రాష్ట్ర సంబంధాలను ఇప్పుడున్న స్థితి నుండి రాష్ట్రాల ప్రయోజనాలకు అనుకూలంగా మార్చాలని సర్కారియా కమిషన్ చేసిన సిఫార్సులను అమలు చేయాలి.

తెలంగాణ ప్రజల సమస్యలకు పరిష్కారం కేవలం రాష్ట్రం ఏర్పాటులో మాత్రమే లేదు. సామ్రాజ్యవాదం, ప్రపంచ బ్యాంకు నిర్దేశిస్తున్న విధానాల్లో ఈ ప్రాంత ప్రజలకు అభివృద్ధి లేదు. ఆ మాటకొస్తే ఏ ప్రాంత ప్రజలకైనా ఈ విధానాల్లో అభివృద్ధి ఉండదు. స్థానిక వనరులతో స్వావలంబన విధానాలతో కింది నుండి జరిగే అభివృద్ధే నిజమైన అభివృద్ధి. తెలంగాణలో అన్ని జిల్లాల్లోని ప్రజల నిర్దిష్టమైన సమస్యలకు నిర్దిష్టమైన పరిష్కార మార్గాలను చూపే అభివృద్ధి విధానం కావాలి. అన్ని ప్రజా సముదాయాలకు ఈ అభివృద్ధి సమతూకంలో అందాలి. ప్రజల జీవించే హక్కు మీద నిర్విచక్షణగా జరుగుతున్న దాడులను పూర్తిగా నిలువరించే, ప్రజలకు నిజమైన ప్రాతినిధ్యాన్ని వహించే ప్రజా రాజకీయ వ్యవస్థ కలిగిన తెలంగాణ రాష్ట్రం కావాలి. దీన్ని మనం ప్రజాస్వామ్య తెలంగాణ అందాం.

ఈ ప్రజాస్వామ్య తెలంగాణ రాష్ట్రాన్ని లక్ష్యంగా పెట్టుకుని ప్రభుత్వంతో, పాలక వర్గాలతో, ఆ పాలక వర్గాలకు ప్రాతినిధ్యం వహించే అధికార రాజకీయ వ్యవస్థతో, దానికి వెన్ను దన్నుగా నిలుస్తున్న సామ్రాజ్యవాదంతో పోరాటం చేయాలి. ఈ లక్ష్యంతో, విధానాలతో ఏకీభవించే అన్ని ప్రజాస్వామిక శక్తులతో కలసి ఈ పోరాటాన్ని ముందుకు తీసుకుపోవాలి. ఈ అవగాహనతో ఈ కింద పేర్కొన్న తెలంగాణ ప్రజల సమస్యల మీద నిర్దిష్టమైన పరిష్కార మార్గాలకు కట్టుబడి తెలంగాణ రాష్ట్రం కొరకు పోరాటాన్ని కొనసాగిస్తామని తెలియజేస్తున్నాం.

## డిమాండ్లు :-

1. ప్రజల ప్రజాస్వామిక ఆకాంక్షలకు అద్దం పట్టే విధంగా ప్రజాస్వామ్య తెలంగాణ రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలి. ప్రజలకు తిండి, బట్ట, ఇల్లు, విద్య, వైద్యం వంటి మౌలిక జీవితావసరాలు, స్వేచ్ఛ, గౌరవం ఉండే విధంగా ప్రజాస్వామ్య తెలంగాణ ఏర్పడాలి.
2. భూ సంస్కరణ చట్టాల్ని హేతుబద్ధంగా సవరించి సమగ్ర భూసంస్కరణల విధానాన్ని రూపొందించి అమలుచేయాలి. దున్నేవానికి భూమి హక్కును చెప్పిన కౌల్దారీ చట్టాన్ని అమలుచేయాలి. ప్రభుత్వ బంజరు భూములను, దేవదాయ,

ఇనాం, తదితర భూములను భూమి లేని పేద రైతాంగానికి పంచాలి.

3. ఏజెన్సీ ప్రాంతాల్లో 1/70 చట్టాన్ని బేషరతుగా అమలు చేయాలి. గిరిజనేతరుల స్వాధీనంలో నున్న ఏజెన్సీ భూములను గిరిజనులకు ఇప్పించాలి.

4. వ్యవసాయ యోగ్యమైన భూమి అంతటికి సాగునీటి వసతిని కల్పించాలి. అయితే ఇందుకొరకు భారీ ప్రాజెక్టుల నిర్మాణాన్ని చేపట్టకూడదు. భారీ ప్రాజెక్టుల వల్ల ప్రజలు నిర్వాసితులవుతారు. వ్యవసాయ భూమి, అడవి ముంపుకు గురవుతాయి. పర్యావరణ సమస్యలు వస్తాయి. అందువల్ల చిన్న, మధ్యతరహా నీటి పారుదల ప్రాజెక్టులను, చెక్ డ్యాంలను, ఊట చెరువులను, వాటర్‌షెడ్ పథకాలను నిర్మించాలి. చెరువులను, కుంటలను బాగు చేయాలి.

5. గోదావరి మీద ఇచ్చంపల్లి సాగు నీటి ప్రాజెక్టును మాత్రమే నిర్మించాలి. వ్యవసాయ భూములు, అడవి ముంపుకు గురి కాని రీతిలో ఇటువంటి ప్రాజెక్టులుండాలి. తెలంగాణలోని నల్లగొండ రైతాంగాన్ని, గుంటూరు మెట్ట ప్రాంత రైతాంగాన్ని ముంపుకు గురిచేసే పులిచింతల ప్రాజెక్టును నిలిపివేయాలి. ఇందుకు ప్రత్యామ్నాయంగా చిన్నతరహా సాగు నీటి ప్రాజెక్టులను చేపట్టాలి.

6. నదీ జలాలను వెనుకబడిన ప్రాంతాల అవసరాల ప్రాతిపదిక మీద, జనాభా, భూవిస్తీర్ణం ప్రాతిపదికల మీద పంపిణీ చేయాలి.

7. వరంగల్ జిల్లాలోని చేర్యాల, ఘనపూర్, జనగాం, కరీంనగర్ జిల్లాలోని హుస్నాబాద్, మహదేవ్‌పూర్, సిరిసిల్ల, నల్గొండ జిల్లాలోని ఆలేరు, భువనగిరి ప్రాంతాలకు ఎత్తిపోతల పథకం ద్వారా సాగునీటి వసతిని కల్పించాలి. జిల్లా అంతటా చిన్న నీటి వనరులను ఉద్ధరించి మరమ్మతులు చేయాలి.

8. కృష్ణా, తుంగభద్ర నదుల నుండి కరువు పీడిత మహబూబ్‌నగర్ జిల్లాకు సాగునీటిని అందించాలి.

9. హైదరాబాదులోని సంపన్న వర్గాల కాలనీవాసులకు నీరందించే విధంగా వాడుకుంటున్న సింగూరు జలాశయం నుండి మెదక్ జిల్లాలో సాగునీటి వసతిని కల్పించాలి.

10. గోదావరి, పెన్‌గంగ, తదితర వనరుల నుండి ఆదిలాబాద్ జిల్లాలో సాగు నీటి, తాగు నీటి వసతులను కల్పించాలి. నీటి ఆయకట్టు పరిధిలో కోస్తా పెత్తందార్ల భూమి కొనుగోళ్ళను నిలిపివేయాలి.

11. శ్రీశైలం ఎడమగట్టు కాలువ నుండి సొరంగ మార్గం ద్వారా నల్గొండ జిల్లాకు నీరందించాలి. నాగార్జున సాగర్ ఎడమగట్టు కాలువ నుండి ఎత్తి పోతల పథకాలను విస్తరించి తెలంగాణకు రావలసిన న్యాయమైన నీటి వాటాను ఇవ్వాలి.

12. శ్రీరాంసాగర్ ప్రాజెక్టును వేగంగా పూర్తి చేసి వరంగల్, ఖమ్మం జిల్లాలకు సాగు నీటి వసతిని కల్పించాలి. ఈ ప్రాజెక్టు నుండి వరద కాలువ నిర్మాణాన్ని చేపట్టాలి.

13. కృష్ణా, తుంగభద్ర నదుల నుండి మహబూబ్‌నగర్ జిల్లాకు సాగునీటి వసతిని కల్పించి అక్కడి కరువును రూపుమాపాలి.

14. తెలంగాణ ప్రాంత భూములను ముంపుకు గురి చేసే పోలవరం ప్రాజెక్టును నిలిపివేసి, ప్రత్యామ్నాయంగా చిన్న చిన్న ప్రాజెక్టులను నిర్మించాలి.

15. గోవనూరు ప్రాజెక్టును నిర్మించడం ద్వారా శ్రీరాంసాగర్‌లో ఇసుక మేట వేయడాన్ని నిరోధించాలి. నిజాంసాగర్, సింగూర్ ప్రాజెక్టుల్లో కూడ ఇసుక మేటలను తొలగించాలి.

16. ఉత్పత్తిలో, ప్రజా సేవ రంగాలలో ప్రైవేటీకరణను నిరోధించాలి. పరిశ్రమలు, విద్యుత్తు, రవాణా సౌకర్యాలు, కమ్యూనికేషన్లు, విద్య, వైద్యం తదితర అన్ని కీలక రంగాలు ప్రభుత్వ రంగంలోనే ఉండాలి. ఇప్పటికే ఉన్న ప్రైవేటు రంగాలలో దళితులకు, వెనుకబడిన తరగతులకు, స్త్రీలకు, మైనారిటీలకు రిజర్వేషన్లు కల్పించాలి. క్రమంగా ప్రైవేటు రంగాన్ని పబ్లిక్ రంగంగా మార్చాలి.

17. సరళీకృత ఆర్థిక విధానాల వలన ఇప్పటికే వృత్తులు కోల్పోయిన కులాల, కుటుంబాల భద్రతకు అవసరమైన సామాజిక భద్రతా చర్యలను రూపొందించి అమలు చేయాలి.

18. విద్యుచ్ఛక్తి బోర్డును ప్రైవేటీకరించకూడదు. తెలంగాణ ప్రాంతానికి జనాభా ప్రాతిపదిక మీద, అవసరాల ప్రాతిపదిక మీద విద్యుచ్ఛక్తిని కేటాయించాలి. లో వోల్టేజ్, కరెంటు కోత లేకుండా చూడాలి.

19. రక్షిత మంచి నీటి పథకాలను అన్ని గ్రామాలకు అందించి ఫ్లోరైడ్ సమస్య నుండి ప్రజలను రక్షించాలి.

20. ఉత్పత్తిలో స్వదేశీ స్వావలంబన విధానాలను పాటించాలి. ప్రజలకు ఉపయోగపడని హైటెక్నాలజీని, భారీ యంత్రాలను, విదేశీ పెట్టుబడిని, విదేశీ సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించకూడదు.

21. ప్రపంచ బ్యాంకు నుండి, ఇతర అంతర్జాతీయ ద్రవ్య సంస్థల నుండి అప్పు తెచ్చి చేసే అభివృద్ధి విధానాన్ని విడనాడాలి. ప్రత్యామ్నాయంగా తక్కువ పెట్టుబడులతో ఎక్కువ ఉపాధి అవకాశాలతో చిన్న, మధ్య తరహా పరిశ్రమలను స్థాపించాలి.

22. సర్‌సిల్క్ మిల్లు, ఆల్విన్ ఆటో యూనిట్, రిపబ్లిక్ ఫోర్జ్ కంపెనీ, మిర్యాలగూడ చక్కెర మిల్లు, అంతర్గాం మిల్లు, వంటి అన్ని పరిశ్రమలను పునరుద్ధరించాలి. ఆజాం జాహి మిల్లు, రామగుండం ఎరువుల కర్మాగారం, బోధన్, ఆదిలాబాద్ స్పిన్నింగ్ మిల్లు మూసివేతకు సిద్ధంగా ఉన్న తదితర మిల్లులన్నింటిని ఆదుకొని, వాటిని సక్రమంగా నిర్వహించాలి.

23. పరిశ్రమలను ప్రభుత్వరంగంలో స్థాపించాలి. పరిశ్రమలను స్థాపించడానికి స్థానిక పారిశ్రామికవేత్తలకు ప్రోత్సాహాన్ని ఇవ్వాలి. ఇవి వ్యవసాయ సంబంధమైన పరిశ్రమలు, స్థానిక వనరుల మీద ఆధారపడిన పరిశ్రమలు అయి ఉండాలి.

24. పర్యావరణ కాలుష్యాన్ని నివారించి ప్రజల ఆరోగ్యాన్ని, జీవించే హక్కును కాపాడాలి. పర్యావరణ కాలుష్య నివారణ చర్యలను చేపట్టని పరిశ్రమలను మూసివేసి, వాటిలో పనిచేస్తున్న కార్మికులకు ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేయాలి.
25. పశుసంపదను హరించి వేసే అల్-కబీర్ యాంత్రిక పశు వధశాలలను మూసివేయాలి. ఇలాంటి పశు వధశాలలకు మున్ముందు అనుమతి ఇవ్వకూడదు.
26. మానవ వనరులను పూర్తిగా సద్వినియోగ పరుచుకునే ఉత్పత్తి విధానాన్ని చేపట్టి, పని హక్కును గ్యారంటీ చేయాలి. ప్రజల ఉపాధి అవకాశాలను దెబ్బ తీసే హైటెక్ యాంత్రీకరణ విధానాలను విడనాడాలి.
27. బాగా వెనుకబడిన ప్రాంతాలకు, బాగా వెనుకబడిన ప్రజలకు మౌలిక అవసరాలను తీర్చే విధంగా అభివృద్ధి ప్రాధాన్యతలు ఉండాలి.
28. తెలంగాణ ప్రాంతంలోని అన్ని వనరులను అన్ని జిల్లాలకు హేతుబద్ధంగా పునఃపంపిణీ చేయాలి.
29. సింగరేణి బొగ్గు గనుల నుండి బొగ్గును తెలంగాణ ప్రజల అవసరాలను తీర్చే విధంగా వాడుకోవాలి. అదనపు బొగ్గును మాత్రమే బయట ప్రాంతాలకు ఇవ్వాలి.
30. ప్రజల ప్రజాస్వామిక హక్కులకు పూర్తిగా గ్యారంటీ ఉండాలి. తిండి, బట్ట, ఇల్లు కొరకు పోరాడే హక్కు ప్రజలకుండాలి. ప్రజల మీద కొనసాగుతున్న భయంకరమైన రాజ్యహింస నిలిచిపోవాలి. పోలీసు క్యాంపులను ఎత్తి వేయాలి. బూటకపు ఎన్‌కౌంటర్లను మానుకోవాలి. బి.ఎస్.ఎఫ్., సి.ఆర్.పి.ఎఫ్. తదితర పారా మిలిటరీ బలగాలను వెనుకకు పంపాలి. ఎలాంటి రాజకీయ అభిప్రాయాలపైన నిషేధం ఉండకూడదు.
31. టాడా, పబ్లిక్ సెక్యూరిటీ యాక్టు వంటి వాటి కింద దీర్ఘకాలం జైల్లో ఉన్న రాజకీయ ఖైదీలను బేషరతుగా విడుదల చేయాలి.
32. శ్రమకు తగిన ఫలితం సూత్రం మీద ఆధారపడి కనీస వేతన చట్టాన్ని సవరించి అమలు చేయాలి. స్త్రీ పురుషులకు సమాన పనికి సమాన వేతనం ఉండాలి. వెట్టిచాకిరీని నిర్మూలించాలి.
33. వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికి, బలహీన వర్గాల సమస్యల పరిష్కారానికి బడ్జెట్ నిధులను ఎక్కువగా కేటాయించాలి. ప్రణాళికేతర ఖర్చును తగ్గించుకొని ప్రణాళికా ఖర్చును పెంచాలి.
34. బ్యాంకు అప్పుల్లో అత్యధిక భాగం వ్యవసాయ రంగానికి ఇవ్వాలి.
35. శ్రీశైలం, దిండి ప్రాజెక్టుల కింద ముంపునకు గురయిన భూములకు నష్టపరిహారం ఇవ్వాలి. నిర్వాసితులకు పునరావాసాన్ని కల్పించాలి.
36. మహబూబ్‌నగర్ జిల్లా ప్రజలకు ఉపాధిని కల్పించి ఇతర ప్రాంతాలకు తరలివెళ్ళే వలసలను నిరోధించాలి.
37. రంగారెడ్డి, మెదక్, నల్గొండ, మహబూబ్‌నగర్ జిల్లాలో జంటనగరాలను ఆనుకొని కోస్తాంధ్ర భూస్వాముల, తదితరుల చేతుల్లో ఉన్న రియల్ ఎస్టేట్ భూములను, ఆంధ్రా కాలనీల భూములను స్వాధీన పరచుకొని ఆ జిల్లాల పేదలకు పంచి పెట్టాలి.
38. ఖమ్మం జిల్లాలో కోస్తాంధ్ర సంపన్నుల ఆధిపత్యాన్ని తొలగించాలి. ఉపాధి రంగంలో, రవాణా రంగంలో, కాంట్రాక్టు రంగంలో, ఇతర వృత్తులలో స్థానికులకు, ఆదివాసులకు అవకాశాలను ఇవ్వాలి.
39. జంట నగరాలలో చుట్టు ప్రక్కల ప్రాంతాలలో సినీ నిర్మాతలు, తదితరులు ఆక్రమించుకున్న విలువైన భూములను, సంపదలను స్వాధీనపరచుకొని ప్రజలకు పంచాలి.
40. కరెన్సీ, రక్షణ కమ్యూనికేషన్స్ వంటి వాటి విషయంలో కేంద్రం అధికారాలను కలిగి ఉండి, మిగిలిన అధికారాలను రాష్ట్రాలకు ఇవ్వాలి. ఆదాయ వనరుల పంపిణీ కేంద్రానికి 30 శాతం, రాష్ట్రాలకు 70 శాతం ఉండాలి.
41. ఆదివాసులకు స్వయంపాలనాధికారాన్ని రాజ్యాంగరీత్యా గుర్తించి అమలుచేయాలి. ఏజెన్సీ భూముల మీద, అటవీ సంపద మీద వారికి మినహాయింపు లేని హక్కు ఉండాలి. ఆదివాసుల అభివృద్ధి కొరకు ఏర్పడిన ఏజెన్సీలలో నిర్ణయాధికారం వారికే ఉండాలి.
42. ఏజెన్సీ ప్రాంతాల్లోకి గిరిజనేతరుల చొరబాటును నిరోధించాలి. ఆ ప్రాంత ఉపాధి అవకాశాలన్నీ వారికే చెందాలి. గిరిజనులకు పరిశ్రమల్లో ప్రాతినిధ్యాన్ని, వాటాను చట్టబద్ధంగా ప్రకటించాలి.
43. ఆదిలాబాదు జిల్లా వెనుకబాటుతనాన్ని ఆసరాగా తీసుకొని ఆ జిల్లాలో స్థానికులకు చెందవలసిన ఉద్యోగాలలో ఇతర జిల్లాల వారిని నియమించే పద్ధతిని విడిచిపెట్టాలి. వాటిలో స్థానికులను నియమించాలి.
44. గిరిజనుల భాషకు, సంస్కృతికి రక్షణ కల్పించాలి.
45. అగ్రవర్ణ హిందూ బ్రాహ్మణీయ భావ జాలాన్ని నిర్మూలించాలి. కులవివక్షను, అంటరానితనాన్ని రూపుమాపాలి. సాంఘిక అసమానతలను తొలగించాలి. దళితులపై అగ్రవర్ణాల దాడులను నిలువరించాలి.
46. పురుషస్వామ్య భావజాలాన్ని నిర్మూలించాలి. స్త్రీలపై అమలవుతున్న మగపెత్తనాన్ని, స్త్రీలపై జరుగుతున్న అత్యాచారాలను రూపుమాపాలి. ఉత్పత్తిలో, ఇంటిపనిలో స్త్రీ పురుషులకు సమాన భాగస్వామ్యం ఉండాలి.
47. సామ్రాజ్యవాద విష సంస్కృతికి వ్యతిరేకంగా పోరాడాలి. మార్కెట్ సంస్కృతిని, వస్తు వినిమయ సంస్కృతిని, స్త్రీని సరుకుగా చూసే సంస్కృతిని రూపు మాపాలి.
48. తెలంగాణ భాషకు, సంస్కృతికి తగిన గౌరవాన్ని, ప్రతిపత్తిని కల్పించాలి.
49. జంటనగరాలలోనూ, తెలంగాణలోని ఇతర ప్రాంతాలలో

ముస్లిం మైనారిటీల మీద కొనసాగుతున్న వివక్షను రూపుమాపాలి. వారి విద్యావకాశాలను, ఉపాధి అవకాశాలను మెరుగుపరచాలి.

50. తెలంగాణలో ఉర్దూ రెండవ అధికార భాష. ఆ భాషా సాహిత్యాలకు తగిన గౌరవ ప్రతిపత్తిని కల్పించాలి.

51. విద్యను ప్రాథమిక హక్కుగా గుర్తించాలి. విద్యారంగంలో ప్రైవేటీకరణను నిర్మూలించి, ప్రభుత్వ రంగంలోనే విద్య అందరికీ అందుబాటులోకి వచ్చేలా చూడాలి. విద్యా యాజమాన్యాన్ని ఒకే గొడుగు కిందికి తేవాలి. నిరక్షరాస్యతను పూర్తిగా నిర్మూలించాలి. వ్యవసాయానికి, అనుబంధ పరిశ్రమలకు దోహదపడే విద్యను, శాస్త్రీయ విద్యను అందించాలి. విద్యా సంస్థలలో విద్యార్థి ఎన్నికలు నిర్వహించాలి.

52. వైద్యాన్ని ప్రభుత్వ రంగంలోనే ఉంచాలి. ప్రజల అవసరాలకు తగిన విధంగా ఆధునిక వైద్య పరికరాలతో కూడిన వైద్యశాలలను నెలకొల్పాలి. ప్రైవేట్ వైద్యశాలలను మూసివేయాలి.

53. జనాభా ప్రాతిపదిక మీద అన్ని ప్రజాసముదాయాలకు విద్యా ఉద్యోగ అవకాశాలలో రిజర్వేషన్ల పునఃపంపిణీ జరగాలి. తెలంగాణ ప్రాంతాలలో విద్యా ఉద్యోగ అవకాశాలు స్థానికులకే దక్కాలి. ఎస్.సి., ఎస్.టి.లకు ఇచ్చే రిజర్వేషన్లను వివిధ కులాల, తెగల జనాభా ప్రాతిపదికను పునర్వర్గీకరించాలి.

54. బ్యాంకులు ఇచ్చే అప్పులు ఎక్కువగా వ్యవసాయ రంగానికే చెందాలి. వ్యవసాయ ఉత్పత్తులకు, అటవీ ఉత్పత్తులకు గిట్టుబాటు ధరలు లభించేలా చూడాలి.

55. పెద్దపల్లి నుండి నిజామాబాదుకు రైల్వే మార్గాన్ని త్వరగా పూర్తిచేయాలి.

56. మహబూబ్‌నగర్ జిల్లాలో టైగర్ ప్రాజెక్టును ఎత్తివేయాలి.

57. పరిశ్రమల వ్యర్థ పదార్థాలను మూసీనదిలోకి వదలకుండా చూడాలి. ఈ వ్యర్థ పదార్థాల వలన తలెత్తిన పర్యావరణ కాలుష్యం, తాగునీటి కొరత, వ్యవసాయ భూములు పనికి రాకుండా పోవడం వంటి సమస్యలను పరిష్కరించాలి.

58. తెలంగాణ ప్రాంత పరిశ్రమల్లో వచ్చిన లాభాలను ఈ ప్రాంత అభివృద్ధికే ఖర్చు చేయాలి.

59. ఆరు సూత్రాల పథకాన్ని ఉల్లంఘించి తెలంగాణా ప్రాంతం వారికి చెందవలసిన ఉద్యోగాల్లో చేరిన తెలంగాణేతరులను వారి వారి ప్రాంతాల్లో ఉద్యోగాల్లో నియమించి ఏర్పడిన ఖాళీల్లో తెలంగాణ వారిని నింపాలి.

60. సంపూర్ణ మద్యపాన నిషేధాన్ని ప్రజల భాగస్వామ్యంతో పటిష్టంగా అమలు చేయాలి.

# కె.వి.ఆర్. తొలి స్మారకోపన్యాసం

**- విరసం నెల్లూరు యూనిట్**

విరసం నెల్లూరు యూనిట్ ఆధ్వర్యంలో 20 ఫిబ్రవరి, 2011న కావలిలో కె.వి.ఆర్. స్మారకోపన్యాస కార్యక్రమం జరిగింది. హైదరాబాద్‌లోని కేంద్రీయ విశ్వవిద్యాలయ విశ్రాంత ప్రొఫెసర్ వకుళాభరణం రామకృష్ణ 'భారతీయ సంస్కృతి: వాస్తవాలు, అపోహాలు' అనే విషయంపై మాట్లాడారు.

భారతీయ సంస్కృతిలో ఆధ్యాత్మికత పాలు ఎక్కువన్నది ఒక అపోహ అన్నారు. ఆధ్యాత్మికత ఏ స్థాయిలో ఉందో, అదే స్థాయిలో భౌతికత కూడా ఉందన్నది వాస్తవం అన్నారు. ప్రాచీనులు 'శరీర మాద్యంఖలు ధర్మసాధనం' అన్నారనీ, అంటే అన్ని ధర్మాలు సాధించాలంటే శరీరం ముఖ్యమని అభిప్రాయపడ్డారని అన్నారు.

ప్రామాణిక తత్వావేత్తగా భావింపబడే రాధాకృష్ణన్ కూడా ప్రాక్పశ్చిమాల మధ్య పెద్దగా విభేదాలు లేవనీ, ఆధునిక యుగంలోనే పెద్ద అగాధం ఏర్పడిందనీ, ఆధునిక కాలంలో భారతీయులు కేవలం ఆధ్యాత్మికతలోనే ఉండి, శాస్త్ర సాంకేతిక రంగాలలో వెనకబడి పోయారని అన్నారు.

ఆర్యులు విదేశీయులు కాకపోతే, ముస్లింలు కూడా విదేశీయులు కారన్నారు. హిందూ దేవాలయాల్లో సంపద ఉంది కాబట్టి గజనీ మహ్మద్‌లాంటి వాళ్లు దాడులు చేశారేగాని, హిందూ దేవుళ్ళపై ద్వేషం కాదన్నారు. ప్రాచీన, మధ్యయుగాలలో భారతదేశంలోని దేవాలయం ఒక ఖజానాగా, ఒక కోటగా రూపుదిద్దుకుందనీ, అందుకే వారు దాడి చేశారనీ అన్నారు. ఇస్లాం వల్ల భారతీయ ఆధ్యాత్మికత దెబ్బతినలేదనీ, పైగా హిందూముస్లింల మధ్య వారధిగా పనిచేసిందనీ, ఇస్లాంలోని ఏకేశ్వరోపాసన వల్లనే కులమతాలకు అతీతంగా భారతదేశంలో భక్తి ఉద్యమం వచ్చిన విషయాన్ని మరిచిపోరాదనీ అన్నారు.

భారతీయ ఆధ్యాత్మికత అస్పృశ్యతను అంగీకరించిందనీ, వివేకానందుడు దాన్ని నిరసించాడనీ, అతను కేవలం ఆధ్యాత్మికవాది అనడం అపోహ అనీ, అతనిలో భౌతికత ఎక్కువగానే ఉందనీ, ఒక దశలో వివేకానందుడు తాను సోషలిస్టునని కూడా చెప్పుకున్నాడనీ అన్నారు.

ఈ సభకు విరసం సభ్యులు చలసాని ప్రసాద్ అధ్యక్షత వహించారు. విరసం సభ్యులు వి. చెంచయ్య కె.వి.ఆర్. స్మారకోపన్యాసాన్ని ఇక నుండి ప్రతి సంవత్సరం ఏర్పాటు చేస్తామన్నారు. సభకు కె.వి.ఆర్. కుటుంబ సభ్యులతో సహా 120 మంది హాజరయ్యారు.

*(క్రాంతి ప్రచురణలుగా జనవరి 1981లో వచ్చిన 'భారతదేశంలో జాతుల సమస్య - మార్క్సిస్టు దృక్పథం' వ్యాస సంకలనం నుంచి...)*

# రాష్ట్ర విభజనోద్యమం - మార్క్సిజం

గత అయిదారు మాసాలుగా ఆంధ్ర ప్రాంతమంతటా రాష్ట్ర విభజనకోసం ఇదివరకెన్నడూలేని స్థాయిలో ఉద్యమం కొనసాగుతోంది. ఆ ఉద్యమాన్ని అణచివేయడానికి కేంద్ర ప్రభుత్వం వేల సంఖ్యలో సి.ఆర్.పి.నీ, సైన్యాన్నీ తరలించింది. ఆంధ్ర పట్టణాలన్నీ దాదాపు సైనిక శిబిరంగా మారాయంటే అతిశయోక్తి కాదేమో. లాఠీచార్జీలు, రోజులకొలది కర్ఫ్యూలు ప్రకటించడం. కదిలితే మెదిలితే తుపాకి కాల్పులు సర్వసాధారణమైనాయి. 1969లో జరిగిన ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి చెన్నారెడ్డి వర్గం ద్రోహం చేసినట్టే, ఇప్పుడు ఆంధ్రలో కూడా కాంగ్రెసు నాయకత్వం. ఆచరణలో పోరాటానికి వెన్నుపోటు పొడవడం మూలంగా తాత్కాలికంగా ఆ ఉద్యమం నీరసించినట్లు కనిపిస్తున్నా, మొత్తం ఆంధ్ర ప్రజానీక మంతటిలోనూ కాంగ్రెసు ప్రభుత్వం పట్ల తీవ్రమయిన ద్వేషాగ్ని ప్రజ్వరిల్లుతోంది. ప్రజలు సి.ఆర్.పి.నీ, సైన్యాన్నీ ఎదుర్కొని పోరాడారు. శాంతియుత పద్ధతులకు ఉద్యమాన్ని కుదించాలని కాంగ్రెసు నాయకులు చేసిన ప్రయత్నాన్ని ఎవరూ ఖాతరు చేయలేదు. బారికేడ్ను కట్టడం, సోడాబాటిల్స్, బాహాబాహి పోరాడడం, నాటుబాంబులు ప్రయోగించడం మొదలయిన పోరాటరూపాలు ఆంధ్ర పట్టణాలలో మొట్టమొదటిసారిగా అమలులోకి వచ్చాయి. అంతేకాదు ఆ రూపాలు ఈనాడు సర్వసాధరణమైనాయి కూడా.

ఈ పోరాటానికి నిరుద్యోగంతో బాధపడుతున్న విద్యార్థులు, యువకులు, అధిక ధరలతో, చాలీచాలని జీతాలతో చావలేక బతుకుతున్న మధ్యతరగతివారూ ప్రాణం. ఆంధ్రప్రదేశ్ మొత్తం ప్రజానీకం అంతా ఈ పోరాటానికి మద్దతుగా ఉంది. ఈ పోరాటానికి వ్యతిరేకంగా గజ్జకట్టి నిలబడింది. కేంద్రప్రభుత్వమూ, కమ్యూనిస్టుపార్టీ పేరుతో చలామణిలో ఉన్న సి.పి.ఐ. కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు)లు. తనకున్న అధికారబలాన్నీ, మిలిటరీ బలాన్ని కేంద్రీకరించి ప్రజావాంఛను నిర్దాక్షిణ్యంగా అణచివేయడానికి ఇందిరాగాంధి సిద్ధపడితే, అది అసలు ప్రజాపోరాటమే కాదనీ, కేవలం కొద్దిమంది బూర్జువా భూస్వాములు మొదలయిన ప్రజాద్రోహులు కొనసాగిస్తున్న విచ్ఛిన్న చర్యలు మాత్రమేననీ. రాష్ట్రాన్ని విభజించడం జాతిపట్ల తీరని అపచారమే గాకుండా, మార్క్సిజానికి కూడా పూర్తి వ్యతిరేకమనీ సి.పి.ఐ. మార్క్సిస్టు పార్టీ వారు తీవ్రతరంగా ప్రచారం చేస్తూ, తమ అనుచరుల్ని ఈ పోరాటానికి వ్యతిరేకంగా సమీకరించడానికి, తద్వారా ఈ పోరాటాన్ని వెన్నుపోటుపొడవడానికి పడరాని పాట్లన్నీ పడుతున్నారు. పైగా ఎట్టి పరిస్థితిలోనూ ఈ పోరాట ఒత్తిడికి లొంగిపోరాదని సి.పి.ఐ. వారు ఇందిరాగాంధీని హెచ్చరిస్తూ తీర్మానాలు కూడా చేస్తున్నారు. ఈ పోరాటాన్ని వ్యతిరేకిస్తూ ఇందిరాగాంధీ చెపుతున్న కారణాలు చాలా పేలవమైనవి. అందుకు జవాబులు అనేక రూపాల్లో చాలామంది ఇదివరకే రాశారు. "కమ్యూనిస్టు పార్టీవారు" ఈ పోరాటానికి వ్యతిరేకంగా పీడిత ప్రజల్ని సమీకరించడానికి, మార్క్సిజం పట్ల అభిమానం ఉన్నవారిలో గందరగోళం లేపడానికి ఈ కింది వాదనలు చేస్తున్నారు. ఈ వ్యాసంలో ప్రత్యేకించి ఈ వాదనకు మాత్రమే జవాబు రాయడానికి ప్రయత్నిస్తున్నాను.

ఈ సందర్భంలో జనరల్‌గా మార్క్సిస్టులమనుకునే వారిమధ్య వినిపిస్తున్న వాదనలివి (1) ఇది బూర్జువా, భూస్వామ్యవర్గాలు కొనసాగిస్తున్న ఉద్యమం కాబట్టి దీనికి మద్దతు ఇవ్వరాదు. (2) ఇలాంటి ఉద్యమాలు దేశంలో కొనసాగుతున్న వ్యవసాయ విప్లవాన్ని పక్కదారి పట్టిస్తాయి కాబట్టి వ్యతిరేకించాలి. (3) మార్క్సిజం ఒక జాతి సమైక్యతను బలపరుస్తుంది కాని విచ్ఛిన్నతను బలపర్చదు. అలా బలపర్చడం మార్క్సిజానికి వ్యతిరేకం. (4) ఈ పోరాటాన్ని రెండు జాతుల మధ్య పోరాటంగా ఎందుకు భావించరాదు?

పై వాదనల్లో ఒకటి, మూడు వాదనలు కమ్యూనిజం, మార్క్సిజం పేరుతో ఈ ఉద్యమాన్ని వ్యతిరేకించడంలో సి.పి.ఐ. కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు)లు కలిసి చేసేవే. రెండోవాదాన్ని ''మార్క్సిస్టు''లతో పాటు మావో ఆలోచనా విధానాన్ని ఆమోదిస్తున్నామని చెప్పుకునే మరికొంత మంది కూడా కొనసాగిస్తున్నారు. నాల్గవవాదం ఈ పోరాటాన్ని సమర్థించడానికి సిద్ధమయిన కొంత మంది కమ్యూనిస్టు అభిమానుల్లో నుంచి వస్తోంది. మొత్తం మీద మార్క్సిజం పేరుతో తరతమ స్థాయిలో పై నాలుగు వాదనలు కొనసాగుతున్నాయి. ఒక్కొక్క వాదాన్నే పరిశీలించుదాం.

మొదటి వాదం ఇది బూర్జువా, భూస్వాముల ఉద్యమం కాదా అనేది. తప్పకుండా సారాంశంలో ఇది బూర్జువా ఉద్యమమే. ఇదే కాదు ప్రపంచమంతటా జరిగే జాతుల ఉద్యమాలన్నీ కూడా బూర్జువా ఉద్యమాలే. ఫ్యూడలిజం నిర్మూలింపబడి పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి జెందే క్రమంలో అంతవరకు స్వయం పోషక ఆర్థిక విధానంతో విడివిడిగా బతుకుతున్న ప్రజల్ని పెట్టుబడిదారీ ఆర్థిక విధానమే సమైక్యం చేస్తుంది. అభివృద్ధి చెందుతున్న పెట్టుబడిదారీ విధానానికి అత్యవసరమయిన విషయాల్లో మార్కెటు

ఒకటి. అలాంటి స్థిరమైన మార్కెటును సృష్టించుకునే లక్ష్యంలో భాగంగానే పెట్టుబడిదార్లు తమ అవసరం కొద్ది ప్రజల్లో జాతీయ భావాన్ని పెంపొందింపజేస్తారు. స్వయం పోషక ఆర్థికవిధానం నశించి, మార్కెటుతో విడదీయరాని సంబంధాన్ని కలిగించే సరుకుల ఉత్పత్తి విధానం ఆరంభమయిన తర్వాత ఒకే భూభాగంలో నివసిస్తూ, ఒకే భాష మాట్లాడుతున్న ప్రజలు ఒక జాతిగా సమైక్యమవుతారు. క్రమంగా వారిలో ఒకే విధమైన మానసికతత్వం కూడా అభివృద్ధి చెందుతుంది. ఆ విధంగా స్వయం సంపూర్ణమయిన జాతిగా ఆ ప్రజలు రూపొందుతారు. అయితే ఈ క్రమమంతా చరిత్రలో ఎక్కడా సాఫీగా జరిగిపోలేదు. ఇకముందు అలా జరగబోదు కూడా. పెట్టుబడిదారీ విధానాభివృద్ధికి ఆటంకంగా ఉన్న ఫ్యూడలిజంతో జరిగిన తీవ్రతర పోరాటంలో భాగంగానే ఆ పరిణామం జరిగింది. అలాంటి ఉద్యమాలన్నిటికీ మొదట్లో పెట్టుబడిదార్లే నాయకత్వం వహిస్తారు.

ఆయా దేశాల్లో సాంఘిక ఆర్థిక పరిస్థితులకు అనుగుణంగా జాతుల సమస్య అనేక రూపాల్లో బహిర్గతం కావచ్చు. ఏ రూపాల్లో బహిర్గతమయినా ప్రధానంగా అది విభిన్న జాతులకు చెందిన బూర్జువా వర్గాల మధ్య గల వైరుధ్యమే అయితే ఆ వైరుధ్యాన్ని తమకనుకూలంగా పరిష్కరించుకునే ప్రయత్నంలో తమ వెనుక ప్రజలందరినీ సమీకరించుకోడానికిగాను జాతినంతటినీ రకరకాల నినాదాలతో ఉత్తేజపరచడానికి పెట్టుబడిదారులు ప్రయత్నిస్తారు. కొన్ని సందర్భాల్లో కార్మికవర్గం తనకేమీ పట్టనట్టూ సంబంధం లేనట్టూ వ్యవహరించజాలదు. ఈ విషయాన్నంతటినీ క్రోడీకరించి మార్క్సిస్టు మహోపాధ్యాయుడు కామ్రేడ్ స్టాలిన్ ఇలా రాశారు.

"పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందుతూ ఉన్న పరిస్థితిల్లో జాతుల సమస్యపై జరిగే పోరాటం బూర్జువా వర్గాల మధ్య జరిగే పోరాటమే. కొన్ని సందర్భాల్లో జాతుల ఉద్యమంలోకి కార్మిక వర్గాన్ని కూడా బూర్జువా వర్గం ఆకర్షించగల్గుతుంది. అలాంటప్పుడు పైకి "జాతి మొత్తం" యొక్క పోరాటంగా అది వ్యక్తమవుతుంది. కాని వాస్తవానికి అది బయటికి కనిపించే లక్షణం మాత్రమే. సారాంశంలో అది ఎప్పుడూ బూర్జువా పోరాటమే. ప్రధానంగా బూర్జువాజీ ప్రయోజనాల కొరకు జరిగే పోరాటమే".

"అయితే కొన్ని జాతులు అణగదొక్కబడడానికి వ్యతిరేకంగా కార్మికవర్గం ఏ విధంగానూ పోరాడరాదని దీనర్థం కాదు."

ఉద్యమం స్వాతంత్ర్యాన్ని అరికట్టడం. వోటింగు హక్కును పరిమితం చేయడం, భాషాభివృద్ధి నరికట్టడం, పాఠశాలలను మూసివేయడం, అలానే ఒక జాతి అభివృద్ధిని అరికట్టే తదితర చర్యలకు పూనుకోడం, మూలంగా బూర్జువా వర్గానికెంత నష్టం వాటిల్లుతుందో దాదాపు కార్మికవర్గం పొందే నష్టం కూడ అంతకంటే తక్కువేమీ కాదు. అలాంటి పరిస్థితులు అణగదొక్కబడుతున్న జాతికి చెందిన కార్మికవర్గం మేధావి శక్తుల స్వతంత్రాభివృద్ధిని అరికట్టడానికి మాత్రమే ఉపకరిస్తాయి."

కామ్రేడ్ స్టాలిన్ రాసిన పై విషయాన్ని బట్టి ఫ్యూడలిజం బలంగా ఉండి అనేక జాతులతో కూడిన రాజ్యంగా ఉన్న దేశంలో జరిగే సామాజిక విప్లవంలో జాతుల సమస్య కూడా పెనవేసుకొని ఉంటుందని అర్థమవుతుంది. అలాంటప్పుడు ఆ సమస్య నిర్దిష్టమయిన పోరాట రూపం తీసుకునే పక్షంలో ఆనాడు దేశంలో కొనసాగుతున్న సామాజిక విప్లవానికి గానీ, ప్రపంచ కార్మిక విప్లవానికి గానీ, ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఎంతో కొంత నష్టాన్ని కలిగించే ప్రత్యేక పరిస్థితుల్లో తప్ప సర్వసాధారణంగా కార్మిక వర్గం తప్పకుండా అలాంటి పోరాటాలకు మద్దతు నివ్వాలి, ఇస్తుంది కూడ. ప్రజాస్వామిక విప్లవాల్లో భాగంగానూ, ఆ విప్లవాలతో పెనవేసికొనీ అవి కొనసాగుతూ ఉండడమే అందుకు కారణం.

ఈ విషయాన్నే కామ్రేడ్ స్టాలిన్ ఈ కింది మాటల్లో వివరించారు.

"సామ్రాజ్యవాదాన్ని బలహీన పరచి, పడగొట్టడానికి తోడ్పడే జాతుల పోరాటాలకు తప్పకుండా మద్దతు నివ్వాలని దీనర్థం. సామ్రాజ్యవాదాన్ని కాపాడి బలపరచే ఉద్యమాలను ఎట్టి పరిస్థితుల్లోనూ సమర్థించరాదు."

జాతుల హక్కులకు సంబంధించిన సమన్వయం సంపూర్ణమయిన ప్రత్యేక సమస్య కాదు. అది కార్మిక విప్లవానికి సంబంధించిన జనరల్ సమస్యలో ఒక భాగమే. మొత్తం సమస్యలో అది ఒక భాగం కాబట్టి మొత్తం సమస్యను పరిష్కరించే దృక్పథంలో భాగంగానే దాన్ని పరిష్కరించాలి."

కాబట్టి నిర్దిష్ట రూపంలో జరుగుతున్న జాతుల పోరాటాలకు మద్దతు ఇవ్వాలా లేదా అని ఆలోచించుకునేటప్పుడు కార్మికవర్గం తేల్చుకోవాల్సింది రెండే రెండు విషయాలు - ఆ పోరాటం దేశంలో అప్పుడు కొనసాగుతుండే సామాజిక విప్లవానికి ప్రతిబంధకమా కాదా అనేది ఒకటి. ప్రపంచ సోషలిస్టు విప్లవానికి ఏ మోతాదులోనయినా ప్రతిబంధకమా అనేది మరొకటి. అది పై విషయాల్లో ప్రతిబంధకమయితే ఎట్టి పరిస్థితిలోనూ ఆ పోరాటానికి కార్మికవర్గం తన మద్దతునివ్వదు. ప్రతిబంధంకం కాకపోతే తప్పకుండా మద్దతు ఇస్తుంది. అంతేకాదు అలాంటి పోరాటాలకు మద్దతు ఇవ్వాల్సి వచ్చినప్పుడు, ఆ పోరాటాల్లో ఉండే నాయకత్వం అభివృద్ధికరమయినదా కాదా అనే విషయానికి ప్రాముఖ్యత నీయాల్సిన పనిలేదు. ఈ సందర్భాల్లో కామ్రేడ్ స్టాలిన్ ఇలా చెప్పారు.

"సామ్రాజ్యవాద నిర్బంధం అమలు జరుగుతున్న పరిస్థితుల్లో జరిగే జాతీయోద్యమాల్లో విప్లవ లక్షణాలకు నిదర్శనాలుగా ఆ ఉద్యమాల్లో కార్మికవర్గ శక్తుల ప్రవేశంగాని, విప్లవకర లేదా రిపబ్లికన్ కార్యక్రమంగాని, ప్రజాస్వామిక ప్రాతిపదికగాని తప్పనిసరిగా ఉండి తీరాల్సిన పనిలేదు. ఆఫ్ఘానిస్థాన్ స్వాతంత్ర్యం కొరకు అచ్చటి అమీరు (ఫ్యూడల్‌లార్డు) కొనసాగిస్తున్న పోరాటం, అమీరూ అతని అనుచరులూ రాచరికవాద అభిప్రాయాలకు కట్టుబడి ఉన్నవారే అయినప్పటికీ, అది సామ్రాజ్యవాదాన్ని బలహీనపరచి, చిన్నాభిన్నం చేయగల్గుతోంది కాబట్టి వాస్తవానికి విప్లవకర పోరాటమే.

కాబట్టి అభివృద్ధి విరోధకులు నాయకత్వం వహిస్తున్నారనే కారణంతో ఈ పోరటాన్ని నిరసించాలనడం మార్క్సిజం కాదు సరికదా, అందుకు వ్యతిరేకం కూడ. ఇక్కడ తేల్చుకోవలసిందల్లా భారతదేశంలో కొనసాగుతున్న ప్రజాస్వామిక విప్లవానికి అడ్డంకిగా ఉన్న బడా పెట్టుబడిదారీ, బడా భూస్వామ్య వర్గాలకు చెందిన ప్రభుత్వాన్ని ఈ పోరాటం ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని బలహీన పరుస్తోందా లేక బలపరుస్తోందా అనేది మాత్రమే. ఇంగిత జ్ఞానమున్న ప్రతి ఒక్కరికీ ఈ పోరాటం ఏ దృష్టితో చూసినా ప్రజాస్వామిక విప్లవాన్ని బలహీనపర్చదనీ, అందుకు భిన్నంగా, అలాంటి విప్లవానికి అడ్డుగా నిల్చి ఉన్న ప్రభుత్వాన్నే బలహీన పరుస్తుందనీ అర్థమవుతుంది.

ఇక రెండవ వాదం. ఇలాంటి పోరాటాలు దేశంలో కొనసాగుతున్న నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని పక్కదారి పట్టించవా అనేది. మొదట నిర్ణయించుకోవాల్సింది అసలు నిర్దిష్ట రూపంలో జరుగుతున్న ఆ జాతుల పోరాటంలో ఆనాటి సామాజిక విప్లవానికి ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని తోడ్పడే పొటెన్షియాలిటీస్ ఏమయినా ఉన్నాయా లేదా అనేది. అలాంటి పొటెన్షియాలిటీస్ ఏమయినా ఉన్నాయనే నిర్ధారణకు వస్తే ఆ పోరాటానికి కార్మికవర్గం తప్పకుండా తన మద్దతునిస్తుంది. అయితే ఆ పోరాటం ప్రజల క్షేమం కొరకే జరుగుతున్నట్టు కనిపిస్తున్నా సారాంశంలో బూర్జువా వర్గ ప్రయోజనాల కొరకే, బూర్జువా నాయకత్వం కిందనే జరుగుతోందనే విషయాన్ని కార్మికవర్గం ఎన్నడూ మర్చిపోదు. అలాంటి పోరాటాన్ని సాధ్యమయితే ఆనాడు ఉన్నత స్థాయిలో జరుగుతున్న వర్గపోరాటాన్ని పక్కదారి పట్టించడానికే బూర్జువా వర్గం ప్రయత్నిస్తుంది. సాధారణంగా అలాంటి ఉద్యమాల్లో ప్రజల్లో వర్గదృష్టిని లోపింపజేసి అన్నివర్గాల ప్రయోజనాలు ఒక్కటేననే అవాస్తవిక వాతావరణం సృష్టింపబడుతుంది. ప్రజల్లో ఉన్న విభిన్న వర్గాల ప్రయోజనాలు భిన్నభిన్నంగా ఉంటాయనే యథార్థం మరుగున పడిపోతుంది. ప్రత్యేకించి పెట్టుబడిదార్లు తమకున్న ప్రచార సాధనాలన్నిటినీ ప్రయోగించి అలాంటి వాతావరణాన్ని సృష్టించడంపై కేంద్రీకరిస్తారు. కాని అలాంటిది జరగకుండా తన శక్తినంతా వినియోగించి కార్మికవర్గం చైతన్య పూరితంగా కృషిచేయాలి. అంతేకాని ఒక ప్రమాదం జరిగే అవకాశం ఉంది కదా అని ఏదో ఒక మోతాదులో ఆనాటి సామాజిక విప్లవానికి తోడ్పడే పొటెన్షియాలిటీస్ ఉన్న ఉద్యమాన్ని నిరసించడం పొరపాటు. అలాంటిది సామాజికాభివృద్ధిపట్లనూ, మార్క్సిజం పట్లనూ అపచారమే అవుతుంది. ఆ ధోరణి కార్మికవర్గ అసమర్థతకు చిహ్నం తప్ప, సమర్థతకు ఎంత మాత్రం చిహ్నంకాదు. ఈ విషయంలో "వేర్వేరుగా పురోగమించండి, కలిసి దెబ్బకొట్టండి" అనే లెనిన్ సూక్తి కార్మికవర్గం సదా గుర్తుంచుకోగల్గాలి.

ఇక మూడవ వాదం మార్క్సిజం ఒక జాతి సమైక్యతను బలపరుస్తుందిగాని, విచ్ఛిన్నతకు తోడ్పడదు అనేది. ఇది ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ ఉభయప్రాంతాల్లోనూ కొనసాగుతున్న రాష్ట్ర విభజనోద్యమాన్ని దృష్టిలో ఉంచుకొని చేయబడుతున్నవాదన. సి.పి.ఐ, కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) వగైరాలంతా ఇదే విషయాన్ని చెవిలో ఇల్లు గట్టుకొని ఊదరగొడుతున్నారు. ఆంధ్రప్రదేశ్ రెండయిపోతే వచ్చే సోషలిజం ఆగిపోతున్నట్టేవారు వాపోతున్నారు. అలా వాదించే వారంతా రష్యాలోగానీ, మరో చోటగానీ ఇలాంటి రాష్ట్రవిభజనోద్యమాల్లో కార్మికవర్గం మద్దతుయిచ్చినట్టు దాఖలాలు కనిపించడం లేదు కదా అని కూడా అంటారు. అంతేకాక స్టాలిన్‌గాని, లెనిన్‌గాని జాతులను గురించీ, జాతుల స్వాతంత్ర్యాన్ని గురించీ రాశారేగాని, ఒకేజాతిలో అనేక కారణాలను పురస్కరించుకొని జరిగే ప్రాంతీయ విభేదాలను గురించి ఎక్కడా రాయలేదు కదా అని కూడా అంటారు. ప్రత్యేకించి ఆంధ్రప్రదేశ్‌లో కొనసాగుతున్న ప్రాంతీయ ఉద్యమాలు పెట్టుబడిదారుల, భూస్వాముల ఉద్యమాలు కాబట్టి ఇందులో పాల్గొనడం ద్వారా పీడిత ప్రజల్ని చీల్చడం మాత్రమే జరిగి ప్రజాస్వామిక విప్లవానికి నష్టం వాటిల్లుతుందని కూడ అంటారు. ఈ విషయాన్ని సాకల్యంగా పరిశీలించాలి. జాతుల సమస్యను వివరిస్తూ కామ్రేడ్ స్టాలిన్ ఈ విధంగా రాశారు.

"జాతి అనేది కేవలం చరిత్రకు సంబంధించిన ఒక అంశం మాత్రమే కాదు. నిర్దిష్టమయిన ఒక శకానికి చెందిన, అంటే అభివృద్ధి చెందుతున్న పెట్టుబడిదారీ విధానపు శకానికి చెందిన చారిత్రకాంశం కూడా. ఫ్యూడలిజం నిర్మూలన, పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి జరిగే క్రమంలోనే, పై వాటితో పాటుగానే ప్రజలు జాతులుగా రూపొందే క్రమం కూడా జరుగుతుంది. ఉదాహరణకు పశ్చిమ యూరప్‌లో అలానే జరిగింది. ఫ్యూడల్ అనైక్యతను నిర్మూలించి, పెట్టుబడిదారీ విధానం విజయవంతంగా పురోగమిస్తున్న కాలంలోనే బ్రిటిష్, ఫ్రెంచి, జర్మన్, ఇటాలియన్ తదితర ప్రజలు జాతులుగా రూపొందారు".

"అయితే పై ఉదాహరణలో ఆయా ప్రజలు ప్రత్యేక జాతులుగా రూపొందడంతోపాటుగానే, అదే సమయంలోనే స్వతంత్ర జాతీయ ప్రభుత్వాలుగా కూడా రూపొందాయి. అంటే బ్రిటిషు, ఫ్రెంచి అలానే తదితర జాతులు బ్రిటిషు వగైరా జాతీయ ప్రభుత్వాలుగా కూడా రూపొందాయి. ఆ క్రమంలో ఐర్లండు భాగస్వామి కాలేదు. అయినా పశ్చిమ యూరపుకు చెందిన పై జనరల్ లక్షణం అందుమూలంగా మారదు."

"తూర్పు యూరపులో పరిస్థితి మరో విధంగా నడిచింది. పశ్చిమ యూరపులో జాతులు స్వతంత్ర జాతీయ ప్రభుత్వాలుగా రూపొందితే, తూర్పు యూరపులో అనేక జాతులతో కూడిన బహుజాతుల ప్రభుత్వాలు (మల్టీ నేషనల్ స్టేట్స్) ఏర్పడ్డాయి. ఆస్ట్రో - హంగరీ, రష్యా ప్రభుత్వాలు అలాంటివే. ఆస్ట్రియాలో జర్మన్లు రాజకీయంగా చాలా అభివృద్ధి చెందిన జాతి కాబట్టి ఆస్ట్రియాలోని తదితర జాతులన్నిటినీ సమైక్యం చేసి ఒకే ప్రభుత్వం కింద సమీకరించే బాధ్యతను జర్మన్లు నిర్వర్తించారు. హంగరీలో ఉన్న జాతులన్నిటిలోనూ అభివృద్ధిజెందిన మాగ్యార్లు అక్కడ

ప్రభుత్వాన్నేర్పరచడానికి పూనుకున్నారు. తద్వారా వారు హంగరీలో ఉన్న మిగిలిన జాతులన్నింటినీ సమైక్యం చేయగల్గారు. శక్తివంతమై బాగా సంఘటితమై చారిత్రక పరిణామంలో ఏర్పడి ఉన్న అరిస్టోక్రటిక్ మిలటరీ బ్యూరాక్రసీ ఆధిపత్యంలో ఉండిన గ్రేట్ రష్యన్లు, రష్యాలోని తదితర జాతులన్నిటినీ సమైక్యం చేయగల భారాన్ని వహించారు.

"తూర్పు యూరపులో పరిస్థితి అలా నడిచింది. అంటే ఎక్కడయితే ఫ్యూడలిజం అప్పటికింకా నిర్మూలింపబడలేదో, ఎక్కడయితే పెట్టుబడిదారీ విధానం చాల బలహీనంగా ఉందో, ఎక్కడయితే వెనకకు నెట్టబడ్డ జాతులు అప్పటికింకా ఆర్థికంగా సంఘటితమయి సమగ్ర జాతులుగా అభివృద్ధి చెందడంలో జయప్రదం కాలేదో అలాంటి చోట్ల ఇలాంటి బహుమతుల ప్రభుత్వాలేర్పడే ప్రత్యేక పద్ధతి అమల్లోకి వచ్చింది."

"కాని తూర్పు యూరపులో పెట్టుబడిదారీ విధానం క్రమంగా అభివృద్ధి చెందసాగింది. వ్యాపార రవాణామార్గాలు అభివృద్ధి చెందసాగాయి. పెద్ద పెద్ద పట్టణాలు వెలుస్తున్నాయి. జాతులు ఆర్థికంగా సౌష్టవాన్ని పొందసాగాయి. వెనుకబడ్డ జాతుల స్తబ్ద జీవితంలో నెలకొంటున్న పెట్టుబడిదారీ విధానం వారిని ఉత్తేజపర్చి, కార్యాచరణకు పురికొల్పుతోంది. ప్రెస్సు, థియేటర్ వగైరాలలో వచ్చిన అభివృద్ధి మూలంగానూ, రీచిస్టాట్ (ఆసియా) డ్యూమా (రష్యా) వగైరా శాసనసభల కార్యకలాపాల మూలంగానూ, "జాతీయ భావాలు" వారిలో బలపడసాగాయి. అభివృద్ధి చెందుతున్న మేధావులు "జాతీయ భావాల"తో ఉత్సాహం పొందడమేగాక ఆ భావాన్ని విస్తృతంగా వ్యాపింపజేయడానికి కూడా పూనుకోసాగారు.

"కాని వెనకకు నెట్టబడి అప్పుడప్పుడే మేలుకొని స్వతంత్ర జీవితాన్ని కాంక్షిస్తున్న జాతులు స్వంతంత్ర జాతీయ ప్రభుత్వాలుగా రూపొందలేకపోయాయి. రాజ్యాంగ యంత్రాన్ని చాలా కాలంగా తన అదుపులోకి తీసికొని అధికారాన్ని చలాయిస్తున్న జాతికి చెందిన పాలకవర్గ శక్తివంతమయిన ప్రతిఘటన వారి దారికడ్డంకిగా తయారయ్యింది. స్వతంత్ర జాతీయ ప్రభుత్వ నిర్మాణానికి పూనుకోవడంలో వారు చాలా వెనకబడ్డారు."

"ఆ విధంగా పరిస్థితులు తూర్పు యూరపులోని వెనకబడ్డ జాతుల్ని పోరాట మార్గానికి నెట్టాయి."

కామ్రేడ్ స్టాలిన్ రాసిన పై విషయాన్ని బట్టి జాతుల సమస్య అన్ని దేశాలలోనూ అన్ని కాలలలోనూ ఒకే రూపంలో ఉండదని అర్థమవుతుంది. అంతేకాదు ఆ సమస్య స్వభావం ఫ్యూడలిజం నిర్మూలన, పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి ఏ దేశంలో, ఏ కాలంలో, ఏ మోతాదులో జరుగుతుందో ఆ పరిస్థితులకు అనుగుణ్యంగా జాతుల సమస్య రూపొందుతుందని కూడా బోధపడుతుంది. కామ్రేడ్ స్టాలిన్ ఇచ్చిన పై ఉదాహరణలో పశ్చిమ యూరపులో ఫ్యూడలిజాన్ని నిర్మూలించడానికి జరిగిన బూర్జువా ప్రజాస్వామిక విప్లవాల్లో భాగంగానే, ప్రధానంగా ఫ్యూడల్ శక్తులకు వ్యతిరేకంగానే జాతుల సమస్య కూడా రూపొందింది.

కాని తూర్పు యూరపులో కూడా ప్రజాస్వామిక విప్లవాల్లో భాగంగానే జరిగినా ప్రధానంగా అధికారంలో ఉన్న ఒక జాతికి చెందిన బూర్జువా వర్గానికి, వెనకకు నెట్టబడ్డ జాతులలోని బూర్జువా వర్గాలకూ మధ్య సంఘర్షణగా జాతుల సమస్య రూపొందింది. చారిత్రక పరిణామంలో పశ్చిమ యూరపులో కంటె ఆలశ్యంగా ఇక్కడ పెట్టుబడిదారీ విధానం ఆవిర్భవించడమే అందుకు ప్రధాన కారణం. కాబట్టి చారిత్రక పరిణామ క్రమంలోనే జాతుల సమస్యను అర్థం చేసికోడానికి ప్రయత్నించాలి. లేకుంటే అనేక తప్పుడు నిర్ణయాలకు వచ్చి మార్క్సిజం పేరుతోనే మార్క్సిజానికి అపచారం చేస్తాం.

మనదేశంలో జాతుల సమస్యను అలాంటి చారిత్రక దృక్పథం నుండి పరిశీలించుదాం. యూరపులో జనరల్‌గా పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందుతున్న కాలంలోనే, మనదేశం బ్రిటిష్ వలసగా తయారయింది. సామ్రాజ్యవాదుల ఆధిపత్యం కిందనే మనదేశంలో పెట్టుబడిదారీ ఆర్థిక సంబంధాలు నెలకొన్నాయి. అంతకు పూర్వం ఉన్న స్వయం సంపూర్ణ గ్రామీణ వ్యవస్థ నశించిపోయింది కాని, దానిస్థానే పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందలేదు. మార్క్సు అన్నట్టు పాత విధానం నశించి పోయింది, కాని కొత్త విధానం సృష్టించబడలేదు. ఫ్యూడల్ వ్యతిరేక ఉద్యమం సామ్రాజ్య వ్యతిరేక పోరాటంలో భాగంగానే కొనసాగింది. సామ్రాజ్యవాదానికీ, మొత్తం ప్రజానీకానికి మధ్యనున్న వైరుధ్యమే ప్రధాన వైరుధ్యంగా ముందుకొచ్చింది. అందువల్ల మనదేశంలో జాతీయ చైతన్యం, సామ్రాజ్యవాద వ్యతిరేక చైతన్యంలో భాగంగానే రూపొందింది. బెంగాలు విభజనకు వ్యతిరేకంగా అక్కడ జరిగిన పోరాటం మనదేశంలో జాతీయోద్యమం (జాతుల ఉద్యమం) ఆరంభానికి నాంది. ఆ ఉద్యమం నుండి పొందిన ఉత్తేజమే ఆంధ్రజాతి ఉద్యమానికి అంకురమైంది. కాంగ్రెసుకు నాయకత్వం వహిస్తున్న బూర్జువావర్గం విభిన్న జాతులకు చెందిన ప్రజానీకాన్ని సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సమీకరించడంలో నూతనంగా అభివృద్ధి చెందుతున్న జాతుల చైతన్యానికి అనుగుణంగా భాషా ప్రయుక్త రాష్ట్రాల నిర్మాణాన్ని ప్రాతిపదికగా అంగీకరించింది. ఆ ప్రాతిపదికపైననే అన్ని జాతుల్నీ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా అది సమీకరించగలిగింది. కాంగ్రెసు నిర్మాణం కూడా అదే ప్రాతిపదికపై జరిగింది. 1947లో ప్రజాస్వామిక విప్లవానికి ద్రోహం చేసి భారత దళారీ బడా బూర్జువా వర్గం (కాంప్రడార్ బూర్జువాజీ) సామ్రాజ్యవాదంతో మిలాఖత్ కావడం ద్వారా రాజ్యాధికారాన్ని చేజిక్కించుకొన్ననాటికి జాతుల సమస్యకు సంబంధించినంతవరకు ఉన్న పరిస్థితి ఇది.

రష్యాలో ఆస్ట్రో - హంగరీల మాదిరిగా ఏదో ఒక అభివృద్ధి చెందిన జాతి మిగిలిన జాతుల నన్నింటిని సమైక్యం చేయడం ఇక్కడ జరగలేదు. బ్రిటిషు సామ్రాజ్యవాదుల నుండి ఏదో ఒక జాతికి చెందిన బూర్జువా వర్గానికి అధికారం దఖలు కావడంగాక దేశంలో ఉన్న కాంప్రడార్ బూర్జువాజీ, బడా భూస్వాములు

అధికారాన్ని హస్తగతం చేసుకొన్నారు. వారి ప్రయోజనాల దృష్ట్యా రాష్ట్రాలు కేవలం పాలక విభాగాలుగానే ఉండి ఆర్థిక రాజకీయాధికారం అంతా కేంద్ర ప్రభుత్వం చేతిలోనే కేంద్రీకృతం కావడం అవసరం. అందువల్ల "భారతజాతి", "భారతీయ సంస్కృతి", "అఖండభారతం", "భారతజాతి అవిభాజ్యమైనది" మొదలగు నినాదాలతో నూతనంగా అభివృద్ధి చెందుతున్న జాతుల అభివృద్ధికి ఈ కాంప్రడార్ బూర్జువా, బడా భూస్వాముల చేతుల్లో ఉన్న కేంద్ర ప్రభుత్వం అడ్డంకిగా తయారైంది. అందువల్లనే సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటకాలంలో భాషా ప్రయుక్త రాష్ట్రాల నిర్మాణాన్ని ఆమోదించిన కాంగ్రెసే, తీరా అధికారంలోకి వచ్చిన తర్వాత ఆచరణలో అందుకు వ్యతిరేకించసాగింది. ఎంతో రక్తబలిదానం జరిగిన ఫలితంగా గాని చివరకు భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడలేదు.

అభివృద్ధి చెందుతున్న జాతుల సమస్య పరిష్కారానికి భాషా ప్రయుక్త రాష్ట్రాల నిర్మాణం ఆరంభమే గాని తుది మాత్రం కాదు. తమ భవిష్యత్తును తాము రూపొందించుకొనేందుకు వీలుగా సర్వసత్తాక ప్రభుత్వాలుగా ఆయా జాతులు రూపొందడమే అందుకు తుది పరిష్కారం. అవి ఒకే భారత సమాఖ్యలో కలిసి ఉంటాయా అనేది ప్రత్యేక విషయం. ఆ విషయాన్ని తమ తమ శ్రేయస్సు దృష్ట్యా వలంటరీగా అప్పుడా ప్రభుత్వాలు నిర్ణయించుకొంటాయి. అలాంటి స్థితి ఏర్పడేటంత వరకు కేంద్రంలో అధికారాన్ని చేజిక్కించుకొని ఉన్న కాంప్రడార్ బూర్జువాజీకి, అభివృద్ధి చెందుతున్న వివిధ జాతులకు చెందిన బూర్జువా, భూస్వామ్య వర్గాలకు మధ్య వైరుధ్యం ఏదో ఒక రూపంలో కొనసాగుతూనే ఉంటుంది. అది ఒకప్పుడు నిర్బంధ హిందీ వ్యతిరేకోద్యమంగా రూపొందవచ్చు, వెనుకబడ్డ ప్రాంతాల్ని కేంద్రం చిన్న చూపు చూస్తోందనే రూపంలో బహిర్గతం కావచ్చు, కేంద్రాన్ని కేవలం దేశరక్షణ, కమ్యూనికేషన్లు మొదలైన కొన్ని అంశాలకు మాత్రమే పరిమితం చేసి ఆయా జాతులు ఆర్థికంగానూ, సాంస్కృతికంగాను అభివృద్ధి చెందడానికి వీలుగా రాష్ట్రాల అధికారాన్ని విస్తృతంగా పెంచాలనే రూపం తీసుకోవచ్చు. ఏ రూపం తీసుకొన్నా పైవన్నీ పాక్షిక పరిష్కారాలే. సర్వసత్తాకాధికారంగల స్వతంత్ర జాతుల ప్రభుత్వాలేర్పడేవరకు కేంద్రంలో అధికారంలో ఉన్న కాంప్రడార్ బూర్జువాజీకి, ఆయాజాతులలోనున్న పెట్టుబడిదారీ. భూస్వామ్య వర్గాలకు మధ్య వైరుధ్యం విభిన్న రూపాల్లో కొనసాగుతూనే ఉంటుంది. అందుకే కమ్యూనిస్టుపార్టీ (మా-లె) ఈ సమస్యకు పరిష్కారంగా విడిపోయే హక్కుతో సహా జాతులన్నింటికీ స్వయం నిర్ణయ సూత్రాన్ని ఆమోదించింది. ఈనాటి బడాబూర్జువా, భూస్వామ్యవర్గాల ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆయా జాతులకు చెందిన పీడిత ప్రజానీకాన్ని సమైక్యం చేయగలిగింది ఆ సూత్రం ఒక్కటే.

కాబట్టి మనదేశంలో తూర్పు యూరపు దేశాల్లోనీ బహుజాతుల ప్రభుత్వాల్లో మాదిరిగా జాతుల సమస్య, అధికారంలో నున్న జాతికి చెందిన బూర్జువా వర్గానికి, వెనుకకు నెట్టబడ్డ జాతులలోని బూర్జువా వర్గానికీ మధ్య వైరుధ్యంగా గాక, కేంద్రంలో అధికారం చేజిక్కించుకొని ఉన్న కాంప్రడార్, బడాభూస్వామ్య వర్గాల ప్రభుత్వానికీ, ఆయా జాతులకు చెందిన పెట్టుబడిదారులకూ, భూస్వాములకూ మధ్య వైరుధ్యంగా రూపొందడం ఒక ప్రత్యేకత. (పెక్యూలియారిటీ)

మరో ప్రత్యేకత కూడ ఉంది. బ్రిటిషు సామ్రాజ్యవాదులు మన దేశాన్ని పాలించిన రోజులలోనే వందల సంఖ్యలో స్వతంత్ర సంస్థానాలు ఉన్నాయి. తమకు అండగా ఉంచుకొనే లక్ష్యంతోనే సామ్రాజ్యవాదులు ఉద్దేశపూర్వకంగానే వాటి మనుగడను కాపాడుతూ వచ్చారు. 1948లో మనదేశంలోని కాంప్రడార్ బూర్జువాజీతో మిలాఖత్ అయి వారికి రాజ్యాధికారం దఖలు చేసినప్పుడు కూడా ఆ సంస్థానాల మనుగడను అలానే ఉంచే షరతుతోనే చేశారు. ఆ తర్వాత సంస్థానాధిపతులతో రాజీపడి క్రమంగా వాటినన్నిటిని భారత ప్రభుత్వంలో సంలీనం చేయగలిగింది కాంగ్రెస్ ప్రభుత్వం. ఆ క్రమంలో అన్నిటికంటె ఆలస్యంగానూ, ప్రత్యేక వాతావరణంలోనూ నిజాం సంస్థానం రద్దయి, ఆ ప్రాంతం కూడా యూనియన్ ప్రభుత్వంలో చేరింది. ఆ తర్వాత 1956 నవంబరులో గాని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అవతరించలేదు. అదైనా తెలంగాణ పెట్టుబడిదార్లు, భూస్వాముల నుండి వచ్చిన తీవ్రమైన ప్రతిఘటనను పెద్ద మనుష్యుల ఒప్పందం ద్వారా చల్లార్చిన తర్వాతనే ఆంధ్రప్రదేశ్ అవతరణ జరిగింది. అయినా రాజ్యాధికారాన్ని తమ స్వప్రయోజనాలకు ఉపయోగించుకొనే సందర్భంలో ఆంధ్ర, తెలంగాణ భూస్వాముల, పెట్టుబడిదారుల మధ్య అంతర్గత వైరుధ్యాలు చెలరేగుతూనే వచ్చాయి. కాంప్రడార్, బడా భూస్వాముల చేతుల్లో ఉన్న ప్రభుత్వం ప్రజాస్వామిక విప్లవకర్తవ్యాలను అంటే ఫ్యూడలిజాన్ని సమూలంగా నిర్మూలించడం, వ్యవసాయికంగా ఉన్న దేశాన్ని పారిశ్రామిక దేశంగా రూపొందించడం ఆధునిక యంత్రాలను ఉపయోగించి వ్యవసాయాన్ని అభివృద్ధి చేయడం మొదలగు కర్తవ్యాలను పూర్తిచేయలేదు. చేయజాలదుకూడ. అటు సామ్రాజ్యవాదులతోనూ, ఇటు భూస్వామ్య వర్గాలతోనూ అది మిలాఖత్ అయిపోవడమే అందుకు కారణం. పర్యవసానంగా సాధారణ ప్రజల జీవితం నానాటికి కష్టభూయిష్టంగా తయారైంది. ప్రభుత్వంపై తీవ్రమైన అసంతృప్తి వ్యాపించింది. నాయకత్వపు విద్రోహం మూలంగా అసంతృప్తి రేకెత్తిన ప్రజల్ని విప్లవపోరాటంలో సంఘటిత పరచడం జరగలేదు. ఈ పరిస్థితులన్నింటి మూలంగా 1956లో తెలంగాణ, ఆంధ్ర ప్రాంతాలు ఒకే రాష్ట్రంగా సంలీనమైనప్పటికి రెండు ప్రాంతాల ప్రజల మధ్య సుదృఢమైన సంఘీభావం ఏర్పడలేదు. అంతేకాదు శతాబ్దాల తరబడి వేరు వేరు పరిపాలన కింద జీవించడానికి అలవాటు పడిఉండడం మూలంగా ఆంధ్రులు వేరు, తెలంగాణ వారు వేరు అనే మనస్తత్వం ఇరు ప్రాంతాల్లోనూ మాసిపోలేదు. ఈ ప్రభుత్వం ప్రజాస్వామిక విప్లవ కర్తవ్యాలను

పూర్తిచేయగలిగి ఉన్నట్లయితే అంటే ఫ్యూడలిజం నిర్మూలించబడి, ప్రజల ఆర్థిక జీవితం సాఫీగా అభివృద్ధి చెందడం జరిగి ఉంటే ఆ క్రమంలో రెండు ప్రాంతాల మధ్య వేర్వేరు మనస్తత్వాలు నశించి సమగ్రమైన జాతిగా రూపొందేదే. కాని అలాంటిది జరగనందువల్ల ఉభయప్రాంతాలలోని భూస్వామ్య పెట్టుబడిదారీ వర్గాలు తమ స్వప్రయోజనాలకవసరమైనప్పుడల్లా ప్రజలలో ఉన్న వేర్పాటు మనస్తత్వాన్నీ, జనరల్‌గా ప్రభుత్వంపై తీవ్రతరంగానున్న అసంతృప్తిని వినియోగించుకొని ప్రాంతీయ విభేదాల్ని రెచ్చగొట్టడం తేలికైంది. "బలమైన కేంద్ర ప్రభుత్వం ఉండాలి" అనే సాకుతో వివిధ జాతులు స్వయం సంపూర్ణజాతులుగా అభివృద్ధి చెందడానికి ఆచరణలో అడ్డుపడుతున్న కేంద్ర ప్రభుత్వంలోని పాలకవర్గాలు తమ స్వప్రయోజనాల దృష్ట్యా ఒకప్పుడు ఒక ప్రాంతం వారికి, మరొకప్పుడు ఇంకొక ప్రాంతం వారికి మద్దతునిస్తూ రావడం కూడ ఈ ప్రాంతీయ విభేదాలు మరింత పెరగడానికి తోడ్పడింది. దాని పర్యవసానమే 1969లో ప్రత్యేక తెలంగాణ కొరకు జరిగిన పోరాటమైనా, ఈనాడు ఉభయ ప్రాంతాలలోనూ కొనసాగుతున్న రాష్ట్ర విభజనోద్యమమైనా. ఇది ఒక్క ఆంధ్ర ప్రాంతంలోనే కాదు, ఎక్కడెక్కడైతే శతాబ్దాలుగా వేరువేరు ప్రభుత్వాల కింద (స్వదేశ సంస్థానాలుగాని, బ్రిటిషు ప్రభుత్వంలోని రాష్ట్రాలుగాని) జీవించడానికి అలవాటుపడ్డ ప్రజలలో సమైక్య రాష్ట్రాల నిర్మాణం జరిగిందో తరతమ స్థాయిలో అక్కడల్లా ఇలాంటి ప్రాంతీయ విభేదాలు తల ఎత్తడం, అవి చరమ స్థాయినందు కొన్న తర్వాత రాష్ట్ర విభజనోద్యమంగా రూపొందడం భారతదేశమంతటా కనిపిస్తోంది. ఇది మరో ప్రత్యేకత.

ఇదీ భారతదేశంలో జాతుల సమస్య రూపొందుతున్న తీరు. క్లుప్తంగా చెప్పాలంటే యూరపులో మాదిరిగా గాక ప్రజాస్వామిక విప్లవానికి ద్రోహం చేసి సామ్రాజ్యవాదులతో మిలాఖత్ అయి కేంద్రంలో అధికారాన్ని చేజిక్కించుకొన్న దళారీ బూర్జువా వర్గానికి రాష్ట్రాలలో ఉన్న పెట్టుబడిదారీ భూస్వామ్యవర్గాలకు మధ్య ఘర్షణగా ఇక్కడ రూపొందుతోంది. ఆ క్రమంలో భాగంగానే సంస్థానాలు రద్దుచేయబడిన తర్వాత భారతదేశంలో ఆంధ్రప్రదేశ్‌లాగా ఏర్పరచబడ్డ కొన్ని సమైక్య రాష్ట్రాలలో ప్రత్యేక రాష్ట్రాలు ఏర్పడాలనే లక్ష్యంతో ప్రాంతీయ ఘర్షణలు కూడ జరుగుతున్నాయి. కొన్ని శతాబ్దాలుగా వేర్వేరు యూనిట్లులో జీవించడం మూలంగా ప్రజలలో ఏర్పడ్డ వేర్పాటు మనస్తత్వమూ, జనరల్‌గా ప్రభుత్వంపై ఉన్న వ్యతిరేకతా ఆ ఘర్షణలకు నాయకత్వం వహిస్తున్న భూస్వామ్య పెట్టుబడిదారీ వర్గాలకు పెట్టుబడిగా ఉపకరిస్తున్నాయి. అందువల్ల భారతదేశంలో ప్రత్యేక పరిస్థితుల్లో రూపొందుతున్న జాతుల సమస్యలో భాగంగానే ఇలాంటి ప్రాంతీయ ఉద్యమాల్ని చూడాలితప్ప, "జాతిని చీల్చడం"గానో విచ్ఛిన్నకర ఉద్యమాలుగానో చూడరాదు.

జాతుల సమస్య ఇలాంటి రూపం తీసుకొన్నచోట్ల రాష్ట్రవిభజన జరిగి వేర్వేరు రాష్ట్రాలు ఏర్పడిన మరునాటి నుండి కొత్తగా ఏర్పడే రాష్ట్రాలలో ఉండే పెట్టుబడిదారీ భూస్వామ్యవర్గాలకూ, ఆర్థిక రాజకీయ అధికారాన్ని తమ గుప్పెటలో ఉంచుకొన్న కేంద్ర ప్రభుత్వంలోని పాలకవర్గాలకూ మధ్య ఘర్షణ చెలరేగక తప్పదు. భారతదేశంలో ఆరంభమై కొనసాగుతున్న వ్యవసాయ విప్లవ పోరాటంతోపాటు ఆ ఘర్షణ కూడ విభిన్న రూపాల్లో వ్యక్తం కాక తప్పదు. రైతాంగ సాయుధ విప్లవ పురోగమన క్రమంలో విభిన్న జాతుల పీడిత ప్రజలు తప్పకుండా సమైక్యమౌతారు. ప్రాంతీయ విభేదాలు తారాస్థాయి నందుకొన్న ఈ పరిస్థితుల్లో రాష్ట్రవిభజన రైతాంగ సాయుధ విప్లవంలో తిరిగి విభిన్న ప్రాంతాల ప్రజలు సమైక్యం కావడానికి తోడ్పడుతుందే తప్ప ఎట్టి పరిస్థితులోనూ అవరోధం కాదు. ప్రత్యేకించి ఈనాడున్న విప్లవ పరిస్థితిని దృష్టిలో ఉంచుకొని ఆలోచిస్తే అది ఎట్టిపరిస్థితులలోనూ అవరోధం కాజాలదు. "జాతి విచ్ఛిన్నం అవుతుంది' అనే పేరుతోనో, మరో అంధ విశ్వాసంతోనో యథార్థ పరిణామాన్ని గుర్తించకుండా ఈ ఉద్యమాలకు అడ్డు తగిలి నిర్బంధంగా ఒకే రాష్ట్రంలో ఉంచడం ద్వారా రెండు ప్రాంతాల ప్రజలు కేంద్ర ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడడం పోయి, ఒకరితో మరొకరు పోరాడుకొనే దుస్థితికి దిగి తద్వారా తెలుగు జాతి శాశ్వతంగా రెండు శత్రు క్యాంపులుగా చీలిపోవడమూ, ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆరంభమై రైతాంగ సాయుధ పోరాటంగా జరుగుతున్న వ్యవసాయక విప్లవం విపరీత నష్టాలకు గురికావడమూ జరుగుతుంది. ఈ సందర్భంలోనే మరో విషయం కూడా గుర్తుంచుకోవాలి. ప్రజాస్వామిక విప్లవంలో భాగంగానే జాతుల అభివృద్ధి జరుగుతుందని అందరూ అంగీకరిస్తారు. పశ్చిమ యూరప్‌లో ఆ విప్లవం పెట్టుబడిదారీ విధాన అభివృద్ధికర దశలోనే జరిగింది. అందువల్ల ఫ్యూడలిజం నిర్మూలింపబడడంతో పాటు విభిన్నజాతులు అక్కడ స్వతంత్ర ప్రభుత్వాలుగా కూడా రూపొందాయి.

తూర్పు యూరపులో ముఖ్యంగా రష్యాలో పెట్టుబడిదారీ విధానం సామ్రాజ్యవాదంగా రూపొందిన తర్వాత ప్రజాస్వామిక విప్లవం జరిగింది. అందులో భాగంగానే జాతుల సమస్య పశ్చిమ యూరపు కంటే భిన్నమైన రీతిలో జరిగింది.

ఈనాడు భారతదేశంలో అంటే సామ్రాజ్యవాదం మొత్తంగా నాశనం కానున్న యుగంలో సోషలిజం ప్రపంచవ్యాపితంగా విజయం పొందుతున్న యుగంలో కార్మిక వర్గ నాయకత్వాన నూతన ప్రజాస్వామిక విప్లవంతో పాటు జాతుల సమస్య కూడా కొనసాగుతోంది. ప్రజాస్వామిక విప్లవంతో పెనవేసికొని ఉండే జాతుల సమస్య రష్యాలో కంటే భిన్నమైన పరిస్థితుల్లో ఇక్కడ రూపొందుతోంది. అయితే ఇక్కడ జాతుల సమస్య యూరపులో పరిష్కారమైనట్లు బూర్జువా పరిధిలో కూడ పరిష్కారం కాదు. అందుకు కారణం ఇక్కడ జరుగుతున్న ప్రజాస్వామిక విప్లవంలో బూర్జువా వర్గం నాయకత్వ పాత్రను కోల్పోవడమే. ఒక్క భారతదేశంలోనే కాదు రష్యా విప్లవం పూర్తి అయిన తర్వాత

వెనుకబడిన దేశాలన్నిటా కూడ ప్రజాస్వామిక విప్లవాలకు నాయకత్వం వహించే పాత్రను బూర్జువా వర్గం కోల్పోయింది.

అలాంటి విప్లవాలన్నీ ఈనాడు కార్మిక వర్గ నాయకత్వాన నూతన ప్రజాస్వామిక విప్లవాలుగానే కొనసాగుతున్నాయి. దీనిని బట్టి ఏమి తెలుస్తుంది? కేంద్రంలో అధికారంలో ఉన్న గుత్త పెట్టుబడిదారీ వర్గానికి, విభిన్న జాతులకు చెందిన పెట్టుబడిదారీ, భూస్వామ్య వర్గాలకు మధ్యనున్న వైరుధ్యాన్ని ప్రజాతంత్ర విప్లవంలో భాగంగా పరిష్కరించుకోవడానికి, అలాంటి పోరాటాలకు నాయకత్వం వహించడానికి ఆయా జాతులకు చెందిన బూర్జువా వర్గం సిద్ధంగా లేదు. అలాంటి పరిస్థితుల్లో విప్లవ పోరాటం తీవ్రతరంగా అభివృద్ధి చెందని ప్రాంతాల్లోనూ, విప్లవ పోరాటం ఆరంభమై తాత్కాలికంగా దెబ్బతిన్న ప్రాంతాల్లోనూ అధికారాన్ని పంచుకొనే ఘర్షణలుగానో (రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలమధ్య) ఆంధ్రప్రదేశ్‌లో జరుగుతున్నట్లు రాష్ట్ర విభజనోద్యమాలుగానో, ఇలాంటివే మరికొన్ని రూపాల్లో ఘర్షణలుగానో రూపొందవచ్చు. అయితే ఆ ఘర్షణలలో పాల్గొనే ప్రజల్లో విప్లవ పొటెన్షియాలిటీలు ఉన్నాయనీ, ప్రభుత్వంపై తీవ్రమైన అసంతృప్తి పేరుకొని ఉండడం మూలంగానే ఆ పోరాటాల్లో ప్రజలు పెద్ద ఎత్తున పాల్గొంటున్నారనీ మనం మర్చిపోరాదు. అందువల్ల ఆ పోరాటాల్లో పాల్గొనే ప్రజలల్లో ఉన్న పొటెన్షియాలిటీస్‌ను సాయుధ వ్యవసాయిక విప్లవానికి అనుకూలంగా ఉపయోగించుకోవడానికి వీలుగా కార్మిక వర్గం అలాంటి ఘర్షణల ఎడల (కేంద్ర ప్రభుత్వ నిరంకుశాధికారాన్ని బలపరచడానికి తోడ్పడే ప్రత్యేక ఘర్షణలలో తప్ప అనుకూల వైఖరినే తీసుకోవాలి. తద్వారానే ఆయా ఘర్షణలకు నాయకత్వం వహిస్తున్న బూర్జువా, భూస్వామ్య వర్గాలను ప్రజల నుండి వేరుచేసి, ప్రజల్లో ఉన్న విప్లవ శక్తి సామర్థ్యాలను (రివల్యూషనరీ పొటెన్షియాలిటీస్) ప్రభుత్వ వ్యతిరేక సాయుధ రైతాంగ విప్లవంలో సంఘటితపర్చడం సాధ్యమవుతుంది. రైతాంగ విప్లవం విజయం పొందడం ద్వారానే సమగ్రమైన జాతులు రూపొందుతాయి. ఈ దృష్టితోనే ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌లోని ఉభయ ప్రాంతాల్లో జరుగుతున్న పోరాటాన్ని జాతుల సమస్యపై జరుగుతున్న పోరాటంలో అంతర్భాగంగా చూసి, దీనియెడల మార్క్సిజాన్ని ఆమోదించేవారంతా అనుకూలవైఖరి తీసుకోవాల్సి ఉంటుంది. అంతేగాని ఎట్టిపరిస్థితుల్లోనూ విచ్ఛిన్నకర ఉద్యమంగా చూడాల్సిన పనిలేదు.

ఇక నాల్గవ వాదన. ఈ పోరాటాన్ని రెండుజాతుల మధ్య జరుగుతున్న పోరాటంగా ఎందుకు భావించరాదు? అనేది ఈ పోరాటం పట్ల ప్రజల్లో ముఖ్యంగా పట్టణ మధ్య తరగతి ప్రజల్లోనూ, విద్యార్థి యువజనుల్లోనూ కనిపిస్తున్న ఉత్సాహాన్ని చూసి, ఆ పోరాటాన్ని సమర్థించడానికి సిద్ధమై. దానిని సమర్థించుకోవడానికి కారణాలు పరిశీలిస్తున్న మిత్రుల నుండి ప్రధానంగా ఈ ప్రశ్న వస్తోంది.

ఆంధ్ర తెలంగాణ ప్రాంతాలకు చెందిన ప్రజలంతా ఇంకా సమగ్రమైన అభివృద్ధి పొందని ఒకేజాతి ఒకే భాష మాట్లాడుతారు. ఒకే భూభాగంలో నివసిస్తున్నారు. ఒకే విధమైన ఆర్థిక విధానం ఉంది. అయితే శతాబ్దాలుగా వేర్వేరు ప్రభుత్వాల కింద జీవించడానికి అలవాటు పడిన కారణం చేత ఉభయప్రాంతాల ప్రజలలోను తాము వేరు వేరు అనే మనస్తత్వం జీర్ణించుకొని ఉంది. ఫ్యూడలిజం నిర్మూలింపబడి దేశం పారిశ్రామికం చేయబడి ఆర్థికాభివృద్ధి చెందే క్రమంలో ఉభయ ప్రాంతాల ప్రజల్లోను వేర్వేరు భావాలు నశించి సమగ్రమైన జాతిగా రూపొందడం జరుగుతుంది. ఈ ప్రభుత్వ ఆధిపత్యం కింద "అలాంటి అభివృద్ధి జరగని కారణంగానే ప్రాంతీయ విభేధాలింకా కొనసాగుతూ ఉన్నాయి. ఆ విభేదాలే ఈనాటి రాష్ట్ర విభజనోద్యమానికి ప్రాతిపదిక. ఈ రోజు వేర్వేరు రాష్ట్రాలు కావాలని కోరుకొన్నంత మాత్రం చేత రెండూ వేర్వేరు జాతులని సిద్ధాంతం చేసుకోనవసరం లేదు. రెండు రాష్ట్రాలుగా ఏర్పడిన తర్వాత తప్పకుండా రెండు రాష్ట్రాలు రాజకీయ ఆర్థికాధికారాన్నంతనటిని తమ గుప్పెటలో పెట్టుకొని ఉన్న కేంద్ర ప్రభుత్వానికి వ్యతిరేకంగా సంఘర్షణ జరుపక తప్పదు. రెండు రాష్ట్రాలలోనూ పాలకవర్గాలకు వ్యతిరేకంగా వ్యవసాయక విప్లవం పురోగమించక తప్పదు. ఆనాడు తెలంగాణ ప్రజల దారిద్ర్యానికి, దినం దినం పెరుగుతున్న నిరుద్యోగానికి ఆంధ్రుల పెత్తనం కారణమనే సాకు చెప్పి వ్యవసాయ విప్లవంలో పాల్గొనే రైతాంగాన్ని తెలంగాణ భూస్వాములు మభ్యపుచ్చలేరు. అలాంటి పరిస్థితే ఆంధ్ర భూస్వాములు కూడ ఎదుర్కొనక తప్పదు. ఉభయ ప్రాంతాల ప్రజలు భారతదేశ వ్యాపితంగా కొనసాగుతున్న వ్యవసాయక విప్లవంలో భాగంగా తప్పకుండా సమైక్యమౌతారు. ఈ అభివృద్ధి నిరోధక ప్రభుత్వాన్ని నిర్మూలించి, దీనిస్థానే స్థాపించబడే కూలీరైతు రాజ్యంలో తప్పకుండా ఆంధ్ర ప్రజానీకమంతా ఒకే ప్రభుత్వం కింద సమైక్యమై సమగ్రమైన జాతిగా రూపొందక తప్పదు.

అందువల్ల ఈ వ్యాసంలో పైన వివరించినట్లు భారతదేశంలోని ప్రత్యేక పరిస్థితుల్లో రూపొందుతున్న జాతుల సమస్యలో భాగంగానే ఆంధ్రులంతా సమగ్రమైన ఒకే జాతిగా రూపొందే క్రమంలో భాగంగానే ఈ రాష్ట్ర విభజనోద్యమాలను అర్థం చేసుకోవాలి గాని అందుకొరకు అవాస్తవికమైన రెండు జాతుల సిద్ధాంతానికి పూనుకోవాల్సిన పనిలేదు.

మార్క్సిజం పేరుతో భారతదేశంలో నెలకొన్న ప్రత్యేక పరిస్థితుల్లో, జాతుల సమస్యలో భాగంగానే జరుగుతున్న ప్రత్యేక రాష్ట్ర ఉద్యమాల్ని నిరశించకుండా తాత్కాలికంగా వేర్వేరు రాష్ట్రాల నేర్పరచుకున్నా భారతదేశంలోని బడా బూర్జువా, బడా భూస్వాముల ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరుగుతున్న నూతన ప్రజాస్వామిక విప్లవంలో ఉభయ ప్రాంతాల ప్రజలు సమైక్యమయి, సమగ్రమయిన జాతిగా రూపొందుతారనే విశ్వాసంతోనే మార్క్సిజాన్ని ఆమోదించేవారంతా ఈ పోరాటాలకు తమ మద్దతు నివ్వగలరని ఆశిద్దాం.

(సృజన మాసపత్రిక 44వ సంచిక 1973 నుండి...)

నివేదిక

గ్రీన్‌హంట్ నడమనే విజయవంతమైన

# క్రాంతికారీ ఆదివాసీ మహిళా సంఘటన్ మూడవ మహాసభ

పాలకవర్గాలు ప్రజలపై, ముఖ్యంగా ఆదివాసీ ప్రజానీకంపై గ్రీన్‌హంట్ పేరుతో తలపెట్టిన పాశవిక దమనకాండ నడుమనే క్రాంతికారీ ఆదివాసీ మహిళా సంఘటన్ తన మూడవ మహాసభను విజయవంతంగా జరుపుకుంది. గ్రీన్‌హంట్ నడుమనే సంఘాన్ని బలోపేతం చేసుకోవడానికీ, విస్తరింపచేసుకోవడానికీ, దాన్ని ఓడించడానికి ప్రజాయుద్ధంలో మహిళల భాగస్వామ్యాన్ని పెంపొందించడానికీ, దండకారణ్యాన్ని విముక్తి ప్రాంతంగా వికసింప చేయడంలో మహిళల పాత్రను మరింతగా పెంపొందించడానికి తగిన కర్తవ్యాలను రూపొందించుకుంది.

ఈ మహాసభను విజయవంతం చేయడం కోసం కామ్రేడ్ ఆజాద్ స్మృతిలో పచ్చని వనంలో కమ్యూన్ ఏర్పడింది. కమ్యూన్ రక్షణ కర్తవ్యాలను నెరవేర్చడం కోసమూ, భోజన, వైద్య తదితర అవసరాలను తీర్చడం కోసం కామ్రేడ్స్ పటేల్ సుధాకర్, శాఖమూరి అప్పారావుల స్మృతిలో హెడ్‌క్వార్టర్, కామ్రేడ్ మంగేష్ స్మృతిలో ఎ డిఫెన్స్ టీం, సింగారం అమరుల స్మృతిలో బి డిఫెన్స్ టీం, కొంగెర అమరులు కామ్రేడ్స్ బండు, శంకర్, రమేష్‌ల స్మృతిలో మూడవ ప్లటూన్, మొడియం దూలే స్మృతిలో రెండవ ప్లటూన్, కామ్రేడ్స్ కమల, రుక్మతి, రాంబత్తిల స్మృతిలో మిలిటరీ గ్రౌండ్, పూలో వడ్డే, రమోలీ వడ్డేల స్మృతిలో హాస్పిటల్, కామ్రేడ్ చైతే స్మృతిలో కిచెన్ వెలిశాయి.

అలాగే మూడేళ్ల ఉద్యమ సమీక్ష కోసం ప్రతినిధులు సమావేశం కావడానికి కామ్రేడ్ అనురాధా గాంధీ మహాసభ హాలు, హాల్లోకి వెళ్లేందుకు వీలుగా కామ్రేడ్స్ శారద (రామక్క), మీనా (మిచ్చ సరిత), కమల (తెల్లం సన్ని)ల ప్రవేశ ద్వారమూ వెలిశాయి.

కెఎఎంఎస్ కార్యకర్తలు, పిఎల్‌జిఎ కామ్రేడ్ల అలుపెరుగని సృజనాత్మక కృషివల్ల కమ్యూన్ అంతటా అమరుల స్మృతులూ, ఉద్యమ కర్తవ్యాలు నిరంతరం స్ఫురించేలా ఎర్రని బ్యానర్లూ, పోస్టర్లూ వెలిశాయి. ఉత్తేజ వాతావరణాన్ని నింపుతూ ఎర్రని తోరణాలు రెపరెపలాడాయి. ప్రత్యేకించి మహాసభ హాలు అమరుల ఫొటోలతో, ఎర్రని బ్యానర్లతో, రాజకీయ నినాదాలూ, మహోపాధ్యాయుల ప్రవచనాలతో కూడిన పోస్టర్లతో రెపరెపలాడే రంగురంగుల తోరణాలతో తీర్చిదిద్దబడింది.

ప్రతినిధులందరూ చేరుకోవడంతో నవంబర్ 8న మధ్యాహ్నం మహాసభ ప్రారంభ సంబరాలు మొదలయ్యాయి. ప్రతినిధులూ, ఆహ్వానితులూ, పిఎల్‌జిఎ సభ్యులూ, సాంస్కృతిక బృంద సభ్యులూ, ప్రజలూ కమ్యూన్ ప్రవేశ ద్వారం వద్ద మధ్యాహ్నం మూడు గంటలకు గుమికూడారు. మొదట ఎ డిఫెన్స్ టీం అప్రమత్తంగా నడుస్తుండగా, ఆ తర్వాత సిఎన్ఎం బృందం ఆటపాటలతో డప్పుల దరువులతో ఉత్తేజాన్ని నింపుతుండగా, వరుసగా కెఎఎంఎస్ కార్యవర్గమూ, ఆహ్వానితులూ, ప్రతినిధులూ, గార్డులూ, ప్రజలూ, చివరగా బి డిఫెన్స్ టీంలతో కూడిన ర్యాలీ కమ్యూన్ ద్వారం గుండా బయల్దేరింది. కెఎఎంఎస్ అధ్యక్షురాలు కామ్రేడ్ నర్మద తెల్లని నక్షత్రం హత్తిన ఎర్రని జెండాను ఎత్తి పట్టుకొని కార్యవర్గానికి ముందు నడుస్తుండగా, మిగతా కార్యవర్గ సభ్యులూ, ప్రతినిధులూ, తదితరులందరూ బ్యానర్లూ, ప్లకార్డులూ ఎత్తి పట్టుకొని నడిచారు. ర్యాలీ పొడుగూతా ఎలుగెత్తి నినదించిన గొంతులు అమరుల త్యాగాలను ఎత్తిపట్టాయి. గ్రీన్‌హంట్ పట్ల, ప్రభుత్వ దమనకాండ పట్ల ఆగ్రహాన్నీ, నిరసననూ ప్రకటించాయి. లాల్‌గఢ్, నారాయణపట్నా, కాశ్మీర్, ప్రత్యేక తెలంగాణ తదితర పోరాటాలకు సంఘీభావం ప్రకటించాయి. మహిళల పట్ల విచ్చలవిడిగా కొనసాగుతున్న రాజ్యాహింసను ఖండించాయి.

ర్యాలీ ముగించుకొని గ్రౌండ్‌కు చేరుకున్న కామ్రేడ్స్‌కు క్యాంపు కమాండర్ ప్రోటోకాల్ చేయించింది. కామ్రేడ్ నర్మద కెఎఎంఎస్ జెండాను ఆవిష్కరించగానే కామ్రేడ్సంతా జెండాకు పిడికిలెత్తి లాల్‌సలాం చేస్తూ 'నారీ ముక్తి జెండా హమ్ పహరాంగే...' అంటూ గొంతు విప్పారు. అనంతరం కామ్రేడ్ నర్మద ప్రసంగిస్తూ విప్లవోద్యమాన్ని, అందులో భాగంగా మహిళా ఉద్యమాన్ని అణచివేయడానికి పాలకవర్గాలు ఎన్ని పథకాలు పన్నుతున్నాయో వివరించి సల్వాజుడుం నడుమనే మనం మహిళా ఉద్యమాన్ని మరింతగా బలోపేతం చేశామని ప్రస్తుతం గ్రీన్‌హంట్ నడుమ కూడా మహిళా ఉద్యమాన్ని బలోపేతం చేయగలమనే ఆత్మవిశ్వాసాన్ని ప్రకటించింది.

ఆ తర్వాత కామ్రేడ్ సరిత స్థూపావిష్కరణ చేసి అమరుల త్యాగాలను కొనియాడుతూ ప్రసంగించింది. ఆ తర్వాత కామ్రేడ్ నర్మద మూడేళ్లలో దేశవ్యాప్తంగా అమరులైన ముఖ్యమైన కామ్రేడ్స్‌ను పేరు పేరునా స్మరించుకుంటూ జోహార్లు చెప్పింది. ప్రధానంగా దండకారణ్యంలో ఈ మూడేళ్లలో అమరులైన ప్రతి ఒక్క మహిళా కామ్రేడ్స్‌కూ పేరు పేరునా జోహార్లు చెప్పింది. అలా జోహార్లు చెప్తున్నప్పుడు ఆమె కంఠం జీరబోయి క్షణకాలం ఆగిపోయినప్పుడు కామ్రేడ్సందరి గొంతుల్లోంచి వెలువడిన జోహార్ నినాదాలతో పరిసరాలు మారుమోగాయి.

ప్రారంభ సభ ముగిసిన అనంతరం ప్రతినిధులనూ, ఆహ్వానితులనూ 'ఆహ్వాన్ కర్తే హై....' అంటూ సిఎన్ఎం కామ్రేడ్స్ గానం చేస్తుండగా, కామ్రేడ్ నర్మద ఒక్కొక్కరికీ లాల్‌సలాం చేస్తూ హాల్లోకి ఆహ్వానించింది.

ఈ మహాసభకు కెఎఎంఎస్ నుండి 40 మంది ప్రతినిధులు, ముగ్గురు సౌహార్ద ప్రతినిధులు, నిర్వాహకులుగా డికె ఎస్‌జడ్‌సి నుండి ఒకరు, పర్యవేక్షకులుగా వివిధ విభాగాల నుండి మరో

ఆరుగురు కామ్రేడ్స్ హాజరయ్యారు. మొత్తం హాలులో 49 మంది కామ్రేడ్స్ హాజరయ్యారు.

కెఎఎంఎస్ కార్యవర్గం ఈ కింది ఎజెండాను రూపొందించింది.

1. ప్రారంభోపన్యాసం, 2. బ్యాడ్జీల ప్రధానం, 3. అధ్యక్షవర్గం ఎన్నిక, 4. ఎస్‌జడ్‌సి సందేశం, 5. సౌహార్ద ప్రతినిధుల సందేశం, 6. పర్యవేక్షకుల సందేశాలు, 7. అమర వీరుల తీర్మానం, 8. జైలు కామ్రేడ్స్‌కు జేజేలు - తీర్మానం, 9. డివిజన్ కార్యకలాపాల నివేదికలు, 10. జోన్ నివేదిక, 11. ప్రణాళిక నిబంధనావళి, 12. రాజకీయ తీర్మానం, 13. మహిళా ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోవడంలో వస్తున్న సమస్యలు, 14. మహాసభ తీర్మానాలు, 15. నూతన కార్యవర్గం ఎన్నిక, 16. నూతన కార్యవర్గం ప్రతిజ్ఞ, 17. ముగింపు ఉపన్యాసం, 18. పర్యవేక్షకుల ప్రసంగాలు, 19. సౌహార్ద ప్రతినిధుల ప్రసంగాలు.

పై ఎజెండాను అనుసరించి కెఎఎంఎస్ జోన్ ఉపాధ్యక్షురాలు కామ్రేడ్ సమిత స్వాగతోపన్యాసంతో మహాసభ ప్రారంభమయింది. కామ్రేడ్ నర్మద ప్రతినిధులూ, పర్యవేక్షకులూ, సౌహార్ద ప్రతినిధులకూ బ్యాడ్జీలను అలంకరించింది. ఆ తర్వాత మహాసభ, కామ్రేడ్స్ కాంత, సుమిత్ర, మీనా, కన్నీ, సన్నీలతో కూడిన అధ్యక్షవర్గాన్ని ఎన్నుకుంది. అధ్యక్షవర్గం తరపు నుండి కామ్రేడ్ కాంత తమల్ని ఎన్నుకున్నందుకు కృతజ్ఞతలు తెలియజేసి, మహాసభ ముందు ఎజెండాను ప్రవేశపెట్టింది. ఎజెండాను ప్రతినిధులు ఆమోదించిన తర్వాత మహాసభ టైం టేబుల్‌ను ప్రకటించడంతో ప్రారంభ దినపు మహాసభ కార్యక్రమాలు ముగిశాయి.

ఎస్‌జడ్‌సి తరపు నుండి సెక్రెటేరియట్ సభ్యురాలు, జోన్ జనతన సర్కార్ సన్నాహక కమిటీ ఉపాధ్యక్షురాలు కామ్రేడ్ మైనా ఇచ్చిన సందేశంతో రెండవరోజు ఉదయపు సెషన్ మొదలయింది. ఆ తర్వాత వరుసగా పర్యవేక్షకులుగా వచ్చిన కామ్రేడ్స్ మహిత (రీజినల్ పొలిటికల్ స్కూలు బాధ్యురాలు), కామ్రేడ్ దీప (సెంట్రల్ టెక్నికల్ యూనిట్ సభ్యురాలు, కామ్రేడ్ భాను (క్రాంతి సంపాదక మండలి సభ్యురాలు), సౌహార్ద ప్రతినిధులుగా హాజరైన కామ్రేడ్స్ రజిత (గోందియా డివిజన్), కామ్రేడ్ దీన (సిఎన్ఎం జోన్ కార్యవర్గ సభ్యురాలు), కామ్రేడ్ వసంత (ఉత్తర తెలంగాణ), పర్యవేక్షకులుగా హాజరైన కామ్రేడ్ చంప (రీజనల్ డాక్టర్స్ టీం ఇంఛార్జ్), కామ్రేడ్ గిరిజ (నిబ్ కంపెనీ పిపిసిఎం), కామ్రేడ్ మంగ్లి (ఒకటవ కంపెనీ పిపిసిఎం)లు తమ సందేశాలను వినిపించారు.

వీరంతా తమ సందేశాల్లో నేడు దేశంలో నెలకొని ఉన్న అద్భుతమైన విప్లవ పరిస్థితిని ఉపయోగించుకొని విప్లవోద్యమాన్నీ, ప్రత్యేకించి మహిళా ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోవడానికి కెఎఎంఎస్ తన వంతు కృషి చేస్తుందనే ఆకాంక్షలను వ్యక్తం చేశారు.

ఆ తర్వాత అమరవీరుల తీర్మానాన్ని కెఎఎంఎస్ కోశాధికారి కామ్రేడ్ మమత ప్రవేశపెట్టింది. అమరులకు పేరుపేరునా జోహార్లు చెబుతూ మహాసభ అమరవీరుల తీర్మానాన్ని ఆమోదించింది. కెఎఎంఎస్ కార్యవర్గ సభ్యురాలు కామ్రేడ్ తార జైలు కామ్రేడ్స్‌కు సంఘీభావం చెప్తూ తీర్మానాన్ని ప్రవేశపెట్టింది. చిరు సవరణలతో మహాసభ తీర్మానాన్ని ఆమోదించింది.

మధ్యాహ్నం సెషన్ మరికాసేపట్లో ముగుస్తుందనగా ఎజెండాలోని 8వ అంశం - డివిజన్ కార్యకలాపాల నివేదికలు - సభ ముందుకు వచ్చింది. డివిజన్ల వారీగా వర్సగా దక్షిణ బస్తర్ నుండి కామ్రేడ్ సమిత, పశ్చిమ బస్తర్ నుండి కామ్రేడ్ జ్యోతి, మాడ్ నుండి కామ్రేడ్ విమల, తూర్పు బస్తర్ నుండి కామ్రేడ్స్ సుమిత్ర, మన్‌కేలు, ఉత్తర బస్తర్ నుండి కామ్రేడ్ మమత, ఉత్తర గడ్‌చిరోలి నుండి కామ్రేడ్ కాంత, లత, మాన్‌పూర్ నుండి కామ్రేడ్స్ సమీల, జైనిలు, దర్భ నుండి కామ్రేడ్ కోసి, ఫులోలు తమ డివిజన్ నివేదికలను సభ ముందు ఉంచారు. అనంతరం కామ్రేడ్ నర్మద జోన్ నివేదికను ప్రవేశపెట్టారు. ఇలా రెండవరోజు సాయంత్రం మొదలైన కార్యకలాపాల నివేదికలు నాలుగవ రోజు ఉదయం సెషన్‌తో పూర్తి అయ్యాయి.

ఈ నివేదికల ద్వారా ప్రస్ఫుటంగా కనబడిన కొన్ని అంశాలు ఏంటంటే - గత సల్వాజుడుం, నేటి గ్రీన్‌హంట్ కారణంగా సంఘకార్యకలాపాల్లో అధికభాగం మహిళల ప్రతిఘటనే ఉంది. ముఖ్యంగా తమ భర్తలనో, పిల్లలనో పట్టుకెళ్తున్న సాయుధ బలగాలతో మహిళలు నిరాయుధంగానే ధైర్యంగా పోరాడ్డం అనేది ఒక సాధారణాంశంగా ఉంది. మృతదేహాల స్వాధీనం కోసం పోలీసుస్టేషన్లూ, పోలీసు క్యాంపుల ముందు ప్రాణాలకు తెగించి ఆందోళనలు చేపట్టడం కూడా సర్వసాధారణ విషయంగా మారిపోయింది. అంతేకాదు వెళ్లడం వంటి పనులు మహిళలకు నిషిద్ధం. ఈ పరిస్థితిలో మార్పు తీసుకురావడం కోసం కెఎఎంఎస్ ప్రయత్నిస్తున్నది కూడా. కానీ నేడు యుద్ధం ప్రధానమై పోవడం, పురుషులు వ్యవసాయపు పనులకు ఎక్కువగా సమయం కేటాయించే అవకాశం లేకపోవడంతో వ్యవసాయంలో పితృస్వామ్య సరిహద్దులు చెరిగిపోతున్నాయి. అన్ని పనులూ మహిళల భాగస్వామ్యాన్ని డిమాండ్ చేస్తున్నాయి.

ఆందోళనకరమైన విషయాలు, మహిళా ఉద్యమం వెంటనే దృష్టి పెట్టాల్సిన విషయాలు ఏంటంటే నిర్బంధం కారణంగా నిర్మాణాలు బలహీనపడిన చోట పితృస్వామిక అణచివేత మళ్లీ మొదటకు వస్తోంది. అంతేకాదు రాజ్య వ్యతిరేక పోరాటం ప్రధానం అయిపోయిన చోట పితృస్వామిక వ్యతిరేక పోరాటం మొత్తంగానే మరుగున పడుతోంది. ఇటువంటి మరెన్నో విషయాలు నివేదికల ద్వారా అర్థమై చర్చకు దారితీశాయి.

నాలుగవ రోజు మధ్యాహ్నం సెషన్ ప్రణాళిక నిబంధనావళితో మొదలైంది. కామ్రేడ్ నర్మద కెఎఎంఎస్ ప్రణాళిక నిబంధనావళిని వివరించింది. అనంతరం దానిపై హాలులో చర్చ జరిగింది. అన్ని డివిజన్ మహాసభల్లో ప్రణాళిక మీద జరిగిన చర్చలనూ, ప్రతిపాదించిన సవరణలను ప్రతినిధులు మహాసభ దృష్టికి తెచ్చారు. చర్చల అనంతరం కొన్ని సవరణలతో సభ ప్రణాళికా నిబంధనావళిని ఆమోదించింది.

కామ్రేడ్ కెఎఎంఎస్ జోన్ కార్యదర్శి కామ్రేడ్ విమల రాజకీయ తీర్మానాన్ని వివరించడమూ ప్రతినిధులు ఆమోదించడంతో ఆనాటి

కార్యక్రమాలు ముగిశాయి.

మహాసభ అయిదవ రోజున మహిళా ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోవడంలో వస్తున్న సమస్యల గురించి విస్తృతమైన చర్చ జరిగింది. గ్రామస్థాయి నుండి సంఘాలూ, కమిటీల ఫంక్షనింగ్‌లో ఎటువంటి సమస్యలు వస్తున్నాయి? సంఘాలూ, కమిటీలను బలోపేతం చేసుకోవడానికి ఎటువంటి చర్యలు చేపట్టాలి? జోన్‌లో ఉన్న పట్టణాల్లోని మహిళల్లోకి ఉద్యమాన్ని ఎలా విస్తరింపచేయాలి? కార్పొరేట్ సెక్యూరిటీ నడుమనే రహస్య పని విధానంతో ఎలా మహిళా ఉద్యమాన్ని విస్తరింపచేయాలి? మారుతున్న పరిస్థితుల్లో ఉద్యమాన్ని ఎలా బలోపేతం చెయ్యాలి? ప్రభుత్వ మహిళా సంఘాలు, అంగన్‌వాడీ కార్యకర్తలు, మహిళా ఆరోగ్య కార్యకర్తల పట్ల మన వైఖరి ఎలా ఉండాలి అనే అంశాలపై విస్తృతమైన చర్చ జరిగింది. మహిళల్ని పక్కదారులు పట్టించడంలో, మహిళా ఉద్యమాన్ని నీరుకార్చడంలో ప్రభుత్వ సంస్కరణలు, హిందూ మతం, సామ్రాజ్యవాద సంస్కృతుల పాత్ర ఉద్యమ ప్రాంతంలో ఎలా పెరుగుతున్నదో నిర్దిష్టమైన చర్చ జరిగింది. అంతేకాదు ఉపాధిని వెతుక్కుంటూ దూర ప్రాంతాలకు వలసవెళ్తున్న యువత ఎన్ని రకాల చెడు ప్రభావాలకు గురవుతున్నారో, అవన్నీ ఉద్యమానికి ఎంత ఆటంకంగా ఉన్నాయో కూడా వివరంగా చర్చించారు. చర్చలో పాల్గొన్న ప్రతినిధులందరూ ఉద్యమాన్ని బలోపేతం చేయడానికి కొన్ని ప్రతిపాదనలు చేశారు. ఉదయం నుండి సాయంత్రం వరకూ జరిగిన ఈ చర్చకు కామ్రేడ్ నర్మద ఒక స్పష్టతను ఇస్తూ ఆఖరులో మాట్లాడింది. ఉద్యమాన్ని బలోపేతం చేసుకోవడంలో భాగంగా ముఖ్యంగా మహిళలను పోరాటాల్లోకి ఆందోళనల్లోకి విస్తృతంగా కదిలించాలనీ, కార్యకర్తలను రాజకీయంగా విద్యావంతం చేసుకోవాలనీ, కింది స్థాయి నుండి నాయకత్వాన్ని బలోపేతం చేసుకోవాలనీ, నూతన ప్రాంతాలకూ, నూతన తరగతులకూ ఉద్యమాన్ని విస్తరింపజేయాలనీ, పలు సమస్యలకూ, రాజ్య దమనకాండకు వ్యతిరేకంగా విస్తృతమైన ఆందోళనలను చేపట్టాలని ఆమె నొక్కి చెప్తూ చర్చను ముగించడంతో ఆనాటి కార్యక్రమాలు పరిసమాప్తం అయ్యాయి.

ఆరవ రోజున అంటే 13వ తేదీన ఉదయం కార్యవర్గం, మొత్తం 17 తీర్మానాలను మహాసభ ముందు ఉంచింది. చిరు సవరణలతో అన్ని తీర్మానాలను మహాసభ ఆమోదించింది.

ఆ తర్వాత కామ్రేడ్స్ నర్మద, సమిత, విమల, మమత, కాంత, విజయ, జ్యోతి, సుమిత్ర, కోసిలతో కూడిన నూతన కార్యవర్గం ఎన్నికైంది. కామ్రేడ్ సన్నీ నూతన కార్యవర్గాన్ని ప్రతిపాదించగా మహాసభ ఏకగ్రీవంగా ఆమోదించింది. అనంతరం నూతన కార్యవర్గం అధ్యక్షురాలిగా కామ్రేడ్ నర్మదను, ఉపాధ్యక్షురాలిగా కామ్రేడ్ సమితను, కార్యదర్శిగా కామ్రేడ్ విమలను, కోశాధికారిగా కామ్రేడ్ మమతను ఎన్నుకుంది. ఎన్నికైన నూతన కార్యవర్గంతో కామ్రేడ్ మైనా ప్రతిజ్ఞ చేయించింది. నూతన కార్యవర్గం పాడిన పాటతో ఉదయం పూట సెషన్ ముగిసింది.

మధ్యాహ్నం సెషన్ కామ్రేడ్ మైనా ముగింపు ఉపన్యాసంతో మొదలైంది. ఆ తర్వాత వరుసగా కామ్రేడ్స్ మహిత, దీన, వసంత, చంప, రజిత, మంగ్లి, గిరిజలు మాట్లాడారు. వీరంతా మహాసభ విజయవంతంగా ముగిసినందుకు తమ సంతోషాన్ని వ్యక్తం చేశారు. ప్రతినిధులందరూ చురుగ్గా చర్చల్లో పాల్గొన్నందుకు అభినందనలు తెలియజేశారు. సల్వాజుడుం ఫాసిస్ట్ దాడి నడుమనే రెండవ మహాసభ చేపట్టిన కర్తవ్యాలను నెరవేర్చిన తీరును, నాటి నుండి నేటి వరకూ సాధించిన విజయాలనూ, సకారాత్మక అంశాలను ప్రశంసించారు. ఇంకా సాధించి ఉండాల్సిన అంశాలను గుర్తుచేశారు. నేడు గ్రీన్‌హంట్‌ను ఓడించాల్సిన కర్తవ్యం మన ముందు ఉందనీ, ఇంకా భవిష్యత్తులో మరెన్నో ఇటువంటి నిర్బంధాలతో తలపడవల్సి ఉంటుందని అన్నారు. ఈ మహాసభ చేపట్టిన కర్తవ్యాల ప్రాధాన్యతను ఎత్తిపట్టారు. కింది నుండి నాయకత్వ శక్తులను పెంపొందింపజేసుకోవాల్సిన ఆవశ్యకతను నొక్కిచెప్పారు. మారుతున్న పరిస్థితుల్లో మరింత ప్రతిభావంతంగా కెఎఎంఎస్ మహిళలను సంఘటితం చేస్తుందనీ, తన కార్యక్షేత్రాన్ని విస్తరించుకుంటుందనీ ఆకాంక్షించారు.

అనంతరం కామ్రేడ్ నర్మద వందన సమర్పణ చేస్తూ మహాసభను విజయవంతం చేసిన ప్రతినిధులకూ, ఆహ్వానితులకూ, సప్లయ్ బాధ్యతలను తీర్చిన, రక్షణ బాధ్యతలను చేపట్టిన పిఎల్‌జిఎ కామ్రేడ్స్‌కు, విప్లవాభివందనాలు తెలియజేసింది. ఆ తర్వాత ప్రతినిధులందరితో ప్రతిజ్ఞ చేయించింది.

చివరగా అధ్యక్షవర్గం నుండి కామ్రేడ్ కాంత మాట్లాడుతూ అధ్యక్షవర్గానికి సహకరించినందుకు అందరికీ విప్లవాభివందనాలు తెలియజేయడంతో మహాసభ ముగిసింది.

అనంతరం ప్రతినిధులూ కమ్యూన్‌లోని కామ్రేడ్స్ అందరూ ర్యాలీగా గ్రౌండ్‌కు చేరుకున్నారు. గ్రౌండ్‌లో బారులు తీరి నిలబడిన కామ్రేడ్స్‌కు కమ్యూన్ కమాండర్ కా. దేవే నూతన కార్యవర్గాన్ని పరిచయం చేసింది. కామ్రేడ్ మైనా కార్యవర్గంతో ప్రతిజ్ఞ చేయించింది. నూతన కార్యవర్గమంతా కమ్యూన్‌ను ఉద్దేశించి క్లుప్తంగా ప్రసంగించారు. ఎన్ని అడ్డంకులు వచ్చినా ఉద్యమాన్ని ముందుకు తీసుకువెళ్తామని వారంతా నొక్కిచెప్పారు.

చివరగా కామ్రేడ్ నర్మద మాట్లాడుతూ సల్వాజుడుం, గ్రీన్‌హంట్ నిర్బంధం మధ్యనే రెండవ మహాసభ కర్తవ్యాలను నెరవేర్చి, మహిళా సంఘాన్ని మరింత బలోపేతం చేసిన తీరును వివరించింది. అలాగే నేటి ప్రపంచ, దేశ పరిస్థితులను ముఖ్యంగా ఆర్థిక సంక్షోభం ప్రజల జీవితాలపై వేస్తున్న ప్రభావాన్ని వివరించింది. ఈ నేపథ్యంలో దండకారణ్యంలోని సహజ సంపదలను దోచుకోవాలనే దోపిడీ వర్గాల కుటిల ప్రయత్నాల వలన నిర్వాసిత సమస్య ప్రమాదభరితంగా ముంచుకువస్తోందనీ దాన్ని ఎదుర్కోవాలని పిలుపునిచ్చింది. జోన్‌లో మహిళల పరిస్థితిని వివరిస్తూ మహిళలపై కుటుంబ హింస, గ్రామపెద్దల పెత్తనం, రాజ్యహింస పెరిగిపోతున్నాయని దీన్ని ఎదిరించడానికి మహిళలను మరింత సమర్థవంతంగా సంఘటితం చేయాలని నొక్కిచెప్పింది. ప్రజాయుద్ధానికీ ప్రజా సంఘాలకు మధ్యనున్న సంబంధాన్ని

గుర్తుచేసి, ప్రస్తుత పరిస్థితులను విప్లవానికి అనుకూలంగా ఉపయోగించుకునే లక్ష్యంతో రూపొందించుకున్న మహాసభ కర్తవ్యాలను వివరించింది. చివరగా గ్రీన్‌హంట్ దమనకాండ నడుమనే దాని ప్రభావం ఏమాత్రం పడకుండా, శత్రువుకు సంబంధించిన ఏ చిన్న ఒత్తిడికీ గురికాకుండా సమర్థవంతంగా రక్షణ బాధ్యతలను నెరవేర్చిన పిఎల్‌జిఏ కామ్రేడ్స్‌కు, మరెన్నో రకాలుగా మద్దతునిచ్చి మహాసభను విజయవంతం చేసిన కమ్యూన్ పరిసర గ్రామాల ప్రజలకు విప్లవాభివందనాలను తెలియజేస్తూ తన ప్రసంగాన్ని ముగించింది. జెండాను అవనతం చేయడంతో మహాసభ కార్యక్రమాలు విజయవంతంగా ముగిసిపోయాయి.

మహాసభ ముగిసిన అనంతరం ప్రతినిధి కామ్రేడ్స్‌కు అయిదురోజుల పాటు వర్క్‌షాపు జరిగింది. ముఖ్యంగా కెఎఎంఎస్ కిందిస్థాయి కామ్రేడ్స్ తమ బాధ్యతను నిర్వర్తించడంలో ఎదుర్కొంటున్న సమస్యలను దృష్టిలో పెట్టుకొని కార్యవర్గం వర్క్‌షాపు అంశాలను రూపొందించింది. అవి 1. సంఘనిర్మాణాలు చేయడం ఎలా? 2. ఎజెండా రూపొందించుకోవడం, 3. తీర్మానాలు రాయడం ఎలా? రిపోర్టులు రాయడం ఎలా? 5. ఉపన్యాసాలు ఇవ్వడం ఎలా? మొదటి రోజు రిపోర్టులు రాయడంపై కా. భాను, రెండవ రోజు సంఘాలు నిర్మాణంపై కా. మైనా, మూడవ రోజు నుండి ఎజెండాలు రూపొందించుకోవటం, తీర్మానాలు రాయటం, ఉపన్యాసాలివ్వటం పై కా. నర్మదలు కార్యశీలనను నిర్వహించారు.

వర్క్‌షాపులో ప్రతిరోజు ఒక్కో అంశంపై టీచర్లు ఒకపూట వివరిస్తే, ఆ తర్వాత రెండు పూటలు విద్యార్థులు మాట్లాడడం, చర్చించడం, రాయడం చేశారు. ఈ విధంగా విద్యార్థులందరూ ఎంతో ఉత్సాహంగా పాల్గొని వర్క్‌షాపును విజయవంతం చేయడమే కాకుండా, భవిష్యత్తులో ఇటువంటివి మరిన్ని జరుపుకోవాలనే కోరికను వ్యక్తం చేశారు.

ఇలా వర్క్‌షాపును నిర్వహించడం కెఎఎంఎస్‌కు తొలి అనుభవం. తొలి అనుభవం మంచి అనుభవంగా నిర్వాహకులనూ, టీచర్లనూ, విద్యార్థులనూ ఉత్సాహపరిచింది.

ఇక మహాసభ ప్రారంభం నుండి వర్క్‌షాపు ముగిసే వరకూ సిఎన్ఎం కార్యకర్తలతో పాటు మరి కొందరు ఔత్సాహిక కామ్రేడ్లు, ప్రతిరోజూ సాయంత్రం గ్రౌండ్‌లోనే కాక మహాసభ హాల్లో మధ్య మధ్యనా, పాటలూ, నృత్యాలూ, నాటికలతో కూడిన సాంస్కృతిక ప్రదర్శనలతో కమ్యూన్ వాతావరణానికి తమ వంతు ఉత్తేజాన్నీ, ఉల్లాసాన్ని చేకూర్చారు.

ఇలా మొత్తంగా కమ్యూన్‌లోని ప్రతీ కామ్రేడ్ సహకారంతో, కమ్యూన్ బయట ఉన్న మరెందరో కామ్రేడ్స్, ప్రజల సహకారంతో మహాసభనూ, వర్క్‌షాపునూ విజయవంతంగా ముగించుకొని నూతన కర్తవ్యాలతో, నూతన ఉత్సాహంతో కెఎఎంఎస్ కార్యకర్తలు తమ తమ కార్యక్షేత్రాలకు తిరుగు ప్రయాణం అయ్యారు.

## మహాసభ చేపట్టిన కర్తవ్యాలు

1. కేంద్ర రాష్ట్ర సర్కార్లు ప్రారంభించిన అణచివేత దాడి ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ను ఓడిద్దాం. దండకారణ్య శాంతి సంఘర్ష్ సమితిని దెబ్బకొడదాం.
2. కార్పొరేట్ సెక్యూరిటీ భారీ సైనిక దాడుల నడుమనే కెఎఎంఎస్‌ను ముందుకు తీసుకెళ్లాలి.
3. జోన్, డివిజన్, ఏరియా, పంచాయితీ స్థాయిలో కార్యవర్గాలను రాజకీయంగా సైనికంగా పటిష్ఠ పరుచుకుందాం. ఏరియా, పంచాయితీ, గ్రామ స్థాయిలో పని విధానాన్ని మెరుగుపరుచుకుందాం.
4. విడి విడి గ్రామాలల్లో జరుగుతున్న మహిళల ప్రతిఘటనను సామూహిక ప్రతిఘటనగా మలుద్దాం. బూటకపు ఎన్‌కౌంటర్లకు వ్యతిరేకంగా సామూహిక ప్రతిఘటనను పెంపొందిద్దాం.
5. శత్రువు ప్రారంభించిన భారీ సైనిక దాడిని ఆత్మరక్షణ యుద్ధంతో ఓడిద్దాం. కెఎఎంఎస్ సభ్యులందరికీ ఆత్మరక్షణా శిక్షణ ఇవ్వాలి.
6. మహిళలపై సాగుతున్న రాజ్యహింసను ఖండించాలి. ఇతర మహిళా సంఘాలు మేధావులతో కల్సి ప్రజాస్వామ్య హక్కుల కోసం ఉద్యమాలను పెంపొందిద్దాం.
7. కూలీకి వెళ్లే యువతీ యువకులను సంఘటితం చేద్దాం. ఉపాధి కావాలి అనే డిమాండ్‌తో ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఉద్యమాల్లో సంఘటితం చేద్దాం.
8. ఉత్పాదనలో మహిళల భాగస్వామ్యంను పెంచుదాం. ఆర్థిక స్వావలంబన లక్ష్యంతో మహిళలను సమిష్టి ఉద్యమాల్లో భాగస్వామ్యం చేద్దాం.
9. మహిళల ఆరోగ్యం, శిశు సంరక్షణ, ప్రసూతి మరణాల సమస్యలపై మహిళలను ఐక్యం చేద్దాం. వైద్య సదుపాయాలను డిమాండ్ చేస్తూ ఉద్యమిద్దాం. మహిళలకు ఆరోగ్య శిక్షణను ఇచ్చి ఆరోగ్య కార్యకర్తలుగా తయారు చేద్దాం.

## హాలు ప్రతినిధులు చేసిన ప్రతిజ్ఞ

క్రాంతికారీ ఆదివాసీ మహిళా సంఘటన్ జోన్ మూడవ మహాసభకు ప్రతినిధి అయిన నేను... బలమైన మహిళా ఉద్యమాన్ని నిర్మించడం కొరకు దృఢంగా ప్రయత్నిస్తాను. మహిళా విముక్తికై దండకారణ్యంలోని మహిళలందరినీ ఏకం చేస్తాను. కేంద్రీకృత ప్రజాస్వామ్యానికి కట్టుబడి ఉంటూ నూతన ప్రజాస్వామిక విప్లవంలో మహిళలందరినీ ఏకం చేస్తాను. దండకారణ్యంలో ప్రజా రాజ్యాధికారాన్ని నిర్మించడం, దాన్ని విస్తరింపజేయడం, బలోపేతం చేయడం కొరకు నా వంతు బాధ్యతను సంపూర్ణంగా నెరవేర్చుతాను. శత్రువు తెచ్చిన గ్రీన్‌హంట్ భారీ దాడిలో కూడా వెనుకాడకుండా, దాన్ని ఓడించడానికి మహిళలను పెద్ద సంఖ్యలో ప్రతిఘటనా ఆందోళనల్లో కదిలించడానికి ప్రయత్నిస్తాను. దోపిడీ వ్యవస్థను కూలదోసి నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని విజయవంతం చేయడం కొరకు అమరవీరుల ఆశయాలను నెరవేర్చుతానని ప్రతిజ్ఞ చేస్తున్నా. జోన్ మూడవ మహాసభ చేపట్టిన కర్తవ్యాలను అమలు చేస్తానని ప్రతిజ్ఞ చేస్తున్నా.

సంస్మరణ

# కామ్రేడ్ రవి జ్ఞాపకాలలో....

- యామిని

"ఏయ్! లెవ్ ఎవడ్రానువ్వు?" బూటుకాలితో తన్నిన దెబ్బ. నిస్తేజంగా పడివున్న శరీరం. 'లేవరా' మళ్ళీ బూటుకాలితో దెబ్బ.

ఒళ్ళంతా హూనమయ్యి స్పృహ లేకుండా ఉన్న శరీరం. అంతా మసక మసకగా ఉంది. లేచేంతా ఓపిక లేదు. శరీరమంతా మాంసపు ముద్దలా తయారైంది. ఆ ముద్ద బలవంతంగా లేవడానికి ప్రయత్నిస్తే... ఊహూ... సాధ్యం కావడం లేదు. కళ్ళు బైర్లు కమ్మి, కాళ్ళు వంకర్లు తిరిగిపోయి. ఎంతో ఓపిక చేసుకొని లేచి నిలబడితే...

"ఎవడ్రా నువ్వు?" పోలీసు అధికారి హూంకరింపు.

"మర్యాదగా మాట్లాడండి" నింపాదిగానే.

"నన్నే అంత మాటంటవురా! నేనెవరనుకున్నావ్? అమాంతం మింగేసే డైనోసార్ చూపులు. చూపులతోనే ఆజ్ఞలు. వెంటనే దబి, దబి దెబ్బలు... పిడిగుద్దులు... ఇక్కడ, అక్కడ అనిలేదు. శరీరమంతా ఎర్రగా, వాచిపోయి ఉంది. అయినా చూపుల హూంకరింపు ఆగలేదు. విమానం ఎక్కించడం... దించడం... మళ్ళీ శరీరంపై కర్రసాము... ఒక్కక్షణం విరామం... ఈసారి కళ్ళతోనే ప్రశ్నని.

"మీరు అధికారి అయ్యుండి మర్యాదగా మాట్లాడడం నేర్చుకోండి" ఏమాత్రం తొణకకుండా.

"ఛీ.... అహం దెబ్బ తిన్నట్టు అక్కడ్నుంచి వెళ్ళిపోతూ మళ్ళీ హుకుం జారీ. అతని హుకుం క్షణాలపై ఆ శరీరంపై ప్రతాపాన్ని చూపించింది. ఒక్కరోజేనా? నిరంతరం ఇదే తంతు. జైలుకు తీసుకెళ్ళేంత వరకూ రకరకాల వేధింపులు, కరెంట్ షాక్ ఇవ్వడం, రకరకాల ప్రశ్నల వరద, విపరీతమైన టార్చర్, ఒక్కటేంటి? శారీరకంగా, మానసికంగా హింసించడం... ఆనందం పొందడం... ఒక నరకకూపం. ఈ నరక కూపంలో ఉంటూ, బయటి ప్రపంచంతో సంబంధం లేకుండా మానసికంగా, రాజకీయంగా మనల్ని మనం తీర్చిదిద్దుకోవటం, ప్రతి విషయాన్ని బ్యాలన్స్‌డ్‌గా అర్థం చేసుకోవడం... ప్రతిదీ కత్తిమీద సాములాంటిది.

గతకాలపు జ్ఞాపకాలు ఒక్కసారిగా కళ్ళముందు కదలాడుతుంటే... ఆ రోజుల కోసం, ఆ రోజు వ్యక్తుల కోసం మనసు ఆరాటం పడుతుంది. అదీ సాధ్యం కాదని తెలిసీ కూడా. ఎప్పుడో ఒకసారి కలువగలమనే ఆశ ఇప్పటి వరకు మిణుకు మిణుకుమంటున్నా, ఆ ఆశను నా నుంచి దూరం చేసిందీ దోపిడీ ప్రభుత్వం. గుండెను ఎవరో మెలిపెడుతున్నంత బాధ. ఉద్యమ అవసరాల రీత్యా ప్రాంతాలు మారినా, ఆయా కామ్రేడ్స్ క్షేమ సమాచారాలు అప్పుడప్పుడు తెలుస్తూ, వాటితోనే తృప్తి పడుతున్న సమయంలో పిడుగులాంటి వార్తతో మనస్సుల్లో గూడుకట్టుకున్న ప్రేమలు, ఆప్యాయతలు హఠాత్తుగా తల్లి నుండి వేరు చేసిన బిడ్డ శోకంలా... ఆర్తించి .... ఆర్తించి... ధారలా కారుతున్న కన్నీరును పంటి బిగువున అదిమిపెట్టిన ఆ అమరుడితో కలసివున్న రోజులను తలచుకొంటూ...

మాకు పై కమిటీ నుంచి నమ్మని కబురు రావడంతో ఉన్న తక్కువ సమయంలోనే అపాయింట్‌మెంట్ ఉన్న బొల్లాపల్లి ఏరియాకు బయలుదేరాం. చాలా దూరం నుంచి నడిచివస్తుండడంతో అలసిపోయిన శరీరాలకు సేద తీరుదామనే ఉన్నా, 'వచ్చేశామని' కమాండర్ నచ్చచెప్పడంతో నడక వేగం పెంచాం. ఎంత వేగం పెంచినా వాగులో ఉన్న కోసురాళ్ళ మీద నడవటమంటే మాటలా? ఏమాత్రం బ్యాలెన్స్ కోల్పోయినా కాలు కోసుకుపోతుంది. అందుకే అతి జాగ్రత్తగా నేను, విజయ (2006 జనవరిలో గాజులపాలెం ఎన్‌కౌంటర్‌లో సహచరుడు సునీల్‌తో పాటు అమరురాలైంది) వెనుక నడుస్తున్నాం. దూరంగా నిలబడి ఉన్న లైనును చూసి ఇంకా వేగం పెంచాం. అందరికీ చేతులు కలుపుతుండగా చివరి నుంచి మూడవ వ్యక్తిని చూస్తే ఎప్పుడూ ముఖ పరిచయం లేని ముఖంగా ఉంది. 'ఈయనెవరబ్బా?' నాలో నేనే అనుకుంటూ చేతులు కలుపుతుండగా, ఆ అపరిచిత మొఖం పక్కనే ఉన్న మా డిసి కామ్రేడ్‌ను 'ఏ దళం' అని అడగ్గా 'దాచేపల్లి దళం' అని సమాధానం చెప్పిన వెంటనే 'ఓహో! మైదాన ప్రాంత వాళ్ళన్నమాట' అని తనలో తానే సమాధాన పరచుకున్నాడు. మాకు చెప్పిన మకాం వైపు అడుగులు సారించాం. అప్పుడే తెలిసిందేమిటంటే 9 సంవత్సరాలు జైల్లో ఉండి, వారం రోజుల కిందటే విడుదలైన కామ్రేడని. ఏరియాలో ఉన్నప్పుడే పేపర్ వార్తల్లో 'సినీ ఫక్కీలో విడుదలైన శాఖమూరి అప్పారావు' అని తాటికాయంత అక్షరాలతో ఉన్నది చదివాం. కానీ, ఆ కామ్రేడ్‌ను ఇంత తొందరగా చూస్తామనిగానీ, కలుస్తామనిగానీ అస్సలు ఊహించలేదు. ఎందుకంటే పై నాయకత్వం ఉండేదే మా దగ్గర అరుదు. సెమీ ఫారెస్ట్ కలిగిన టెర్రియిన్ కావడం వల్లనేమో. అందులోకి జైలు నుండి విడుదలైన వారు హెడ్ క్వార్టర్స్‌లో ఉంటారుగానీ, ఇక్కడకు రారనే అభిప్రాయం ఉంది. అందుకే ఊహించని పరిణామానికి అవాక్కయ్యి 'ఇతను అతనా?' అని ఆశ్చర్యపోవడం, గుసగుసలు చేయడం మొదలైంది.

అందరూ జమ అయ్యాక జైలు రిపోర్టు చెపుతానన్నారు. 'జైలు రిపోర్టు' అనగానే చెప్పిన సమయానికన్నా ముందే వెళ్ళి కుతూహలంతో కూర్చున్నాను. దరిదాపు అందరూ ముందే

వచ్చేశారు. నిశ్శబ్దంగా, కింద సూది పడితే వినిపించేంతగా, చెప్పే విషయం కోసం ఉత్కంఠతో ఉందా వాతావరణం. ప్రతి అక్షరాన్ని కంఠస్తం చేయాలనే ఆశ, ఆత్రుతతో ఉంది. చెప్పడం మొదలుపెట్టాడు. తనమాటల్లోనే....

పార్టీ రహస్యాల కోసం ఒకరోజు బాగా టార్చర్ చేశారు. సొమ్మసిల్లి పడిపోయేంతవరకు కొట్టి వదిలి పడేసిపోయారు. నిస్తేజంగా కాళ్ళకు, చేతులకు సంకెళ్ళతో పడి ఉన్న నన్ను ఒక పోలీసు అధికారి వచ్చి బూటుకాలితో తన్నాడు. కాలితో తన్నడం సరైంది కాదని గొడవపడ్డాను. వాడు నన్ను అనరాని మాటలని, కొట్టించి పక్కగదికి వెళ్ళిపోయాడు. ఒక రకంగా నాకు వాడికి పెద్ద గొడవే అయింది ఆ రోజు నాకు. వాడు వెళ్ళిన వెంటనే పక్కగదిలో పెద్ద గొడవయింది. ఏంటది అనుకుంటూ గోడకు దగ్గరగా జరుగుతుంటే, పక్కగదిలో గొడవను బట్టి నాకు ఉన్న రక్షక భటుల చూపులు నా మీదకు మళ్ళాయి. కొద్దిసేపటకి పక్కగదిలో ఎవరో మనవాళ్ళే ఉన్నారని అర్థమైంది. నాతో ఎలా గొడవపడ్డారో అతనితో కూడా అంతే గొడవపడి బయటికి వెళ్ళిపోయాడు. వాడు వెళ్ళాక ఒకళ్ళిద్దరు అప్పటివరకు ఉన్నవాళ్ళు కూడా వెళ్ళిపోయారు. అంతా నిర్మానుష్యంగా ఉంది. బయట ఒకతను పచార్లు చేస్తున్నాడు. నా కోసం పెట్టిన గార్డులు కుర్చీలో కూర్చుని కునికిపాట్లు పడుతున్నారు. నేను గోడకు దగ్గరగా వెళ్ళి నిదానంగా గోడను చేతులతో కొట్టాను. అవతలి నుంచి ప్రతిశబ్దం వస్తుందేమోనని. ఆ సమాధానం కోసం ఎదురు చూస్తూ బయట ఎవరన్నా వస్తున్నారేమోనని, బయట బూట్లు, చెప్పుల శబ్దాల కోసం చూసేవాడిని. వెంటనే అవతలి నుంచి సమాధానం వచ్చింది. 'మనవాళ్ళే! ధోకా లేదు. కానీ నేనెవరో, అతనెవరో తెల్సుకోవాలంటే ఎలా? ఈ నాలుగ్గోడల బందీఖానాలో ఏంచేయాలి? అని ఆలోచిస్తూ గార్డుల కేసి చూపు మళ్ళించాను. కునికిపాట్లు యథాతథం. ఆ సమయంలో ఎవరూ వచ్చేటట్లు లేరు. అందుబాటులో చిన్న పేపరు ముక్క కనపడితే దాన్ని తీసుకొని చేతి వేలిగోరుతో నాపేరు, ఎక్కడ నుండి అని రాసి అవతలి వైపుకు పంపించాను. తన నుంచి సమాధానం రావడానికి చాలా సమయం పట్టింది. చివరికి సమాధానం వచ్చింది. ఒకరి గురించి ఒకరం సమాచారం ఇచ్చిపుచ్చుకున్నాం. బయటి ప్రపంచానికి దూరంగా బందిఖానాలో ఉన్నప్పుడు ఇటువంటి అతి చిన్న సైగలు, సంజ్ఞలే మనసుకు ఎంతో ఊరటనిస్తాయని చెపుతుంటే మనసంతా ఆర్ధ్రతతో నిండిపోయింది. నిజంగా శత్రువు మన జీవితాలతో ఆటలాడుకుంటున్నాడు. కనీసమైన మానవ విలువలు పాటించకుండా వందలమందిని అరెస్ట్ చేసి చిత్రవధ చేస్తుందీ ప్రభుత్వం. ఎంత క్రూరమైన హింస. 'మెంటల్‌గానే మనల్ని తనకు అనుకూలంగా మార్చుకోవడానికి చాలా ప్రయత్నాలు చేస్తాడు. అందుకే, మనం చాలా దృఢనిశ్చయంతో ప్రజలపట్ల, విప్లవం పట్ల అంకిత భావంతో ఉండాలి. ఒక్కోసారి కొట్టిందే తడవుగా కొడతాడు, ఒక్కోసారి నీకెందుకన్నీ కష్టాలు? నువ్వు ఊం..... అను ఈ క్షణంలో నీ జీవితం మారిపోతుంది. నీ గురించి, కుటుంబం గురించి బెంగపడకు. నిన్ను విదేశాలు పంపిస్తామని ఆశ చూపుతాడు. మధ్య, మధ్యలో సిద్ధాంతం మీద చర్చ చేస్తాడు. ఇది పొలిటికల్ టార్చర్. మేమేమీ మార్క్సిజానికి వ్యతిరేకం కాదు. మాకూ మార్క్సిజమంటే ఇష్టమే. కానీ రష్యా, చైనాల్లో ఏమైంది? ఇక్కడ కూడా అంతే! ఎందుకు ఈ కాలం చెల్లిన సిద్ధాంతాలు? అంటూ మార్క్సిజాన్ని ఔపోసన పట్టినట్లు, మన సిద్ధాంతం పట్ల మనకే డౌట్ వచ్చే విధంగా మైండ్‌ను కలియ తిప్పుతాడు. ఒక్కోసారి మన నాయకుల గురించి అడుగుతాడు. ఏం తెలీదు, అంటే, వెంటనే తన దగ్గరున్న చిట్టాను తీసి మన ముందుంచుతాడు. ఇదిగో! నీవు చెప్పకపోయినా మా దగ్గర ఉంది. ఇంకా ఎందుకు దాచాలనుకుంటావ్! అని మనం చెప్పే విధంగా నమ్మకం కలిగిస్తాడు. ఇవన్నీ వాడి ఎత్తుగడలు. ఈ ఎత్తుగడలను అర్థం చేసుకోకుండా ఏమాత్రం బ్యాలన్స్ కోల్పోయినా ఊబిలో దిగిపోయినట్లే. అందుకే శత్రువు దగ్గర చాలా జాగ్రత్తగా ఉండాలి. అచితూచి అడుగేయాలి. అనుకోకుండా ఎప్పుడైనా శత్రువు చేత చిక్కితే ఈ విషయాలన్నిటిని గుర్తు చేసుకుంటూ ఉండాలి. భయపడితే ఇంకా భయపెట్టిస్తాడు. ఏదైనా దీటుగా జవాబు చెప్పడం, నమ్మిన సిద్ధాంతానికి కట్టుబడి ఉండాలి. అంటూ ముగించేటప్పటికీ శత్రువు కలలను వమ్ము చేద్దామంటూ అందరం ఎవరి డ్యూటీల్లోకి వాళ్ళం వెళ్ళిపోయాం.

రిపోర్టు విన్న క్షణం నుంచి ఎక్కడ చూసినా జైలు రిపోర్టును మననం చేసుకోవడమే అందరి పనయింది. అది కిచెన్, స్కూల్, సమిష్టి, చర్చ... ఏది జరిగినా, ఏ ఇద్దరు కామ్రేడ్స్ మాట్లాడుకున్నా 'జైలు రిపోర్టు' ప్రధానాంశమైంది.

"విప్లవకారులకు ప్రేమించడం చేతకాదు. ఆప్యాయత, అనురాగాలు అసలే తెలియవు. ఎంతసేపు హింసించడమే వారి పని." శత్రువు ఎప్పుడూ మన మీద చేస్తున్న దుష్ప్రచారం. కానీ ఇది నిజమా? ఎంత మాత్రం కాదు. 'యుద్ధం, ప్రేమను ఎన్నటికీ వదిలిపెట్టదని నిజం. ఈ వర్గ సమాజంలో దొరకని ప్రేమలు విప్లవోద్యమంలోనే దొరుకుతాయి. బయటి సమాజపు ప్రేమలు కొలమానంతో తూగుతుంటాయి. అటువంటి కొలమానాలు, కల్మషం అంటే తెలియని ప్రేమలు ఇక్కడివి. తనతో పరిచయమయ్యాక తన వ్యక్తిగత జీవితం గురించి నాతో చెప్పినప్పుడు (ఆ మహిళా కామ్రేడ్ మీద ఎంత ప్రేముందో ఆ సందర్భంగా అర్థమైంది) కావాలనే శత్రువు ప్రచారం చేస్తున్నాడనిపించింది. ఒక రకంగా విప్లవ వర్గాల్లో కలవరం సృష్టించడం కోసం ఉన్నతమైన విలువలతో పనిచేస్తున్న విప్లవకారులకు శత్రువు పట్ల ఎంత కసి ఉందో, ప్రజల పట్ల, సహచరుల పట్ల అంతకు రెట్టింపు ప్రేమ ఉంటుంది. చాలా సున్నిత హృదయులు కూడా.

2001లో రాయలసీమ, కోస్తా జిల్లాల రీజినల్ మిలటరీ క్యాంపు సందర్భంగా అన్నను కలవడమైంది. ఆ క్యాంపులో నేను అన్నతో కలసి క్యాంపు నిర్వహణ కమిటీలో ఉండడం. విడిగా మాట్లాడి పేర్లు చెప్పినప్పుడు, తనతో కలసి కమిటీలో ఉండడం

బాగా సంతోషమేసింది. ఆ రోజు క్యాంపు నిర్వహణ కమిటీలో ఉన్న ఐదుగురిలో ఇద్దరు సరెండర్ కాగా, ఒకరు శివ 2002 నవంబరు 12న విజయవాడ బెంజి సర్కిల్ వద్ద ఆటోలో ప్రయాణిస్తున్న ఈశ్వర్, శివ, వెంకటయ్యలను ఎస్.ఐ.బి. పోలీసులు పట్టుకొని తీవ్ర చిత్రహింసలు పెట్టి బెల్లంకొండ మండలం చంద్రాజుపాలెం అడవుల్లోకి తీసుకొచ్చి కాల్చి చంపి ఎన్‌కౌంటర్ కట్టు కథ అల్లారు. ఒకరు రవి, నేను. నిర్వహణకు సంబంధించి అన్ని పనులను సమన్వయం చేస్తూ దొరికిన ఖాళీ సమయంలో నాతో, శివతో ఎక్కువగా మాట్లాడేవాడు. ఇద్దరం ఒకే జిల్లా వాళ్ళం కావడంతోనూ, మొదటిసారి కలిసింది కూడా మా జిల్లాలోనే కావడం వలనేమో. మేము కూడా ఎటువంటి దాపరికాలు లేకుండా చనువుగా ఉండేవాళ్ళం. క్యాంపు విషయాలు, రాజకీయాలు, మిలటరీ, సాయంత్రపు సాంస్కృతిక కార్యక్రమాలు... అన్నీ మా చర్చల్లోకి వస్తుండేవి. నాకు బాగా ఆశ్చర్యమేసిందెందుకంటే మేమేమో మామూలు సభ్యులం, అతను రాష్ట్రస్థాయి. మాతో మాట్లాడిన ప్రతి సందర్భంలోనూ నేను చెప్పిందే వినాలనే భేదభావం వ్యక్తమయ్యేది కాదు. అందుకే తను సొంతం చేసుకున్న తీరుకు బాగా ఆశ్చర్యమేసింది. తెలియని విషయం ఏదడిగినా అర్థమయ్యే రీతిలో అర్థం చేయించేవాడు. తను విడుదల అయ్యి వచ్చేటప్పటికీ బెల్లంకొండ ఏరియాలో పెరికపాడు ఎన్‌కౌంటర్ జరిగింది. ఆ ఎన్‌కౌంటర్‌లో కొత్తగా వచ్చిన ఇద్దరు కామ్రేడ్స్ అమరులైనారు. అప్పటి సమీక్షలో కమాండర్ సమన్వయం ప్రధానాంశం చేయగా, తను జైలు రిపోర్టులో భాగంగా ఆ ఎన్‌కౌంటర్ గురించి మాట్లాడుతూ పెరికపాడు ఎన్‌కౌంటరైనా, మరే ఎన్‌కౌంటరైనా శత్రువు మెకానిజంను కూడా అర్థం చేసుకొని మన మీద దాడులు చేస్తున్నాడు. వాడి నెట్‌వర్క్ ఎన్ని రూపాల్లో ఉందనేది పరిశీలించాలి. అంటే కమాండర్ సమన్వయం ఒక్కటైతే, శత్రువు మెకానిజంను కూడా అర్థం చేసుకోవాలని మాట్లాడేటప్పటికీ ఆ కమాండర్ తన లోపాలను రవితో పంచుకోవడమైంది. అంటే, లోపాలను కూడా వాళ్ళంతట వాళ్ళే గుర్తించే విధంగా, వాటిని సరిదిద్దుకునే విధంగా తన డీలింగ్ ఉండేది.

2001లో జరిగిన కాంగ్రెస్ తర్వాత వచ్చిన డాక్యుమెంట్ల క్లాసుల సందర్భంగా కలవడం. ఆ క్లాసుల్లో సి.సి. పి.ఓ.ఆర్. అమరుడు కా. శ్రీధర్ (మంజీరా); ఎస్.సి. పి.ఓ.ఆర్. అమరుడు కా. ఎమ్.ఆర్; మహిళా పర్‌స్పెక్టివ్ అమరుడు కా. ఆర్.సి.; వ్యూహం - ఎత్తుగడలు కా. రవి చెప్పారు. క్లాసు మొత్తం ఆచరణకు అన్వయిస్తూ రకరకాల ఉదాహరణలతో అర్థం చేయించాడు. అప్పటికీ నాకు పుస్తకంలో ఉన్నది ఉన్నట్లు చెపుతారనేది మాత్రమే తెలుసు. నేను ముందు పి.ఎమ్.ఎస్.కు అలాగే చెప్పడమైంది. కానీ విషయాన్ని ఆచరణకు అన్వయించడం ద్వారానే నిజమైన క్లాసవుతుందని ఆ రోజు రవి క్లాసు ద్వారా గ్రహించగలిగాను. ఇదే క్లాసుల సమయంలో చంద్రబాబు ప్రభుత్వంతో చర్చలు చేయాలని పార్టీ ఆలోచించిందని అందరికీ అర్థమైంది. అన్ని చోట్ల చర్చలు జరుగుతూ అదే విషయమై అడిగితే పార్టీ ఎత్తుగడల్లో ఒక భాగం మాత్రమే చర్చలంటే తుపాకులన్నీ కిందపెట్టేసి వెళతామనుకోవద్దు. ప్రస్తుతం ఎన్.టి. (ఉత్తర తెలంగాణ) ఎదుర్కొంటున్న పరిస్థితిల్లోంచి పార్టీ ఈ నిర్ణయం తీసుకొంది. చర్చలు జరుగుతుంటే ముందుగా కాల్పుల విరమణ ఉంటుంది. అలాగని చర్చలు జరుగుతుండగానే దళాల మీద దాడులు చేయడానికి వస్తే మనం కాల్పులు చేయవద్దనే రూలు లేదుగా! అంటూ చర్చల మీద పార్టీ అవగాహన అర్థం చేయించాడు. ఈ దోపిడీ ప్రభుత్వంతో చర్చలేంటి? రాజీలాగా'... అని పార్టీ ఆలోచించిన తీరుకు కోపమొచ్చింది. నా మనసులో భిన్నాభిప్రాయం ఉన్నా అడగలేక చివరికి కోపంతోనే వెళ్ళగక్కాను. అప్పటికీ నాలాగే ఆలోచించే వాళ్ళు ఇద్దరు, ముగ్గురు తోడవ్వటంతో నా వాదనకు బలం దొరికినట్టయింది. నేను మాట్లాడినదంతా పూర్తిగా విని తను ఇచ్చిన వివరణకు నా(మా) అవగాహనలోనే లోపం ఉందని గ్రహించడానికి ఎంతో టైమ్ పట్టలేదు. తర్వాత ఉత్తర తెలంగాణ స్పెషల్ జోనల్ కమిటీ మెంబర్ కా. పద్మక్క (న్యాలకొండ రజిత) అమరత్వంతో ఆ చర్చల ప్రహసనం ముగిసింది.

అనుకోకుండా 2004లో కలయిక - వై.ఎస్. గెలిచి ప్రమాణ స్వీకారంతో మొదటి సంతకం రైతులకు ఉచిత విద్యుత్తు ఇవ్వడంపై, రెండవదో, మూడవదో కానీ నక్సలైట్లతో చర్చలు చేస్తాననడం. వార్త విని ఇపుడు పెద్ద పెద్ద మీటింగ్‌లు పెట్టి, మన పార్టీ వాయిస్‌ను విస్తృతంగా ప్రజల్లోకి తీసుకెళ్ళవచ్చు. మన స్వీయాత్మకత శక్తుల పెంపుకు కృషి చేసే మంచి అవకాశమని నా ఫ్రెండ్, నేను మాట్లాడుకుంటూ కిచెన్ దగ్గరకు వెళుతుండగా ఎక్కడ్నుంచి విన్నాడోగానీ కిచెన్ దగ్గర అందరూ వచ్చేదాక ఆగి "మళ్ళీ మనం దీన్ని ఎలా ఆలోచించాలనేది, అంటే వాడు ఒక ఎత్తుగడగానే దీన్ని ఆలోచిస్తున్నాడు. ఈ సమయంలో వాడి నెట్‌వర్క్‌ను, ఇన్‌ఫర్మేషన్‌ను పెంచుకోవచ్చు. కాబట్టి మనం మనకు వీలైన అన్నిచోట్ల లీగల్‌గా గానీ, రహస్యంగా గానీ పార్టీని రాజకీయంగా బలోపేతం చేసుకుంటూనే, మిలటరీ పరమైన సన్నాహాలు చేసుకోవాలి. ఇవన్నీ కాకుండా పరిస్థితులను అంచనా వేయడంలో సరిగా లేకపోతే మనం నష్టపోయే ప్రమాదం ఉంటుంది." నిజంగా తర్వాత ఇదే జరిగింది. వాడు నమ్మిస్తూనే చివరకి దళాలపై దాడులు చేయడం మొదలుపెట్టాడు. 2005 జనవరిలో నిరాయుధంగా ఉన్న లక్ష్మిని పట్టుకొని హత్య చేసి ఎన్‌కౌంటర్ కట్టుకథ అల్లడంతో మరోసారి చర్చల బూటకత్వం బట్టబయలైంది.

చివరిసారిగా 2005లో కలవడం. అప్పటికే కొద్ది నెలల ముందు వేరే రంగానికి బదిలీ అయ్యి పార్టీ అవసరాల రీత్యా నల్లమల్లకు వెళ్ళాను. ఆ సమయంలో రాష్ట్ర కమిటీ మీటింగ్‌తో తీరిక లేకుండా ఉన్నారు. (అప్పటి రాష్ట్ర కమిటీ అంతా అమరత్వం చెందింది. కా. మాధవ్, శ్రీధర్, సుదర్శన్, ఆర్.సి., రాఘవులు, రవి) ఆగస్టు నెల కావడంతో వర్షాలు పడుతున్నాయి. ఒకరోజు వర్షం పడుతుండగా గబగబ టెంట్‌లోకి వెళుతుండగా రేడియోలో 5.50 ని. ఉర్దూ వార్తలను వింటూ, ఏవో రాసుకుంటూ ఉన్నాడు. రాయడం, వినడం ఆపకుండానే నన్ను గమనించి రాసుకుంటూనే

'హిందీ వస్తదా?' అంటే 'రాదన్నాను' 'ఏం కాదు, రోజూ వార్తలు వింటుంటే అదే అర్థమవుతుంది. తప్పకుండా హిందీ నేర్చుకోవాలందరం''. ఆ మాటతో గుండె గతుక్కుమన్నది. ఈ తెలుగు ప్రపంచంలో హిందీ అవసరమేంటి? తెలుగు రాయడమన్నా, చదవడమన్నా అమితంగా ప్రేమించే నేను 'హిందీ' అనేటప్పటికీ కొంత విసుగు కూడా తోడయింది. కానీ రవి ఊరికే అనలేదని తర్వాత అర్థమైంది. చాలా ముందు చూపుతోనే అప్పటికే పార్టీ ఎదుర్కొంటున్న సీరియస్ నిర్బంధం, సీరియస్ అమరత్వాలు, అప్పటికే కొద్దిమంది కామ్రేడ్స్‌ను ఇతర రాష్ట్రాలకు (ఎ.ఓ.బి, డి.కె.) మార్చడాలు జరిగాయి. ఆ మార్చిన కామ్రేడ్స్ కూడా అదే క్యాంపులో తెలుగు హిందీ డిక్షనరీలు పట్టుకొని తిరుగుతుండటం... రవి ఈ మాటనడంతో 'ఊఁ' అంటే వెంటనే మార్చేస్తారేమోనని భయం వేసి నేను వెళ్ళేచోట అపాయింట్‌మెంట్ లేకపోయినా మా బాధ్యుడితో మాట్లాడి బయటకు వెళ్ళిపోయాను. కానీ ఇప్పుడా వెలితి అనుక్షణం కొట్టొచ్చినట్లు కనపడుతుంది. తెలుగు తప్ప వేరే భాషలు నేర్చుకోవాల్సిన అవసరం రాదనుకున్న నాకు తప్పనిసరిగా 'హిందీ' నేర్చుకోవాల్సిన అవసరం వచ్చింది. పెద్దలు ఊరికే అనరు. ముందు చూపుతోనే అంటారు. అందుకే కాబోలు 'పెద్దల మాటలు చద్దెన్నం మూటలు' అని నానుడి.

రవి గురించి రాస్తుంటే తనతో కలిసున్న రోజులన్నీ, ఆ జ్ఞాపకాలన్నీ ప్రతి అనుభవం, ప్రతి కదలిక రాయమని పోరుపెడుతున్నాయి. 30 సంవత్సరాల విప్లవ జీవితాన్నీ, తరగని గనిలా హిమాలయాల అంత ఎత్తుకు ఎదిగిన వారి త్యాగాన్ని విభజించడం ఈ పేపర్, పెన్నులకు సాధ్యమవుతుందా?

ప్రతి విషయంలోనూ ముందు చూపుతో ఉండే రవి మిలటరీ విషయాల్లో అంతే ముందుచూపుతో ఉండేవాడు. 9 సంవత్సరాల కఠోరమైన జైలు శిక్ష అనుభవించి విడుదలై వచ్చాక ఆ రిపోర్టును కేడర్‌కు అందించడమేకాక శత్రువు ఫిజికల్, సైకలాజికల్ ఎత్తుగడలను అర్థం చేసుకొనే విధంగా ఎడ్యుకేషన్ నేర్పాడు. నిత్యం కూంబింగ్స్ నడుమనే ఉంటూ శత్రువు కారుకూతలను తిప్పికొడుతూ ఏమాత్రం తన ఆనుపానులు అర్థం కాకుండా కార్యక్రమాలు నిర్వహించేవాడు.

రిమోట్ మెకానిజంను డెవలప్ చేసి, వాకీల్లో స్కామ్లర్ వినే సిస్టమ్‌ను మెరుగుపర్చి కేడర్‌కు అందించాడు. స్టేట్ మిలటరీ కమిషన్ (ఎస్.ఎమ్.సి) సభ్యుడిగా, ఇంచార్జ్‌గా రాష్ట్ర కేడర్‌కు మిలటరీ సూచనలు, సలహాలను, ఆయా ఘటనల సమీక్షలను, వాటిలోని గుణపాఠాలను నిరంతరం కేడర్‌కు అందిస్తుండేవాడు. అది ఎన్‌కౌంటరైనా... అరెస్టైనా... మరేదైనా.... సుదీర్ఘమైన జైలు జీవితంలో ఎన్ని కష్టనష్టాలొచ్చినా వెరవక, ప్రలోభ పడక, నమ్మిన సిద్ధాంతం కోసం, ప్రజల కోసం అంతిమ సమయం వరకు దోపిడీ వర్గానికి పెను సవాలై నిలిచాడు. అందుకే విప్లవకారులన్నా, విప్లవోద్యమమన్నా శత్రువుకు గుండె ఆగినంత పనవుతుంది. అరెస్ట్ చేసి కోర్టుకు హాజరు పరిచే నియమం చట్టంలో ఉన్నప్పటికీ దాన్ని తుంగలో తొక్కేసి అరెస్ట్ చేసిన కొద్ది క్షణాల్లో కిరాతకంగా హత్యచేసి 'ఎన్‌కౌంటర్' కట్టుకథ అల్లుతూంటే, ప్రజలకు, మీడియాకు అర్థమై నిలదీస్తారని. ఒకపక్క హత్యలు చేస్తూనే, మరోపక్క నక్సలిజం 'డేంజర్' అంటూ ప్రకటనలు గుప్పిస్తుంది. 'జిహాదీ తీవ్రవాదం కన్నా నక్సలిజం దేశానికి ప్రమాదకరమైంది. దేశభద్రతకు భంగం కలిగించే నక్సలిజాన్ని అంతమొందించడానికి వెనుక, ముందుపడం'. మార్చి 13న చిదంబరం ప్రకటన. 'ఎక్కడైనా నక్సలైట్ల డంపులు ఉంటే ముందుగానే ప్రజలు అప్రమత్తమై పోలీసులకు చెప్పాలని' మార్చి 15వ తారీఖున రాష్ట్ర డి.జి.పి. గిరీష్‌కుమార్ వ్యాఖ్య. పై రెండూ ప్రకటనలు రవి బూటకపు ఎన్‌కౌంటర్ తర్వాత చేసినవే. ఈ రెండు ప్రకటనలకు జవాబు ప్రభుత్వం దగ్గరే ఉంది. కానీ దాటవేస్తుంది. దాటవేయడానికీ నక్సలిజంపై బురద చల్లుతుంది. దోపిడీని, అన్యాయాన్ని, అసమాన అభివృద్ధిని ప్రశ్నించడమే నక్సలిజం తప్పు. ప్రజల సంపద ప్రజలకే చెందాలనడం నక్సలిజం తప్పు. అందుకే నక్సలైట్లంటే ప్రభుత్వాలకు అంతకోపం. నక్సలైట్ల నాయకులను వెతికి, వేటాడమంటే మహా సరదా దానికి.

ఎవరి జీవితాలు బుగ్గిపాలు అవుతున్నాయో, ఎవరి జీవితాలు అంధకారంలో కొట్టుమిట్టాడుతున్నాయో వారే ఆ చీకటి ఆక్రందనలే నక్సలిజానికి జన్మనిచ్చాయి. వారి ఆవేశాలే నక్సలిజానికి బాటలు వేశాయి. ఒక నిప్పు కణికతో మొదలైన నక్సలిజం నేడు దావాలనంలా దేశమంతటా మండుతోంది. దేశమంతా విస్తరిస్తూ తప్పనిసరి చర్చగా తయారైన నక్సలిజంను రూపుమాపాలని, సామ్రాజ్యవాద ప్రయోజనాలనుగుణంగా తలపెట్టిందే 'గ్రీన్‌హంట్'. వెతికి, వెంటాడి నాయకత్వాన్ని హతమార్చడమే దీని లక్ష్యం. ఎంత అణచి వేస్తే అంత తిరుగుబాట్లు లేస్తాయని చరిత్ర చెప్పిన సత్యం. ప్రజల కోపాగ్నిని గ్రహించలేని ప్రభుత్వం ప్రజల ముద్దుబిడ్డ కా. రవిని హతమార్చి ఆనందపడుతోంది. 'గెలుపు, ఓటములను బేరీజు వేసుకుని ముందుకుపోవాలని' కా. మావో చెప్పినట్లుగా ప్రతి కామ్రేడ్ అమరత్వం నుండి, ప్రతి ఓటమి నుండి, ప్రతి విజయం నుండీ గుణపాఠాలు తీసుకొని ద్వేషాన్ని, కసిని పెంచుకుంటేనే విజయాలు సాధించగలుగుతాం! గ్రీన్‌హంట్ అభియాన్‌ను ఓడించగలుగుతాం! అదే మనం అమరులకు ఇచ్చే నిజమైన నివాళి. కా. రవి! నీకు మరణం లేదు. ప్రజల హృదయాల్లో ఎప్పటికీ పచ్చని మొక్కలా మొలకేస్తావ్. మా రక్తం, చెమటలతో అవి మహావృక్షాలై దోపిడీ పునాదులను పెకిలిస్తాయి

(మార్చి 12, 2010న శాఖమూరి అప్పారావు (రవి), కొండలరెడ్డి (టెక్ మధు)ను ప్రకాశం జిల్లా అడవుల్లో కాల్చి చంపి ఎన్‌కౌంటర్ కట్టు కథ అల్లిందీ రోశయ్య ప్రభుత్వం. కలివిడితనం, కలుపుగోలుతనంతో తర తమ భేదం లేకుండా కేడర్ మనసుల్లో ముద్ర వేసిన కా. రవితో ఉన్న రోజులకు అక్షర రూపమే ఈ స్పందన)

పనుల్లోకి పంపాడు. దాదాపు 30 అడుగుల వరకు పెరిగిన అరంగి చెట్లు పచ్చగా ఉండి అడవికి అందాన్ని అందిస్తున్నాయి కానీ ఎండ వేడి నుండి తలదాచుకోడానికి నీడను మాత్రం తగినంత ఇవ్వలేకపోతున్నాయి. ఆ రోజు ఫిబ్రవరి 13వ తేదీ.

రాహీ దళం డేరా వేసిన అడవి అంచుల్లోని విశాలమైన ప్రాంతంలో జనతనా సర్కార్ చేపట్టిన వ్యవసాయ క్షేత్రం ఉంది. ఆ క్షేత్రంలో ఈ సంవత్సరం వరి పంట, పప్పు దినుసులు, నూనెగింజల దిగుబడి బ్రహ్మాండంగా ఉంది. ఆ విశాల క్షేత్రం చాలా కాలంగా బీడుపడి ఉండడంతో జనతనా సర్కార్ అందులో సమష్టి వ్యవసాయాన్ని చేపట్టి పరిసర గ్రామాల ప్రజల సహకారంతో పంటలు తీసింది. పండిన పంటను సర్కార్ నియమం ప్రకారం మూడు పాళ్లు చేసి ఏరియా వ్యవసాయ శాఖా బాధ్యుడు పంపకాలు చేశాడు. ఒక పాలు శ్రమలో పాల్గొన్న రైతాంగానికీ, ఒక పాలు మరుసటి సంవత్సరం విత్తనాలకూ, ఖర్చులకూ పోగా, మూడవ పాలు ప్రజావిముక్తి గెరిల్లా సైన్యానికి తీశారు. బోసిగా నిల్చిన ఆ పంట పొలాల పక్కలో పచ్చని పొరకలతో కూరగాయల చెట్లు చూడ ముచ్చటగా ఉండి టమాటా, మిరపకాయలు జోరుగా కాశాయి. అక్కడ డేరా వేసే దళానికైనా, కంపెనీకైనా కూరకు అవే ఆదుకుంటాయి. పరిసర గ్రామాల వాళ్లు ఎవరైనా ఏ పూటకు ఆ పూట అవసరమైన కూరగాయలు నిరభ్యంతరంగా అక్కడి నుండి తెంపుకు వెళుతారు. అయితే అడవిలో సీజన్‌ల వారీగా దొరికే ఆకు-అలం కూరకు ఏరుకు రావడమే జనానికి ఎక్కువ పసందుగా ఉంటుంది. పక్కనున్న వాగునుంచి నీరు తోడి ఆ కూరగాయల మొక్కలకు పోస్తారు. ఈ పనిలో వ్యవసాయ క్షేత్ర కార్యకర్తలే కాకుండా అక్కడికి వెళ్లే పార్టీ, పిఎల్‌జిఎ కార్యకర్తలు కూడా పాల్గొంటారు.

మాడ్ కొండల్లో కొన్ని వాగులు సాలు పొడుగుతా పారుతుంటాయి. వాటిలో ఈ ధుంనార్ వాగు ఒకటి. వాగు మధ్య మధ్యలో పెద్ద, పెద్ద నీటి మడుగులు ఉన్నాయి. వాటిలో పెద్ద పెద్ద చేపలు ఏ ప్రమాద భయం లేకుండా గెంతులు వేస్తున్నాయి. ఆ అడివంతా ఎటు చూసినా అరంగి చెట్లే - ఇవి సాలవృక్షాలుగా ప్రసిద్ధి. ఇవి అనేక రకాలుగా ప్రజలను ఆదుకుంటాయి. ఆకులతో డొప్పలు, విస్తర్లు కుట్టి వాడుకుంటారు. దీని బంక తీసి అమ్ముకుంటారు. 'ఊదు' (గుగ్గిలం) గా మార్కెట్లో దొరుకుతుందిదే. దీని గింజలను కూడా మార్కెట్లో అమ్ముతారు. వాటి నుంచి తీసే నూనె వనస్పతిలో విరివిగా వినియోగిస్తున్నారు. గతంలో బ్రిటిష్ హయాంలో ఈ చెట్టును నరికి పెద్ద, పెద్ద మొద్దులను తీసుకెళ్లి రైలు మార్గాల నిర్మాణంలో ఉపయోగించేవారు. ఇప్పటికీ మధ్య భారతంలోని అడవిలో అత్యధిక శాతం సాలవృక్షాలే దర్శనమిస్తాయి.

నీటి మడుగుల్లో చేపలను చూసిన డిప్యూటీ కమాండర్ ఊరి నుంచి వల తేవడానికి ఆలోచించసాగాడు. ఈలోగా కమాండర్ మోతీ బాధ్యునితో ప్రోగ్రాం ప్లానింగ్ చేసి వచ్చి సభ్యులతో 'ఈ రోజు సాయంకాలం కూడా ఇక్కడే ఆగుతుంది దళం' అని చెప్పింది. ఈ మాటలు విన్న దళ సభ్యులందరూ ఒక్కసారిగా జుగ్నూ (డిప్యూటీ కమాండర్) వైపు చూసి 'సాయంత్రం చేపల కూరే' అన్నారు. కమాండర్ మోతీకి చేపలంటే మహా ఇష్టం. ఆమె 'ఇంగో' అనడంతో సభ్యులు వంట పాత్రలూ, వలల కోసం ఊళ్లోకి వెళ్లారు. మోతీ, మరో ఇద్దరు సభ్యులతో కూరగాయల తోటలోకి వెళ్లింది. జుగ్నూతో కలిసి అంజూ కిచెన్ పనిలోకి దిగింది.

ఊళ్లోకెళ్లిన సభ్యులు గంజాలతో పాటు ఊరి పిల్లలను కూడా తమ వెంట తెచ్చారు. టమాటాలూ, మిరపకాయలతో మోతీ వచ్చింది. ఆమెతో వెళ్లిన సభ్యులు ఏతం నీళ్లు తోడి కూరగాయల మొక్కలకు పోయడం కోసం అక్కడే ఆగారు. బాధ్యుడు తన రక్షణ గార్డులతో స్నానానికి సిద్ధమయ్యాడు. కొత్తగా వచ్చిన డాక్టర్ తన కిట్‌నుంచి పుస్తకం బయటకు తీశాడు. ఈలోగా జుగ్నూ, అంజూలు సేమ్యా ఉప్మా వండారు. అందరినీ రమ్మంటూ జుగ్నూ విజిల్ ఊదాడు. ఊరి పిల్లలతో-మాటల్లోకి దిగిన బాధ్యునికి ఆ పిల్లలే డేరాకు ఉత్తరం వైపు 100 గజాల దూరంలో ఉన్న చెట్లను చూపుడువేలుతో చూపుతూ 'అక్కడే మన కుమిలి శవం రెండు రోజుల క్రితం దొరికింది' అన్నారు. ఆ మాటలు విన్న బాధ్యుడు నిశ్చేష్టుడై 'కుమిలిని ఎవరు చంపారు?' అంటూ కనుబొమ్మలు చిట్లించి ప్రశ్నించాడు. 'పున్నోం (తెలియదు). శవాన్ని నర్సింగ్ దాదా వాళ్లు వచ్చి తీసుకెళ్లారు' అన్నారు ఆ పిల్లలు.

కుమిలిని ఎవరు చంపి ఉంటారు? ఈ లోతట్టు ప్రాంతంలో ఇంతటి ఘాతుకానికి పాల్పడ్డవాళ్లు ఎవరై ఉంటారు? పరిసర గ్రామాల్లో వాళ్లకు ఎవరు తోడ్పడి ఉంటారు? రోజుల తరబడిగా జనం కంట్లో పడకుండా హంతకులు ఈ అడవిలో ఎలా ఉండగలరు? రెండు రోజుల వరకు శవం దొరక్కుండా పోవడం ఏంటి? తేనెతుట్టెను కదిపితే జుమ్మంటూ లేచిన ఈగల్లా బాధ్యుని మెదడంతా ఆలోచనలతో నిండిపోయింది. ఊరి పిల్లలతో, తన దళం సభ్యులతో ఇవే ప్రశ్నలు చర్చించాడు. రష్యాలో విప్లవం జయప్రదం అయ్యాక అక్కడి 'కులక్కులు' నూతన వ్యవస్థను దెబ్బతీయడానికి చేసిన కుట్రలు ఆయన మదిలో మెదిలాయి. 'బీళ్లు దున్నారు' నవలలోని అనేక విషయాలు తన వాళ్లతో పంచుకున్నాడు.

భోజనాలు ముగించుకున్న దళం ఆ రోజు అక్కడ ఆగాల్సిన కార్యక్రమం రద్దు చేసుకుంది. వెంటనే కృషి (వ్యవసాయ) బాధ్యులను కలవాలనే ప్లాన్‌తో రాహీ దళం సాయంత్రం 4 గంటలకు బయలుదేరింది.

ఏరియా జనతనా సర్కార్ వ్యవసాయ శాఖ అధ్యక్షుడు కా.నర్సింగ్ తన క్షేత్రంలోని పంట నూర్పిళ్లయిన తర్వాత మొత్తం ఏరియాలోని క్షేత్రాల పని తనిఖీలో నిమగ్నమయ్యాడు. చుక్కి మరో తోట వద్ద పని చూస్తుండడంతో ధుంనార్ క్షేత్రంలో కమ్లూ, కుమిలి ఇద్దరే ఉంటున్నారు. ఈ పరిసరాల్లో గత కొద్ది రోజులుగా అనుమానాస్పద వ్యక్తుల కదలికలు పెరిగాయన్న రిపోర్టులు అందుతుండడంతో ఏదైనా అఘాయిత్యం జరుగుతుండవచ్చన్న అంచనా ఉంది. ఊహించినట్లే జరగడంతో 'బాధ్యుడు

బలహీనతలను చూసి దెబ్బ కొట్టడం యుద్ధనీతే కదా' అని తనలో తాను అనుకుంటూ కొడ్డిలేర్ చేరాడు.

ఉదయం 9 గంటలకు మాడ్ డివిజన్ పార్టీ కార్యదర్శి రాజమన్ వచ్చి బాధ్యుణ్ణి కలిశాడు. కుమిలి హత్యోదంతాన్ని వివరించాడు. శత్రువు తన శక్తులను రహస్యంగా పంపించి హత్య చేయించాడనీ, హంతకులు తలకూ-మొండానికీ కొంత అతుకు మాత్రమే ఉండేలా మెడను మిగిల్చి మొత్తం స్వరపేటికనూ, నాలుకనూ కోశారనీ, శవాన్ని చూసిన వారెవరైనా ఈ హత్య నరబలి అయ్యుంటుందని భ్రమపడి, అసలు విషయం బయటపడకుండా పోతుందని కుట్ర పన్నారనీ, ఇది శత్రువు ఉద్దేశ్యపూర్వకంగా చేసిన హత్యేననీ రాజమన్ తన అభిప్రాయాన్ని స్పష్టం చేశాడు. ఈ హత్య జరిగిననాటి నుంచీ ఊళ్లల్లో పెద్దమనుషులు మరో ప్రచారాన్ని లేపి శత్రువు కుట్రలకు తగినట్టు వంత పాడుతున్నారనీ అన్నాడు. 'ఆ భూమిలో దయ్యం ఉందన్నా వినకుండా అంధవిశ్వాసం అని కొట్టి పారేసి జనతనా సర్కార్ వాళ్లు తెగబడి దున్ని, పంట తీసిన ఫలితం ఇది' అంటూ గుసగుసలను భగ్గుమని వ్యాపింపజేశారు. ఈ పెద్దల ప్రచారం, ఈ హత్యా, గత కొద్ది రోజులుగా ఈ ప్రాంతంలో అనుమానాస్పద వ్యక్తులు సంచరించడం అన్నీ ఒకే తానులోని ముక్కలు అంటూ బాధ్యుడు తన అభిప్రాయం చెప్పి ' వాళ్ల మెకానిజం ఈ పరిసర గ్రామాల్లో లేకుండా ఈ హత్య జరగదు' అని కూడా చెప్పాడు.

'నిజమే మీరంటున్నది, ఇవన్నీ మా పరిశీలనలోనూ ఉన్నవి' అన్నాడు రాజ్‌మన్. రాజ్‌మన్ కుమిలి జ్ఞాపకాలను బాధ్యునితో పంచుకున్నాడు.

కుమిలి పైవేరు ఊరిపిల్ల. పేదరైతు బిడ్డ. చిన్నతనంలోనే కన్నతల్లి ప్రేమ కరువైన తల్లిలేని పిల్ల కుమిలి. ఎదిగే పిల్లకు కావల్సిన సరైన పోషకాహారం లేకుండా పోవడంతో రోగాల మధ్య పెరుగుతుండిన బిడ్డ ఆమె. దేశంలో పోషకాహార లోపంతో సతమతమవుతున్న పిల్లల్లో ఆదివాసీ పిల్లలే అగ్రభాగాన నిలుస్తారని ప్రభుత్వం గణాంక వివరాలతో సహా ప్రకటిస్తుందే తప్ప వాళ్ల కోసం చేసేదేమీ లేదని కుమిలిలాంటి వందలాది పిల్లలను ఖాకీలను ఎదిరించి మాడ్ కొండల్లోకి వచ్చి చూడ సాహసించే వారికెవరికైనా వెంటనే స్ఫురిస్తుంది.

ఒళ్లంతా గజ్జి కురుపులతో చీమూ, నుసీ కారుతూ పుళ్ల మంటలతో గడియ-గడియ గండంగా ఏడ్చే కుమిలి తన జీవితం పై ఆశ చాలించుకుందో లేదో కానీ ఆమె తండ్రి మాత్రం 'పోరి బతుకదు' అనే మాట తరచుగా అంటుండే వాడు. ఆ ఊరుకు ఇంద్రావతి దళం రెగులర్‌గానే వెళుతుంది. కానీ కుమిలి సంగతి వాళ్ల దృష్టికి ఎప్పుడు రాలేదు.

దళం వెంట రాజ్‌మన్ ఓ రోజు ఆ ఊరు వెళ్లేసరికి పెంటకుప్ప పక్కలో పడుకొని ఏడుస్తున్న కుమిలి రాజ్‌మన్ కంటపడింది. పిల్లలంటే ఆయనకు ఎంతో ప్రాణం. ఒక్క పరుగున కుమిలిని చేరి ఆమె ఒళ్లంతా పునికి చూశాడు. సందు లేకుండా గజ్జి పుళ్లతో బాధపడుతున్న కుమిలికి వెంటనే చికిత్స ప్రారంభించాడు. పుళ్లను కడిగి శుభ్రం చేసి మందు రాసి, 15 రోజులకు సరిపడా గోలీలు ఇచ్చి అవి వాడే పద్ధతి వివరించి, పిల్ల బాధ్యత ఊరి జనతనా సర్కార్‌కు అప్పగించినాడు. తల్లి లేని కుమిలి తన జీవితంలో ఈ మాత్రం ప్రేమను పొందింది బహుశ ఎన్నడూ లేదేమో ! అప్పటివరకూ ఆమె పుళ్లను కడిగి శుభ్రం చేసిందెవరు? ఈ ఘటన కుమిలి జీవితంలో ఒక మంచి మలుపుకు దారి తీసింది.

15 రోజుల్లో కుమిలి గజ్జి తగ్గింది. ఆమె ఆ పై రెగ్యులర్‌గా దళం వద్దకు రావడం మొదలైంది. ఆమె దళం వద్దకు వచ్చిందంటేనే ఆమె కళ్లు మొదట వెతికేది బట్టతల, సూదిలాంటి మీసాలు, లోతు కళ్లు, చిన్న-పెద్ద, ఆడ-మగ తేడా లేకుండా అందరినీ ఆప్యాయంగా 'లాల్‌సలాం' అంటూ పలకరించే 'రాజ్‌మన్'నే. ఆమె ప్రాణాలను నిలిపిన ఆ అన్న అంటే ఆమెకెంత ప్రాణమో !

కుమిలి ఆ తర్వాత ఏడాది లోపునే పుష్పవతి అయ్యింది. అన్ని పనుల్లో చొరవగా, శ్రద్ధగా పాల్గొనడం పెరిగింది. తన మనసులోని మాట ఎవరితోనైనా ఫ్రీగా పంచుకునే మనస్తత్వాన్ని ఆమె స్వంతం చేసుకుంది. ఊరి సంగంలో కుమిలి సభ్యురాలైంది.

పాశవిక సల్వాజుడుం దాడులు ఇంద్రావతి ఏరియాలోనూ మొదలయ్యాయి. డుంగ, తాకిలోడ్, వెడమ, గోట్ మొదలైన గ్రామాల్లో జుడుం దాడులు జరిగి ప్రాణనష్టం, ఆస్తి నష్టం సంభవించాయి. దీనితో అనేక గ్రామాల రైతులు లోతట్టు కొండల్లోకి చేరి తల దాచుకోగా, కొందరు రైతులు దూర ప్రాంతాలకు వలసపోయారు. జుడుం గూండాలకు బందీలుగా చిక్కిన వాళ్లు హంతక శిబిరాలకు తరలించబడ్డారు. ఇలాంటి స్థితిలో ఏం చేయాలన్న ప్రశ్న కుమిలిని వెంటాడింది. కొండల్లోకి వెళ్లడమా, వలసపోవడమా, బందీగా చిక్కి చిత్రహింసల కొలిమిలో తల దూర్చడమా? కుమిలి కళ్లలో దళం, తనకు వైద్యం చేసి బతుకునిచ్చిన రాజ్‌మన్ నిలిచారు. కుమిలి ఇల్లు విడిచి విప్లవోద్యమంలో చేరిపోయింది.

ఆలివ్ గ్రీన్ డ్రెస్సు, తలకు ఎర్ర నక్షత్ర టోపీ, వీపుకు కిట్టు, కాళ్లకు బూట్లు, చేతిలో ఆయుధం ధరించి దండకారణ్య విముక్తి ప్రాంత లక్ష్య సాధనలో మార్చింగ్ చేస్తున్న ప్రజా విముక్తి గెరిల్లా సైన్యాన్ని పాలించే, పోషించే జనతనా సర్కార్‌లో ఆమె భాగమైంది. ధుంనార్ వ్యవసాయ క్షేత్రంలో నర్సింగ్‌దాదాకు తోడైంది. ఆమె నాగేటి చాళ్లలో కర్రు అయింది. పంట కాలువల్లో నీరైంది. వరి నాట్లలో ఎరువైంది. పంట కోతలో కొడవలైంది. చేతికొచ్చిన పంటలో ఆమె సిరిసిరి మువ్వ అయ్యింది. లేత వయసులోనే విప్లవానికి ఎరుపైంది. ధుంనార్ వ్యవసాయ క్షేత్రానికి తన చెమటనూ, నెత్తురునూ ధారపోసి గింజ-గింజలో తన జ్ఞాపకాలను నిలిపి భవిష్యత్తు పంటలకు హామీనిచ్చింది.

ఆమె చరిత్రను వివరిస్తున్నంత సేపు రాజ్‌మన్ కళ్ల వెంట కన్నీళ్లు కారుతూనే ఉన్నాయి. ఆ అమరురాలితో ఉన్న అనుబంధాన్ని అవి చాటుతున్నాయి.

వారం రోజుల తర్వాత రాజ్‌మన్ నుంచి బాధ్యునికి ఉత్తరం

వ్యాసం

# మతాల చరిత్ర

- కొడవటిగంటి రోహిణీప్రసాద్

మతవిశ్వాసాలు ఎంతో ప్రాచీనమైనవి. వాటిని ఈ రోజుల్లో ప్రశ్నించేవాళ్ళే తక్కువ. వాటిని నమ్మడం ఎంతో సహజమని ఎక్కువమంది అనుకుంటారు. అవి వేల ఏళ్ళుగా కొనసాగుతున్నాయనేది ఒక బలమైన కారణంగా వారికి కనిపిస్తుంది. అతీతశక్తుల గురించిన నమ్మకం ఆదిమమానవుల్లో సహజంగా తలెత్తడం ఒక ఎత్తయితే, ఆ భ్రమలూ, తప్పుడు నమ్మకాలూ ఇన్నాళ్ళుగా కొనసాగడానికి దోహదపడిన సామాజిక, ఆర్థిక, రాజకీయకారణాలన్నీ మరొక ఎత్తు. వీటన్నిటి గురించీ స్థూలంగానైనా తెలుసుకోకపోతే మతాలవల్ల నేటికీ కలుగుతున్న అయోమయమూ, అనర్థాలూ, హింసా, రక్తపాతమూ మొదలైనవాటికి కారణాలు అర్థంకావు.

మతాల చరిత్రయొక్క అధ్యయనం పంతొమ్మిదో శతాబ్దంనుంచీ మొదలయింది. దానివల్ల చారిత్రక వివరాలెన్నో బైటపడుతూ వచ్చాయి. ప్రపంచంలో అనేకచోట్ల క్రీస్తుకు సుమారు 3 వేల ఏళ్ళ క్రితం లిపుల వాడకం మొదలయింది. అప్పటినుంచీ మత విశ్వాసాలు ఏదో ఒక రూపంలో నమోదు అవుతూవచ్చాయి. మానవ సమాజాలు రూపొందిన దశలో తెగలుగా జీవించిన ప్రజలు ఎందరో దేవతలను ఆరాధించేవారు. గణాచారులు నడిపిన తంతుల్లో రకరకాల జంతువులూ, చెట్లూ చేమలూ, ప్రకృతిశక్తులూ అన్నిటికీ పూజలు జరిగేవి. సమాజం విస్తృతమై సమాజ జీవితాలు జటిలం అవుతున్నకొద్దీ దేవుడు ఒక్కడేనన్న భావన బలపడసాగింది. కారణాలేమిటో ఇప్పుడు ఖచ్చితంగా తెలియదు కాని మొత్తంమీద ఏకేశ్వరోపాసనకు భూమిక ఏర్పడింది. తెగలుగా జనపదాల్లో జీవించిన ప్రజలు చిన్న, పెద్ద సామ్రాజ్యాల పాలనకు లోనయారు. వ్యవసాయం పెద్దఎత్తున వ్యవస్థీకృతం అవడం వల్ల ప్రజల వ్యక్తిగత జీవితంకూడా అపూర్వమైన మార్పులకు గురి కాసాగింది.

తెగలు చిన్న రాజ్యాలుగానూ, చిన్న రాజ్యాలు పెద్ద సామ్రాజ్యాలుగానూ ఏకీకృతం అవుతున్న దశలో పాతకాలపు ఆచారాలకు కొత్త స్వరూపాలు ఏర్పడ్డాయి. టర్కీలో క్రీస్తుకు 9 వేల ఏళ్ళ క్రితమే మొదలైన ప్రాచీన దేవతారాధన గ్రీస్‌లో పెంపొందిన మతభావనలకు రూపాన్నిచ్చింది. అదే పద్ధతిలో గ్రీక్ దేవతలు రోమన్ నాగరికతకు భూమికను సిద్ధం చేశారు. ప్రాచీన గాథలూ, పురాణాలకు కొత్త రూపాలు ఏర్పడ్డాయి. తెగల్లో విడివిడిగా రూపొందిన మతభావనలన్నీ క్రమంగా ఏకం అవుతూ వచ్చాయి. తెగలమధ్య జరిగిన కొట్లాటల్లో జయం పొందినవారి దేవతలందరిదీ కొత్త సంస్కృతిలో పైచెయ్యి అయింది.

మతాలు బలపడిన తీరు కేవలం మనుషుల భావనలమీద ఆధారపడి, వారి ఇచ్ఛానుసారం జరగలేదు. సమాజాల్లో ఎటువంటి శక్తులు బలం సంపాదించుకోగలిగాయో వారు నమ్మిన మతాలే బలవత్తరం అవుతూవచ్చాయి. యేసుక్రీస్తును న్యాయవిచారణ జరిపి మరణదండనకు గురిచేసిన రోమన్ ప్రభుత్వం మొదట్లో క్రైస్తవమతాన్ని తీవ్రంగా అణగద్రొక్కింది. తరవాతికాలంలో రోమన్ చక్రవర్తులు అదే మతాన్ని అవలంబించాలని నిశ్చయించుకున్నాక క్రైస్తవమతం బలపడడమే కాక, దానికి అడ్డొచ్చినవారందరినీ రోమన్ ప్రభుత్వం మట్టుబెట్టసాగింది. మతాలకు స్వతహాగా బలమేమీ ఉండదు. పాలకవ్యవస్థ తలుచుకున్నప్పుడల్లా మతాల ప్రాబల్యం తగ్గడం, పెరగడం చరిత్రలో కనబడుతుంది.

చిన్న తెగలుగా వేటా, ఆహారసేకరణ ఆధారంగా జీవించిన దశతో పోలిస్తే వ్యవసాయం మొదలయాక జనాభా పెరగసాగింది. జనవాసాలు ఏర్పడి వాటిమధ్య సహకారసంబంధాలు పెరిగాయి. వస్తువుల మార్పిడి, వాణిజ్యం మొదలైన కొత్త ప్రక్రియలు

---

చేరింది. కా. కుమిలిని చంపిన హంతకులు పట్టుబడ్డారనీ, గతంలో పోలీసు ఇన్ఫార్మర్లుగా పని చేసినందుకు ప్రజల చేతిలో శిక్షింపబడి నారాయణపూర్ పారిపోయి శత్రువు పంచన చేరిన దుష్ట శక్తులే వాళ్లు అని రాశాడు. శత్రువు వీళ్లను హంతక గ్యాంగులుగా మలచి ప్రత్యేక శిక్షణనిచ్చి టార్గెట్లు నిర్ణయించి పంపాడనీ రాశాడు. వాళ్ల టార్గెట్లు స్థానిక పార్టీ నాయకురాలు కా. కౌసల్య, కా. దిలీప్‌లు అని కూడా ఇంటరాగేషన్‌లో తేలిందని రాశాడు. మన కామ్రేడ్స్ బలహీనతలను పరిశీలించి దొరికిందే తడవుగా మావోయిస్టులను అంతమొందించాలని వీళ్లను శత్రువు ప్రేరేపించి పంపాడనీ, వీళ్లకు అక్కడక్కడ గ్రామాల్లో షెల్టర్లు ఇచ్చే శక్తులున్నాయనీ, ఇలా అనేక విషయాలు వీళ్లను ఇంటరాగేట్ చేయడం ద్వారా తెలిశాయనీ సంక్షిప్తంగా రాశాడు.

ఉత్తరం చూసిన బాధ్యునికి చరిత్ర పునరావృతమవుతుంది అని హెచ్చరించిన మహోపాధ్యాయుల వ్యాఖ్యలు గుర్తొచ్చాయి. చైనా, రష్యా, వియత్నాం తదితర అనేక ప్రజా విప్లవోద్యమాలలో శత్రువు ఇలాంటి ఎత్తుగడలు ఎన్ని అనుసరించినప్పటికీ చివరకు ప్రజాయుద్ధం ముందు అవన్నీ దిగదుడుపే అయ్యాయి కదా ! అనుకుంటూ ఆయన కిట్టు సదురుకోసాగాడు.

(మిగతా వచ్చే సంచికలో...)

ఆరంభమయాయి. శ్రమవిభజన ద్వారా అనేక చేతిపనులూ, వృత్తులూ చేపట్టడం వీలయింది. వ్యక్తులమధ్య కేవలం ఒకే తెగకూ, కుటుంబానికీ చెందిన సమష్టి భావనకు ప్రాధాన్యత తగ్గసాగింది. దగ్గర సంబంధీకులు కాకపోయినా ఎక్కువమంది వ్యక్తులు సమీపాన నివసించడం తప్పనిసరి అయింది. ఇటువంటి అపరిచితులమధ్య పొరపొచ్చాలూ, కొట్లాటలూ తలెత్తకుండా సహజీవనం కొనసాగేందుకు అందరినీ ఏకం చెయ్యగలిగిన మతవిశ్వాసాలకు అవసరం ఏర్పడింది. పురాతనపద్ధతిలో ఏ తెగకాతెగలో జరిగినట్టుగా పక్షుల, జంతువుల చిహ్నాలను ఆరాధించడం సాధ్యంకాలేదు గనకనే దేవతల సంఖ్యకూడా తగ్గుతూవచ్చింది. అందరికీ వర్తించి, అందరూ పాటించగలిగే మతవిశ్వాసాలకు రూపలక్షణాలు ఏర్పడ్డాయి. సంబంధీకులు కానటువంటి వ్యక్తులు పరస్పరం కలహించుకోకుండా శాంతియుత సహజీవనం కొనసాగించేందుకు అందరినీ కలిపే మతాలు రూపొందాయి. దీని ఫలితంగా వ్యక్తులందరూ ఎవరికి వారేననే భావనకూడా పెరిగింది. ఒకనాడు గణజీవితంలో ప్రవర్తిల్లిన ఐకమత్యం బలహీనపడి, ప్రతివ్యక్తీ ఏకాకి అనీ, ప్రతి ఒక్కడూ దేవుణ్ణే నమ్ముకుని జీవించాలనే దృక్పథం ఏర్పడి, ఈనాటికీ కొనసాగుతోంది. అప్పట్లో ఇదొక విప్లవాత్మకమైన మార్పు. దీనికి అధ్యాత్మిక, అతీత కారణాలేమీ లేవు. ఇదంతా ఆర్థిక, సామాజిక పరిణామాల ఫలితమే.

అలాగే సమాజంలోని కట్టుబాట్లూ, పరిపాలకవ్యవస్థా, చట్టాలూ, నిబంధనలూ అన్నీ వ్యక్తిగత పద్ధతులకు అతీతంగా రూపొందే అవసరం ఏర్పడింది. కారణాలు ఏవైనప్పటికీ మునుపటికన్నా అతి దగ్గరగా జీవించసాగిన ప్రజలందరూ ఎవరికివారుగా ఏకాకులైపోయారు. అటువంటి పరిస్థితిలో దేవుళ్ళని నమ్ముకోవడం తప్ప వారికి గతి లేకుండా పోయింది. తెగలుగా, ముఠాలుగా జీవించినప్పుడు వారందరికీ ఉండిన పరస్పర సహకారం, ఐక్యతా క్రమంగా తగ్గిపోయాయి. వారంతా మతాధికారుల, పాలకవర్గాల చెప్పుచేతల్లో మెలగవలసిన అవసరం ఏర్పడింది.

సమాజాలు విస్తరించి, సామ్రాజ్యాలుగా రూపొందుతున్నకొద్దీ పాలకుల బలం పెరగసాగింది. రాజు స్వయానా దేవుడికి ప్రతినిధి అనీ, అందరూ అతనికి తల ఒగ్గి జీవించడం దైవశాసనమేననీ మతాధికారులు ప్రజలను నమ్మించసాగారు. ఈనాటి పత్రికలూ, వార్తా మాధ్యమాలూ డబ్బుకోసమూ, ప్రాపకం కోసమూ పనికిమాలిన రాజకీయనేతలనూ, చెత్తరకం సినిమాతారలనూ ఆకాశానికెత్తి అతిశయోక్తులు వల్లించే పద్ధతిలోనే అప్పటి పూజారి వర్గాలూ, కవి పుంగవులూ పాలకులను కీర్తిస్తూ ఉండేవి. చంద్రవంశమనీ, సూర్యవంశమనీ పేర్లు పెట్టి, ఒక్కొక్క చక్రవర్తీ ఏ దేవత అంశాన జన్మించాడో చెపుతూ ప్రజలను నమ్మించడం అప్పటి వ్యవస్థల్లో మామూలే. ఇది మనదేశంలోనే కాక, ప్రపంచంలో తొలి నాగరికతలన్నిటిలోనూ కనిపిస్తుంది.

ఈ పాలకవ్యవస్థలో చట్టాలను అమలుచెయ్యడం, పన్నులూ, శిస్తులూ వసూలు చెయ్యడం, సామాన్యులకు కొంత శాంతిభద్రతలను ఏర్పాటుచెయ్యడం మొదలైనవి ఉండేవి. దొంగలూ, దోపిడీదార్లూ, శత్రుదేశాలూ దాడులు చేసి కొల్లగొట్టకుండా ఉండేందుకు ఆత్మస్థైర్యాన్నిచ్చే విధంగా ఈ పాలకుల గురించిన ప్రశంసలు కొంతవరకూ ఉపయోగపడేవి. అతీతశక్తులూ, వరాల గురించి ఏం చెప్పినప్పటికీ అవన్నీ నిత్యజీవితంలోని అవసరాలకనే నిర్దేశించబడిన అతిశయోక్తులు. వీటి గురించిన సరైన అవగాహన మనకు లేకపోతే ప్రతిదానికీ విపరీతమైన వ్యాఖ్యానాలు చెప్పి సమర్థించే అర్థంలేని ప్రయాసే మనకు మిగులుతుంది.

సమాజం ఆర్థికంగా, ఆహారోత్పత్తి తదితర మౌలిక వ్యవస్థల్లో పరిణామాలకు లోనవుతున్నప్పుడల్లా గతితార్కిక భౌతికవాదం చెప్పినట్టుగా పాతవ్యవస్థల స్థానంలో కొత్తవి పుట్టుకురావడం, అవి కొత్తరకం స్పర్థలకు దారితియ్యడం వగైరాలన్నీ జరుగుతాయి. ప్రజలు తెగలుగా జీవించిన పరిస్థితి మారి గణజీవితం, జనపదాలూ, రాజ్యాలూ, సామ్రాజ్యాలూ, వైయక్తిక ధోరణులు పెరగడం మొదలైనవన్నీ అనివార్యంగా తలెత్తినటువంటి సంఘటనలే. గుహావాసులుగా దుర్భరజీవితాలు గడిపిన తొలిమానవులను మతభావనలు ఏకం చేసి ఉండవచ్చుగాని, చరిత్ర మొదలైనప్పటినుంచీ మతాలు ప్రజలను వేరుచెయ్యడానికే ఎక్కువగా ఉపయోగపడ్డాయనిపిస్తుంది. ☆




చదవండి!
చదివించండి!

వెల : రు. 50

# మార్క్సిస్టు తత్వశాస్త్రం

ఒక పరిచయం

న్యూ విస్టాస్ పబ్లికేషన్స్

ప్రతులకు :

మైత్రీ బుక్ హౌస్, విజయవాడ,
దిశ పుస్తక కేంద్రం, హైదరాబాద్
ప్రజాశక్తి బుక్ హౌస్, హైదరాబాద్,
నవోదయ బుక్‌హౌస్, హైదరాబాద్
సహచర బుక్‌మార్ట్, హైదరాబాద్

పాటలు

# కల్లోల కన్నీటి కశ్మీరు!

## - కె. రాజనర్సింహ పాటలు రెండు

కల్లోల కాశ్మీరు కన్నీటి
కథమీరు వింటారా?
కాశ్మీరులో కథ మీరు వింటారా! ॥కల్లోల॥

అటుచూస్తే పాకిస్తాన్
ఇటుచూస్తే ఇండియా
రెండు దేశాలు కలపి
రెండుగా చీలినాయి

నడుమ నలిగిపోతున్నరురో కాశ్మీరులు
ఈ గోస చూడమంటున్నారురో కాశ్మీరులు ॥కల్లోల॥

బ్రిటిషోడి కుట్రలో
పాకిస్తాన్ తరిమేస్తే
కాశ్మీరును కలువమాని
ఢిల్లీకి రమ్మన్నారు

రాజీకి రమ్మన్నారురో కాశ్మీరుల
రాత మేము మారుస్తంట్రు కాశ్మీరుల ॥కల్లోల॥

హక్కులన్ని కల్పిస్తామని
హామీలు ఇచ్చింది
భారత రాజ్యాంగములో
370 ఆర్టికల్‌ను
తిరగేసి రాసింది

ఆ రాసిందే అడిగితే కాశ్మీరుల
రక్తం మరకలు బెట్టిరి కాశ్మీరుల ॥కల్లోల॥

ఇంట్లోకి రమ్మని పిలిచి
గొల్లెంబెట్టి గొంతు నులిపి
గోలబెట్టె ఇండియా
పాకిస్తాన్ మిలటెంట్లు
కాశ్మీరులో ఉన్నారని

టెర్రరిస్టు పేరుతోనిరో కాశ్మీరుల
టెర్రరు చెస్తున్నారురో కాశ్మీరుల ॥కల్లోల॥

జాతిబిడ్డ సూఫీలు
సొంతగడ్డ కాశ్మీరంటె

బార్డర్‌పై బందుకెట్టి
భారత్ సైన్యాన్ని దింపి

4 లక్షల సైన్యంతో కాశ్మీరుల
40 వేల మందిని చంపె కాశ్మీరుల ॥కల్లోల॥

కాశ్మీరు ప్రజలంత
పవిత్రంగా భావించె
చరారె దర్గను
పట్టణాన్ని బూడిద చేసి

భయభ్రాంతులను చేసిరో కాశ్మీరుల
చరారె నుండి తరిమినారో కాశ్మీరుల ॥కల్లోల॥

దర్గను కూల్చుడాన్ని
ప్రజల కాల్చి చంపడాన్ని
సైన్యాన్ని లేపాలని
దాడులన్ని ఆపాలని

ప్రపంచానికి చాటి చెప్పరో కాశ్మీరులు
ఢిల్లిని నీల దీసింట్రురో కాశ్మీరులు ॥కల్లోల॥

వీడిపోయి బతకాలని
స్వేచ్ఛగా జీవించాలని
సంస్కృతి(ని) కాపాడాలని
కాశ్మీరుపై అధికారం
కాశ్మీరులకె దక్కాలని

కలసి రమ్మంటుంట్రురో కాశ్మీరులు
పోరుజేస్తమంటుంట్రురో కాశ్మీరులు ॥కల్లోల॥

పచ్చి ఫాసిస్టులైన
భారత పాలక వర్గం
సిక్కులపై దాడిచేసి
ఇందిరమ్మ ఇగిలిచ్చె
బాబ్రీమసీదును కూల్చి
బయటపడె పి.వి.గాడు(గారు)
అస్సామును అనచడంలో
ఆరితేరినారు (వీడు) వీరు
నాగాల మీజోల
నమిలిండు మింగిండు

అన్ని జాతులతో కలసి కాశ్మీరులు
అధికారం అడగండిరో కాశ్మీరులు ॥కల్లోల॥

పెట్టుబడితో పడగవిప్పి
డంకల్‌తో డొంకచీల్చి
సామ్రాజ్యవాదానికి
పాలకవర్గాలకు
పక్కలో బల్లిమయ్యి

జాతులన్ని ఏకమయ్యిరో కాశ్మీరులు
పోరు బాటనడండిరో కాశ్మీరులు
పోరుబాట నడవండిరో కాశ్మీరులు
జంగుబాట నడవాలిరో కాశ్మీరులు

(1996 ఢిల్లీలో అంతార్జాతీయ సదస్సు - 'జాతుల సమస్య' ఆ సందర్భంలో రాసింది)

## యుద్ధం ఒద్దు గ్రీన్‌హంట్

యుద్ధం ఒద్దు చిదంబరం
ఆదివాసులను అంతం చెసె - యుద్ధం
నక్సలైట్ల నిర్మూలన సాకుతో
ఆదర్శ యుద్ధమని దేశమంతంటుంది ॥యు॥

నాగమిజో బెటాలియన్లు
సి.ఆర్.పి.ఎఫ్. కోబ్రాలు
హర్మత్ వాహిని, సెంద్రాలతో
ప్రైవేటు సైన్యం దాడులు చేసే
కాశ్మీరు నుండి రాష్ట్రీయ రైఫిల్స్
పారామిలటరీ బలగాలు దింపి
ఆపరేషన్ గ్రీన్‌హంట్‌తో
సైనికదాడికి సిద్ధమైతివి ॥యు॥

టాటా కేమో హయ్ అంటివి
బాటా కేమో బాయ్ అంటివి
ఎస్.ఆర్.కు రైట్ అంటివి
పోస్కోను పక్కలుంచుకోని
జిందాల్‌కు జీవం పోస్తివి
మిట్టల్‌ను మెచ్చుకుంటివి
వేదాంతకు వెల్కంచేస్తివి
దుబాయోన్ని దోచుకోమంటివి
వేల ఏకరాలు భూమి ఇస్తివి
సెజ్‌లు పెట్టామంటివి
ఖనిజ సంపద తొవ్వుకోమన్నవ్
ఉక్కు ఫ్యాక్టరీలు పెట్టామన్నవ్
బడుగు జీవుల భూములు గుంజి
బడా కంపెనీలు పెట్టమంటివి ॥యు॥

ఆపరేషన్ అని ఆదరిస్తివి
గ్రీన్‌హంట్ గిరిగేస్తివి
బస్తర్ చుట్టు బలగాలు దింపి
అబూజ్‌మాడ్ అంతుచూస్తంటివి
గుత్తికోయల గుడిసెకు నిప్పు
గుండెకు తుపాకి గురి పెడితివి

సాల్వాజుడుంకు సైగచేస్తివి
ఛత్తీస్‌గఢ్‌ను చెదరగొడ్తివి ॥యు॥

ఎ.ఓ.బి.పై ఎక్కుపెట్టినవ్
ఎదలకు బందూకు సూటుపెట్టినవ్
ఖనిజాలపై కన్నువెసినవ్
బాక్సైట్ తవ్వకాలు పట్టినవ్
కోందు గిరిజనుల కాలిజెయ్యమని
గూడెం గుడిసెల గుండ్లు దించినవ్

అరణ్యరోదన పెట్టాకు మాకు
అరణ్యంపై యుద్ధం ఒద్దు ॥యు॥

లాల్‌గఢ్‌లో సంథాల్ తెగ
జల్, జంగల్, జమీన్ కోసం
అడవి మీద హక్కు ఆదివాసిదని
అడవి బిడ్డలు అడుగుతున్నారు
నందిగ్రామ్‌లో నారీలోకం
నానో వొద్దని నడుం కట్టిరి
సింగూరులో స్త్రీ పురుషులు
సి.పి.ఎం.పై తిరగబడ్డరు
మార్క్సిస్టుపార్టీలో మార్పురాలేదు
బుద్ధదేవ్‌కు బుద్ధి రాలేదు
దోపిడి మా రూపమన్నడు
అణచివేత మా మార్గమన్నడు

హింస అహింసలది కానే కాదు
న్యాయ న్యాయలది న్యాయం చెయ్యి ॥యు॥

నిలువడానికి నేల అడిగినారు
తలదాచుకోను నీడ అడిగినారు
తాగడానికి నీరు కోరినారు
చెరువులు కుంటలు సాగు అన్నరు
చదువుల కోసం బడులన్నరు
న్యాయమైన హక్కులు అడిగితె
నక్సలైట్లని ముద్రవేస్తిరి

చెయ్యమంటె మీరు చెయ్యకపోతిరి
చెసుకుంటె మీరు ఓర్వకపోతిరి ॥యు॥

నీ చట్టం ఎందో తెలియని వాళ్ళు
నీ రాజ్యం రంగు ఎరుగని వాళ్ళు
నీ పాలన నీడ సోకని వాళ్ళు
నీ సైన్యం సంగతి తెలియని వాళ్ళు
నోరులేని ఆ మూగజీవుల
మట్టుబెట్టకు మంచిది కాదు

సామ్రాజ్యవాదె యుద్ధోన్మాది
యుద్ధోన్మాదె - ఉగ్రవాది
టెర్రరిస్టులు - తీవ్రవాదులు
పెట్టుబడిదారులు - దోపిడిదారులు
పాలక పార్టీలు - ప్రజా ద్రోహులు

యుద్ధం నీది ఓటమి నీది
అంతిమ విజయం ఆదివాసిది ॥యు॥

# ఎందాక ఎందాక....

- ఎం.ఎ. బాసిత్

ఎందాక ఎందాక
ఎదురు చూద్దాము.....
ఛల్ ఎదురు తిరిగి
తెలంగాణ తెచ్చుకుందము ॥2॥

పార్లమెంటులో బిల్లు
పెట్టమందము
పెట్టకుంటె
గల్ల బట్టి వెంటబడుదము? ।ఎందాక।

డిసెంబరు తొమ్మిదిని
తొండి చేసిరి..
అర్ధరాత్రి తొమ్మిది పోరును
దగా చేసిరి.
తెలంగాణ తండ్లాట
అణగ తొక్కిరి
విశాలాంధ్ర విద్రోహం
ఆదర్శమనిరి.
దురాక్రమణ కాంక్షను
సమైక్య మనిరి
స్వపరిపాలనాకాంక్షను
జాతిద్రోహమనిరి. ।ఎందాక।

అక్కడోళ్ళు ఇక్కడుంటె
ఈడోళ్లే అవుతరు....
ఈడ బుట్టినోళ్లె
ఈడ పరాయవుతరు.
బీదా బిక్కి పక్కలల్ల
పాగ వేస్తరు...
పల్లె పట్నం పెత్తనాలు
పట్టుకుంటరు ।ఎందాక।

ఈడపారె నదులన్ని
మల్లించు కుంటరు..
ఓపెన్ కాస్టులు తవ్వి
భూమి పుండు చేస్తరు.
గనులు తవ్వి
వనరులు దోచుకెళ్తరు....
చెరువులు, చెలకాలన్ని
కబ్జా చేస్తరు.
తెలంగాణ భూములన్ని
సెజ్జు చేస్తరు....
బడుగుల బతుకులన్ని
నుజ్జు చేస్తరు.
సి.ఎం. సీటెక్కి వీళ్ళు

## రచయితలకు విజ్ఞప్తి!

అరుణతారకు రచనలు పంపండి. కథలు, కవిత్వం, పుస్తక సమీక్షలు, విమర్శా వ్యాసాలు, సామాజిక రాజకీయ సిద్ధాంత వ్యాసాలు, ఇతర భాషల్లో నుండి తెలుగు పాఠకులకు అవసరమైన అనువాదాలు పంపించండి. అరుణతారలో అచ్చవుతున్న రచనలపై ఉత్తరాలు రాయండి. రచనలను మెచ్చుకునే ఉత్తరాలకంటే గుణదోష చర్చలు చేయగల ఉత్తరాలు పత్రిక ప్రమాణాలు పెంచుతాయి. పాఠకుల విమర్శనాత్మక ఉత్తరాలు పత్రికా నిర్వహణకూ తోడ్పడుతాయి. మీ రచనలు అరుణతార సాహిత్య, సిద్ధాంత స్థాయిని పెంచుతాయని నమ్ముతూ -

- సం

ఈ-మెయిల్ ఐ.డి. : arunatara1977@gmail.com

ఫోజు కొడుతరు...
హోల్ సేల్ దోపిడితో
చిందులేస్తరు. ।ఎందాక।

అమరుల త్యాగాలను
హత్తుకుందము.
భూమి, భుక్తి పోరును
ఎత్తుకుందము....
వనరుల తరలింపును
అడ్డుకుందాము
పంతంబట్టి దోపిడి పాలన
అంతం జేద్దాము.

# నా రెప్పల కింద పాపా!

## బమ్మిడి జగదీశ్వర రావు

నాయమ్మా పెద్దమ్మా!
నను పెంచిన నాతల్లీ తెలంగానమ్మా!
నీ నాలుగు కోట్ల బిడ్డల తీరుగ
నన్నూ నా బిడ్డల్నీ పొదువుకొని పెంచిన తల్లీ... తెలంగాణా!
కడుపు జరక్క వచ్చినా కటిక నిజం జెప్పాలే...
సిక్కోలు సిన్నోడ్ని ముక్కు నేలకు రాసి సెపుతున్నా
ముచ్చట ఇనుతల్లీ
నువ్ గాంధీని అనుసరిస్తే
రాజ్యం గాడ్సే అయి సంపుతది
నువ్ భగత్‌సింగువయితే
ఉరితీసి వుసురుతీసి సంపుతది
నువ్ అల్లూరి వారసునివయితే
తను బ్రిటిషు వారసత్వమయి కాల్చుతది
ఎన్‌కౌంటర్లు ఎరగనిదానివా తల్లీ
మూడు రంగుల జెండాకి ఎనక ఎన్ని రంగులున్నాయో నీకు
తెల్దా అమ్మా?
అశోకచక్రం ఎనకాల ఎంతశోకముందో ఎరిక లేదా అమ్మా...
నైజామోడి నైజాం తెలిసిన దానివి
ఆంధ్రపాలకుల పాపం మోసిన దానివి
ఆత్మగౌరవం కోసం అనాదిగా ఆరాటపడ్డదానివి
అరవై ఏళ్ళుగా ప్రవహిస్తున్న అంతులేని దు:ఖం నీది
అప్పుడు నాలుగొందల హత్యలు...
ఇప్పుడు ఆరొందల ఆత్మ హత్యలు...
రక్తపు చుక్క నేలన పడకుండా తలలు రాలుతున్న శాంతి
సమయమిది

కవిత్వం

లోపల సముద్రాలు దాచుకొని పైకి ప్రశాంతంగా సాగుతున్న
పోరాటమిది
కొమురం భీం బందగీల వారసత్వ సత్తువ నీది
కమిటీల కాలయాపనల్ని భరిస్తున్న సహనం నీది
సోనియమ్మ పాదాలు పట్టే దరిద్ర నాయక సంతతి నీది
ఏమైనా అమాయక ప్రజానీకానికి అద్దం నువ్వు
ఆత్మీయతకీ వాత్సల్యానికీ అర్థం నువ్వు
అందుకే అమ్మవీ తోబుట్టువ్వీ అయినావు
నీ ఆశ తీరితే కదమ్మా నాకు ఆనందం
నీ ఆకాంక్ష నెరవేరితే కదమ్మా నాకు సంతోషం
రెండు రాష్ట్రాలయితే యేం కొంపకూలుతుందని...
విడి విడి జిల్లాల్లో ఉన్నట్టే వేరువేరు రాష్ట్రాల్లో ఉంటాం...
రెండు కుటుంబాలయినప్పుడు పేగుబంధం తెగిపోతుందా?
మానాయకుల నాటకాలకు మా ప్రజలూ
పాత్రలవుతున్నారు...
తెలియక చేసిన నేరమే తల్లీ...
అర్థం చేసుకోని అపోహలేనమ్మా...
అమ్మా నీ ఒడిలో పదమూడేళ్ళుగా ఉన్నానమ్మా...
ఇక్కడందరూ ఆత్మబంధువులే!
ఇక్కడ కష్టానికి నిలబడ్డవాళ్ళేగాని కష్టపెట్టిన వాళ్ళులేరు!
ఉన్నదే ఊరు - పెంచిందే కన్నతల్లి
అమ్మా నువ్వెప్పుడూ మాకు ఆసరావేగాని ఆపదవుగావు!
దోపిడిగాళ్ళు తెలంగాణల పుట్టినా ఆంధ్రల
పుట్టినా దోపిడిగాళ్ళే!
వాళ్ళు రెచ్చ గొట్టినా మేం రెచ్చిపోం
మీరణంలో సహాయనిరాకరణంలో మేమూ ఉన్నాం...
దారి తప్పిన తమ్ముళ్ళని క్షమించుతల్లీ...
అమ్మా... తెలంగాణా నీ తిండి నువ్వు తినాలే
నీ బట్ట నువ్వు కట్టాలే
నీ గాలి నువ్వు పిల్వాలే
అప్పుడే నీ ఒడిలో నేను జీవితాన్ని రుచిచూస్తాను!

# వందేళ్ళ శ్రామిక మహిళ

## - రాగో

వందేళ్ళ శ్రామిక మహిళకు
నేనొక పోరుబిడ్డని,
భారత ఎర్ర రాజకీయాల్లో
నా తల పండింది (నెరిసింది)
పాత ఎరుపెప్పుడూ ఆ మువ్వన్నెల జండా
చుట్టే ఊరేగి నా మాటే మరిచింది

దేశం విముక్తి అయిందన్నారు
చట్టాలు చేతిలోకి వచ్చాయన్నారు
కానీ, ఆ చరిత్రలో నాకు మిగిలింది
తరతరాల అణచివేత, అసమానత, అన్యాయమే
పోరుకాలంలో చిందిన నా నెత్తుటి రుణానికి
ప్రతిఫలంగా పితృస్వామ్యం అందించిన 'స్వాతంత్ర్య'
రాజ్యాంగం సాక్షిగా
కాగితాలపై గుమ్మరించిన సానుభూతి
కాలం పగుళ్లలో ఇంకిపోయింది
వసంత కాల మేఘగర్జన
వసంతాలను పుష్పిస్తుందనుకున్నాను
కానీ, ఆ నూతన వసంతాల దారిలో
నేను పితృస్వామ్య సంకెళ్ళను తెంచుకునేలా
సంఘటితం కాలేదు
కాలకూట విషనాగుల కాటుకు బలై
ముక్కచెక్కలైన గతంగా నిలచాను
ఆ ముక్కల్లో మిగిలిన నిప్పుకణికలు
పోరాట కొలిమిని రాజేసి
ప్రజాపోరాటాలకు కొత్త ఊపిర్లు పోశాయి
సంతాల్ సోదరి నుంచి గోండు దీదీ వరకు
సాగిన నా దీర్ఘపయనంలో
నా విముక్తికి నా సంఘటిత శక్తే
మార్గం అంది దండకారణ్యం
నాకు బొడ్డు కోసి, పురుడు పోసి, పేరు పెట్టి
నా నడిబొడ్డున జండాను నిలిపి
నా అంతిమ విముక్తికి సంకేతంగా
నూతన వెలుగులు విరజిమ్మే
నక్షత్రాన్ని నడుమ హత్తిన
పోరుజండాను నాకందించింది
ఇక ఆపై సాగిన నా పోరు ప్రస్థానంలో
ఎన్ని మలుపులో, ఎన్ని మెలికలో, ఎన్నెన్ని మైలు రాళ్లో?
తెగ పితృస్వామ్యం నాకందించిన అర్ధనగ్న జీవితాన్ని ముందు
మీకు విప్పి చెప్పనా!
లేక
మనసైన మొగిలిని కోరిన
నా మనసును జల్లెడ చేసి
పట్టెడు అన్నం పుట్టకుండా
నిలువనీడ లేకుండా
భయం, భయంగా ఆగమాగంగా
మానవ మృగాల కంటపడకుండా
అడవిలో దొంగచాటుగా
తిరిగిన నా రాగోల జీవితాన్ని
మీకు గుర్తుచేయనా!
'పాయిక' చేతిలో
తెల్లారిన నా బతుకునూ
'కోస్క్' కాటేసిన నా గతాన్నీ
ఏమని తలపోయను!
నా తనువును తప్ప నా
మనసెరుగని మగతనం
ఇన్నాళ్లూ నన్ను హింసించిన తీరును
అడుగడుగున పితృస్వామ్య కొలిమిలో నేననుభవించిన
శారీరక, మానసిక యాతనలను
కథలు, కథలుగా నా వెతలను
మీరెన్నైనా పుస్తకాలు రాసుకోవచ్చును!!!
ఆ గతం నాకక్కరలేదనీ,
ఆ జీవితంతో నే వేగలేననీ,
ఆ జీవితానికి స్వస్తి పలికి
మరో నూతన జీవితాన్ని కోరుకొని
పోరుబిడ్డనయ్యాను పోరు గీతాన్నయ్యాను
గత మూడు దశాబ్దాలుగా నెత్తురోడుతూ
సాగుతున్న నా కొత్త జీవితమంతా
వినూత్న చరిత్రకు ప్రాణం పోస్తోంది!
'రాగో'ల దారి ఏది? అని ప్రశ్నించినవారికి
దండకారణ్య విముక్తి బాటను ముందుంచుతుంది
నూతన చరిత్రలో,
మహిళా విముక్తి పథంలో,
పోరుకు వన్నెలు తెస్తూ,
వనితాలోకానికే కాదు, సమస్త మానవాళికి
ఆదర్శ మహిళలుగా నిల్చిన
రామయ్యపల్లె మట్టా రత్తక్కను గుర్తు చేయనా,
గంపెడు పిల్లలకూ, సంసార నావకూ
నన్నిక బంధించలేరనీ,
పితృస్వామ్య ఇనుప సంకెళ్లను తెంచుకొని
మొగిలితో మల్లియనంటూ
సమర రంగానికి సాగి వచ్చిన
తల్లి శ్యామలను మీకు పరిచయం చేయనా,
బంగారం పేటలో 'బయ్యి'[1]గా
ముద్రపడిన వేలాది బయ్యక్క
ఇక మహిళలను 'బయ్యి'లుగా మార్చలేరని
చాటి చెప్పి 'ధీరిమురుం'లో
నెత్తురొడ్డిన వీర చరిత్రను మీకు వివరించనా,
ఫాసిస్టు సల్వాజుడూం సృష్టించిన
తెల్ల బీభత్సంతో పోరాడి
ప్రజామిలీషియా కార్యకర్తలుగా,

పిఎల్‌జిఎ సైనికులుగా,
పార్టీ నేత్రిలుగా
త్యాగానికి మారుపేరైన ముద్దుబిడ్డలను
ఎంకినీ, బుద్రిని, మంగ్లీనీ, అయితే లను గూర్చి
ఎంతని చెప్పాలి! ఏమని చెప్పాలి!!
పొలం, హలమూ గాదు,
వంటగదీ గాదు, పిల్లల పెంపకమే కాదు
కూలీ, నాలే కాదు
సాయుధం - సమరం - అధికారం
మాకు అలీనం కాదంటూ
దొడాయి, కోరాపుట్, నయాగఢ్‌లలో
అద్భుత రణకౌశలాన్ని ప్రదర్శించిన
గెరిల్లా వనితలు
కరుణ, సోమారీ, పెంటీ, రాంబత్తీలు...
పీడిత ప్రజా రాజ్యాధికార స్థాపనా దిశలో
కోస్మిలో సర్కార్ అధ్యక్షురాలై
కోస్కి[2]ల కత్తుల వేటలో
నిండు జీవితాల్ని బలిపెట్టిన
నైతాం మైనాబాయిలు

ఆధే ఆస్మాన్‌కే చమక్‌తే సితారే
అని సగర్వంగా ప్రకటించుకున్న కెఎఎంఎస్[3] గురించీ
యావత్తు దండకారణ్య మహిళా ఉద్యమ చరిత్ర గురించీ
నెత్తుటి సిరాతో రాస్తున్న కొత్త చరిత్రను
భావితరాలకు అందిద్దాం
పితృస్వామ్య ఉక్కు సంకెళ్లను బద్దలు కొడదాం
శాశ్వతంగా ఆ దాష్టీకాన్ని పాతర పెడదాం
క్లారా జట్కిన్‌ని మదిలో నిలుపుకొని
వందేళ్ల మహిళకు నిజమైన
పోరు వారసురాళ్లుగా, అంతిమ పోరులో ముందుకు సాగుదాం!
అంతర్జాతీయ శ్రామిక మహిళా సమైక్యతకు
పోరు వారధి నిర్మిద్దాం
8 మార్చ్ జిందాబాద్ అని గట్టిగా నినదిద్దాం

(పాదసూచిక 1. ఆదివాసీ పల్లెలో అమాయకులను బయ్యి అని ఎగతాళి చేస్తుంటారు. 2. కోస్కి - పరాయివాళ్ళు, శత్రువులు. 3. క్రాంతికారీ ఆదివాసీ మహిళా సంఘటన్)


Statement about ownership and other particulars of periodical **ARUNATARA** as required to be published in the first issue of every year after the last day of February.

**Form IV (See Rule 8)**

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | Vijayawada |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | Chalasani Prasad |
| Whether citizen of India | : | Indian |
| Address | : | 33-13-3, Seetarampuram Vijayawada-520 002. |
| 4. Publisher's Name | : | Chalasani Prasad |
| Whether citizen of India | : | Indian |
| Address | : | 33-13-3, Seetarampuram Vijayawada-520 002. |
| 5. Editor's Name | : | Chalasani Prasad |
| Whether citizen of India | : | Indian |
| Address | : | 33-13-3, Seetarampuram Vijayawada-520 002. |
| 6. Name and addresses of Individuals who own the newspaper | : | Chalasani Prasad |

I, Chalasani Prasad, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*Sd/-*
*(Chalasani Prasad)*
Date : 1st March, 2011 — Signature of the Publisher


# తెలంగాణా!
# నీ గాయాలు వర్ధిల్లనీ
# నీ గాయాల్లో నా రక్తాన్ని
# పుష్పించనీ!

**- అనామధేయుడు**

గాయాలున్నంత వరకు
గానాలూ ఉంటాయ్
ధిక్కార గేయాలు ఉంటాయ్

చావుకీ బతుక్కీ మధ్య
నిలిచిన సందిగ్ధ సీమల
ప్రాచీన ప్రేమగీతం నువ్వు

వెలుగుకీ చీకటికీ మధ్య
సోలిన దివారాత్రాల
క్షతగాత్రగానం నువ్వు

కాలం చేసిన గాయం
జీవితం పోడవునా గీస్తోన్న
నెత్తుటిగీతకు
అటు నువ్వు

యిటు నేను

తెలంగాణా!
లోతైన గాయానివి నువ్వు
అద్భుతమైన భూమివి నువ్వు
అసంపూర్తి పద్యానివి నువ్వు
ఆదిమ ప్రేమవి నువ్వు
సశేష స్వప్నానివి నువ్వు

ఎన్నితరాల కన్నీళ్ళు
మేటలు వేస్తే
ఇక్కడ సముద్రాలయ్యాయో?
ఎన్ని యుగాల స్వేదం
దుముకులెడితే
ఇక్కడ జలపాతాలయ్యాయో?
ఎన్ని తరాల అణచివేతలకు
తిరుగుబాటీ ఈ పోరాటం?
ఎన్ని యుగాల ఆక్రోశానికి
ఆయుధ ధారణీ యుద్ధం?

తెలంగాణా!
మళ్ళీ మళ్ళీ ఓడిపోతుంది నువ్వే
తిరిగి ఎప్పటికప్పుడు
సరికొత్త దేహాన్ని
వాగ్దానం చేస్తుందీ నువ్వే!

మేలుకుంటూ, రగులుకుంటూ
మోసపోతూ, కుమిలిపోతూ
ఎప్పటికప్పుడు
తిరిగి రాజుకొనే
నిప్పుకణిక నీ అస్తిత్వం

రాలుతున్న ఆకుల్లాగా
రూపు మారుతున్న పగల్లాగా
దేహాల్ని నిలువునా కోసుకుపోతోన్న
చీకటి నదిలా
ఎప్పటికప్పుడు
నీవు నన్ను లాక్కుపోతూనే ఉంటావ్.

అనేక అసత్యాల తర్వాత
కొన్ని అర్ధసత్యాల తర్వాత
విభేదించాల్సిన
చారిత్రక అర్థరాహిత్యాల తర్వాత
నేను నాతో మాట్లాడుకుంటూ
నీతోనూ మాట్లాడుతాను.

నీతో మాట్లాడాలనుకునే ప్రతీసారీ
నీ గురించి ఎలుగెత్తాలనుకునే ప్రతీసారీ
పదాలు పీలికలైపోతాయి
నిలువెల్లా నెత్తుటి ధారలై పోతాయి
వాక్యాలు జైళ్ళయి పోతాయి.
నెర్రెలిచ్చిన బయళ్ళయిపోతాయి

మూగబోయిన నాస్వరం నిండా
దట్టించిన నీ దుఃఖమే పొగులుతుంది
నా ప్రతి కదలికలోనూ
నీ సంకెళ్ళ శబ్దమే ప్రతిధ్వనిస్తుంది
నా ఉఛ్వాస నిశ్వాసాల్లోనూ
నీ మట్టి వాసనే, నీ వెట్టివేదనే!

కాలం ముట్టడిలో
కూలిపోవడమంటే తిరిగి లేవడమే కదూ?
నెత్తుటి చిత్తడిలో
తూలిపోవడమంటే తిరిగి రావడమే కదూ?

కరుకుగా వీచిన నెత్తుటి రుతుపవనం
కనుభూములు మీద కల్లోల సంతకం చేసిపోయాక-
ప్రపంచాన్ని దుఃఖంలో ముంచెత్తే
ఓ ప్రేమగీతాన్ని నీకోసం పాడాలనుంది
నీ తరపున ముఖాముఖి
మృత్యువుతో మాట్లాడాలనుంది.

సమస్తాన్నీ శూన్యం చేసేస్తోన్న
నడిచే డొల్లల్ని చేసేస్తోన్న
ఈ విషాద మొఖం ఎవరిది?
మిగిలిన దుఃఖభరిత రాత్రుళ్ళా - అంతేనా
ఇటుగా సాగిపోతున్న నది - అదేనా

నదిలో పడవ
పడవలో రెండు సాయంకాలాలు
ఒకటినీది, ఒకటినాది.

ఇలాగే కదా
మృత్యువుతో మాట్లాడేది?

పదేపదే ఏకరువు పెట్టే చరిత్రలాగే
గాలి మోసుకొచ్చే కబుర్లు

తెరచాప లేని దిగులు పడవలు
ఇక వదిలేసేయ్
ఈ రాత్రికి ఏ ముఖంలేదు.

దుఃఖమొక్కటే ప్రస్తుతం ఇక్కడ వర్తమానం
పదేపదే వంచించబడటం దుఃఖం కాదు
బిడ్డలకు స్తన్యం దక్కకపోవడం దుఃఖం కాదు
చారిత్రక వక్రీకరణకు గురికావడం దుఃఖం కాదు
నేలనేలంతా ఇనుపటోపీగా మారిపోవడం దుఃఖం కాదు
బతుకంతా బూట్ల నాడాలతో చిల్లులు పడటం దుఃఖం కాదు
తెరుచుకున్న గొంతుల మీదుగా కవాతులు సాగిపోవడం
దుఃఖం కాదు
కళ్ళెదుటే కన్నబిడ్డలు మానభంగాలకు గురికావడం
దుఃఖం కాదు
ఆయుధాన్ని చేజార్చుకోవడం దుఃఖం కాదు
పచ్చికస్పైతం మొలకెత్తని నాగేటి చాళ్ళలో
మనల్ని మనం తలక్రిందులుగా నాటుకోవడం
కూడా దుఃఖం కాదు

దుఃఖమంటే,
మనం నిలబడ్డ నేల మనది కాకపోవడం
మన సొంతగొంతులోకి చల్లగా దిగుతోన్న
విషాదం మనది కాకపోవడం
మన ఎముకల్లోకి దట్టించబడుతున్న
జడత్వాన్ని మనమే నినదించాల్సి రావడం
ఆశలూ, ఆలోచనలూ, త్యాగాలూ, పోరాటాలు
అర్థరహితమైపోవడమే అసలైన దుఃఖం.

నమ్మకద్రోహం
వెన్నులో నాటుకున్న ప్రతీసారీ
కాస్త ప్రేమని అడుక్కుంటూ
అంత అన్నం కోసం ప్రార్థిస్తూ
పదే పదే అదే దుఃఖ దృశ్యం
ఎప్పటికీ ఆరిపోదు
ఎన్నటికీ ఇంకిపోదు.
బహుశా ఇదో జూదశాల
తోడుగా మృత్యుగడియారం
తెలంగాణా!
ఇప్పుడు నీ పిల్లలు
మృత్యువు నోట్లో కాళ్ళు పెట్టి
నా ఒళ్ళో పడుకుంటున్నారు.

గగుర్పాటు అంటే ఇదేనా?
శవదహనానంతర సౌందర్యమంటే ఇదా?
భీభత్సం ఇంత కంటే బావుంటుందా?

## 2

దుఃఖాలున్నంత వరకు
ధిక్కారాలూ ఉంటాయి
దూసుకొచ్చే విస్ఫోటనాలూ ఉంటాయి.

కలలు రాని కళ్ళు
పాటలేని పడవ
ఎవడిక్కావాలి.

ఈ దీపం నాదికాదు
ఈ ఒడ్డున నిలబడ్డ
పిలుపు నాది కాదు

తెలంగాణా!
నీకు దక్కకుండా నిన్నుదాటుకు వచ్చిన
ఈ గుక్కెడు నీళ్ళు
నా దాహాన్ని మాత్రం ఎప్పుడు తీర్చాయని?

నీలానే నాదీ వలసల భూమి
నాకు తెలియకుండానే
దురాక్రమించబడ్డ జీవితం నాది
స్వంత నేల మీదే
ఎలుగెత్తే కాందిశీక గీతం నాది

నాదో ప్రాచీనాంతరం దేహం
దానికి ఆత్మలేదు
కాస్త అస్తిత్వం, కొంత ఏమరుపాటు
దానికి చరిత్ర లేదు
ఛిద్ర గతం దానిది

ఛిలిన నదులు మొగసాన
చిక్కుకొని ఇప్పుడు
ఉన్నదల్లా ఒకే పడవ,
రెండు సాయంకాలాలు
ఒకటి నాది
ఒకటి నీది

మనకు తెలియకుండానే
మనల్ని తోసుకొచ్చిన చీకటి చాటున
ఇప్పుడా నది ఎండిపోయింది.
ఎండిపోయిన నది ఒడ్డున

కూలిపోయిన నది ఒడ్డున
కూలిపోయిన వృక్షం మీద
వాలిన అనాది దాహం
నీదే కాదు
నాది కూడా!

అలుముకున్న మృత్యుచ్ఛాయ కింద
ఒరిగిన దీపస్తంభం మీద
ఆరేస్తోన్న శతాబ్దాల వెట్టి నీడ
నాదే కాదు
నీది కూడా!

కొన్ని చిల్లచెట్లు
కబళిస్తోన్న ఇసుక మేటలు
విరిగిన కుండ పెంకులు
చెలరేగుతోన్న బూడిద రాశులు

పాతగాయం
ఎవరిదైతేనేం
అవనత పతాకం
ఎవరికోసమైతేనేం

నీలాగే నా తల్లీ
నిత్య బహిష్కృతురాలు

ఆమెగురించి
చెప్పడానికి ఏ కథలూ లేవు
పాడటానికి ఏ పాటలూ లేవు
కీర్తించడానికి ఏ వీరగాథలూ లేవు

నెర్రెలిచ్చిన నేల ఆమె రూపు
చిల్లచెట్ల గుబురులే ఆమె చిరునామా
గుక్కెడు నీళ్ళకోసం
కైమోడ్చిన దైన్యం
ఆమె సొంతం

ఆమె శతాబ్దాల పరిచారిక

కొంకర్లు తిరిగిన కాళ్ళు
కాయలు కాసిన చేతులు
కదుములు కట్టిన పళ్ళు
ఎదురు దెబ్బల కరుకు రాళ్ళు

గ్రీష్మరుతువొక్కటే

ఆమెకు తెలిసిన కాలం
పైటేళ వొక్కటే
ఆమెకు తెలిసిన గడియ
మబ్బుల్లోనే
ఎప్పుడూ ఆమెనడక

ఆమె నిత్య గర్భశోకిత

నగరాల్లో తప్పిపోయిన
గొర్రెపిల్లలు ఆమె బిడ్డలు

పొగచూరిన కొష్టాలు
వట్టిపోయిన పాదుగులు
ఆమెకు మిగిలిన
గత కాలపు గుర్తులు

సజ్జకూడు
రాగి సంకటి
కొర్రన్నాలే
ఆమెకు పరమాన్నాలు
ఇప్పుడు ఆమెకు
కనడానికి ఏ కలలూ లేవు
నెమరేసు కోవడానికి ఏ జ్ఞాపకాలు లేవు
ఎలుగెత్తడానికి ఏ స్వరమూ లేదు

ఆమె ఎండిన కన్నీటి చారిక!

నాకు తెల్సు
నాకాలాన్నుండీ నన్ను నేను కోల్పోయిన
విశాలపు రహస్య లిపి ఇది.
నాకు తెలియకుండా నాకు నేను తెరుచుకున్న
నిషిద్ధ ద్వారమిది.

జీవితాన్ని వాగ్దానం చేసిన
వసంతం చెదిరి పోయాక
విముక్తిని గానం చేసిన
ఉప్పెన ఎన్నటికీ ఆరని
నెత్తుటి జల్లుని చిలికిపోయాక -

కాసిని మెతుకుల కోసమే కదా,
కాస్తంత వెలుతురు కోసమే కదా,
ఇలా ఓ చిరిగిన జ్ఞాపకంగా మారుతోంది!

నిశబ్దం చిట్లదు

కల బద్దలు కాదు
అంతా పరుచుకున్నట్లు
అంతా ధ్వంస పరచినట్లు
తిరిగి పెనవేసుకున్నట్లు
ఓ వియోగానంతర భ్రాంతి.

తెలంగాణా!
జ్వలిస్తోన్న ఓ జ్వరగీతం
పెగుల్తోన్న ఓ వేదనా స్వరం
అలజడవుతోన్న ఓ జడివాన
ప్రేమంటే ఇదేనా?
గాయమై పుష్పించడమంటే ఇదా?
విధ్వంసం ఇంతకంటే బావుంటుందా?

## 3

నిష్క్రమణలున్నంత వరకు
పునరుత్థానాలూ ఉంటాయ్
దిక్కులు పిక్కటిల్లే ఆగ్రహాలు ఉంటాయి.

తెలంగాణా!
నీలానే నేను పురిటిలోనే బిడ్డని పోగొట్టుకున్న
పచ్చిబాలింత స్త్రీని,
అడవిని కోల్పోయిన ఆదివాసీని,
క్రమం తప్పకుండా ప్రతి రుతువూ మోసగించే
అనాథ రైతుని
క్రమంగా మొఖాన్ని కోల్పోతోన్న
శతాబ్దాల ఆత్మని.

ఇప్పుడు నేను
నీ గుండె మీద నాగుండెను పెడుతున్నాను
నీ చెప్పుల్లో నాకాళ్ళు పెడుతున్నాను
ఎలుగెత్తిన నీ ఆగ్రహాన్ని ఆవాహం చేసుకుంటున్నాను
నీ ఆయుధ విన్యాసాన్ని నేనూ నేర్చుకుంటున్నాను

తెలంగాణా!
నీ గాయాలు వర్ధిల్లనీ
నీ గాయాల్లో నా రక్తాన్నీ పుష్పించనీ!

ఇప్పుడు ప్రేమించడాన్ని సైతం
నీ నుండే నేర్చుకుంటున్నాను.
ఒక శరీరాన్నుండీ ఒక సమూహాన్ని సృష్టించడం
ఒక సమూహాన్నుండి ఒక వెల్లువని సృష్టించడం
ఒక వెల్లువ నుండీ తిరిగి మనల్ని మనం సృష్టించుకోవడం

ఇదే కదా ప్రేమంటే
సంకెళ్ళపై ద్వేషంతో
మట్టిపై మమకారంతో
ఆయుధమై పదునెక్కడమే కదా
ప్రేమించడమంటే!

పుట్టుకే ప్రామాణీకమైతే
పుట్టి పొరాడిన నేల మీదే
ఎందుకు మనం పదేపదే
కాందిశీకులమవుతున్నాం?
శ్రమిస్తూ సంపదనివ్వడమే
సాక్ష్యమైనా ఏ కొలబద్దలపై
నిత్యం వెంటాడి వేటాడబడుతున్నాం?

జీవితానికి మరణానికి మధ్య తేడా
ఒక్క ఊపిరి పీల్చడమేనా?
అడుగుకి అడుగుకీ మధ్య దూరం
ఒక్క కూలి పోవడమేనా?
మాటకీ మాటకీ మధ్య బంధం
ఒక్క శబ్దమేనా?
ఒక జాంబియా, ఒక జాఫ్నా
కళ్ళముందింకా చెదరని ఇరాక్,
సిక్కుల ఊచకోత, గుజరాత్ గాయాలు,
తిరుగులేని సాక్ష్యంగా
తడియారని కాశ్మీర్ నెత్తుటి నదులు -
ఎన్నికల జూదం ముందు
నెత్తురు కక్కని నిజమేది?
ఒడ్డయి రాలని జాతేది

జాతి జాగృతమై, ఆగ్రహం సుడిగాలై
చెలరేగినప్పుడల్లా గాలిపీల్చుకొనే మార్గాలన్నీ
మూసేస్తుంది రాజ్యం.
రాజ్యం మొఖాన ఖాండ్రించి ఉమ్మేస్తూ
తన దేహాన్నే సర్రున చించి
ఏదో ఒక ద్వారాన్ని
కొత్తగా తెరుస్తూనే ఉంటుంది అమరత్వం.
పల్లానికి ప్రవహించడమే నీటికి తెలియొచ్చేమో గానీ
పల్లానికి ఎదురెక్కి పదునెక్కడం రాలిన రక్తానికి
మాత్రమే తెలుస్తుంది!

రెండుగా చీలిన నది
ఒకే పడవ
ప్రవాహాల వెంట అది వదిలే
రెండు వేకువ పాటలు

ఒకటి నువ్వు
ఒకటి నేను.

తెలంగాణా!
ఇక మనం దుఃఖించం
వెక్కిళ్ళు సైతం పెట్టం

వందల శతాబ్దాల నుంచి
వీస్తోన్న పాత గాలే ఇది
వేసిన ప్రతి అడుగు ప్రస్థానంలో
నేలకి పచ్చని తివాసీని అల్లిన
చెమట దారాల జలపాతాల మీదుగా వీస్తోన్న గాలే ఇది
తలెత్తి పలకరిస్తోన్న
ప్రతి గడ్డిపోచనూ చెయ్యారా నిమిరి
గుండెల కత్తుకుంటోన్న వర్తమానం ఇది
రాలే ప్రతి నీటి బొట్టునీ
తన కంట్లోకి పొదువు కుంటోన్న ప్రజాయుద్ధ సందర్భమిది!

తెలంగాణా!
ఒంటరి గాయాలు
ఒంటరి యుద్ధాలు కావు మనవి.
కుప్ప కూలిపోయిన సన్నివేశాల మధ్య సైతం
తిరిగి నిటారుగా నిలబెట్టే సాయుధ పాఠశాల నువ్వు
యుద్ధ వ్యాకరణానివి నువ్వు
నా తొలి పాఠానివి నువ్వు
గుణపాఠానివి కూడా నువ్వే
నీ విముక్తిలోనే
నా స్వేచ్ఛ!

నీకు తెల్సు
కేవలం కంచెల్లోంకి మినహాయించబడటమే
స్వేచ్ఛ కాదు
నాకు తెల్సు
కేవలం సరిహద్దులై పిగిలిపోవడమే
విముక్తి కాదు.

వేలాది ఓటముల్ని నింపుకొని
ఉక్కులా పదునెక్కిపోయిననారాల్తో
నీవు మాట్లాడతావ్
తీర్పు చెబుతావ్
నేనూ అంతే -
ఒరిగిపోయిన నా నల్లమల
తిరిగి చిగురించేట్లు మాట్లాడతాను

తప్పదిక -
విముక్తి పతాకాన్ని ఎగరేయడానికి
స్వేచ్ఛాగీతాన్ని ఎలుగెత్తడానికి
కత్తికన్నా పదునైందేదో కావాలి
బందూక్ కన్నా బరువైందేదో కావాలి

తెలంగాణా!
అది నీకూ తెల్సు
నీ ద్వారా నాకూ తెల్సు!

# ఐదు తలల క్రిష్ణుడు

## - వడ్డెబోయిన శ్రీనివాస్ కవితలు ఐదు

కుత కుత ఉడుకుతున్న
కుంపట్లోంచి
నిప్పుకణికెలు నల్లగా చూసినప్పుడు
యాడాది రాగం తీసి
వొక కొండచిలువ నవ్వు నవ్వావు

దట్టమైన మంచులో
రూపాయికి మోకరిల్లి
ఐదుతలల క్రిష్ణుడా! మాయమైయ్యావ్

నక్క వినయ సంభాషణల రాయబారీ
సింహాన్ని దువ్వి దువ్వి
విజయవాడలో మాయమై
హైదరాబాదు నిమ్స్ రోగుల్ని పరిహసించిన
నిరాహార దీక్ష నీడ వైయ్యావ్

నటనా న్యాయకుడా!
ఎండిన వరిమొక్క
వొక్క కల కనలేదు
చినుకైతావని
ఎర్రమట్టి చారల గోడ
ఎదురు చూడలేదు
ఎన్నెల ముగ్గైతావని

మట్టిచేతుల్లో
వొక నది చిగురించి
ఈ నేల కన్నీటి చారిక
కడుగుతుందనుకోలేదు
పిడుగులు చిమ్మే వయస్సులు
మంటల చెట్టెకట్టిన
చీకటి ఆకాశం గీసిన నక్షత్రాలేవి

రెండు కళ్ళ రెండు నాల్కెల దారిలోని
ఐదు నాల్కెల ఆరుమాటలోడా!
గుప్పెట్లో దాచుకున్న గుండెచప్పుడు
ఎలా దొంగిలిస్తావు
పుస్తకాల్లో దాచుకున్న నెమలికన్ను
ఎలా ముక్కలు చేస్తావు
రక్తంలో వేలాడదీసుకున్న మట్టి బొమ్మను
ఎలా పగులగొడ్తావు

మెదడు మోకాళ్ళోకొచ్చిన ఉండూకమా!
ఈనేలే
వొక సూర్యసముద్రం

నీ మాయా ప్రియదర్శిని పేటికను
ఈనేల చేతుల రాయలాంధ్ర చెమటచుక్కలు
ఫెళేల్లు పగులగొట్టి
త్యాగాల గమ్యాన్ని ముద్దు పెట్టుకుంటాయి

## బ్లాక్ హంగ్రీ

రూపాయ గుట్టల కింద
బొరియల్లో
బంగారు ఎలుకలు దొర్లుతున్నాయి

ఆకలి లోయల్లో
కుప్పకూలి
చెమట చుక్కలు ధ్వంసమవుతున్నాయి

బియ్యం గోదాములు
గోదాముల కడుపులో కుళ్ళినట్టుగా
ఆకలి మింగేసిన మనుషులు!

బ్లాక్‌మని
ఒకదిక్కు! గుట్టలు గుట్టలు
బ్లాక్ హంగ్రీ
ఒక దిక్కు! లోయలు లోయలు

అభివృద్ధి ఏకపక్షమైయ్యాక
ఆకళ్ళల్లో ఆకలి కలువలు
ఆ గరిమనాభి చుట్టూత ఆకలివనం
ఆ శరీరాలన్నీ ఆకలి వాసన

ఆకలి ఉరిపడి
చెమట చుక్క మరణించింది!
అయినా
అభివృద్ధి గురించి మాట్లాడండి
దోచుకున్న మెతుకుల్తో
అన్నదానం దహనం చేసిన
'నల్ల ఆకలి' గుర్తించకండి!

పిండాకూడు కోసం
పిట్టల్లావాలి
రాలిపోయిన పేగుల గురించి - మాట్లాడకండి!
'డీమ్డ్ టు బి డెవెలెప్డ్'[1]
అభివృద్ధి గురించే మాట్లాడండి!

బహుళ జాతాకలి
పారిశ్రామికాకలి
రాజకీయులాకలి
కాంట్రాక్టుర్లాకలి
ఆశ్రమాలాకలి
ఆకలి
పర్యాయపదాలైన
అప్పుల ఛాంపియన్ రాజ్యంలో

కులాన్ని కప్పినా
మతాన్ని కప్పినా
జాతీయ భావోద్వేగాల్ని కప్పినా
అభివృద్ధి పాలకపక్షం!
ఆకలి ప్రజల పక్షం!!
ఇంకా
అభివృద్ధి గురించే మాట్లాడండి

రాజ్యం
అభివృద్ధి అన్నప్పుడల్లా
జూలు విదిల్చే ఆకలి సునామి కన్పిస్తుంది
ఖాండవ దహనాకలి కన్పిస్తుంది

అభివృద్ధంటే
ఆకలి పంపిణీ పథకమే!
అభివృద్ధంతా ఆకలే!!

ఊబకాయంలా పెరుగుతున్న
కవరేజ్ ఏరియాలో లేని ఆకల్ని
స్వేచ్ఛాడాఫ్ చూపుల్తో
ప్రపంచీకరణ నల్లపూతద్దాల్లోంచి

హవ్వ! ఇంకా ఆకలేంటనే అంధకారానికి
అన్నదాన హత్యలూ
అభివృద్ధి భాగమే!?
హవ్వ!

[1] అభివృద్ధి జరక్కుండానే జరిగినట్టు భావిస్తూ
(మాన్‌గఢ్ కృపాలు మహరాజ్ భార్య శ్రాద్ధ కర్మ అన్నదాన చావుల సందర్భంగా)

# ఇరోం షర్మిలా భాను

అల్లకల్లోలమైన
జీవితాల మధ్యలోంచే
ఆకస్మికంగా
పరిసరాల్ని విద్యుత్కేంద్రాల్ని చేసే
సూర్య వృక్షాలు మాయం
ఆమె చూసింది

ఏ పగలో
ఏ రేయో
ఏ సంధ్యో
కారణం పుట్టకుండానే
తూటా కురిసి
మృత్యువు ప్రవాహం
ఆమె చూసింది

పట్టపగలు చీకటి పడ్డట్టు
బతుక్కు
చావుకు
పేర్లకు
జీవితం మాయమై
వేలాది ఇండ్ల
దుఃఖంతో నిండిన కండ్లు
ఆమె చూసింది

ఎంతకీ మనుషుల్ని
పీడించి ఓడించే క్రీడలో
నడిచే కలల్ని
నెత్తురు చిందే గాయాల్ని చేసే
వొక తుపాకీ చుట్టం!
సిగ్గూ శరం లేని ఉక్కు పాదం!
ఆమె చూసింది

మానవ నాగరికత సిగ్గుతో
తలదించుకొంది
నియంతృత్వం తొడుక్కున్న గరం కోటు
భద్రతా దళాల ప్రత్యేక చట్టమృగాన్ని
నిరాహార దీక్ష బోనులో బంధించడానికి
మృత్యువు నెత్తి మీద నిలబడి
నిరసనలు నిరసనలుగా
తన మెతుకు మీది పేరు
తనే చెడుపుకుంది

రోగాల పుట్ట
కూలుతున్న అవయవాల్తోనే
ఒక్క వీరవనితే
తనను తానే ఎక్కుపెట్టింది
తుపాకుల కోట కట్టడికి
తుదముట్టడికి
(పదేళ్ళ నిరాహార మహాదీక్ష చదివాక)

# స్వేచ్ఛను మాట్లాడాలి

అణిచివేయబడ్తున్న మట్టి
ఆధిపత్య భూమి
కలిసేది
సంకెళ్ళ రేఖతోనే కదా!

అద్దాలనాడు చేయిపట్టుకున్నందుకు
గడ్డాల నాటికే
అర్ధవలస అర్ధభూస్వామ్యం
గద్దెపోయింది

జ్వాలల జీవనది
కాశ్మీరు
ఇప్పుడు
సంకెళ్ళు పగలగొడ్తోంది

ఇవ్వాళేదో
కొత్తగైనట్టు
వినపడడం లేదా!?
నటించండి!

కాశ్మీర్ను మాట్లాడాలి
కాశ్మీరు స్వేచ్ఛను మాట్లాడాలి
కాశ్మీరు స్వతంత్ర కాంక్ష మాట్లాడాల్సిందే!

అవినీతి దేశభక్తుల్లారా!

దోపిడి కొలిమిలో
దేశాన్ని
చేతుల త్రికోణ చపాతిలా
కాల్చుకుతింటే
దేశద్రోహం కాదా!?

దేశవిదేశ కార్పొరేట్ ఘనులకు
బోర్లాబొక్కల పడి
గర్భస్థ పంటను
అంటగట్టి ఆ గర్భ దారిద్రాన్ని పెంచడం
ఉరినేరం కాదా!?

మతంతో
మనిషి తల నరికే రాజకీయం
రాజద్రోహం కాదా!?

ఒళ్ళంతా
చెమట చుక్కను చేసినా
ఆకలి పులితో
ఓడించటం
ప్రజాస్వామ్య రాజ్య
చట్టబద్ధంకాని చట్టబద్ధం నేరం కాదా!?

మీరు
బహూకరించే
గాయాల్నుంచి
చావుల్నుంచి
ఆకల్నుంచి
అరాచకం నుంచి
స్వేచ్ఛను మాట్లాడడం
స్వతంత్ర్యాన్ని మాట్లాడడం
దేశ ద్రోహమంటున్నప్పుడు
గొంతుకు
ఇనుప కచ్చడాలు బిగించినా సరే

పిడికట్టిన
జనం మాటే మాట్లాడాలి
పీడిత పాటే పాడాలి

# మే 28 యుద్ధ గానం

పుటకు పుటకు
పుట్టెడు దుఃఖం

పుటుకే
నీళ్ళొండిన 'పుటుబాలు'

ఏం చదివినట్లు
ఈ బతుకుల్ని!

మేమెలా చిక్కుబడ్డాం
మేమెలా ముడిపడ్డాం
వేసిన అడుగులు
వేసినట్టే
మొదలవుతామో లేదో
చివరవతాం!

పచ్చని చెమట చుక్కలు
రాలి రాలి
ఎండిన చెట్టవుతాం!

చిగుల్లేవు
చిలుకల్లేవు
మనిషి నిండా
చింత చెట్టు విస్తరిస్తుంది

కోల్పోడానికి
ఏం మిగిలింది
దుఃఖమే కదా!

చేతుల్లో
రాళ్ళు పొద్దుపొడుస్తాయి
మళ్ళీ
రాతియుగం మొదలైంది

అక్కడ
కాశ్మీర్లో
ఇక్కడ
తెలంగాణలో

## 2

హింసకు
శిలాఫలకం వేసిందెవరు

ఆకలి కడుపుల్లో
ఆయుధాన్నెగరేసిందెవరు
పాలకంకులకు
నెత్తుటి గోరింటాకు పెట్టిందెవరు

పిచ్చులకు
ఉచ్చుపెట్టి
శవాల మీంచి
సింహాసనాన్ని కలగంటున్నదెవరు

వలస చేతులే
ఈ నేల
తలరాత రాస్తున్నాయి

## 3

మా పెరుమాళ్ళ సంకీసను
ఎవరు ఓదార్చారు
మా బైరాన్‌పల్లిని
ఎవరు ఓదార్చారు
మా పర్కాలను
ఎవరు ఓదార్చారు
మా గుర్తూరును
మా కూటిగల్‌ను
మా కోటకొండ రామచంద్రాపురాల్ని
ఎవరు ఓదార్చారు
సాహసం ఈ నేలలోనే!
సహనం ఈ నేలలోనే!!

## 4

చేతిలో
నాగలి మొలిస్తే
హరిత జలపాతాల్ని సృష్టించే వారే!

దుర్భిక్షం గుండెలో
ఆకుపచ్చ కత్తిదించేవారే
పగల్నీ రాత్రినీ
పంటపాలం చేసేవారే

బతుక్కు
మెతుక్కు
నదుల్ని
అనుసంధానించి
ఆకల్ని దగ్ధం చేసేవారే కాని

పచ్చటి ఆశల మీంచి
ఎండకాలమై నడిచిందెవరు
పిడచకట్టిన గొంతుల్లో
ఇనుపచినుకులు రాల్చిందెవరు

ఇక్కడి వెలుగుల్తో
బతుకుల్ని కడుక్కున్నదెవరు

ఇసుక తిన్నెల మీది
నిర్మాణాలతో
జీవితాల్ని కూల్చిందెవరు

చరిత్రకు
చేతినడ్డుపెట్టి
సానుభూతి తెరల్ని వేలాడదీసుకొన్న
అలల్లో వస్తే

కాలయవనిక మీద
బీభత్స దృశ్యాలే కదుల్తాయి

## 5

వొక రాజకీయ వారసత్వ కొత్తబిచ్చగాడు
భుజం మీద నియంత శవంతో
వొక యుద్ధాన్ని
చేతిలో
పట్టుకుతిరుగుతాడు

దుఃఖ గాథా సప్తశతి
కళ్ళలోంచి
ఎగిరిపోతున్న కుర్చీ!

ఆత్మగౌరవాన్ని
అమ్ముకున్నవంతలతో
వొక పీడిత భూమి గుండెల మీద
కూర్చొని
పట్టాభిషేకం
తల మీద వాలేలా
వలపోతల ఎత్తిపోతలతో
ప్రత్యేక ఆకాంక్షల పక్షిని
పంజరంలో
బంధించాలనుకుంటాడు

## 6

ఈ మట్టి
మొహంలో లేదు
ఈ మట్టి
మైకంలో లేదు
తరతరాల
దోపిడి సమైక్యపొరలవలయాల్ని
ఒల్చుకుంటు ఒల్చుకుంటు
తేనెపూసిన మాటల్ని
మంటల్లో నిగ్గుతేల్చి
అంతరంగంలోని
విషభాండాన్ని
ఎక్స్‌రే తీస్తుంది
గాయాల మీద
మెరుపు కలలు అతికించి
భూత భవిష్యత్తులను
మాయం చేసే
ఓదార్పుల ఇంద్రజాలం పిచ్చికి
వైద్యురాలై నిలబడుతుంది

## 7

పునాదులు
శిల్పాలు
స్తంభాలేనా
ఇప్పుడు
రాళ్ళు
ఆయుధాలు!
రాళ్ళు
మట్టిచేతులు కాల్చిన తూటాలు
రాళ్ళు
మిస్సైళ్ళు
రాళ్ళు
రాకెట్లు
రాకెట్ లాంచర్లు
ఉద్యమ కర్మాగారం
ప్రజల చేతికిచ్చిన వజ్రాయుధాలు
రాళ్ళు
నిస్సహాయంగా రాలిన
ప్రజల కన్నీళ్ళు
రాళ్ళు!

రాళ్ళు
ప్రజల వాటర్ కేన్లు!

వేటగాడి నైపుణ్యాన్ని
పావురాలు పసిగట్టాయి

చరిత్రా!
చెప్పు
సమైక్య సింహాసనం విద్రోహాల్ని

## 8

నవ్విస్తావో
కవ్విస్తావో
కౌగిలిస్తావో
కంపించేలా కవాతు చేస్తావో

కత్తిదిగిన భాగం సలుపుతూనే ఉంది
వొక జాతితో
నెత్తుటి క్రీడేనా

రూపాయి తల మనుషుల
జనగణల్తో
వస్తావా!
రా!
ఈ నేల పొక్కిలి చేస్తూరా!
ఈ శవాల్ని దాటిరా!
దోచుకోవడం
జీవితమైనవాడా!
దోచుకోవడం
రాజ్యాంగమైన వాడా!
దోచుకోవడం
రాజ్యమైన వాడా!
రా!
దోచుకోవడం
న్యాయస్థానమైనవాడా!
మాంసఖండాల్ని మింగుతున్న
కొండ చిలువైన వాడా!
రా!
జనపథ్, 10కు
బహుశా
ఓటుకన్నా
ప్రజాభిప్రాయంగా చేతికందింది
రాయే!

## 9

కాలం కదిలినట్టు

రైలు కదులదు కదా!
తొవ్వలో
భువనగిరి దాటాక
వంగపల్లి లొంగదీయకుంటే
ఆలేరుంది
జనగాముంది
స్టేషన్ ఘన్‌పూరుంది
ఖాజీపేటుంది
వరంగల్లుంది
నెక్కొండుంది
కేసముద్రముంది
పల్లుంది
పట్నముంది
ఇన్ని మానవహారాలు చితికితే కదా
దండయాత్ర
మానుకోట చేరేది

ఉద్యమకారుని తురాయి
నిరసనరాయి!
మానుకోట!!
ఈ నేలింకా
యుద్ధంలో
అలసిపోలేదు

## 10

సమైక్యవాదవంతలారా!
దోపిడి అనుచరులారా!
హింస ప్రేమికులారా!

ఆ చేయి
ఎవరిదైతేనేం
కాల్చండి
ఇంకా
కాల్చండి

దోపిడి చేయితో కాల్చు
పీడన చేయితో కాల్చు
అణిచివేత చేయితో కాల్చు
భూస్వామ్యం కోసం
ఫ్యాక్షనిజం కోసం
పెట్టుబడిదారితనం కోసం
కాల్చండి
కొండ చెయ్యేకావొచ్చు
ఇడుపులపాయ చెయ్యే
కావొచ్చు

కాల్చండి
తెలంగాణను
కాల్చండి
స్వేచ్ఛాగీతాన్ని
కాల్చండి
ఎండల్ని ఎత్తిపోస్తూ
ఎదురునిల్చిన
సబ్బండ వర్ణాలెత్తిన
జండాని కాల్చండి
హత్యలు
మీకెవన్న కొత్తనా?

## 11

ఈ నెత్తురు
అంటరాని వాసనేస్తోంది

ఈ రక్తం
తండాపరిమళాలు వీస్తోంది
ఈ రుధిరం
రాలిన నెలవంక చెమట చుక్కల
రాజస పోతోంది

మానుకోటా
మట్టి తల్లీ!
మట్టి మనుషుల
మనసును
పుష్పించే దానా!
మహాపథికుల
పోరుపాలపుంతైన దానా!

పోరుగందమా!
యుద్ధకరవాలమా!

వందల కిలోమీటర్ల ఊడల మఱ్ఱై పాకిన
సుబ్లేడు ఫిర్కా, పిండిప్రోలు
కాకర్లాయి, గార్ల
పెద్దముప్పారం, కుమ్మరికుంట్ల
మరిపెడ, మానుకోట
భూస్వామ్య దేశ్‌ముఖ్‌ల
తరతరాల గడి కూల్చిన

తడి చేతుల నెత్తుటి ప్రసారమా!

ప్రేమలు తెల్సు
యుద్ధాలు తెల్సు
పంచవర్ణాలను చల్లుతున్న
వలలోంచి
వొక కలను
గుండెల్లో జీవనది చేయడం తెల్సు!

ఎత్తుల జిత్తు గులాబి
చెబితే వచ్చేదా
గుండెకు గుండెకు పోరుపట్టాలేసిన
ఈ నేల పొరల్లో
సలసలకాగే వేడి నెత్తుటి
జల ఉంది
గ్రానైట్ కాదు
గంధకపు కొండలున్నాయి
ఇనుపగుండ్లున్నాయి

## 12

కడుపు కోతలు
ఇవ్వాలేనా -
ఆద్యంతం!

నటనలు
నయవంచనలు
చెమట చుక్కల పరిహసించే
రాక్షసత్వం!

సముద్రపు హోరులో
ఈ నేలను విన్నదెవరు?
విముక్త పురిటినొప్పుల
ఈ నేల రక్తం నటించదు

పండించిన చేతులే
గింజమీద వాలాలి!

వక్రవాద సమైక్య మర్యాదల్లో
ఇక
తడువలేం!

మట్టిమనుషుల తిరుగుబాటు
ఈనేలిప్పుడు
సూర్య తుఫాను

ఈ నేలిప్పుడు
సూర్యసునామి

ఈ నేలిప్పుడు
చుట్టు ముట్టిన విద్రోహం - అభిమన్యుడు - నడుమ

ఇప్పుడు
గుండె గుండెలో
మానుకోట రాళ్ళు!
ఇంటి ఇంటికి
ఉద్యమ కళ్ళు
మీ గుండెల్లో రైళ్ళు
మానుకోటా
మట్టి తల్లీ పోరుపాలవెల్లీ!
దండం బెడుతాన!

# తెర్చిన రెప్పలతో వీక్షిస్తా

- సముద్రుడు

నూతన సమాజ నిర్మాణానికి
స్వేచ్ఛా విహంగంలా
విహరించిన నాకు
అలుపు... సలుపులు తీర్చి
పని పాటు పాటలచే
సాంతన కూర్చిన పల్లెతల్లులు
అడవి మల్లెల
వడుల్లో..
సేదదీరిన నాకు
మూసిన కండ్లు తెర్చినంతగనే
పల్లె తల్లులకు
అడవి మల్లెలకు దూరంగా
రెక్కలు విరిచిన పావురంలా
బందీకాన గొంతుకనయినాను
బందీకాన బద్దలయ్యేలా
యుద్ధగీతమాలాపిస్తా
స్వేచ్ఛకై నినదిస్తా
నూతన శిశువును
దోసిట్లోకి తీసుకోవడానికి
తెర్చిన రెప్పలతో వీక్షిస్తా

# మూడింట ఒక వంతు

- ఎం. రావు

రక్త తైలంలో
జీవనాడిని వత్తిని చేసి
మానవ మందిరాన వెలిగించిన అలౌకిక దీపం
చీకటిని చిమ్ముతుందే తప్ప
వెలుగును వర్షించదు
వందల ఏళ్లగా
మస్తిష్కపు పొరలలో నిక్షిప్తమై
మానవత్వాన్ని మంటగలిపే మత్తు
సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని సమాధి చేసి
బతుకును బుగ్గి పాల్జేస్తుందే తప్ప
మనో వికాస పుష్పమై వికసించదు
ఆత్మీయతా తాయత్తై
తన చేతికి నేను చుట్టుకున్నా...
నా నుదిటన విద్వేష విభూది ఐ
తలరాతను మార్చాలని చూస్తుంది
ఉపవాస దీక్షానంతరం నేను ఆరగించే హలీమ్‌లో
అనుమానపు ఉండ 'రాళ్లై' అడ్డు పడుతుంది
చంద్రుడ్ని చూసి నేను చేసే విందును
నీలాపనిందల పాల్జేస్తుంది
మసీదు ప్రాంగణంలో మొక్కై మొలిచి
మతోన్మాదపు మానై వేళ్లూనుకుంది
చరిత్రను వక్రగతి పట్టించి
సాక్ష్యాలను చీకటి పాల్జేసి
విశ్వాసానికి ఊపిరిలూది అదే
నిజమని నిగ్గుతేల్చి
రాజ్యాంగపు చ(చు)ట్టాల కత్తివేటుతో
మూడింట ఒక వంతును మిగిల్చింది
మసీదు, మందిరాలలో మసిలే
మతసామరస్యపు కపోతం
రెక్కలు తెగిన ప్రజాస్వామ్యపు పక్షై
కుళ్లిన శవం కంపుకొడుతుంది

# యుద్ధం మల్లె పరిమళం

- మాతంగి

మాట మీద నిలబడ్డారు కాబట్టే
వాళ్ళు యుద్ధంలోనే మరణించారు
రాబోయే తరాల నిరంతర స్వేచ్ఛా ప్రవాహాల కోసం
నీళ్ళలో కలిసిన చితా భస్మాలైనారు
స్వచ్ఛమైన జీవితాల కోసం
నింగి ముఖంలోకి జొరబడి అమరత్వం పొందారు
వేదనాభరిత గానాల మధ్య
రక్తసిక్తమైన దేహంతోని కదులుతూ
ఉదయిస్తున్న కిరణాలలో వెలుతురై
కాలం తనువు మీద శాశ్వత సంతకం చేసి
మట్టికి అల్‌విదా చెప్పి ఆసాంతం కరిగిపోయారు
మాట ఇచ్చి నీతి తప్పే
భేషరం నామధేయులు కారు
బంగారం తీగల్లాగా సాగిపోతున్న సాయంత్రాలలో
జల్సాలు చేసే బడాబాబులు కాదు
యుద్ధం చేస్తూ
యుద్ధంతోనే వీరత్వం పొందుతున్న
అడవి మల్లె సువాసనలు
చాన్పు చల్లిన ఇంటి ముందట
దోసిళ్ళ కొద్దీ ముగ్గులు పెడుతున్న
అవ్వ చూపుల్లోకి జారినవాళ్ళు,
మాటలు తెగిపోయిన నాలుకలు
నేలమీద కొట్టుకుంటున్నవేళ
గొంతులై నినాదాలిస్తున్న వాళ్ళు
పుట్టిన చోటునుంచి యుద్ధభూముల దాకా,
ఒకే నడక
తప్పటడుగులు లేని లయాత్మక నడక
కన్నీళ్ళతోని పచ్చిగైన మైదానాల వెంట నడుస్తూ
వెలలు కట్టబడ్డ తలల్లోకి
చెల్లా చెదురైన కలలు దూరకుండా
ఎప్పుడూ తన్మయత్వ ఊహల్లో కదిలేవాళ్ళు
అన్ని రుతువుల్లో విరగపూసే పూల పరిమళాలు
కొత్త సమాజం కోసం
మెడలో మృత్యువును వేళాడదీసుకొని
నడుస్తున్నవాళ్ళు
జయాపజయాల మధ్య వంతెనల ముళ్ళు
మొలుచుకొస్తున్నప్పుడు
పాదం తొణకకుండా కదిలే
పవన మార్గాలు!
(ఆజాద్ స్మృతిలో...)

# రాయినిగూడెం నల్గురు అక్కా చెల్లెండ్లు

- ఎం.ఎ. బాసిత్ కవితలు నాలుగు

వేల గన్నుల దన్నుతో
పీతపదిల నజర్‌తో..

బైలెల్లిన
వలసాధిపత్య రథం....
ఒక్క గుండె బలంతో
చిత్రైన చోద్యం !

మానుకోట కాంప్లెక్స్
వదలక ముందె
రాయినిగూడెం రచ్చబండను
చాటు చేసుకున్న
పాలక ప్రాణ భీతి
పాదరక్షల్ని నిషేధిస్తుంది.

బుష్‌లకు
బుద్ది చెప్తున్న చెప్పు....
వరంగల్లులో
వడెసెల రాళ్ల జల్లై
పాలక గుండెను
ఎప్పటిలా
ఘల్లు మనిపిస్తుంది.

వాటా, కోటా, మాటా, పాటా, ఆటా అన్నీ
ఏటేటా
"పోటా" పోటీగా
రద్దు చేస్తున్న పాలక హస్తం
పిల్లికి బిచ్చం సంక్షేమం విసిరి....
ఆత్మహత్యలు అలుముకున్న
నేల తల్లికి క్షామం కురిపిస్తుంది.
సమ్మక్క, సారమ్మలను పూనుకున్న
గుర్రం కవిత, గుగులోతు జ్యోతి
మాస సావిత్రి, డోనేటి కృష్ణలత

- - -

నల్గురు అక్కా చెల్లెండ్లు
నాలుగైదు వందల
కూలీనాలీ అమ్మలక్కలు
పాదరక్షలు, రక్షణ కవచాలు
అక్కర లేకుండానే........
ఇనుప బూట్ల
బూటక సమైక్యాన్ని
పిచ్చి ముదిరి, రొచ్చు బండ నెక్కి....
చిచ్చు బెట్టడాన్ని
చీల్చి చెండాడుతారు!

ఇప్పుడిక
భూగోళమంతా ఒక్కటే కాంక్ష.....
తిండి, స్వేచ్ఛ, గౌరవం....
వంచన
దగ్ధ మవుతున్న కాలం...
ట్యునీషియా,
ఆల్జీరియా,
పాలస్తీనా,
బహ్రెయిన్,
యెమన్,
లిబియా...
అరబ్బి గుండెకు
మురబ్బా తినిపిస్తున్న కాలం....
నియంతల్ని
రాలగొడుతున్న కాలం...
ఈజిప్టు
స్వేచ్ఛాకూడలై
తెలంగాణను
నిర్దిష్టం చేస్తున్న
గ్లోబల్ సంగ్రామం,
నల్లబైమిలియన్ల
నవ్య చేతనా కూడలిలో
వలస పాలక పీఠాన్ని
దగ్ధం చేస్తుంది.

# కూలిపోతున్న పీఠం...

కడుపుల
పెట్టుబడి యిసం...
నాల్క మీద
సింథటిక్ ఆదర్శాల మధురసం
లోకంలోని సత్తా ఆసాంతం
కూకట్‌పల్లి కులం కాలని పత్తాదారుడికే సొంతం !
బీటింగ్ ఆరౌండ్ ద బుష్
కబుర్లకేం కొదవగాని...
కుబుసం విడిచిన నాగు
కక్కింది వలస పాలక సొల్లు...
ఏనుగంత రాజ్యాంగ పూజారికి
యాభై నాల్గేళ్ల
రాజ్యాంగ ఉల్లంఘనలు
కండ్ల కానరావు పాపం !
సమైక్య దోపిడి కాల్చిన
బడుగు బతుకు సెగ
ఇన్నేళ్లైనా

వలస దోపిడి తొత్తు గుండె తాకదు శాపం !

గీళ్లు చెప్పె
గా రాజ్యాంగ మీదనె కద,
గీ పెద్ద మనుషుల బాసలన్ని ?
ప్రవచనాలన్ని పాతరేసిన
సమైక్య పరిహాస ప్రహసనం
ఇంకెన్నాళ్లని.....
ఉసురు తీసుకొని
విద్యార్థి పీనుగ లెన్ని లేసినా..
కడుపు కోతల
సంద్రాలెన్ని ఎగిసినా....
కనికరించని
బ్యూరోక్రాట్ కుత్సితం,
కూలిపోతున్న నియంతల
పీఠాల సాక్షిగ
స్వాభిమానం
స్వపరిపాలన కాంక్ష
జాతి ద్రోహమంటుంది.

- - -

బతుకు పోరాటమే
'అంతర్గతముప్పని'
పూట పూటకో
కలంపోటు పొడిచి పంపె ఘాతకుని
కుర్చీ తన్ని పడేసిన తెగువను
ప్రజాస్వామ్య విఘాతమంటుంది...

గందుకే
నాలుకోట్ల గుండె మంటల సెగ
మల్లేష్ ముష్టి ఘాతమై
పాలక వ(ల) స పిట్ట
మెడమీది మెడుల్లా
నాడీ సంచయాన్ని తెంచి
శుష్కప్రియ వంచనను
పటా పంచలు చేస్తుంది.
అక్షరాలు సవరించుకుంటున్న
నయవంచక నాల్క
మరో కుటిల నాటకానికి
బేరం కుదుర్చుకుంటుంది.

మళ్ళీ చెప్తున్న.....
నియంతలు రాలిపోతున్న కాలంలో
బూటక సమైక్య స్వామ్యం
నాటక ప్రజా సంక్షేమ ప్రహసనం
మస్సై పోతాయి.
నూతన ప్రజాస్వామిక
మందారాల్ని పూస్తయ్..

# జాత్యహంకారతీర్పు

భయ విప్వాల నిజం !
విశ్వాస బురుజుల మీదనే
మరో వికృత విశ్వాసాధిపత్య అహం
విలయతాండవం చేసిన
విధ్వంసక రుజువు....
అలహాబాద్ హైకోర్టు లక్నో బెంచ్
పవర్‌లెస్‌పూర్ ఫెలో ముఖమ్మీద
ఇచ్చిందొక పవర్‌ఫుల్ పంచ్...
మధ్యయుగ భూసుర న్యాయం,
మెజారిటీ మత మౌఢ్య దుడ్డున్న బలిశాలి
భుజమ్మీది
భుజంగానికిచ్చిందింకొక భుజ కీర్తి.

గుజరాత్ గాయమై
కెలికిన కర్కశ శాడిజం,
భైంసా దుర్గామాత ఊరేగింపై
జుమ్మా నమాజు
నిర్మల ధ్యానంలో చొరబడి
మృత్యు ఘంటికలు మోగిస్తుంది.
పటోలి దళిత ఇంటి దాపు దర్జీ
చేతి వైద్యపు మహమూద్‌ను,
పేగు బంధపు కూనలనూ
విడవని ఉన్మాదం,
కాళ్లు చేతులు నరికి
అక్కడో ముక్క.... ఇక్కడో ముక్క.
విసిరి వేస్తుంది.
ఉన్మత్త చిత్తం
తెగ్గోసిన అంగాంగం
మెరిపించిన ఎరుపుకు
జడిసి,
కాల్చి బూడిదనూ చేస్తుంది.
పిండాల్ని చీల్చిన చేతులకు
కాల్చడమొక లెక్కా !
గాయం చేస్తున్న చేతులకు
డబుల్ ధమాకా
కానుకలిస్తున్న కోర్టు తీర్పు ముందర....

వెంటాడుతున్న
చేదు జ్ఞాపకాల దొంతర....
విద్వేషాగ్నుల కుంభవృష్టిలో
ఖత్నా చేసుకున్నోడల్లా
ఆల్‌ఖైదీ ముతాలిబో,
ఆల్ ముజాహిదీనో,
తప్పించుకు తిరుగుతున్న తాలిబనో
అయిపోతున్న భయోత్పాతం.

"పదుగురాడుమాట
పాడియై ధరజెల్లు ..."
ఔరా !
లోకరీతి నీతి సైతం
బుసకొట్టె పామై
విషం చిమ్ముతున్న విషాదం !...
ఇవ్వాళ
అఖండ భారత దర్శకుల నేతృత్వంలో
ఖండ ఖండాలుగా తెగిపడ్తున్నది
ముస్లిం బడుగు బతుకు.
భద్రత గ్గైబెన
"గలీజు" గరీబు సాయెబు బతుక్కు
ఏ కోర్టు హామీ పడదు.
ఇప్పుడిక,
తెగిపడ్డ ఒక్కొక్క
అమాయక మాంసం ముక్క
నిగ్గదీస్తుంది
జాత్యహంకార దౌష్ట్యాన్ని

# కట్టమైసమ్మ సాక్షిగ

కూలినవి
అంతర్గత వలస దూరాక్రమణ పతాకలు...
చినిగినవి
యాభై నాల్గేళ్ల ఆధిపత్య కుబుసాలు...
కాదంటరా,
సమైక్యవైతాళికుల
ముఖారవిందాల్లో
మహనీయత సంగతేమోగాని
నిలబెట్టినోళ్ల రూపు రేఖలె
కనిపించబట్టె...
తెల్లోడ్డిదైనా
నల్లోడ్డిదైన
దొరతనమెవ్వడ్డిదైన

మర్లబడ్డ జీవగడ్డ..
గడీలు కూల్చిన తెగువ
సాక్షమిచ్చినా,
కండ్ల గానని
ఆధిపత్య ఛత్వారం...
లేదంటరా,
పాల్కురికి సోమన...
సమ్మక్క - సారక్క...
కొమురం భీం...
తుర్రెబాజ్ ఖాన్...
చాకలి ఐలమ్మ...
దొడ్డి కొమురయ్య
షేక్ బందగీ....
వట్టికోట ఆళ్వార్...
యాది గురుతులకు
ఉమ్మడి వారసత్వ శకలాల నడుమ
ఇప్పటికైనా
కాసింత జాగిస్తరా?
మా మట్టి మనుషుల ప్రతీకాత్మలకు
మీ మది గదిలో
చోటెక్కడుంటదిగని...

పెంపు జేసిన నేలతల్లి
కండ్ల ముంగట్నే...
కన్న బిడ్డల్ని కడతేర్చిన "కల్చర్"
కట్టమీద కన్నపేగు గుర్తుల్ని
కనబడనియ్యని "నెనరు"
కలోగంజో తాగి
బతకనివ్వని
వలసదోపిడి...
వలసపాలన రేపిన
కడుపు మంటల భాస్వరం...
పెట్టుబడి చిమ్మిన
విషం దాల్చిన
గరళ కంఠుల
ధర్మాగ్రహ ప్రకటన...
ప్రజాకాంక్షల
ప్రళయ కాల గర్జన...
సుదీర్ఘ నిగ్రహానంతర
రుద్ర తాండవం...
ఓ జవాబు...
ఓ ప్రతి చర్య...
నిగ్రహ విగ్రహ
నీతి వాక్యాలు సరే...

వలసాధిపత్యం సంగతో?
ప్రకృతితో పరాచికాలాడ్డం
ఎందుగ్గని,
దోపిడి ముల్లెలు
సర్దుకునే దెప్పుడో...

# మిగిలిన నేను

**- పాణి కవితలు 4**

చివరి మెట్టు మీద నిలబడి
భూగోళాన్ని ముట్టుకున్న సాహసి వొకడు
రచించిన గాథ ఇది

గెలుపు ఓటముల నిమిత్తం లేక
తల ఎగరేసి నిలిచిన
జీవిత ప్రయోగంలోని ఒకానొక అంకమిది

కొండగాలి సుడిరేగి
తరతరాల విషాదపు జీర వలె ఎగసి
నేలపై సొమ్మసిల్లిన విశ్రాంతి గడియ ఇది

పునఃపున:
పునరావిష్కారమవుతూ దు:ఖసంజెలో తెప్పరిల్లి
ఇక్కడ దెబ్బతిని మరోచోట కాచుకొనే మజిలీ ఇది

లోలోపలి మానవులనూ
అంతరాంతరాల్లో పెనవేసుకున్న సజీవ చరిత్రనూ
ఏమరపాటున ఉన్నప్పుడు ఒకే ఒక దు:ఖమై గుండెలను ఎగదన్నే జ్ఞాపకాలనూ
సర్ర్...న వొరుసుకపోతున్న కన్నీటి జడి ఇది

అందరూ దూరమైనా
ధిక్కారమొక్కటే తదుపరి దీర్ఘయానం

ఈ యుద్ధపు కార్చీకటిలో
బరిగీసి నిలిచిన ఆదిమ మానవుడే ఇప్పటి ప్రత్యామ్నాయం

జీవితం తెలిసినంతగా
మరణం తెలియకపోవడమొక చిరంతన

ఇక నేనూ
అంతర్జ్వాల వలె నల్లమల

# దు:ఖం మిగలడం మంచిదే

నిన్ను ముట్టుకోగానే
నాలో దు:ఖం కదిలాడింది
నన్ను చూడగానే
నీలో కన్నీరు పారాడింది

మాటలు లేకపోయినా ఫరవాలేదు

పంచుకోడానికి ఏమీ మిగలకపోతేమానే
దు:ఖం మిగిలే ఉంది గదా
కోపంతో కూడిన మాటల కంటే
మౌనమే మంచిది
గడిబిడిగా అరుచుకోవడం కంటే
దు:ఖమే మంచిది

దు:ఖమొక ఎడతెగని బంధం
కన్నీరెన్నటికీ ఇరిగిపోని విశ్వాసం
ఎల్లవేళలా ఉద్వేగాల్లో వెల్లువెత్తడమెందుకు?
స్థిమితంగా జీవితామూలాగ్రం పరికిద్దాం
క్రీనీడల దాపున సత్యమెంతో కొంత
మిగిలే ఉంటుందని సందేహిద్దాం
ఈ పూటకిక మాటలు లేనట్టనిపించినా
రేపటి బృందగానానికి ఎదురుచూద్దాం

దు:ఖం మిగిలి ఉందంటే
వారధి ఉన్నట్లే
కాసేపు కన్నీరు కార్చాక
మళ్లీ మాటలు సాగవుతాయని నమ్ముతున్నట్లే

# చూపులనేకం

ఎపుడైనా తొంగి చూసుకున్నావా?

చుట్టూరా మారుమూలలా
దిగంతాలకావలా
తరచి చూచే చూపులనేకం

విడిగా, కలివిడిగా
ఒక్కొక్కరినీ సమూహాన్నీ
ఈ కొన నుంచి కడ బిందువుదాకా

తరచి బొమ్మకట్టించే చూపులనేకం

ఎపుడైనా నీలోనికి తొంగి చూసుకున్నావా?

గతిలో గమనంలో
పలు వృత్తాలనూ ఇతివృత్తాలనూ
పరిగెత్తి వెళ్లి చూపులలోకి అనువదిస్తావుగదా
ఎపుడైనా అంతరాంతరాల్లోకి చూపులు విసిరావా?

అగాథంలోకీ అల్లకల్లోలంలోకీ
సుడిబడ తిరిగే జన సమర్దంలోకీ
ఏది ఏమిటో తెలియని గజిబిజిలోకీ
మాటల మాయా జాలంలోకీ
పోరెత్తే నీ చూపుల నది
ఎపుడైనా నీలోకి చల్లగా జారి సేదతీరిందా?

నీ పలుకుల అర్థాన్నీ
నీ గొంతుకలోని స్వరాన్నీ
నీ ముఖ కవళికల వర్ణాన్నీ
నీకే తెలిసిన నీ అంతరంగాన్నీ
నీవెపుడైనా చిత్రికపట్టావా?

చూపులనేకంలో
నీ జాడ పట్టించే చూపు కోసం
నీవెపుడైనా వెతికావా?

# నేచూసినవి

నేల ఈనడం చూశాను

ఆకాశంలో జెండాల రెపరెపలు మేఘసందోహమైనప్పుడు ఊరూరా తెప్పలుగా చెరవు నిండాయి. మేఘమాలకూ, అలుగుపారుతున్న చెరువులకు ఉన్న బంధం చాటడానికి ఒకటే పోటీ. ఉద్వేగమొక్కటే తొలి తుది సూత్రీకరణలకు అవధి. అంతా ఐదు వేళ్ల మధ్య ఉన్నట్లు అతిశయవాదం ఉప్పొంగింది. చలనమే ఒక వైరుధ్యమని తెలుసుకొనే లోగా తనకు తానొక వైరుధ్యమైపోవడం నేను కళ్లారా చూశాను.

చరిత్ర త్రుటిలో జరిగే ఘటన కాదుగదా?

పడి లేచే చరిత్ర ఎన్నటికీ పూర్తికాని పాఠం. వేయి చేతుల సృజన కార్యం. లక్షోప లక్షల కాళ్లలపు తొక్కిసలాట. ఎంతగా దృశ్యమానమౌ అంత నిబిడం. కూలిపోయినప్పుడు, చెల్లాచెదరైనప్పుడు పెటిల్లున వేనవేల రూపాల్లో, మార్గాల్లో దిగంతమంతా విస్తరిస్తుంది. త్యాగం విలువగానే గాక ప్రయోగం కూడా అవుతుంది. శిరస్సు పతాకంగా ఎగురుతున్నప్పుడు ఉద్రేకపడి, చేజారిపోతున్నప్పుడు దారి తప్పిందనడం నేను పదేపదే చూశాను.

చరిత్ర ఇచ్ఛాపూర్వక పరివర్తన కాదుగదా?

అయితే అన్నీ అయినట్టు, కాకపోతే ఏమీ కానట్టు. ఒక క్షణాన సర్వమూ సామాజికం...మరు క్షణాన అంతా వైయుక్తికం. మేథో తలమేదో...పామరోచితమేదో తెలియకపోవడం కన్నా విషాదమేమున్నది. బట్టబయలు నుంచి ఒంటరి బొరియల్లోకి రూపాంతరం చెందడం ...కొంపతీసి కాలం కలిసి రావడం కాదుగదా? పొగ మంచు తెరల్లోనే కకావికలమైన వైరాగ్య భావుకులను బాధాతప్త హృదయంతో చూశాను.

చరిత్ర శుద్ధ నైరూప్య చిత్రం కాదుగదా?

ఒక దు:ఖం నుంచి మరో దు:ఖానికి చేసే ప్రయాణమిది. సుభాషితాతోపోసగదు. ఉత్పత్తిదాయకమైన మాటలే మనిషి ఆకృతి. కాళ్లూ చేతుల శ్రమే ఆలంబన. కంటికి కనిపించేవాటి గురించి ఎంతైనా చెప్పవచ్చు. కరిగిపోయిన సూర్యోదయ కాంతి, పూచిన తొలి జాముకే రాలిపోయిన పువ్వు, ఎన్నటికైనా సాకారం కావల్సిన స్వప్న భారం...దగ్గర కావడం ఏమిటో...దూరం కావడం ఏమిటో తెలియని దృశ్యాదృశ్య మీమాంస ఎల్లెడలా ఆవరించడం నేను దగ్గరిగా చూశాను.

చరిత్ర అంటే - మానవ కర్తృత్వం నిజం చేస్తేఅట్టడుగు తలంలోని సజీవ నిర్మాణం కాదా?

☆

## సవరణ

*అరుణతార నవంబరు - డిసెంబరు 2010 సంచికలో భారత్ - ఆజాదీ - వర్ధిల్లాలి! శీర్షికతో ఉన్న మానేపల్లి వ్యాసంలో పేజి నెం. 22 చివరి పేరాలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంతో చర్చలకు వచ్చిన విప్లవ పార్టీల ప్రతినిధుల పేర్లు తప్పు వచ్చాయి. మావోయిస్టు పార్టీ ప్రతినిధులుగా ఆర్.కె., సుధాకర్, గణేష్‌లు పాల్గొనగా సి.పి.ఐ. (ఎం.ఎల్. జనశక్తి) ప్రతినిధులుగా అమర్, రియాజ్‌లు పాల్గొన్నారు. సరిజూసుకోగలరు. పొరపాటుకు చింతిస్తున్నాము.*

- సం

వ్యాసం

# బొవజిజి తెచ్చిన టునీషియా విప్లవం

- ప్రశాంత్

'వీధుల్లో విషాద ప్రదర్శన సాగుతున్నది
కనుపాపల లోగిట్లో కాంతి చివరి ఆర్తనాదం చేస్తున్నది
బహుశా
స్వరం తన చివరాఖరు మాటకోసం వెతుక్కుంటున్నది
ఇప్పుడు నేనిక మాట్లాడకపోయినా స్వరపేటిక తన బాధను మోస్తున్నది
మాట్లాడితే దాని బాధ కొంచెమైనా మీకు తెలుస్తుంది కదా'

ఉత్తర అరబ్ ఆఫ్రికాకు చెందిన మహిళా కవి తన ఆవేదనను ఇట్లా పంచుకుంది. బహుశా ట్యునీషియాలో ఆత్మహత్య చేసుకుని దేశాధ్యక్షుడి పలాయనానికి కారణమైన నిరుద్యోగ యువకుడు బొవజిజి కూడా ఇట్లాగే అనుకున్నాడేమో తెలియదు. కాని, బొవజిజి మరణం తర్వాత ఆయన తల్లి తన పేగు తెగినా ప్రజాగ్రహానికి కొడుకు కారణం కావడం ఆనందంగా ఉంది అని ఒక పత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో పేర్కొంది. దొడ్డి కొమరయ్యలాగా బొవజిజి తనకు తెలియకుండానే ప్రపంచ విప్లవ చరిత్రలో స్థానం సంపాదించుకున్నాడు. సాధారణ కుటుంబంలో పుట్టిన బావుజిజి తన భూమిని బ్యాంకు అధికారులు స్వాధీనం చేసుకోవడంతో ఉన్న ఒక్కగానొక్క జీవనోపాధి పోయింది. డిగ్రీ చదివినా ఉద్యోగం లేకపోవడంతో తోపుడు బండి పెట్టుకుందామనుకున్నాడు. అందుకు స్థానిక కౌన్సిల్ అనుమతించలేదు. చివరకు ఆత్మహత్యను ఆశ్రయించాల్సి వచ్చింది. వంద గొడ్లను తిన్న రాబందు ఒక్క గాలివానకు నేల కూలుతుందంటారు. బొవజిజి ఆత్మహత్య అనంతరం వెల్లువెత్తిన ఆందోళనలతో ట్యునీషియా అధ్యక్షుడు దొడ్డిదారిన పారిపోయాడు. జాస్మిన్ విప్లవం అరబ్ ప్రపంచానికి, ఫ్రెంచ్ పెట్టుబడిదారులకు ఒణుకు పుట్టించింది. జాతీయ పుష్పం పేరును మార్పుకు చిహ్నంగా మార్చుకున్నారు. సామాన్య ప్రజలు దేశాధ్యక్షుడి బావమరిదిని సజీవ దహనం చేశారు. అరబ్ ప్రపంచానికి విప్లవం అనే మాట పొసగనిదీ... అంటనిదీ అనే భావన ప్రపంచవ్యాప్తంగా ఉంది. చెక్కు చెదరని భూస్వామ్యంతో చెట్టాపట్టాలేసుకున్న ఫ్రెంచ్ పెట్టుబడిదారుల దోపిడిని ప్రజలు ఏళ్ల తరబడి సహించి చిట్టచివరిగా విప్లవాన్ని ఆహ్వానించారు. విప్లవాలకు గత చరిత్ర ఉండనవసరం లేదు. అప్పటికప్పుడే పుట్టి పాలకుల ముక్కు నేలకు రాయించిన ఉదాహరణలు కోకొల్లలు. ట్యునీషియా అతి చిన్న దేశం. కోటి మూడు లక్షల జనాభా గల ట్యునీషియాలో అపారమైన సహజవనరులు ఉన్నాయి. 13 వందల కిలోమీటర్ల తీరప్రాంత సారవంతమైన భూమి ఉంది. బ్రెడ్ బాస్కెట్‌గా పిలిచే టునీషియా ప్రాచీన నాగరికతా చరిత్రలో ప్రముఖ పాత్ర పోషించింది. సాంస్కృతిక భిన్నత్వం ఉంది. అటు అరబ్ లీగ్‌లోనూ ఇటు ఆఫ్రికన్ యూనియన్‌లో ట్యునీషియా భాగంగా ఉంది. కార్తేజియన్, రోమన్, ఇస్లాం ఒట్టోమన్ రాజ్యాల పాలనలో మగ్గిన టునీషియా రెండో ప్రపంచ యుద్ధం కాలానికి ఫ్రెంచ్ వలసగా మారింది. ఫ్రెంచ్ బలగాలు ట్యునీషియాలోనే ఆశ్రయం పొందాయి. జాస్మిన్ విప్లవం మొదలవగానే దేశాధ్యక్షుడు కాలికి బుద్ధి చెప్పాడు. అరబ్ దేశాలూ, యూరప్ దేశాలు తమ ఉదాత్త బుద్ధి చాటుకుని ట్యునీషియాకు సహాయాలను ప్రకటించాయి. సాధారణ ప్రజాజీవనం దారిలోకి వస్తోంది. 23 ఏళ్ళు అప్రతిహతంగా పాలించిన బెన్ అలీ క్షేమంగా గల్ఫ్‌లో తలదాచుకున్నాడు. ట్యునీషియా భవిష్యత్తేమిటన్నదే ఇవ్వాళ్టి ప్రశ్న. సద్యోజనితంగా వచ్చే ప్రజాఉద్యమాల్లో... విప్లవాల్లో ఆలోచన కన్నా ఆగ్రహం పాలు ఎక్కువ కావడం సాధారణంగా జరిగేదే. అయితే ఇది అనారోగ్యకరమైందని కాదు. సామాజిక గతిశీలతపై ఉద్యమశక్తులకు ఉన్న అవగాహన ఏమిటన్నదానిపై భవిష్యత్తు నిర్మాణమవుతుంది. సద్యోజనిత ఉద్యమాల్లో ఏ ఏ శక్తుల ప్రాబల్యాలెంత అనే దానిపై విప్లవ ఫలాలు ప్రజలకు అందడమన్నది నిర్ణయమవుతుంది. జాస్మిన్ విప్లవంపై ఎవరంతకు వారు పొగడ్తలూ... వ్యంగ్య బాణాలూ విసురుతూనే ఉన్నారు. మధ్య తరగతి ప్రజలు ఫేస్‌బుక్‌లో పరిస్థితిని ఉన్నదానికన్నా ఎక్కువ చేసి చూపించడం వల్ల జాస్మిన్ విప్లవం వచ్చిందన్న హేళన చేసే వ్యాఖ్యలు వినిపిస్తున్నాయి. వీలైనంత వరకూ ప్రజాచైతన్యాన్ని విస్మరిస్తూ పోవడం అగ్రరాజ్యాలకే కాదు వాటి పౌరులకూ అలవాటు పడిన విద్య. టునీషియా అనగానే ఉండే తిరస్కార ధోరణి సర్వత్రా కనిపిస్తోంది కాని, ఆఫ్రికా గడ్డపై ఇతర దేశాల్లోని ప్రజలు కేఫుల్లో... హోటళ్లలో, వసిన్థలాల్లో జాస్మిన్ విప్లవం గురించి మాట్లాడుకుంటూనే ఉన్నారు. ఆ స్థితి ఇక్కడ కూడా వస్తుందనీ... రావాలనీ అనుకుంటున్నారు. అరబ్ దేశాల లీగ్ సమావేశాల్లో జాస్మిన్ విప్లవ ప్రస్తావన వచ్చింది. ఆ మాటకొస్తే ట్యునీషియానే కాదు కాళ్లకింది నేల గర్భంలో సంపద ఉన్న ప్రతిదేశంలోనూ దారుణ హింస చెలరేగుతూనే ఉంది. జోహన్సన్‌బర్గ్ ఉదాహరణ ఉండనే ఉన్నది. బోస్ట్వానా, అంగోలా, నమీబియాలలో సంపద ఉన్న కారణంగానే ఆయా దేశాలు పతనావస్థలో ఉన్నాయి. సంపద శాపంగా మారిన అనేక ఆఫ్రికా దేశాల్లో ఒకానొకటి ట్యునీషియా. 1956లో స్వాతంత్ర్యం వచ్చిందన్న మాటేగాని దాని ఫలాలు బెన్ అలీ ఆయన కుటుంబ సభ్యులు లేదా ఫ్రెంచ్ కార్పొరేట్ సంస్థలకు తప్ప ప్రజలకు అందలేదు. 23 ఏళ్ల పాటు బెన్ అలీ దుర్మార్గాలను

ట్యునీషియన్లు మౌనంగా భరించారు.

ఫ్రెంచ్ కార్పొరేట్ మార్కెట్ కూరగాయల ధరలను సైతం పెంచి మల మల మాడే స్థితి వచ్చిన తర్వాత దేశ భవిష్యత్తును వ్యక్తావ్యక్తంగా ఊహించినవాడు బొవజిజి పళ్ళబండి కోసం పెట్టుకున్న అర్జీ పత్రాలను కళ్లముందే చించేసిన తర్వాత ఇక బతుకు చీకటిని భరించకూడదనుకున్నాడు కావచ్చు. స్వయం హననంతో తన నిరసనను తెలిపాడు. అంతే దేశం యావత్తు బొవజిజి త్యాగాన్ని పిలుపుగా తీసుకున్నాయి. ప్రజలు వీధుల్లోకి వచ్చారు. ప్రజాస్వామ్య ముసుగు ధరించిన రాజభవనాలు ప్రజల నినాదాలతో దద్దరిల్లిపోయాయి. బెన్ అలీ పలాయనం చిత్తగించాడు. బావుజిజి ఆత్మహత్య తర్వాత దేశ వ్యాప్తంగా ఆగ్రహజ్వాలలు చెలరేగాయి. ప్రభుత్వం ఉద్యోగాల కల్పన, ప్రజాస్వామిక సంస్కరణల హామీల ప్రవచనాలు మొదలుపెట్టింది, కాని ప్రజలు వీటన్నింటినీ తిరస్కరించారు. 1987లో అధికారంలోకి వచ్చిన బెన్ అలీ ప్రభుత్వానికి బయట రాజకీయ వర్గం ఎదగకుండా చేశాడు. ప్రతిపక్షాలను మాట్లాడకుండా చేసి పత్రికలూ, ప్రసార మాధ్యమాల నోళ్లు మూయించి తన నియంతృత్వాన్ని అమలు చేసిన బెన్ అలీని ప్రజలు ఇక క్షమించదలచుకోలేదు. అలీ నిరంకుశత్వం ఎంతటిదంటే వెబ్ సైట్లనూ, యూ ట్యూబ్‌ను సైతం నిషేధించాడు. ప్రజాందోళన చెలరేగగానే బెన్ అలీ రహస్య పోలీసులు సాధారణ పౌరుల వేషంలో, ట్యాక్సీ డ్రైవర్ల వేషంలో మూల మూలన పొంచి ఉన్నారు. వేటికీ ప్రజలు వెరవలేదు. ప్రజాందోళన మొదలవగానే అమెరికా, బ్రిటన్‌లలో ఊహాగానాలు మొదలయ్యాయి. బెన్ అనంతరం ఇస్లామ్ మతోన్మాదులు అధికారంలోకి వస్తారా... అన్న నిందార్థంలోని దొంగ ప్రజాస్వామ్యపు సానుభూతి మాటలు వినిపించాయి. జాస్మిన్ సైరన్ వినిపించగానే జర్మన్, ఫ్రెంచ్, రష్యా, బ్రిటన్ పర్యాటకులు కాళ్లకు బుద్ధిచెప్పారు. బడా బహుళజాతి సంస్థలు తమ భవిష్యత్తు గురించి బెంగపడుతున్నాయి.

బొవజిజి తన తల్లికి రాజకీయాలు నేర్పాడు. గోర్కీ అమ్మలో పావెల్ నేర్పినట్టుగా. ఆమె మాటల్లోనే చెప్పాలంటే "నా భర్త అప్పుడప్పుడు లిబియా పోరాటం గురించి చెప్పేవాడు... ఇప్పుడు ఇక్కడ అలాంటి స్థితి రావడానికి నా కొడుకు కారణం కావడం గర్వంగా ఉంది" అన్నది. బొవజిజి సంగీతం, సాహిత్యం, క్రీడలు, సమాజం వీటి వేటి పట్లా ఆలోచించినవాడు కాదు. ఆ మాటకొస్తే బొవజిజి జీవితం సృజనాత్మకతను చిదిమేసింది. తోపుడు బండి ద్వారా వచ్చిన ఆదాయంతో చెల్లెళ్ల పెళ్లిచేయాలనుకున్న సగటు మనిషి బొవజిజి. జాస్మిన్ విప్లవం ఎంత ప్రభావం వేసిందంటే ఈజిప్టులో ఒక కేఫ్‌లో డిగ్రీ చదివిన నిరుద్యోగ యువకుడు బొవజిజి ఆత్మహత్య వార్త విని "ఇలాంటి తిరుగుబాట్లు అన్ని చోట్లా వస్తాయి. వాటిని ఆపడం ఎవరితరం కాదు... ఇక్కడ తొంభై శాతం యువకులు ఉపాధి లేకుండా ఉన్నారు. నిరుద్యోగం సకల జీవన రంగాలను ప్రభావితం చేస్తున్నది. పెళ్లిళ్లు చేసుకునే స్థితి లేదు." అన్నాడంటే పరిస్థితి తీవ్రత తెలుస్తుంది. జాస్మిన్ విప్లవం అరబ్ దేశాల్లో, ఆఫ్రికా దేశాల్లో రాబోయే విప్లవాలకు వేగుచుక్క. సద్యోజనిత ఉద్యమాలు అంతిమంగా నాయకత్వలేమితో, అవకాశవాద వర్గాల చేతిలో అధికార రూపుతీసుకుంటాయి. విప్లవం అన్న మాట అధ్యక్షుడి పలాయనానికి చిహ్నం కాకూడదు. ఆయా సమాజాల్లోని ప్రజాస్వామిక శక్తులు నిర్ణాయక పాత్ర వహించి ప్రజాందోళనకు నిర్మాణ రూపం తీసుకురావాలి. అధికారం కోసం కాచుక్కూర్చున్న దోపిడివర్గాలను ప్రజాచైతన్యంతో నిరోధించాలి. నేపాల్ తర్వాత ప్రపంచంలో విప్లవాన్ని ఆహ్వానించిన టునీషియా ప్రజలు ప్రపంచ పీడిత ప్రజలకు ఆదర్శం. అమెరికన్ సామ్రాజ్యవాదం రెండు దురాక్రమణ యుద్ధాలను ప్రకటిస్తే అఫ్ఘానిస్తాన్ ఇరాక్ ప్రజలు అలుపులేని, రాజీలేని పోరాటం చేస్తున్న కాలంలో టునీషియా విప్లవం ప్రపంచ రాజకీయ చిత్రపటంపై సమున్నత పతాకం. కోటి కోట్ల కుంభకోణాన్ని వందకోట్ల జనాభా ఉన్న దేశం మౌనంగా భరించిన కాలంలో కోటిమంది నిరుపేదలు చైతన్యంతో అధికార వర్గాలను దనుమాడడం ఆహ్వానించడమే కాదు ఆచరించదగ్గది కూడా.


# మార్క్సిజం లెనినిజం మావోయిజం



స్టడీ నోట్స్

వెల : రు. 50/-

న్యూ విస్టాస్ పబ్లికేషన్స్

ప్రతులకు :

మైత్రి బుక్ హౌజ్ విజయవాడ,

దిశ పుస్తక కేంద్రం, హైదరాబాద్, నవోదయ పబ్లిషింగ్ హౌస్,

కాచిగూడ, హైదరాబాద్, సహచర బుక్‌మార్క్, హైదరాబాద్,

సందర్భం

# జైపూరు సాహిత్యోత్సవానికి ప్రతిస్పందన

అనువాదం: పి. వరలక్ష్మి

వావి వరస తప్పి ప్రవర్తించడం జరుగుతూ ఉండేదే కాని దానిపట్ల బహుశా అన్ని నాగరికతలు ఎచ్చరికతతో ఉండేవి.

జైపూరు సాహిత్యోత్సవం 2006లో 'పౌరసమాజ' చొరవతో మొదలై గత నాలుగు సంవత్సరాలుగా డి.ఎస్.సి లిమిటెడ్ ప్రాయోజిత సాహిత్యోత్సవంగా పరిణామం చెందింది. ఈ ఉత్సవానికి సమర్పకులు, భాగస్వాములు అయిన కంపెనీల పౌరసంబంధ కార్యకలాపాలు, కార్పొరేట్ సామాజిక బాధ్యత అసలు ముఖాన్ని గురించి విచారిస్తున్న సందర్భం ఇది. ఈ ఉత్సవ ప్రాయోజితుల విశ్వసనీయతను ఎవరైనా పరిశీలిస్తే ఆందోళన కలిగించే రూపం కనిపిస్తుంది.

కుంభకోణాలతో నిండిపోయిన కామన్‌వెల్త్ క్రీడల విచారణ సందర్భంలో డి.ఎస్.సి లిమిటెడ్ కంపెనీ 23శాతం ఎక్కువ చెల్లింపులు పొందిందని కేంద్ర నిఘాశాఖ కనుగొంది.

ప్రపంచంలో మూడవ అతిపెద్ద గనుల కంపెనీ అయిన రియో టింటో గ్రూపు ఫాసిస్టు, జాత్యాహంకార ప్రభుత్వాలతో కుమ్మక్కైన అపరాధిగా ఎంచబడుతోంది. ప్రపంచవ్యాప్తంగా దశాబ్దాలుగా మానవ హక్కుల, కార్మిక హక్కుల, పర్యావరణ హక్కుల ఉల్లంఘనల ఆరోపణలను ఎదుర్కుంటోంది.

అతిపెద్ద ఇంధన సంస్థ, లాభాలపరంగా ప్రపంచంలో రెండవ అతిపెద్ద కంపెనీ అయిన షెల్ ఆయిల్ కంపెనీ నైజీరియా రచయిత, పర్యావరణ ఉద్యమకారుడు కెన్‌సారోవివా మరణానికి కారకురాలిగా ఎంచబడుతోంది.

ఒగోని ప్రజలను దోపిడి చేస్తూ, నైజీరియా తీరప్రాంత సమూహాలను విచ్ఛిన్నం చేసి పర్యావరణ విధ్వంసానికి కారణమవుతున్న షెల్ ఆయిల్ కంపెనీకి మౌనప్రోత్సాహాన్నిస్తున్న డచ్ పార్లమెంటు తన మౌనాన్ని బద్దలు కొట్టుకొని షెల్ కంపెనీని నైజీరియా నుండి బహిష్కరించాలని విజ్ఞప్తి చేస్తూ - 2011 జనవరి 4న జాతీయ ఒగోని విద్యార్థుల సంఘం ఐక్యరాజ్య సమితి ప్రకటన 18వ వార్షిక దినాన్ని మూలవాసుల సంవత్సరంగా గుర్తించాలని సందేశాన్నిచ్చింది. ఈ సాహిత్యోత్సవంలో పాలుపంచుకునే వాళ్ళు ఆ సందేశాన్ని సమర్థిస్తూ, వాళ్ళ ధర్మాగ్రహానికి గొంతునివ్వగలరా?

సాహిత్యానికి వాస్తవాల పట్ల ఆసక్తి లేదా? లేక అది పాలకవర్గ కూటమిలో భాగస్వామ్యం పొందే అవకాశాల కోసం వెంపర్లాడుతూ తద్వారా ఆ అధికారిన్ని సుస్థిరంగా కాపాడటంలో ఆసక్తి కనపరుస్తోందా?

సాహిత్యం వ్యాపార సామ్రాట్టుల సేవ చేస్తూ అబద్దాలను వాస్తవాలుగా భ్రమింపజేసే గారడి పట్లనే మక్కువ చూపుతోందా?

ఈ ఉత్సవంలో పాల్గొనే రచయితలు మెరుగైన జీవితం సాధ్యమేనని, దానిని సాధించాలని విశ్వసించే వాళ్ళైతే వాళ్ళ విశ్వాసాలకు విరుద్ధంగా యథాతథ స్థితిని కాపాడే ఈ భాగస్వామ్యం గురించి తీవ్రంగా ఆలోచించడం ఎంతైనా అవసరం.

అనైతిక, అధర్మ వ్యాపార సంస్థల మద్దతుతో జరిగే ఒక సాహిత్య ఉత్సవం 'అంతా బాగుందనే' మత్తులోకి తీసుకుపోయే హిప్నాటిజంతో సమానమైన కార్యక్రమం అవ్వదా?

సమాజంలో రాజ్యమేలే ఆధిపత్య భావజాలాన్ని, దాని వల్ల వచ్చే సంక్లిష్టమైన పరిణామాల్ని, అది ప్రస్తుత, భవిష్యత్తు తరాలపై వేసే ప్రభావాలను లోతుగా అంచనా వేయగల మనసు, మేధస్సు ఈ సాహిత్యోత్సవానికి, దీనిలో పాలుపంచుకునే వాళ్ళకు ఉండగలదా?

ఈ ఉత్సవంలో పాల్గొనే రచయితలు ఆలోచించాల్సింది: నైజీరియా రచయిత, పర్యావరణ ఉద్యమకారుడు, పర్యావరణ పరిరక్షణకై అతను చేసిన కృషికి అతని మరణానంతరం ఐక్యరాజ్య సమితి పర్యావరణ కార్యాచరణ (యు.ఎన్ ఎన్విరాన్‌మెంటల్ ప్రోగ్రాం) ఎంపిక చేసిన గ్లోబల్ 500 రోల్ ఆఫ్ ఆనర్ పొందిన కెన్‌సారోవివా హంతకుల ఆర్థికసాయం తీసుకోవడం కన్నా అనైతికత ఏమైనా ఉంటుందా? నైజీరియా సైన్యం నియమించిన న్యాయస్థానానికి సారోవివా చెప్పిన చివరి మాటలు ఇవి: 'ఇక్కడ షెల్ బోనులో నిలబడి ఉంది... ఆ కంపెనీ నిజానికి ఈ విచారణలో ఘోరంగా ఓడిపోయింది. ఒగోని ప్రజలపై దాని నీచమైన యుద్ధ నేరాలకు అది శిక్షించబడుతుంది. ఆ రోజు తప్పక వస్తుంది....'

'కోకాకోలా కంపెనీ వారి సమర్పణలో జరిగే ఒక సాహిత్య ఉత్సవం కేరళలోని ప్లాచిమాడ, రాజస్థాన్‌లోని కాలాడేరా భూగర్భజలాల్ని పీల్చేసి, బావుల్ని ఎండబెట్టి స్థానిక ప్రజలను బైటి ప్రాంతాల నీటి సరఫరా మీద ఆధారపడేలా చేసింది ఆ కంపెనీయే అని గుర్తించే నైతిక బాధ్యత నుండి తప్పించుకుపోతుందా? విపరీతంగా నీటిని తోడేసే ఇలాంటి కర్మాగారాల వల్ల 52చోట్ల ఇదే పరిస్థితిని ప్రజలు ఎదుర్కుంటున్నారు.

జాతిహననాల్లో, అంతర్యుద్ధాల్లో, యుద్ధనేరాల్లో, ఆర్థికనేరాల్లో మునిగిపోయిన ఈ ప్రభుత్వాలు, విద్వేషాలు రెచ్చగొట్టే, దురాక్రమణలకు పాల్పడే, నిరంకుశత్వాన్ని రక్షించే ఈ ప్రభుత్వాలు వెనకుండి నడిపించే ఒక సాహిత్య ఉత్సవానికి ప్రపంచ సూపర్ పవర్‌కు ప్రపంచవ్యాప్తంగా 132 దేశాల్లో 702 సైనిక స్థావరాలతో పాటు 8,000 శక్తివంతమైన యుద్ధక్షిపణులు ఎందుకోసం ఉన్నాయో పరిశీలించే దృష్టి ఉంటుందా?

ఈ మానసిక దౌర్బల్య స్థితిని విచారించ గలగడం దానిలోనే కొట్టుకొనిపోతున్న సాహితీ బుద్ధిజీవులకు సాధ్యమవుతుందా?

'ఒక రచయిత జీవితం అత్యంత సున్నితమైనది. గాయాలూ, భావోద్వేగాలూ బహిరంగమే. దాని గురించి దుఃఖించాల్సిన పని

కరపత్రం

# ఉద్యమించడం మన హక్కు... బాధ్యత కూడా!

"మేము ఉద్యమాలు చేయం. మాకు సదుపాయాలు లేకపోయినా, పిజి విద్యార్థులమైన మమ్మల్ని కాన్వెంట్ పిల్లల్లా కించపరుస్తున్నా నోరు మెదపం. మాకెన్ని మార్కులొచ్చినాయో మాకే అర్థం కాని గ్రేడింగ్ పద్ధతి గురించి అడగం. లేడీస్ హాస్టళ్ళను జైళ్ళు చేసి, మమ్మల్ని అనుక్షణం అనుమానపు దృష్టితో చూస్తూ అవమానపరుస్తున్నా తల వంచుకుని భరిస్తాం. మా కరువుసీమకు రాకరాక ఒక విశ్వవిద్యాలయం వస్తే అనర్హులను అందలాలెక్కించి, అవినీతికి పీఠం వేసినా మేం ప్రశ్నించం. మా ప్రజల రెక్కల కష్టం రేపటి మాభవిష్యత్తు కోసం, మా ప్రాంత అభివృద్ధి కోసం ప్రభుత్వ నిధులుగా ఇక్కడ ధారపోస్తే అప్పనంగా అందింది అందిన కాడికి దోచుకుతింటున్నా చవటదద్దమ్మల్లా, ఎముకలు కుళ్ళిన, వయసు మళ్ళిన సోమరుల్లా తరగతి గది మూలన కూలబడి ఉంటాం. ఈ ఆదర్శాన్ని నలుమూలలా చాటుతాం. ఇది నేటి తరం విద్యార్థులంతా చేయవలసిన ప్రతిజ్ఞ అంటూ ఒక కుహనా విద్యార్థి సంఘం మన విశ్వవిద్యాలయంలో పుట్టుకొచ్చింది. ప్రపంచంలో ఎక్కడైనా ఈ వింత ఉందో లేదో కాని ఈ స్టూడెంట్ ఫోరంకు నాయకత్వ స్థానంలో వి.సి, ప్రిన్సిపాల్‌లు ఉన్నారు. పుట్టగానే ఇది విద్యార్థి సంఘం ముసుగేసుకున్న రియాక్షనరీ కులగుంపు అని తెలిసిపోయింది. అయినా అది అధికార బలంతో సంతకాల సేకరణలు, పత్రికా ప్రకటనలు వంటి పిల్లిమొగ్గలు వేస్తూ ఉంది. ప్రత్యామ్నాయ గొంతు వినిపించనివ్వకుండా బ్లాక్‌మెయిల్‌లు చేస్తోంది.

విద్యార్థి మిత్రులారా! మనం ఇద్దరు సహచరుల్ని కోల్పోయాం. ఆత్మహత్యలు చేసుకోడానికి వాళ్ళకు ఏ మానసిక వేదన కారణమయ్యిందో కూడ పట్టించుకోని లెక్కలేనితనం, దిక్కులేని స్థితిలో మన క్యాంపస్ ఉంది. విద్యార్థులకు ఆదర్శప్రాయంగా ఉండాల్సిన గురువుగారే అమ్మాయిలను లైంగికంగా వేధిస్తుంటే బాధితుల్నే భయపెట్టి ఆ దుర్మార్గుల్ని కాపాడే వ్యవస్థ ఇక్కడ రాజ్యమేలుతోంది. ఇది మనకు గౌరవనీయమా? ఎందులో గొప్పతనం ఉందని ఈ ఆత్మవంచన. విద్యార్థులకు

---

లేదు. రచయిత తనంతటతానే ఎంపిక చేసుకొని మరీ దాంట్లో ఇరుక్కుపోతాడు. అయితే అన్ని రకాల పెనుగాలులు నిన్ను తాకుతాయన్నది నిజం. కొన్ని గడ్డకట్టించేలా ఉంటాయి. నీఅంతట నీవే బైటికి నెట్టబడతావు. ఒంటరిగా నిలబడిపోతావు. నీకు ఆశ్రయం దొరకదు, రక్షణ దొరకదు-నువ్వు బొంకేంతవరకు - అయితే ఆ సమయానికి నీ రక్షణ నువ్వు నిర్మించుకున్నావన్నమాటే, అంటే ఒక రాజకీయవేత్త అయిపోయి ఉంటావు', అంటాడు హెరోల్డ్ పింటర్, '2005 సంవత్సరానికి నోబెల్ సాహిత్య బహుమతి అందుకు చేసిన ఉపన్యాసం సందర్భంలో".

మరీ ఆలస్యం కాకముందే జైపూరు సాహిత్యోత్సవం పింటర్ సందేశం నుండి జాగరూకులై ఫాస్టియన్ బేరం (జర్మనీలో తన ఆత్మను దెయ్యానికమ్ముకున్న జొహాన్నెస్ ఫాస్టస్ పేరు మీద ఫాస్టియన్ బేరం అన్న పదం వచ్చింది) లాంటి తెలివితక్కువ పనులను సరిదిద్దుకోవాలని ఎవరైనా ఆశిస్తారు.

21 జనవరి 2011న ప్రారంభమైన ఈ ఉత్సవానికి హాజరయ్యే రచయితలు కార్పొరేట్ నేరాలను, మానవత్వానికి విరుద్ధంగా రాజ్యం ప్రేరేపించే చర్యలను ఖండించాలని మేము విజ్ఞప్తి చేస్తున్నాం.

26 జనవరి 2011న శ్రీలంకలో ప్రారంభమయ్యే గ్యాలే సాహిత్యోత్సవానికి దూరంగా ఉండాలని ఈ కింద సంతకం చేసిన మేము రచయితలకు విన్నవిస్తున్నాం. ఎందుకంటే అది ఇచ్చిన ప్రకటన ఇలా ఉంది '..స్వతంత్ర్య పాత్రికేయులకు స్వేచ్ఛగా విధులు నిర్వర్తించుకునే అనుమతినివ్వలేదు కాబట్టి శ్రీలంక దళాలకు, తమిళ పులులకు మధ్య చివరి నెలల్లో జరిగే ఘర్షణలో యుద్ధనేరాలకు ఆస్కారముంది.' అది ఇంకా ఇలా చెప్పింది. 'శ్రీలంక యుద్ధనేరాలకు సంబంధించిన రుజువులను ప్రపంచవ్యాప్తంగా చూపుతున్నప్పటికీ దేశంలోని జర్నలిస్టులు వాటి గురించి మాట్లాడలేరు. కనీసం ఉత్తరప్రాంతలకు వెళ్ళనైనా లేరు. వెళ్తే వాళ్ళు చనిపోవడమో, అదృశ్యం చేయబడటమో జరుగుతుందని భయపడుతున్నారు.'

జైపూరు సాహిత్యోత్సవం లాగానే శ్రీలంక గ్యాలే సాహిత్యోత్సవం కూడ స్వతంత్ర్య నిర్వాహకుల చొరవతో జరుగుతున్నా దానికి ప్రభుత్వ సంస్థల దన్ను ఉంది.

జర్నలిస్టు కార్యకలాపాలు, రచయితలు ప్రభుత్వ బాకాలూదే ప్రచార సాధనాలుగానో, రాజ్యప్రతినిధులుగానో మారిపోయి పూర్వవ్యక్తిత్వాన్ని కోల్పోయి ఖాళీ అయిపోయిన ఉత్త తోలుతిత్తులుగా కఠినమైన చట్టాలకో, ఎమర్జెన్సీ విధానాలకో లొంగిపోయిన చోట హింసాత్మక తిరుగుబాట్లు, అంతర్యుద్ధాల ఈ సందర్భంలో సాహిత్య పండుగను జరుపుకుంటున్న తీరు బాధాకరంగా ఉంది.

ప్రకటనపై సంతకాలు

గోపాల్ కృష్ణ, సిటిజన్స్ ఫోరం ఫర్ సివిల్ లిబర్టీస్

ప్రకాశ్. కె.రే, జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీ రీసర్చర్స్ అసోసియేషన్

రాజకీయాలొద్దని, ఉద్యమాలు చేయొద్దని చెప్పడం ఈ రోజుల్లో ఫ్యాషనైపోయింది. నిజానికి అట్లా చెప్పడమే ఒక రాజకీయ కుట్ర. ఆ చెప్పేవాళ్ళు నిరంతరం పాలకవర్గ రాజకీయాల్లో మునిగి ఉంటారు. వాళ్ళ ప్రయోజనాల కోసం నీతిలేని రాజకీయ నాయకుల భజన చేస్తుంటారు. ఒక వివాదాస్పద మాజీ ప్రజాప్రతినిధికి ప్రోటోకాల్ నిబంధనలన్నీ ఉల్లంఘించి స్వాగత సత్కారాలు చేస్తారు. బందులూ చేయిస్తారు. నిర్దాక్షిణ్యంగా భోజన సమయంలో మెస్ మూయిస్తారు. ఇవి రాజకీయాలు కావా? నిజానికి వీళ్ళు చేసేదంతా రాజకీయాలే. అయితే వీళ్ళకు తెలిసిన రాజకీయాలు ముఠా రాజకీయాలు మాత్రమే.

వీళ్ళు ఉద్యమం అంటే అర్థం తెలిసే ఉద్యమాలొద్దంటున్నారా? లేక ఉద్యమమంటే కూడ తెలియని వాళ్ళు మనకు బోధకులుగా ఉన్నారా? ఉద్యమమంటే అర్థం ఒక ఆశయం కోసం చేసే ప్రయత్నం. అది సామూహికమైనప్పుడు ప్రజా ఉద్యమమవుతుంది. మార్పుకోసం ఉద్యమం విప్లవమవుతుంది. నేడు అరబ్ ప్రపంచంలో రగులుకున్న విప్లవం ట్యునీషియా, ఈజిప్ట్‌ల మీదుగా యెమన్, అల్జీరియా, మొరాకో, సూడాన్, బహ్రెన్, లిబియా దేశాలను చుట్టుముట్టింది. దశాబ్దాల అవినీతి పాలకుల అధికారపీఠాలు కూలిపోతున్నాయి. కూరగాయలు అమ్ముకునే ఒక యువకుడు పోలీసు అధికారి చేసిన అవమానానికి స్థానిక మునిసిపల్ కార్యాలయం ముందు నిప్పంటించుకుంటే వీధుల్లోకొచ్చిన జనం విప్లవానికి నాంది పలికారు. ఆ యువకుడు చనిపోయేనాటికి ట్యునీషియా మొత్తం ఉద్యమ జ్వాలల్లో ఉంది. ఇది నడుస్తున్న చరిత్ర. ఒక చేతిలో సెల్‌ఫోన్, ఒక చేతిలో రాయి పట్టుకొని లక్షలుగా వీధుల్లోకొచ్చిన యువత ట్యునీషియా దేశాధ్యక్షున్నే దేశం నుండి తరిమేసింది. మా చెమట, నెత్తురుతో సృష్టించిన సంపదంతా నువ్వు, నీ కుటుంబం దోచుకొని జల్సా చేస్తారా అంటూ ప్రపంచంలోనే అత్యంత ధనవంతుడైన ఈజిప్టు దేశాధ్యక్ష్యున్ని పదవి నుండి లాగేసింది ఆ దేశ ప్రజానీకం. జనం ఒక్కటైతే తుపాకులు ఓడిపోయి కంకర రాళ్ళు విజయం సాధిస్తాయి. అది ఉద్యమానికున్న శక్తి. ఎక్కడిదాకో ఎందుకు? మన రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాల్లోనే అక్రమ పద్ధతుల్లో పదవులు పొందిన వాళ్ళను, అవినీతికి పాల్పడిన వాళ్ళను దించేసిన సంఘటనలు చెప్పుకోదగ్గ సంఖ్యలో ఉన్నాయి. అందుకే అధికారులు, పాలకులు ఉద్యమాలంటే జడుసుకుంటారు.

ఏం మాట్లాడినా పదేపదే శాంతిభద్రతలు అంటూ మన వి.సి. పోలీసుభాష మాట్లాడతారు అసలు శాంతిభద్రతలంటే ఏమిటి? ఎవరికి శాంతి? ఎవరికి భద్రత? ఈ భాష మాట్లాడేవాళ్ళ దృష్టిలో శాంతిభద్రతలంటే వీళ్ళు ప్రశాంతంగా యూనివర్సిటీ నిధులను దోచుకొనే వెసులుబాటు ఉండడం. ఎలాంటి ప్రశ్నలకు తావులేకుండా విద్యార్థులుగాని, నిజాయితి గల టీచింగ్, నాన్‌టీచింగ్ సిబ్బందిగాని ప్రశ్నించకుండా వీళ్ళ పదవులకు, అధికారాలకు భద్రత ఉండడం.

యూనివర్సిటీ అంటే ఏమిటి అన్నపుడు సామాజిక శాస్త్రవేత్తలు చాలా చెప్తారుగాని అందరూ అంగీకరించేది యూనివర్సిటీలు జీవనభృతిని సముపార్జించడానికి అవసరమైన ప్రత్యేక నైపుణ్యాలను బోధించే కేంద్రాలు కావని, అవి సభ్యసమాజానికి బాధ్యతగల పౌరులను అందించేవని. వేలాది ఎకరాల ఆవరణ, శాస్త్రసామాజిక పరిశోధనలకు కోట్లాది రూపాయల నిధులు వాటికి కేటాయించేది కేవలం కొన్ని డిగ్రీలు ఇవ్వడానికి కాదు. ఈ పరిశోధనలు మన సాంఘిక, రాజకీయార్థిక స్థితిగతుల్ని మెరుగుపరిచి సమాజాన్ని ఉన్నతీకరించడానికి కృషి చేయాలి. మరి మన యూనివర్సిటీకి ఆ దృష్టికోణం ఉందా?

యోగివేమన యూనివర్సిటీ లోపలి సాంఘిక పరిస్థితులు చూస్తే ఇది ఒక గ్రామానికి కొనసాగింపుగా కనపడుతుంది తప్ప ఆధునిక ప్రజాస్వామిక విలువలు ఏకోశానా కనపడవు. ఒక పల్లెటూర్లో పెత్తందార్ల రాజ్యంలాగ కిందిస్థాయి ఉద్యోగులను, కార్మికులను ఇంటిపాలేర్లలాగ, అర్ధబానిసల్లాగ చూస్తారు. ప్రశ్నిస్తే ఉద్యోగులకైతే మెమోలు, విద్యార్థులకైతే ఫెయిల్ మార్కులు. స్త్రీలకు స్వాతంత్ర్యం ఉండరాదన్న మధ్యయుగాలనాటి సంస్కృతిని అమలు చేస్తున్నారు. సమస్యల గురించి కదిలివస్తే అమ్మాయిలై ఉండి రోడ్డెక్కుతారా అంటూ అవమానకరంగా మాట్లాడతారు. పట్టపగలు అడుగు బైటికి పెట్టాలన్నా సవాలక్ష ఆంక్షలు పెట్టి, ఆరాలుతీసి ఆత్మగౌరవాన్ని దెబ్బతీస్తారు. ఇదంతా వాళ్ళేం చేసినా అడగేవారు లేకుండ అందరిని భయభ్రాంతులకు గురి చేయడానికే. దీనికి పరాకాష్ట ఒక విద్యార్థిపై అక్రమకేసు బనాయించి జైల్లో పెట్టించడం. ఇది కక్షపూరిత చర్య అని అందరికి తెలుసు. న్యాయస్థానంలో ఇది ఓడిపోయింది కూడ. అయినా ఇంత అన్యాయానికి పాల్పడిన ఆ అధికారిని శిక్షించకపోగా పదోన్నతి కల్పించారు. ప్రశ్నించకపోవడం వల్ల, అన్యాయాన్ని ఎదిరించకపోవడం వల్ల భుజాలపైన కూర్చున్న వారు నెత్తికెక్కి ఆడుతున్నారు. ఆవిధంగా మనం హక్కుల్ని కోల్పోవడమే కాదు యూనిర్సిటీ నైతికతను, విలువలను దిగజార్చాం కూడ.

ఉన్నత విద్య మనకంటూ సొంత వ్యక్తిత్వాన్ని, సామాజిక దృక్పథాన్ని, ప్రాపంచిక జ్ఞానాన్ని పెంపొందించాలి. అది సమాజానికి బాధ్యత పడాలి. యూనివర్సిటీల దృక్పథం అలా ఉండాలి. కాని ఇప్పుడు అన్యాయాన్ని ప్రశ్నించకపోవడం, స్వార్థం, కెరీరిజం మన సిలబస్‌లోని పాఠాలు. దీన్నిలాగే కొనసాగనివ్వడం అంటే మన సమాజానికి ద్రోహం చేయడమే. కాబట్టి ఉద్యమించడం మన ప్రజాస్వామిక హక్కు మాత్రమే కాదు సామాజిక బాధ్యత కూడ.

- యోగి వేమన విశ్వవిద్యాలయ పరిరక్షణ కమిటీ,
కడప

గల్పిక

# సిద్ధాంతం మీద బండపడ...

- పి. చిన్నయ్య

'తెలంగాణ పట్ల మీ పార్టీ వైఖరి మారదా?"

"వింతగా అడుగుతున్నావు, మారదు..."

"ఎందుకని?"

"అది మా కేంద్రకమిటీ తీర్మానం, చిన్న రాష్ట్రాల్లోకి బహుళజాతి కంపెనిలొచ్చి సులభంగా దోచుకుంటాయి. అందుకే భాషా ప్రయుక్త రాష్ట్రాల సిద్ధాంతానికి కట్టుబడి ఉంటాం, పోరాడుతాం..."

"దేశమే బహుళజాతి కంపెనీల చేతుల్లో పడె, చిన్న రాష్ట్రాల్లో సులభంగా దోచుకోవడం ఏమిటి నీ బొంద, సరే ఎవరికోసం పోరాడుతారు?"

"దోపిడి, అన్యాయానికి గురైన ప్రజల కోసం..."

"తెలంగాణ ప్రజలు దోపిడి, అన్యాయానికి గురికాలేదా?"

"అయ్యారు, అందుకేగా మా పార్టీ వెనుకబడిన ప్రాంతాల కోసం పోరాడుతుంది"

"తెలంగాణ ఏర్పడితే పరాయి ప్రాంతపు దోపిడి దారులకు నష్టంగాని, మీ పార్టీకొచ్చిన నష్టమేమిటి? ఆ ప్రాంతంలో, ఈ ప్రాంతంలో పోరాటాలు చేయొచ్చుగా?"

"ఆరు నూరైన సరే, మా తీర్మానానికే కట్టుబడి ఉంటాం..."

"కాదు కామ్రేడ్స్, ఎక్కడో లాటిన్ అమెరికా, ఆఫ్రికా ఖండాలలో, ఇరాన్, ఇరాక్, పాలస్తీనా, ఆఫ్ఘనిస్తాన్, ఇజ్రాయిల్ తదితర దేశాలలో సామ్రాజ్యవాదుల దోపిడిలను ఖండిస్తారు, వారికి వ్యతిరేకంగా పోరాడుతామని తీర్మానాలు చేస్తారు, కాని ఈ తెలంగాణ ప్రాంతంలో పరాయి ప్రాంతపు దోపిడి దారులకు వ్యతిరేకంగా పోరాడలేరా?"

"ఎందుకు పోరాడం, తప్పకుండా పోరాడుతాం, కాని తెలుగు ప్రజలు సమైక్యంగా ఉండాలన్నదె మా పార్టీ అభిమతం"

"ఓరి పిచ్చోడా, మేము విడిపోతామన్నది పీడిత తెలుగు ప్రజలతో కాదు, అట్లనుకుంటె మొత్తం ప్రపంచపు పీడిత ప్రజలతో ఉండె సంబంధాలు మాకుంటాయి, విడిపోదామనుకుంటున్నది ఆ ప్రాంతపు దోపిడి దారులతోనే"

"అయినా గాని మా పార్టీ..."

"మీ పార్టీ, మీరు గంగలోపడి చావండి, మేమెమన్న దేశం నుండి విడిపోతామంటున్నామా, పరిపాలన సౌలభ్యం కోసం పక్కకు జరగాలనుకుంటున్నాము, తెలంగాణలో ఉన్న మీ భవనాలను, విజ్ఞానకేంద్రాలను మేము లాగుకుంటామా, మీవి మీకుంటాయి, మీ పోరాటాలు మీకుంటాయి..."

"అయినా సరే భాషా ప్రయుక్త..."

"మీ భాషా ప్రయుక్త రాష్ట్రాల సిద్ధాంతం మీద బండపడ, తెలంగాణను ఒప్పుకోక పోతిరిగాని, కనీసం మీ భాషా ప్రయుక్త సిద్ధాంతానికి కట్టుబడి ఉంటార్రా?"

"తప్పకుండా ఉంటాం"

"పశ్చిమ బెంగాల్లో భాషా ఏమిటి?"

"బెంగాళి!"

"ఆ రాష్ట్రంలోనే డార్జిలింగ్ కొండ ప్రాంతాల్లో ఉండే గుర్ఖాజాతి భాషా ఏమిటి?"

"నేపాలి!"

"మీ సిద్ధాంతం ప్రకారం గుర్ఖాలు కోరినట్టు గుర్ఖాలాండ్ రాష్ట్రం ఇవ్వొచ్చుగా!"

"..............................?"

"మాట్లాడవేమిటి?"

"తెలంగాణలో కేసిఆర్ అంతటివాడె గుర్ఖాలాండ్‌ను వ్యతిరేకించే, దానికేమిటి?!"

"ఆయనకు మార్క్సిజం తెలియదు, మరి మీకు?, పైగా ఆ పేరు మీదనే అధికారం ఎలగబెడుతున్నోళ్ళు, మీరు, కేసిఆర్ ఒకటేనా?"

"కాదు, అయితె ఏమిటి?"

"గుర్ఖాలకు ప్రత్యేక దేశమిచ్చిన తప్పులేదు"

"మావోయిస్టు లాగ మాట్లాడుతున్నావు..."

"ఇది మాట్లాడడానికి మావోయిస్టు కానక్కరలేదు, మార్క్సిస్టు అయితె చాలు"

"ఎలా!"

"ఒకప్పటి రష్యాలో కమ్యూనిస్టు పార్టీ చిన్న జాతులకు, తెగలకు ఎటువంటి అధికారాలిచ్చిందో తెలుసుగా?"

"డార్జిలింగ్ కొండ ప్రాంతాల్లో ముప్పై లక్షల మంది దాక గుర్ఖాలున్నారుగాని, రష్యాలోని అల్తాయ్ పర్వత ప్రాంతాల్లో పదహారు వేల షార్ట్జీ జాతి ప్రజలకే ప్రత్యేక స్వపరిపాలన అధికారమేగాక, అన్యాయం జరిగిందనుకుంటే యూనియన్ నుండి విడిపోయే జాతి స్వయం నిర్ణయాధికారం ఇచ్చారు అప్పట్లో"

"అలాగ, మా పార్టీ దాని గురించి మాట్లాడడం లేదె!"

"నీవు ఈ ప్రాంతపోనివనో, ఒకే ఊరతనివనో చెప్పడం లేదు, ప్రజలగురించి ఆలోచిస్తావు గనుక చెబుతున్న, మీ పార్టీ ఇటు భాషా ప్రయుక్త సిద్ధాంతానికి కట్టుబడదు, అటు జాతి పోరాటాలను సమర్థించదు. మార్క్సిజం అంటే ఏమిటి? కులం, మతం, జాతి, లింగ, ప్రాంతాల మధ్య గల వైరుధ్యాలను పరిష్కరించుకుంటు పోవడమే కదా, తెలంగాణ ప్రజల ఆవేదన, ఆత్మగౌరవం అర్థం చేసుకోకుండా, సమస్యలంటు లక్షల సార్లు సైకిల్ యాత్రలు చేపట్టిన ఇక్కడి ప్రజల మనసును గెలవలేరు. భాషా ప్రయుక్త రాష్ట్రాల కోసం కాదు. బాధా సర్పద్రష్టులకోసం పోరాడమని మీ పార్టీ నాయకత్వాన్ని నిలదీయండి!"

రిపోర్టు

# ఛత్తీస్‌ఘడ్ గ్రామాల్లో పోలీసు బీభత్సం

- అమన్‌సేథి

అనువాదం : అరుణ్

(మార్చి 14న ఛత్తీస్‌ఘడ్ రాష్ట్రంలోని చింతల్నార్ ప్రాంతంలో పోలీసులకు, మావోయిస్టులకు మధ్య పెద్ద ఎన్‌కౌంటర్ జరిగిందని, భారీ సంఖ్యలో మావోయిస్టులు చనిపోయారని పత్రికల్లో ప్రచారమైంది. మృతుల గురించి ఆ రాష్ట్ర పోలీసులు నోటికి వచ్చిన సంఖ్య చెప్తూవచ్చారు. ఇది ఇలా ఉండగా ఎన్‌కౌంటర్‌ను సాకు చేసుకొని, ఆ ప్రాంతంలో మావోయిస్టు ముఖ్య నాయకులు ఉన్నారని కూంబింగ్ తీవ్రం చేశారు. దానికి సంబంధించిన నిజానిజాలు దిహిందూ పత్రికలో రిపోర్టయ్యాయి. పాఠకుల కోసం ఈ సమాచారం)

అత్యాధునిక ఆయుధాలతో 350 మంది పోలీసులు మార్చి 11 తెల్లవారుజామున దంతెవాడ అడవుల్లోకి ప్రవేశించి భయానక దాడి ప్రారంభించారు. అయిదు రోజుల్లో మూడు గ్రామాలను తగలబెట్టారు. 300 గృహాలను, ధాన్యపు రాశులను తగలబెట్టారు. ముగ్గురు గ్రామస్తులు, ముగ్గురు రక్షక భటులు ఈ దాడిలో చనిపోయారు. ముగ్గురు స్త్రీలపై లైంగిక దాడులు చేశారు. ఇంత విధ్వంసం తర్వాత కానీ సాయుధ పోలీసులు తమ బ్యారక్ లకు చేరలేదు. ఈ బీభత్స వాస్తవం గురించి బాధితులు, ప్రత్యక్ష సాక్షులు చాలా మంది ' ది హిందూ'కు చెప్పారు.

పోలీసుల కథనం ప్రకారం, మావోయిస్టుల దాడిలో ముగ్గురు కోయ కమెండోలు చనిపోయారు. కానీ ఆ ప్రాంతానికి మాత్రం ఏ పత్రికా విలేఖరినీ వెళ్లనివ్వలేదు. ఆ తర్వాత ఈ విలేఖరి మరో మార్గం ద్వారా సంఘటన జరిగిన అటవీ ప్రాంతానికి చేరడంతో నిజానిజాలు బైటపడ్డాయి. ఆ ప్రాంతం చింతల్నార్ పోలీస్ క్యాంపుకు 15 కిలోమీటర్ల దూరంలో ఉంది. సాయుధ పోలీసులు 3 ఆదివాసీ గూడేలపై దాడి చేసి వారి గుడిసెలను తగలబెట్టి, ధాన్యం కాల్చేసి బీభత్సం చేశారు. ప్రత్యక్ష సాక్షులు, బాధితులు పోలీసులకు భయపడి తమ పేర్లు చెప్పడానికి నిరాకరించారు.

మార్చి మొదటి వారంలో పోలీసులు, సీఆర్‌పిఎఫ్ జవాన్లు, కోయ కమెండోలతో కలిసి మావోయిస్టు సానుభూతిపరులనే నెపంతో ఆదివాసీ గ్రామాలపై దాడికి ప్రణాళిక వేశారు. ఈ కోయ కమెండోలతో లొంగిపోయిన మావోయిస్టులు, ఆ ప్రాంత యువకులు వెళ్లారు.

చింతల్నార్ పోలీసు క్యాంప్ నుంచి 2 గంటల నడక దూరంలో ఉన్న మోర్పల్లి గ్రామంలో మావోయిస్టు గెరిల్లాలు ఆయుధ కర్మాగారం నడుపుతున్నారని ఒక లొంగిపోయిన మావోయిస్టు తమకు చెప్పాడని ఒక పోలీసు అధికారి 'ది హిందూ' కు చెప్పారు. ఈ సమాచారం ప్రకారం ... ఆ ప్రదేశంలో ఆంధ్రప్రదేశ్‌కు చెందిన ఒక నాయకుడు జై కిషన్‌తో సహా 100 మంది మావోయిస్టులు ఉన్నారు.

'మార్చి 11న 200 మంది కోయ కమెండోలు, 150 మంది కోబ్రాలు ఉదయం నాలుగు గంటలకు చింతల్నార్ క్యాంప్ వదిలి మావోయిస్టుల ఆయుధ కార్మాగారాన్ని నాశనం చేసేందుకు వెళ్లారని పోలీసుల సమాచారం.

'పోలీసులు అక్కడికి ఉదయం 8 గంటలకు చేరారు. మొత్తం గ్రామాన్ని చుట్టుముట్టారని మోర్పపల్లి మాజీ సర్పంచ్ న్యాపో ముట్టా చెప్పాడు. పోలీసులు గాలిలోకి కొన్ని రౌండ్లు కాల్పులు జరపగానే గ్రామస్తులు అడవిలోకి పారిపోయారు.

అయితే మాడవి సుల్ల అనే 30 ఏళ్ల ఆదివాసీ యువకుడు తొందరగా మేల్కొనలేదు. 'నా భర్త చింతపండు తెంపుతున్నాడ'ని అతని భార్య హుంగ చెప్పింది. ' అతడు కనిపించగానే పోలీసులు కాల్చడం మొదలు పెట్టారు. నేను వారిని కాల్చవద్దని వేడుకున్నాను. కానీ వినలేదు. పైగా నా దుస్తులు చించేసి , నన్ను చంపుతామని బెదిరించారు' అన్నది. అయితే హుంగ తప్పించుకొన్నది. ఆమె భర్త శవం మాత్రం చింతచెట్టుకు వేలాడుతూనే ఉంది.

' నేను టెండవా ఆకులు తెంపుకుంటుండగా పోలీసులు వచ్చి నీవు మావోయిస్టులకు సమాచారం అందిస్తున్నావ'ని అన్నారు అని ఐమ్లా గంగి(45) అన్నది. వారు తనను కింద పడేసి, బట్టలు చించి, తన ఇద్దరు కూతుళ్ల ముందే అత్యాచారం చేశారని చెప్పింది. అంతేగాక తన మొలకు చుట్టుకున్న సంచిలో ఉన్న పదివేల రూపాయలు దొంగిలించారని చెప్పింది.

35 ఇళ్లు తగలబెట్టాకపోలీసు దళాలు మధ్యాహ్నానికి వెళ్లిపోయాయి. ఆమె వెంట 45 ఏళ్ల కూతురు హుర్రేను పట్టుకపోయారు. హుర్రే ఇలా చెప్పింది. ' మమ్మల్ని వాళ్లు చింతల్నార్ పోలీస్ స్టేషన్‌కు తీసికెళ్లారు. విడివిడిగా వేర్వేరు గదుల్లో ఉంచి బట్టలూడదీశారు' . రాత్రంతా ఆమెపై అత్యాచారం చేశారు. ఇక గంగ, అతని కొడుకు భీమాను మావోయిస్టులు మీ గ్రామానికి వచ్చారా? అని ప్రశ్నిస్తూ రాత్రంతా చితకబాదారు. మోర్పల్లి గ్రామ మహిళలంతా సంఘటితంగా చింతల్నార్ పోలీస్ స్టేషన్ ముందు

బైఠాయిస్తే మడావి కుటుంబాన్ని వదిలేశారు.

పోలీసు సమాచారం ప్రకారం మోర్పల్లిలో మావోయిస్టుల ఆయుధ కర్మాగారం లేదు, మావోయిస్టులూ లేరు. ఏప్రిల్ 6, 2010 టర్మెట గ్రామ సమీపంలో 76 మంది సీఆర్‌పీఎఫ్ జవాన్లను హతమార్చిన సంఘటనలో అమరులైన 8 మంది మావోయిస్టుల జ్ఞాపకార్థం నిర్మించిన 15 అడుగుల స్థూపం అక్కడ ఉంది.

మార్చి 13న పోలీసులు తిమ్మాపురంపై తిరిగి దాడి చేశారు. 'కోయ కమెండోలు పగలు దాడి చేయాలని, కోబ్రా దళాలు రాత్రిళ్లు దాడులు చేయాలనే విషయంలో వారి మధ్య విబేధాలు తలెత్తాయి. దీంతో కోయ కమెండోలు తమంత తాముగా దాడులకు దిగారు. తిమ్మాపురం వెళ్లే దారిలో వాళ్లు పూలన్‌పాడ్ వద్ద బర్సా, మనుయాదవ్ అనే వారిని బంధించారు. ఈ కోయ కమెండోల దాడి విషయం ముందుగా తెలియడంతో ఆ గ్రామస్తులు దగ్గరిలో ఉన్న అడవిలోకి పారిపోయారు. 'కోయలు ఆ గ్రామానికి మధ్యాహ్నం రెండు గంటలకు చేరుకున్నారు. వారు అక్కడ ఆ రాత్రి బస చేశారు. ఆ ఊళ్లో ఉన్న కోళ్లను, గొర్రెలను చంపి వండుకున్నారు' అని గ్రామస్తుడు మడ్యం భద్ర చెప్పాడు. వారిపై మావోయిస్టులు మార్చి14, సోమవారం ఉదయం దాడి చేశారు. అందులో పాల్గొనిన మావోయిస్టు దళ సభ్యుడు ది హిందూ విలేకరితో 70 మంది మావోయిస్టులు, కమాండర్ రామన్నతో సహా ఆ దాడిలో పాల్గొన్నారని చెప్పాడు. మూడు గంటల సేపు జరిగిన ఆ దాడిలో ముగ్గురు కోయలు చనిపోయారు. 9 మంది గాయపడ్డారు. కోయలు అదనపు బలగాలను కోరారు. గాయపడిన వారిని తరలించడానికి ఒక హెలికాప్టర్ అక్కడికి వచ్చింది. మావోయిస్టులు మధ్యాహ్నానికి ఆ ప్రాంతాన్ని వదిలారు. పోలీసులు ఆ దాడిలో 37 మంది మావోయిస్టులు చనిపోయారని ప్రకటించారు. దాన్నే ఆ ప్రాంత దిన పత్రికలు రాశాయి. అయితే మావోయిస్టులు, తమ సెక్షన్ కమాండర్ ముబాక గంగ మాత్రమే చనిపోయినట్లు హిందూ విలేఖరికి ఒక కాగితంపై రాసి పంపించారు.

ఇక మార్చి 15న వారు చింతల్నార్‌కు తిరిగి వెళ్లే ముందు దాదాపు 50 ఇళ్లను కూల్చేశారు. ఆహారధాన్యాన్ని తగలబెట్టారు. తాము పట్టుకున్న బార్సే భీమాను గొడ్డలితో నరికి చంపారు. మనుయాదవ్‌ను చింతల్నార్ పోలీస్‌స్టేషన్‌కు తీసుకెళ్లి కాల్చేశారు. అతను మావోయిస్టని, ఎన్‌కౌంటర్‌లో చనిపోయాడని పోలీసులు ప్రకటించారు. ఒక సీనియర్ అధికారి చెప్పినదాని ప్రకారం 'పోలీసులు చంపిన ఆ వ్యక్తి మావోయిస్టు కాదు. తామేదో సాధించినట్టు చూపుకోడానికి ఆతడ్ని చంపేశారు'.

మార్చి 16, పైన చెప్పిన కోయ దళమే టర్మెట్ల గ్రామాన్ని చుట్టుముట్టింది. దాదాపు 200 ఇళ్లను, ఆహార నిల్వలను, బట్టలను, డబ్బును తగలబెడుతూ ఊరంతా తిరిగింది. అంతేగాక వారు మడావి హండా, మడావి ఐతా అనే వారిని ఎత్తుకెళ్లారు. 'వారెక్కడున్నారో తెలియదని, బహుశా చంపేసి ఉంటారు' అని ఆ గ్రామస్థుడు దేవా హిందూ విలేఖరితో చెప్పాడు. ఇదంతా ముందుగా గమనించిన మడావి హిద్మే తన దగ్గర ఉన్న సొమ్ములను ఒక సంచిలో వేసుకొని అడవివైపు పరిగెత్తింది. 'అక్కడ ఆమెను నలుగురు ఎస్‌పిఓలు ఆపి, స్పృహ తప్పేలా కట్టెలతో బాదారు'. తనకు స్పృహ వచ్చే సరికి ఒంటిపైన బట్టలు లేవని, తన సంచీ కూడా మాయమైందని ఆమె చెప్పింది. ఈ పైశాచిక దాడి వల్ల ఆమె ఎడం కన్ను చూపు పోయింది.

పై సంఘటనలపై దంతేవాడ కలెక్టర్ ఆర్ ప్రసన్న ఒక విచారణ కమిటీ నియమించారు. 'ఆ కమిటీకి అధ్యక్షుడు కుంట తహసీల్దార్. 'పత్రికా రంగానికి, పౌరసమాజానికి చెందిన ప్రతినిధులు ఈ కమిటీలో సభ్యులు' అని ఆయన 'ది హిందూ'కు చెప్పారు. ఈ దాడుల్లో ధ్వంసమైన ప్రతి ఇంటికి రు. 50,000 నష్టపరిహారం ఇస్తామనీ, తిండి గింజలు, పాత్రలు వగైరా సామాగ్రికి కూడా పరిహారం ఇస్తామని ఆయన అన్నారు. ఈ కమిటీ ఒక నెల రోజుల్లో తన నివేదికను సమర్పిస్తుంది.

డైరెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ విశ్వరంజన్‌కు ఈ ఘటనలపై సమాచారం కోసం ఫోన్ చేస్తే జవాబివ్వలేదు.

**కొసమెరుపు**

కలెక్టర్ ఆదేశాల మేరకు నిర్వాసితులైన ఆదివాసీలకు ఆహారం, దుస్తులు పంపిణీ చేయబోయిన రెవెన్యూ సిబ్బందిని పోలీసులు అడ్డుకున్నారు. శనివారం( మార్చి 26) స్వామి అగ్నివేశ్ ఆహార ధాన్యాలు, దుస్తులు, దుప్పట్లు తీసుకొని టర్మెట్ల గ్రామంలో పంచడానికి వెళ్లగా అక్కడి సాల్వాజుడుం వాళ్లు అడ్డుకున్నారు. ఆయనపై దాడి చేసి రేషన్ లాక్కున్నారు. ఆదివారం నాడు పత్రికా విలేఖర్ల గోష్టిలో స్వామి అగ్నివేష్ మాట్లాడుతూ తమపై జరిగిన దాడి పోలీసులు, సాల్వాజుడుం వాళ్లు కలిసి ముందస్తుగా రూపకల్పన చేశారని చెప్పారు. ఈలోగా మోర్పపల్లి గ్రామంలో ఆరుమంది ఆదివాసీలు ఆకలి చావులకు గురయ్యారని అక్కడి పత్రికలు రాశాయి. గత శనివారం ఎస్‌పి కల్లూరిని, కలెక్టర్ ప్రసన్నను ఆ జిల్లానుంచి ప్రభుత్వం బదిలీ చేసింది. మావోయిస్టు దక్షిణ బస్తర్ డివిజన్ కమిటీ ప్రతినిధి రామన్న ... తాము మోర్పల్లి, టెర్మెట్ల గ్రామాలకు బియ్యం, ధాన్యాలు , దుస్తులు, మందులు సరఫరా చేశామని పత్రికలకు తెలిపారు.

(మూలం) ది హిందూ 28 మార్చి

వ్యాసం

# ప్రజాసేవ రాజద్రోహమా?

- ఎం.ఎ. బాసిత్

అంతర్జాతీయంగా ప్రజా సేవకుడైన వైద్యుడుగా ఖ్యాతిగాంచిన డాక్టర్ బినాయక్ సేన్, రాజనందగాం ప్రజా మేధావిగా గుర్తింపు ఉన్న విప్లవోద్యమ నాయకుడు నారాయణ్ సన్యాల్, ఎటువంటి నేర చరిత్ర లేని ఏదో వ్యాపారం చేసుకొంటున్న పియూష్ గుహలకు ఛత్తీస్‌గఢ్ రాష్ట్రంలోని రాయపూర్ సెషన్స్‌కోర్టు రాజద్రోహం చేసిండ్లని యావజ్జీవ కారాగార శిక్ష విధించింది.

కేసులోని పూర్వాపరాల్లోకి వెళ్లితే ఈ ముగ్గురూ రాజద్రోహానికి పాల్పడ్డారా లేదా అనే దాని కంటే ముందు రాజద్రోహానికి పాల్పడ్డారని కోర్టు ప్రకటించిన వెంటనే అసలు రాజద్రోహం అంటే ఏమిటని ప్రశ్నించిన బినాయక్ సేన్‌కు సెషన్స్‌కోర్టు జడ్జి ఎందుకు జవాబు చెప్పలేదో ఆలోచించాలి. వెంటనే చెప్పలేరు. ఎందుకంటే అర్థం చాలా విడ్డూరంగా ఉంటుంది.

ప్రపంచంలోనే రెండో అతి పెద్ద ప్రజాస్వామ్య దేశమని ఖ్యాతి గాంచిన భారత ప్రజాస్వామ్య విషయంలో అట్లా అంటే ఏమిటో అర్థం చేసుకోవల్సిన, మారిన దేశకాల పరిస్థితులల్లో పునర్నిర్వచించుకోవల్సిన అవసరం ఉంది. రాజద్రోహం మీద తీర్పు చెప్పిన జడ్జికి దాని అవసరం లేకపోయినా భారత ప్రజలకు, ప్రజాస్వామికవాదులకు, హక్కుల కార్యకర్తలకు ఆ అవసరం తప్పనిసరిగా ఉంది.

ఇప్పటిదాకా ప్రజాస్వామ్యం అంటే ప్రజల సార్వభౌమాధికారం అని, ప్రజలే ప్రభువులని అటువంటి ప్రజలకు సేవ చేయడమంటే దేశానికి, సమాజానికి సేవ చేయడమేనని అందరం అనుకుంటున్నది. ఇది తప్పు అని రాయపూర్ సెషన్స్‌కోర్టు వారు నిర్ద్వందంగా ప్రకటించారు. అంతమాత్రమే కాదు, దీన్ని రాజద్రోహం అంటారని కూడా వారు పునర్నిర్వచించారు.

ఈ భావనను ఇంకొంచెం వివరంగా పరిశీలిస్తే, ప్రజాస్వామ్య వాదులకు ఈ తీర్పు ఒకింత విస్మయాన్ని కల్గించినప్పటికీ, ఇటువంటి తీర్పులు కొత్తవేమి కావు. అంతమాత్రమే కాక ఇట్లాంటి ఒక భావజాల నిర్మాణం భారత రాజ్యాంగ ప్రియాంబుల్‌లో మనం రాసుకున్న సోషలిస్టు విధానాలను అవలంబించడం మానేసి, క్రమంగా పెట్టుబడిదారులకు ఊడిగం చేసే విధానాలకు మన పాలకులు తల్గొగ్గడం ప్రారంభించిన కాలం నుంచి రూపొందుతున్నదె. ఈ క్రమంలోనే టాటాలు, బిర్లాలు బలపడి, ఇందిరమ్మ స్వైర విహారం చేసిన ఎమర్జెన్సీ కాలం నాటికి పారిశ్రామికవేత్తలే పాలకుల్ని శాసించే స్థాయికి ఎదగడం మన కళ్ల ముందటి వాస్తవమే కద.

ఈ వాస్తవ పరిణామం పర్యవసానం ఏమిటి?

ఈ పరిణామక్రమంలోనే గుప్పెడు మంది పెట్టుబడిదారుల ప్రయోజనాలను కాపాడడమే ప్రజాస్వామ్య పరిరక్షణ అని, అసంఖ్యాకంగా ఉత్పత్తిలో పాల్గొనె ప్రజల ప్రయోజనాలు అత్యంత అప్రధానమని లేదా అనవసరమని పాలకులు భావిస్తున్నారని అర్థం అవుతుంది.

కాకుంటే శ్రీకాకుళం జిల్లా సోంపేటలో ఉద్యానవనంలాంటి ఉద్దానం పంటపొలాల్లో, ఆ పంట పొలాల మీద ఆధారపడి బతుకీడుస్తున్న ప్రజల్ని నిర్వాసితుల్ని చేసి, ఆ ప్రాంత అభివృద్ధి పేరిట, వాళ్ల వినియోగ పరిమితితో సంబంధం లేని విద్యుత్తు పవర్ ప్రాజెక్టును కొద్దిమంది వ్యాపార ప్రయోజనాల కోసం ఎందుకు స్థాపిస్తారు. అభివృద్ధి అంటే అదేం బ్రహ్మ పదార్థమా కాని, దాని పేరిట మరీ ముఖ్యంగా ఈ ప్రాజెక్టు మాకు వద్దు మొర్రో, మా పంటపొలాలు మాకు చాలు అంటూంటే, అదే పంటపొలాల్లో ఆ రైతుల్ని పొర్లించి, పొర్లించి కొడుతూ, రక్తపాతం సృష్టించి మరీ ఆ ప్రాజెక్టుల్ని నెలకొల్పుతున్నారంటే ఎవరి అభివృద్ధి కొరకు, ఈ ప్రాజెక్టులను నిర్మిస్తున్నారని అర్థం చేసుకోవాలి?

అంతెందుకు విశాఖ తీరం వెంబడి చేపలు పట్టుకొని జీవిస్తున్న మత్స్య కారుల ఉదాహరణ పరిశీలించినా ఈ విషయం అవగతం అవుతుంది. ఈ ప్రభుత్వాల సహాయం మీద ఆధారపడకుండానే తమ బతుకేదో తాము బతుకుతున్న లక్షలాది తీరప్రాంత మత్స్యకారుల బతుకుదెరువును దెబ్బ తీస్తూ గంగవరం పోర్టు పేరిట తీర ప్రాంతాన్నంత సర్కారు వారు నిస్సిగ్గుగా బహుళజాతి కంపెనీలకు అప్పగిస్తున్నారు. ఇట్లా ఎందుకు ధారాదత్తం చేస్తారు? ఇటువంటిదే, డెల్టా భూముల్ని, లక్షలాది ఎకరాల సారవంతమైన నేలను, భూమి పుత్రుల శోకాన్ని సైతం లెక్కచేయకుండా కాకినాడ సెజ్ పేరిట కోస్టల్ కారిడార్‌నంత స్వదేశీ, విదేశీ గుత్త పెట్టుబడిదారులకు అప్పనంగా అంటగట్టుతున్న వైనం. ఇదంతా కాకుల్ని కొట్టి గద్దలకు వేయడమేనని వేరే చెప్పాలా?

అట్లాగే అడవిని నమ్ముకుని బతుకుతున్న ఆదివాసీలను గురించి ప్రభుత్వాలు ఏనాడు పట్టించుకున్న దాఖలా లేదు. ప్రభుత్వాల మీద ఆధారపడడం మానేసి జల్-జంగిల్-జమీన్ ల మీద హక్కుల్ని కాపాడుకోవడానికే జీవిత కాలమంత వీళ్ళు పోరాడవలసి వస్తున్నది. ప్రకృతికి దగ్గరగా జీవిస్తున్న వీళ్లు అవసరానికి మించి ఏమిచ్చినా తీసుకోలేని నిష్కల్మష జీవులు. ఇట్లాంటి ఆదివాసుల్ని సమూహాలకు సమూహాలను నిరాశ్రయుల్ని చేయడం ద్వారా భారత ప్రభుత్వం వీళ్ల బతుకుదెరువుల్ని మొత్తంగా లాక్కొని విదేశీ, స్వదేశీ బహుళజాతి కంపెనీలకు కట్టబెడుతున్న హృదయవిదారక దృశ్యాలు మన దృష్టి నుంచి తప్పించుకోలేవు.

ఇందులో భాగంగానే పశ్చిమ బెంగాల్, ఒడిశా మధ్యప్రదేశ్, చత్తీస్‌గఢ్‌లలోని దట్టమైన అటవీ ప్రాంతాల్లోని లక్షలాది కోట్ల విలువైన రక రకాల ఖనిజాలున్న భూగర్భాల్ని చీల్చుకోవడానికి అంగీకరిస్తూ వేదాంత, పోస్కో వంటి బహుళజాతి కంపెనీలతో భారత ప్రభుత్వం ఒప్పందం చేసుకున్నది. ఈ పని గత ముప్పైయేళ్లుగా టాటాలు, బిర్లాలచే ప్రభుత్వం చాలా గుంభనంగా నిర్వహిస్తోంది. గత సెప్టెంబరు 2009 నుంచి ఇక గుంభనత్వంతో పని లేకుండా నగ్నంగానే ఆపరేషన్ గ్రీన్ హంట్ పేరిట సాయుధ బలగాల్ని దింపి ఆదివాసీ సమాజాన్ని గుంపులు, గుంపులుగా సంహరిస్తూ జీనోసైడ్‌కు కేంద్ర ప్రభుత్వం పాల్పడుతోంది. ఇది కేవలం ఆదివాసుల హక్కులకు సంబంధించిన విషయం మాత్రమే కాదు. పర్యావరణ, సామాజిక, ప్రజాస్వామిక హక్కులకు కూడా సంబంధించిన విషయం. పర్యావరణవేత్తలు, సామాజిక ఉద్యమకారులు, ప్రజాస్వామిక, పౌర హక్కుల కార్యకర్తలు గగ్గోలు పెట్టడం అసందర్భం కాదు.

ఏ దళారీ ప్రయోజనాల్ని ఆశించి బహుళజాతి సంస్థలకు, ఆదివాసీ హక్కుల్ని సైతం కాలరాస్తూ అడవుల్ని ధ్వంసం చేస్తూ భూగర్భాల్ని చీల్చి మరీ ఖనిజ వనరుల్ని ఈ ప్రభుత్వం దోచి పెడ్తుందన్న సంగతి ఎలా ఉన్న, అందుకు భవిష్యత్తరాలు భారీ మూల్యాన్ని చెల్లించవలసి ఉంటుందన్న విషయం పాలకులెరుగరా అనే సందేహం కూడా కల్గుతోంది. ఇంతటి విద్ధ్వంసం కళ్లముందు కనిపిస్తున్నా పర్యావరణ, ప్రజాస్వామికవాదుల ప్రతిఘటన ఒక పరిమితికి మించి ఉండడం లేదు.

అపార ఖనిజ వనరులున్న గనుల్ని ఆయా కంపెనీలకు అంటగట్టడం వల్ల వచ్చే భారీ దళారీ కమిషన్ మీద ఆపేక్షతో అనాదిగా ఆదివాసీ ప్రాంతాలైన అడవుల గర్భాల్ని చీల్చడం వలన ఆ భూఖండం మొత్తంగా దారుణంగా దెబ్బతిని మానవజాతి మనుగడకే ప్రమాదకరంగా పరిణమించే విషయాన్ని పాలకులు విస్మరిస్తున్నారు. పాలకులు విస్మరించిన ఆ బాధ్యతను ప్రజాస్వామిక వాదులు, హక్కుల కార్యకర్తలు పట్టించుకోవాల్సిన అవసరం ఏర్పడింది. అటువంటి బాధ్యతను బినాయక్ సేన్, నారాయణ్ సన్యాల్ చేపట్టడంవల్లనే వారికి కష్టాలు మొదలయ్యాయి.

అట్లా దట్టమైన అటవీ ప్రాంతాల్లోని కొండల్ని, గుట్టల్ని విపరీతంగా తవ్వే క్రమంలో, ఆదివాసీ హక్కుల్ని కూడా విచక్షణారహితంగా కాలరాస్తున్నారు. వాళ్ల మాన ప్రాణాలకు సైతం రక్షణ లేదు. ఇటువంటి నేపథ్యంలోనే ప్రభుత్వాలు కాలరాస్తున్న ఆదివాసీల ప్రాణాలకు ఆలంబనగా వాళ్ళకు వైద్యమో, గుండె ధైర్యమో, మాట సాయమో చేయడానికి వచ్చినందుకు డాక్టర్ బినాయక్ సేన్ మీద రాజద్రోహం నేరాన్ని మోపారు. దాన్ని నిరూపించే సాక్ష్యాధారాలతో సంబంధం లేకుండానే కోర్టువారు యావజ్జీవశిక్ష ఖరారు చేసింది.

నిజానికి భారత పాలక వర్గాలు ఇప్పటికే చాలా విషయాల్ని ఖరారు చేసి పారేశారు. పెట్టుబడిదారులతో కుమ్మక్కైన భారత పాలక వర్గాలకు లేదా పెట్టుబడిదారులే పాలకులైన పరిణామ దశలో .... పెట్టుబడుదారులకు వ్యతిరేకంగా ప్రజలను చైతన్యవంతం చేయడం అంటే "రాజద్రోహమే"నని ఎప్పుడో ఖరారు చేసి పారేశారు. పైగా పెట్టుబడిదారులే బాగా బలిసి సామ్రాజ్యవాదులై ప్రపంచ దేశాల సార్వభౌమత్వాన్ని శాసిస్తున్న స్థితిలో సామ్రాజ్యవాద బహుళజాతి మైనింగ్ సంస్థలకు వ్యతిరేకంగా భూమి పుత్రులైన అమాయక ఆదివాసీ ప్రజల కోసం పని చేయడం అంటే "రాజద్రోహం" కాక మరేం అవుతుంది? ఇందుకు సాక్ష్యాధారాలు ఇంకా ఎందుకు? అని భారత పాలకవర్గాలు అనుకుంటున్నాయి. కోర్టులు కూడా అటువంటి భావాల్నే పుణికి పుచ్చుకున్నాయి.

ఈ నేపథ్యంలోనే ఇంకో ఉదాహరణ కూడా ఇక్కడ చెప్పక తప్పదు. దశాబ్దాలుగా పాలకుల నిర్లక్ష్యానికి గురైన ఒక ప్రాంతానికి ప్రక్కనున్న అభివృద్ధి చెందిన ప్రాంత పెట్టుబడిదారుడు వ్యాపారం కోసం వచ్చి, ఆ ప్రాంత ప్రజల రక్తమాంసాల్ని పీల్చి బాగా బలిసి అంతర్గత వలస సామ్రాజ్యవాదిగా రూపొందాక, వాడికి వెనుకబడ్డ ప్రాంతాలవాళ్లు తమ స్వావలంబన కోసం, స్వయంపాలన కోసం చేసే పోరాటం జాతి వ్యతిరేక పోరాటంగాను, రాజ్యాంగ వ్యతిరేక పోరాటంగాను అనిపిస్తుంది.

కాబట్టి ఆదివాసీ భూమిపుత్రులు తమ నేల, నీరు, అడవిని రక్షించుకోవడానికి పోరాటం చేస్తే ఆపరేషన్ గ్రీన్ హంట్ పేరిట అణిచివేయడం, ఎట్లా "న్యాయమో", ఒక ప్రాంత స్వావలంబన కోసం, స్వయంపాలన కోసం ఎవరైన ఉద్యమిస్తే వాళ్లను సాయుధ బలగాలతో తొక్కి వేయడం కూడా అట్లాంటి "న్యాయమే" అవుతుంది. తెలంగాణ సందర్భంలో గవర్నర్ నరసింహన్, ముఖ్యమంత్రి కిరణ్ కుమార్‌రెడ్డి అదే పనిలో ఉన్నారు.

అందుకే బినాయక్ సేన్ ప్రజా వైద్యుడుగా ఎంతటి ఖ్యాతి గడిస్తే నేమి, నారాయణ సన్యాల్ భూమి పుత్రుల హక్కుల కోసం ఒక రాజకీయ దృక్పథంతో ఎంత న్యాయమైన పోరాటం చేస్తేనేమి, పియూష గుహకు నేర చరిత ఉంటేనేమి, లేకపోతేనేమి, వాళ్ల ఖరారు చేసుకున్న నియమాలననుసరించి తమ ప్రభుత్వ అంగమైన "న్యాయశాఖ" చేత వాళ్ళకు శిక్షను ఖరారు చేస్తారు.

చారిత్రకంగా ఇదంతా పాలక వర్గ న్యాయంగా చెలామణీ అవుతూ ఉన్నదే. కాని ప్రజలకు స్వీయ గౌరవానికి మించిన స్వేచ్ఛ, స్వావలంబనను మించిన న్యాయం, స్వయంపాలనను మించిన ధర్మం తప్ప వేరే ఏముంటాయి? అందుకోసం దేన్నైనా ధిక్కరించవలసిందే. అది "రాజద్రోహమైన" సరే, ప్రజాద్రోహం కానంత వరకు.

పత్రికా ప్రకటన

# చింతల్‌నార్‌లో ఏం జరిగింది?

- నిజనిర్ధారణ బృందం

మార్చి 11, 2011న మావోయిస్టులకు, పోలీసులకు మధ్య జరిగిన ఎదురు కాల్పులలో 36 మంది మావోయిస్టులు. ముగ్గురు కోయ కమాండోలు చనిపోయారని సంచలన వార్తగా వచ్చిన వార్త తరువాత... వాస్తవంగా అక్కడ ఏమి జరిగిందో తెలుసుకుందామని ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం (ఏపిసిఎల్‌సి) ఆధ్వర్యంలో దేశవ్యాపిత హక్కుల సంఘాలు నిజనిర్ధారణకు పోయి, సంఘటనా స్థలాన్ని సందర్శించి, అక్కడి ప్రజలను కలిసి విచారించగా చాలా ఆసక్తికరమైన, ఆందోళనకరమైన విషయాలు మా దృష్టికి వచ్చాయి.

మార్చ్ 11, 2011న దాదాపుగా 300-350 మంది కోబ్రా పోలీసులు, సిఆర్‌పిఎఫ్ పోలీసులు, నాగా పోలీసులు, కోయ కమాండోస్ కలిసి మొదట మోర్‌పల్లి గ్రామంపై ఉదయం 7-8 గంటల మధ్య దాడి చేశారు. వారందరు కూడ మిలటరీ డ్రస్‌లోనే ఉన్నారు. వారిని చూసేవరకు గ్రామంలోని జనం అడవిలోకి పరిగెత్తారు. మాడివి గంగను వారు పట్టుకున్నారు. ఆమెను విపరీతంగా కొట్టి ఆమె దగ్గర ఉన్న డబ్బులు గుంజుకుని ఆమెపై అత్యాచారం చేశారు. గ్రామంపై బడి 33 ఇండ్లను తగులబెట్టారు. మారిలి భీమ్ 80 సంవత్సరాల వృద్ధురాలు ఇంటికి పోయి ఇంట్లో వస్తువులు తీసుకుపోతుంటే మీకాళ్లు మొక్కుతాం అంటూ కాళ్ల వేళ్లబడినా ఆమెను జుట్టుపట్టుకుని లేపి తుపాకుల బయోనెట్‌తో కొట్టారు. చాలా ఇండ్లల్లో ఉన్న ధాన్యం తగులబెట్టారు. అదే విధంగా ఎముల మూడే అనే 35 సంవత్సరాల మహిళ తన చిన్నపిల్లలను తీసుకుని అడవిలో గడ్డి కోయడానికి పోయింది. అక్కడికి పోయిన కోయ కమాండోస్ ఆమెను పట్టుకుని ఆంధ్ర నుండి వచ్చిన మావోయిస్టు పార్టీదళం ఎక్కడ ఉంది చెప్పమంటు బాగా కొట్టారు. ఆమె దగ్గర ఉన్న పది వేల రూపాయలు తీసుకుని ఆమెపై అత్యాచారం చేశారు. ఆమెను కొట్టిన వారిని, అత్యాచారం చేసిన వ్యక్తులను ఆమె గుర్తుపట్టాను అని మాతో చెప్పింది. వంజం భీమ్ దగ్గర నుండి ఇరవై వేల రూపాయల విలువ చేసే బంగారం తీసుకుపోయారు. అక్కడి నుండి పోయేటప్పుడు మాడివి జోగ్‌ను అతని కూతురు, కుమారుడైన మాడివి లక్కె, మాడివి భీమ్‌ను చింతల్‌నార్ పోలీస్ స్టేషన్‌కు తీసుకుపోయి అమ్మాయిని వేరే రూంలో ఉంచారు. తరువాత అమ్మాయిని బట్టలు లేకుండా కేవలం కట్‌డ్రాయర్‌తో తండ్రికి అప్పగించారు. గ్రామంలో ఒక వ్యక్తిని చింతచెట్టుపై ఉంటే కాల్చిచంపారు.

మార్చి 12, 2011న ఈ మొత్తం 300 మంది పోలీస్, కోయ కమాండోస్ తిమ్మాపూర్ గ్రామంపై దాడికి పోయారు. అక్కడ మాడివి నంద ఇల్లు తగలబెట్టి, లూటీ చేసి గ్రామంలోని ఇండ్లను తగులబెట్టి గ్రామంలో ఉన్న మేకలు, కోళ్లు తీసుకుపోయి గ్రామం పక్కనే వండుకుతింటూ తాగుతూ ప్రజలను భయభ్రాంతులకు గురిచేస్తూ ఉన్నారు. వారికి వచ్చేటప్పుడు పొల్లంపాడు గ్రామం నుండి బాడిసే భీమ్‌ను, చింతల్‌నార్ నుండి ఒక వ్యక్తిని (పేరు తెలియదు) తీసుకు వచ్చి వారి చేతులు వెనకకు కట్టివేసి వారి దగ్గర ఉంచుకున్నారు. ఆ విధంగా వారు తిని, తాగుతు ఉన్న క్రమంలో అటుగా వచ్చిన మావోయిస్టుల బృందం (దాదాపుగా 60-70 మంది ఉండవచ్చునని ప్రజలు అన్నారు) వారిపై దాడి చేసింది. ఆ దాడిలో ముగ్గురు కోయ కమాండోస్, ఒక మావోయిస్టు చనిపోయారు. ఆ సంఘటనతో వెనక్కు పారిపోతున్న సందర్భంలో వారు పొల్లంపాడు నుంచి తీసుకు వచ్చిన బాడిసె భీంను గొడ్డల్లతో నరికి ముక్కలు ముక్కలుగా తిమ్మాపూర్ గ్రామంలో వెదజల్లి పోయారు. ఆ విధంగా తిమ్మాపూర్‌లో ముగ్గురు కోయ కమాండోస్, ఒక మావోయిస్టు, ఒక బాడిసే భీమాతో కలిసి మొత్తం ఆరు మంది చనిపోయారు. ప్రస్తుతం ఆ గ్రామస్తులందరు భయంతో గ్రామంలో నుండి పొయి అడవిలో చెట్ల కింద తల దాచుకుంటున్నారు. అలా తల దాచుకుంటున్న అనేక కుటుంబాలు మమ్మల్ని కలిసాయి. తిమ్మాపూర్ నుండి చింతల్ నార్ పోయిన పోలీస్, కోయకమాండోస్ తిరిగి మార్చ్ 16, 2011న తాడిమెట్ల గ్రామంపై ఉదయం 7 గంటలకు దాడి చేశారు. ఈ గ్రామంలో మొత్తం 315 ఇండ్లు ఉన్నాయి. అందులో 207 ఇండ్లను తగుల బెట్టారు. వీరి రాకను పసిగట్టిన ప్రజలు అడవిలోకి పారిపోయారు. కాని అప్పుడే నిద్ర నుండి లేచి చీపురు పట్టుకుని ఇంటి ముందు కసువు ఊడుస్తున్న మాడిరి జోగికి వారి రాక తెలియకపోయింది. వారు వచ్చి ఆమెను పట్టుకుని విపరీతంగా కొట్టారు. ఆమె ఇంట్లో ఉన్న ఎనిమిది వేల రూపాయలు, బంగారం టిక్కీ విలువ ఏడు రూపాయలు, ముక్కుల పుల్లలు విలువ రెండు వేల రూపాయల, చెవుల కమ్మలు మూడు వేల ఐదు వందల రూపాయలు కూడ తీసుకున్నారు. ఆమెపై అత్యాచారం చేశారు. ఆమె కణతపై తుపాకి బయోనెట్‌తో కొట్టిన గాయం సంఘటనకు సాక్ష్యంగా ఉంది. వారు పోయేటప్పుడు ఇద్దరిని మాడివి నంద, మాడివి అయితను తీసుకుపోయారు. వారు ఏమైనారో ఇప్పటికీ తెలియదు.

వాస్తవంగా మొత్తం సంఘటన ఈ విధంగా ఉంటే పోలీసులు, చత్తీస్‌ఘడ్ ప్రభుత్వం ఒక అబద్దాన్ని, తప్పుడు సమాచారాన్ని బయటి ప్రపంచానికి తెలియజేస్తూ మొత్తం

సమాజాన్ని చీట్ చేసే ప్రయత్నం చేస్తున్నాయి.

ఎందుకు మీ మీద ఈ దాడులు చేస్తున్నారు, ఎందుకు మిమ్ములను చంపేస్తున్నారు అని అడిగితే గిరిజనులు చాలా స్పష్టంగా మా భూములను పెద్ద పెద్ద కంపెనీలకు అమ్మేస్తున్నారు. మా భూమి లేకుండా చేసి మమ్ములను ఇక్కడి నుండి పంపేయలనుకుంటున్నారు. ఇప్పుడు కూడ అనేక మంది ఠాగుర్‌లు వచ్చి చింతల్‌నార్‌లో ఉన్నారు. మేము ఇక్కడి నుండి కదులం అన్నందుకు మాపై ఈ దాడులు చేస్తున్నారు. మాకు ఈ ప్రభుత్వం సహాయం చేయకపోయినా సరే మా బతుకులు మమ్ములను బతకనిస్తే చాలు అంటున్నారు.

నిజంగానే ఇవాళ చత్తీస్‌ఘడ్ ప్రభుత్వం సల్వాజుడుం అనే హంతక ముఠాను ఏర్పాటు చేసి అక్కడి ప్రజలను చంపిస్తున్నది. దీనికి స్పందించిన సుప్రీం కోర్టు సల్వాజుడుం ఏర్పాటు చట్ట విరుద్దమని దానిని రద్దు చేసి మాకు రిపోర్టు పంపాలని అడిగినందుకు దాని పేరు మార్చి 'కోయ కమాండోస్'గా తిరిగి దాడులు మొదలు పెట్టింది. దీనిని మేము తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాం. దాదాపుగా 2 లక్షల పారామిలటరీ సైన్యంను దింపి ఆదివాసీ సమాజం మొత్తాన్ని భయభ్రాంతులకు గురిచేస్తూ వారికి మానసిక ప్రశాంతత లేకుండా చేసి వారి జీవించే హక్కును కూడా ప్రభుత్వమే సహకరిస్తోంది. అమాయకులను చంపేసి దానిని సమర్థించుకోవడానికి ఎన్‌కౌంటర్లలో మావోయిస్టులు చనిపోయినట్టుగా ప్రకటిస్తుంది. "ప్రభుత్వమే తన ప్రజలను ఇంత కిరాతకంగా చంపేస్తు - అబద్ధ ప్రచారం చేయడం సిగ్గు చేటు. కనుక వెంటనే కోయ కమాండోస్ అనే సంస్థను రద్దు చేసి, ఆదివాసీల మీద ప్రకటించిన "గ్రీన్ హంటు ఆపరేషన్"ను నిలిపి వేయాలని, పారామిలటరీ బలగాలను వెనక్కు పిలవాలని మేము డిమాండు చేస్తున్నాము. ఆదివాసీల జన్మహక్కైన వనవాసపు హక్కును కాపాడాలని మేము డిమాండు చేస్తున్నాం.

**నిజనిర్ధారణలో పాల్గొన్న సంఘాలు - నాయకులు**

ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం (ఎపిసిఎల్‌సి) నుండి చిలుకా చంద్రశేఖర్, ఆర్. రాజానందం, వేడంగి చిట్టిబాబు, వి. రఘునాథ్, జి. రవి, విప్లవ్ కుమార్, శిరీష ; సిపిసిఎల్ (సెంటర్ ఫర్ ప్రొటక్షన్ ఆఫ్ సివిల్ లిబర్టీస్) ఆర్. మురుగేషన్ ; ఎపిడిఆర్ఎల్ నుండి ప్రశాంత్ హల్దర్, చంద్రిక, బానో జ్యోస్నా ; యు. సాంబశివ రావు దళిత బహుజన సోషల్ యాక్టివిస్ట్.

# విరసం పత్రికా ప్రకటన

ఛత్తీస్‌గఢ్ ఆదివాసులపై పారా మిలటరీ, సాల్వాజుడుం మూకల అత్యాచారాలు, గృహదహనాలు, మిస్సింగులను ఖండించండి

మార్చి 14న దంతెవాడ జిల్లా అటవీ ప్రాంతంలో జరిగిన ఎన్‌కౌంటర్‌లో మృతి చెందిన మావోయిస్టుల సంఖ్యను కూడా పోలీసులు నిర్దిష్టంగా చెప్పకపోగా దంతెవాడ, బీజాపూర్, నారాయణపూర్ జిల్లాలో ఎన్‌కౌంటర్ తర్వాత అనేక దుర్మార్గాలకు పాల్పడుతున్నారు. ఈ మూడు జిల్లాల్లో ఆదివాసీల గృహదహనాలు, హత్యలు, మిస్సింగ్‌లు, మహిళలపై లైంగిక అత్యాచారాలు చేస్తున్నారు. మావోయిస్టు నేత రామకృష్ణ కోసం కూంచింగ్ అనే పేరుతో వేల సంఖ్యలో పారామిటరీ బలగాలు, సాల్వాజుడుం మూకలు ఆదివాసీ ప్రాంతాలను అల్లకల్లోలం చేస్తున్నాయి. నిర్దిష్టంగా దంతెవాడ జిల్లాలో మోరేపల్లె గ్రామంలో 35 ఇళ్లను, తాడిమెట్ల గ్రామంలో 207 ఇళ్లను, తిమ్మాపూర్ గ్రామంలో 50 ఇళ్లను తగలబెట్టారు. ఇట్లా 20 గ్రామాల్లో వందలాది ఇళ్లను తగలబెట్టడంతో ఆదివాసులు చెల్లాచెదరైపోయారు. తాడిమెట్ల గ్రామంలో ఒక ఆదివాసీ యువతిని పారా మిలటరీ బలగాలు సామూహిక అత్యాచారం చేసి హత్య చేశాయి. మడ్రి సూలు, మడ్రి సోము అనేవారిని చంపేశారు. మడ్రి హంద, మడ్రి ఐత అనేవారిని మాయం చేశారు. ఇట్లా అనేకమందిని మాయం చేసినట్లుగా తెలుస్తోంది. మాయం చేసిన మహిళలను అత్యాచారం చేసి హత్య చేయడం, మగవాళ్లను చిత్రహింసలు పెట్టి చంపేయడం ఛత్తీస్‌ఘడ్‌లో మార్చి 14 ఎన్‌కౌంటర్ తర్వాత కూంబింగ్‌లు పేరుతో దిగిన బలగాలు విచ్చలవిడిగా చేస్తున్నాయి.

ఛత్తీస్‌ఘడ్‌లోని సహజ సంపదను బహుళజాతి కంపెనీలకు కట్టబెట్టడానికి రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు ఆదివాసీలను అడవి నుంచి తరిమేసి శాశ్వతంగా నిర్వాసితులను చేయడానికి ఈ వేసవిలో చేపట్టిన చర్యల్లో భాగమే చింతల్‌నార్ ఎన్‌కౌంటర్, ఆ తదనంతరం జరుగుతున్న పరిణామాలని విరసం స్పష్టం చేస్తోంది. ఈ వేసవిలో దండకారణ్య ఆదివాసీలపై కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు గ్రీన్‌హంట్ రెండో దశ యుద్ధానికి సిద్ధమవుతున్నాయి. నిజానికి ఇప్పటికే ఒక్క మిలటరీని నేరుగా దింపడం మినహా అన్ని రకాలుగా సైనిక చర్యలనూ, యుద్ధాన్నీ ప్రభుత్వాలు కొనసాగిస్తున్నాయి. ఆదివాసుల జల్, జంగిల్, జమీన్ అనే స్వావలంబన పోరాటాన్ని మావోయిస్టులు విప్లవోద్యమంగా, విముక్తి పోరాటంగా తీర్చిదిద్దుతున్నందు వల్లే ప్రభుత్వాలు ఈ యుద్ధాన్ని ఆదివాసులపై కొనసాగిస్తోంది. ప్రజాస్వామిక వాదులు ఈ గ్రీన్‌హంట్ యుద్ధాన్ని ఆపడానికి, నిర్దిష్టంగా ఛత్తీస్‌ఘడ్‌లో దురాగతాలను అడ్డుకోడానికి గొంతుకలపాలని విరసం విజ్ఞప్తి చేస్తోంది.

నవల సీరియల్

# గుమ్మెటమోత

- పాణి

## (10)

(గత సంచిక తరువాయి)

సంజె చీకట్లు ముసురుకుంటున్న ఆ సమయాన విశాల అక్కడున్న వాళ్లందరి ముఖాల్లోకి నిశితంగా చూస్తోంది. పంచాయతీ సాగినంత సేపూ ఆమె పరిశీలన అదే. వాళ్ల అంతరంగాన్ని వెతుకులాడుతోంది. ఈ తతంగం గురించి వాళ్లేమనుకుంటున్నారు? అని.

కులస్తుల్లో నిరామయ ప్రశాంతత కనిపించింది.

అదే ఆమెను విస్మయానికి గురిచేసింది.

ఆ రోజు పంచాయితీలో వాళ్లు ఎంత ఆగ్రహించిందీ జానయ్య వర్ణించి చెప్పాడు. అప్పుడాయన కొండ దాటి జనారణ్యంలోకి వచ్చిన ఒంటరి లేడిపిల్లలాగా విలవిలలాడిపోయినట్టు, తన కోపం, దుఃఖం అరణ్య రోదనైనట్టు ఆయన మాటలను బట్టి అర్థం చేసుకుంది.

'మా జానయ్య ఉన్నా..!' అని తన గురించి అభిమానంగా, పిసరంత గర్వంగా, తమ రక్షణ కుడ్యంగా భావించి నలుగురితో చెప్పుకొనే కులస్తులు ఆ రోజు నోటికొచ్చినట్లు తిట్టారు. 'లంగనాయాలుకు... నాలుగు అచ్చరాలు నేర్చుకున్నానని దొమ్మపొకురు. మనిండ్లలో యానాకొడుకైనా ఇట్ల చేసిండెనా? పోన్లే అని ఊకుంటే యింకేంలా?' అన్నారు.

వాళ్లకెందుకు ఇంత ఆగ్రహం వచ్చిందో జానయ్యకు మొదట్లో తెలియలేదు. తప్పే చేసినాననుకో.. కాయనీక లేదా? ఈ పొద్దటి దాక వీళ్ల కోసం తాను ఎంత చేసినాడు? అవేవీ మతికి లేవా? ఇట్ల వొంటి కాలి మీద లేచినారు? అని కుమిలిపోయాడు.

ఆయన మాటల్లో ఆ లోతును విశాల తడిమి చూచింది. కొంచెం భయమైంది. మంచికైనా చెడుకైనా జానయ్య తమకు ఒక కొండగట్టులాంటి వాడని నమ్మినవాళ్లే ఇక్కడికి వచ్చే సరికి ఎందుకిలా ప్రతిస్పందించారు? ఈ ఆగ్రహావేశాల తావు ఏమిటి? వాళ్లు ఎక్కడి నుంచి, దేని నుంచి ప్రేరితులయ్యారు? సొంత మనుషులు ఇట్లా మారిపోవడం ఆమెకు తెలిసిందే. నా అనుకున్నవాళ్లే ఎంత పరాయి వాళ్లుగా దుమ్మెత్తిపోసేదీ అనుభవించినదే. అక్కడ కుటుంబం, ఇక్కడ కులం. అంతే తేడా.

'మావోల్లు ఇంతే...' అని ఉలిగప్ప కూడా అన్నాడు - తన ఆశ్చర్యాన్నీ, ఆందోళనను గమనించి.

అప్పటి నుంచి విశాలను అదే వెంటాడుతోంది. పంచాయితీ అని వెళ్తున్నాంగాని ఏం అవుతుంది? ఎట్లా తీసుకుంటారు? దీని వల్ల జానయ్యకు మేలు లేకపోగా మరింత ఇరకాటాన పడడుగదా? అనుకుంది. ఏవేవో కొన్ని ఊహలు చేసింది. కొన్ని అంచనాలకు వచ్చింది.

'కులం అంటే ఏమనుకుండావు? గలీజు పన్లు చేస్తాంటే చూస్తా ఊకొనేదిలా? అట్లగినైతే ఇంక పెద్దమంచులెందుకు, పంచాతులెందుకు?. నాలుగు దినాలు వక్కన పెడితే సిగ్గుమానంపొయ్యి దావకొచ్చినాడు?' అని ఎత్తి పొడుస్తారనుకుంది. సందు దొరికింది గదా? అని హేళన చేస్తారనుకుంది. తమ కాళ్లకిందికి నడిచి వస్తున్నాడనుకుంటారేమో..! అనుకుంది.

అవేవీ జరగలేదు.

కాలం గడిచేకొద్దీ ఆవేశం బదులు మానవీయత చోటు చేసుకుంటుందేమో ! వివాదం పాతబడిపోయినట్లే నిర్ణయమూ పాతబడుతుందేమో. వాటి మధ్య కాలం నడిచిపోయినందువల్లనే గాఢత తగ్గిపోవడమా? ఇది. అదే అయితే వందల వేల ఏండ్లలో కట్టుబాట్లు కూడా సడలిపోవాలి. అట్లా చాలా మాయమైపోయి ఉండొచ్చు. కానీ ఉండగలిగినవన్నీ నిలిచే ఉన్నాయి. బహుశా క్షమ, సర్దుబాటు లేకుంటే కట్టుబాట్లేవైనా నిలవడం కష్టమే. కర్కశమైన కట్టుబాట్లను కూడా అమలు చేయాల్సిందీ, తద్వారా కాపాడుతున్నదీ రక్తమాంసాలున్న మానవులే కదా?

విశాలకు ఏదో తోచినట్లయింది. మనసు చెమ్మగిల్లింది.

మనిషి ఔదార్యంలో కూడా కులం పునర్జీవితం అవుతుందన్నమాట.

"మంచి పిల్లోడు. ఆ పిల్లను లింగమయ్య అతరాన కొడ్తాంటే ఒక్క నాకొడుకు అడ్డంబొయినాడా? నెనరు ఉండేటోడు గావట్టి ఆ పొద్దు టేసన్‌కు తోలకపొయినాడు. ఇన్నేండ్ల సంది ఆ పిల్లోడు ఒగ మాట తూలినోడు కాదు. ఒకల మీదికి పొయినోడు కాదు. కులమంటే ప్రేమ ఉండది గావట్టే మల్లా పంచాతికీ వచ్చినాడు.."

ఎవరో ముసలామె తనలో తాను అనుకున్నట్లే బైటికి అంటోంది. ఆమె ఇంకా .... పది మంది కూచ్చున్నతాన పరమాత్ముడు ఉంటాడు అనుకుంటూ పంచాయితీ నుంచి లేచి పైట ఇదిలించి భుజం మీద వేసుకుంది. జానయ్యను కులంలో కలుపుకోవాలని పెద్దమనుషులు చెప్పాక కూడా ఎవరికైనా అభ్యంతరం ఉంటుందేమో అనుకొని ఆమె సమాధానపరుస్తోంది. అప్పుడు ఎదురుగా మశమ్మ. ఈ మాటలు వింటుంటే ఆమెకు బిచ్చావతి పంచాయతీ గుర్తుకు వచ్చింది. కళ్లలో నీళ్లు తిరిగాయి. విశాల ఎందుకో తన సంశయ, సందిగ్ధ మానసంతో కూడా ఈ విషయం గమనించింది. నిన్న పొద్దున రాగానే ఉలిగప్ప జేజిని పరిచయం చేశాడు. మీరంతా పెద్దోల్లు, సదూకున్నోల్లు..మా ఇండ్లల్లో ఏముంటదని వచ్చినారు? అని మశమ్మ నొచ్చుకున్నది. దానికి తను .. ఏంగాదు, జేజినాయన బాగ పాడతాడంటగా. ఉలిగప్ప చెప్పినాడు. విందామని వచ్చినాం.. అని క్షణం సేపాగాక, చిన్నగా చెవిలో గొనిగినట్లు ... ఉలిగప్పకు చిన్నాయిన ఉండడంటగా, నాకైతే ఆయన్ను చూడాలని ఉంది. వస్తాడా? అంది. దానికి మశమ్మ కళ్ల నీళ్లు తీస్తూ .. వాన్ని యాడ రానిస్తరమ్మా.. అని చెప్పకొచ్చింది.

'పిల్లోన్ని ఉండమనరాదూ..' అని ఎన్నితూర్లు మొగుడ్ని బతిమిలాడుకుందో మశమ్మ. 'వాడేం చేసినాడని?' అని కులంలో

ఒక్క పురుగు అనలేదు. బిచ్చావతిని కాళ్లావేళ్లాపడింది. ఈఊడనే ఉండరా. యా పొద్దుకో పెద్దమంచులు కనికరించరా? కులపోల్లు కలపకపోరా? అని నచ్చచెప్పింది. కానీ బిచ్చావతి ఎట్లాంటి వాడు? నీ కులానికి నా చెప్పు దెబ్బ.. అని రెండో మాటకు తావు ఇచ్చేవాడు కాదు.

మశమ్మను అట్లా చూసి విశాలకు విచారం కలిగినా ముసలామె మాటలతో గొప్ప ఆనందం కలిగింది. కులానికి ఆంక్ష పెట్టడమేగాక, క్షమాగుణం కూడా ఉంది. కట్టుబాట్లను ఈ రెంటికి మధ్య చూడాలి. అందుకే మనుషులు ఎంత కర్కశంగా ఉంటారో, అంత దయామయంగా కూడా ఉంటారు.. అనుకుంది. తను సరిగ్గా అర్థం చేసుకుంటున్నందుకు కలిగిన ఆనందమది.

అందరూ ఎవరంతకు వాళ్ల అక్కడి నుంచి లేచిపోతున్నారు. ఏదో జరగకూడనిది జరిగిందనుకోవడం లేదు. ఇంతక ముందు ఎప్పుడెప్పుడు ఇట్లాంటి పంచాయతీలు జరిగిందీ చెప్పుకుంటున్నారు. అప్పుడు పెద్దమనుషులుగా ఎవరున్నదీ, ఎంత దండగ కట్టించిందీ గుర్తు చేసుకుంటున్నారు. పెద్దమనుషులు కల్లు తాగడానికి లేచిపోయారు. అప్పటికే తాగిన వాళ్ల పంచాయితీ నడిచినంత సేపు గమ్మున ఉండి ఇంక వదరడం మొదలు పెట్టారు. ఆ సన్నివేశం విశాలకు వింతగానూ, కొత్తగానూ, సజీవంగానూ తోస్తోంది. వీళ్లంతా ఎక్కడపోయారా? అని గిరి వాళ్ల కోసం వెతికింది. గుంపులో ఎక్కడో ఉన్నారు.

ఆ క్షణాన 'పుస్తకాలు అర్థం చేసుకోవడం తేలికే, జీవితాన్ని అర్థం చేసుకోవడమే కష్టం... ' అని సుధాకర్ అనే మాట గుర్తుకు వచ్చింది.

ఆ మాట గిరిని ఉద్దేశించింది.

'నేను ఒప్పుకోను, గిరి చాలా కష్టపడి పైకి వచ్చాడు. నాకన్నా, నీకన్నా కింది నుంచి వచ్చాడు. అది మర్చిపోవద్దు..' అని ఆ రోజు విశాల అన్నది.

'కష్టాలు అనుభవించడమే జీవితం తెలియడం కాదు. ఈ మాట నీవు ఒప్పుకోవనీ తెలుసు. నీవే కాదు, చాలా మంది నా మీద విరుచుకపడతారు..' కరాఖండిగా అన్నాడు సుధాకర్.

గిరి ఆ మధ్య ఎక్కడో రాస్తూ- జీవితానుభవమే సత్యం అయ్యేటట్లయితే మానవజాతి శాస్త్రాలను తయారు చేసుకొని ఉండేది కాదు. ఆ రెంటికీ తప్పక సంబంధం ఉంటుంది. జీవితం, అనుభవం చాలా విలువైనవి. కానీ జీవితాన్ని అర్థం చేసుకొని మార్చుకోవడానికి అనుభవమే సరిపోదు. అందుకే శాస్త్రం పుట్టుకొచ్చింది. శాస్త్ర పద్ధతి లేని వాదన చాలా చాలా పెద్ద మనుషులు కూడా చేయవచ్చు. దాన్ని వాగుడు అని మాత్రమే అనగలం... దాన్ని పిట్ట కథలుగా గుర్తించగలం. అయితే దాని వల్ల కొంచెం సాహిత్యానుభూతి పొందగలం.... అని ఎవరి మీదో విరుచుకుపడ్డాడు.

అవతలి పక్షాన ఉన్న వ్యక్తి సుధాకర్‌కు చాలా సన్నిహితం కాబట్టి గిరి రాసింది నచ్చలేదు. అసలే నచ్చదు.. దానికి ఇదీ తోడైంది. సొంతంగా ఆలోచించే వాళ్లంటే ఎంత ఇష్టమున్నా గిరి మీద దురభిప్రాయమే స్థిరపడిపోయింది.

మన నిమిత్తం లేకుండా మనకు జీవితానుభం చాలా ఉండొచ్చు. కానీ అర్థం చేసుకోవడం, సొంతం చేసుకోవడం అందరికీ చేతకాదు. ఏవో సిద్ధాంతాలు తయారుచేసి పెట్టుకున్నవాళ్లకు అవే అడ్డంపడుతుంటాయి.... అనే వాదన అతనిది.

ఇందులో సుధాకర్ వెనక్కి తగ్గడు.

అతని మాట ఆలోచించాల్సిందే అయినా, గిరికి ఇది వర్తించదనుకొని ఆరోజు విశాల యింక కొనసాగించలేదు.

ఇప్పుడదంతా గుర్తుకొస్తోంది.

జీవితాన్ని అర్థం చేసుకోవడం అంటే ఇదేనేమో... అనుకుంటూ మిగతా వాళ్లందరినీ చూచింది.

జానయ్య ఉద్వేగంగా గిరి చేతులు పట్టుకొని మాట్లాడుతున్నాడు. వెంకటేశ్వర్లుసారు అతని భుజం చుట్టూ చేతులు వేసి పొదివిపట్టుకొన్నాడు. జానయ్యకు తన్మయంగా ఉంది. నోటివెంట ధారగా మాటలు రావడం లేదు. ఇదంతా నిజమా? కలా? అనుకుంటున్నాడు. వెలికి గురైనప్పటి నుంచి కులం లోపలా, బైటా ఆయన ఇరుకునపడిపోయాడు. తన చుట్టూ ఉండిన రక్షణ వలయం క్షణకాలంలో కరిగిపోయినట్టు, తానొక వంటరిగా నిత్య అభద్రతలోకి జారిపోయాడు. ఈ పంచాయతీ కుల పెద్దల నిర్ణయంతో పునర్జీవితంలోకి చేరుకున్నట్టనిపించింది.

"మొత్తం మీద తిరిగి కులంలోకి చేరుకున్నావ్..." మందస్మితంగా అన్నాడు గిరి.

ఏ అర్థంలో గిరి ఆ మాట అన్నదీ జానయ్యకు బోధపడలేదు. కొంచెం అమాయకంగా, అయోమయంగా చూశాడు.

చీకట్లు ముసురుతున్న ఆ సమయాన కూడా జానయ్య నల్లని ముఖంలో ఆ కవళికలు ఉలిగప్ప గమనించాడు. గిరి దీని మీద మొదటి నుంచి ఏం ఆలోచిస్తున్నదీ తెలుసు కాబట్టి వెంకటేశ్వర్లుసారు కళ్లద్దాల పైనుంచి ఓరగా చూశాడు. ' పని అయిపోయిందిగదా... ఇక నీ ఇష్టం వచ్చినట్టు విశ్లేషించుకోవచ్చు...' అన్నట్టుందాచూపు.

వెంకటేశ్వర్లుకు మొదట ఇది అయ్యేదేనా? అనిపించింది. పైగా ఇలాంటివాటిని గిరి ఎట్లా ఆలోచించేదీ తెలుసు. అయితే పని చేసేటప్పుడు గిరి తన ఆలోచనలన్నీ వాటి మీద పులమడని కూడా నమ్మకం. చాలా సార్లు గమనించాడు. అందుకే ఇక్కడికి రావడానికి ఒప్పుకున్నాడు.

"లా చదువుకొని మోడరన్ లీగల్ సిస్టంలో ఉన్న జానన్నను ప్రీమాడరన్ న్యాయ వ్యవస్థ వెలి వేసి, చివరికి నేరస్థుడి సత్ప్రవర్తనను పరిగణలోకి తీసుకుంటూ పెనాల్టీతో క్షమించి వదిలిపెట్టిందన్నమాట....." అన్నాడు గిరి.

అంతటితో ఆగకుండా... 'కమ్యూనిటీ నుంచి ఆధునిక జీవితంలోకి వచ్చాక కూడా కులం తన కట్టుబాట్లతో

లొంగదీసుకొని తిరిగి తనలోకి కలుపుకుంది. దానికి మనమంతా చేయీ చేయీ కలిపాం' అన్నాడు.

అక్కడికి వచ్చిన విశాల క్షణం సేపు ఆశ్చర్యంలో మునిగిపోయింది. ఎట్లా వస్తాయి.... ఇలాంటి ఆలోచనలు? అనుకుంటూ జానయ్య ఏమనుకుంటాడో అని " మొత్తం మీద క్షమ ఉందని తెలిసింది గదా?" అంది.

వెంకటేశ్వర్లుకు అర్థం కావడం లేదు. ఏమిటీ ఈ పిల్లవాడు? మనోళ్లంటే ఎంత ఇష్టం! ఎంత పనైనా చేస్తాడు. మళ్లీ ఇంత విమర్శిస్తాడు. ఇట్లాంటి పనులేవీ నచ్చవు. ఆ రోజు గుమ్మెట తాంబురలతో ఊరేగింపు అన్నప్పుడు కూడా ఇట్లాంటివే పదునైన మాటలు చాలా చెప్పాడు. అయితే అవి పనికి ఆటంకమవుతాయేమో అనే అప్రమత్తత కూడా ఉంది. అందుకే పట్టుపట్టడు. ఏది అవసరమో అది మనస్ఫూర్తిగా చేస్తాడు...

ఆలోచిస్తుంటే గిరి మీద గౌరవం కలిగింది.

కొంచెం అపురూపంగా చూశాడు.

వీళ్లు ఈ మాటల్లో ఉండగానే చీకట్లు అలుముకపోయాయి. అక్కడున్నవాళ్లందరూ ఫుల్‌గా తాగారు. సన్నివేశం పూర్తిగా మారిపోయింది. విశాల ఆలోచనలన్నీ కట్టిపెట్టి ఒక్కొక్కరి మాటలను, ప్రవర్తనను శ్రద్ధగా గమనించసాగింది. ఉలిగప్ప తండ్రి, తమ్ముళ్లతో సహా అందరూ తాగారు. పంచాయితీ మీద లోపల దాగి ఉన్నవన్నీ బైటికి వస్తున్నాయి. జానయ్యను వెలేసినందుకు ఇప్పుడు ఆగ్రహంతో కొందరు ఊగిపోతున్నారు. ఎవరెవరినో బూతులు తిడుతున్నారు. లింగమయ్య అయితే 'ఆనిగాడు.. అయిద్రాబాదు నుంచి మంచులను తోలుకొని వస్తే మల్లా పంచాతి చేస్తరా? దుడ్లు కడితే సరిపోయ్యేటట్లయితే నేను దినాం తప్పు చేస్తా, ఒప్పుకుంటరా?' అంటున్నాడు.

ఉలిగప్ప వచ్చి విశాలను పిల్చుకపోయి ' జానయ్య కతలో తెర వెనుక విలన్ ఇతనే' అని చెప్పాడు.

'భార్యను కొట్టడం విలన్ అని ఇక్కడ ఎవరూ అనుకోరనుకుంటా. అది మొగవాళ్లందరూ హక్కుగా భావిస్తారు. ఆడవాళ్లేమో చాలా మామూలు వ్యవహారమనుకుంటారు. జానయ్య అట్లా అనుకోనందుకే ఇంత గొడవైంది...' విశాల అన్నది.

అంతా గడిబిడిగా ఉంటే జంబులు ఒక పక్క గంభీరంగా కూర్చున్నాడు. తాజా కల్లు ఇష్టంగా తాగుతాడు. కానీ ఈ పొద్దు కాస్త గొంతు తడుపుకొని గుంభనంగా మాట పలుకూ లేకుండా ఓ రాతి గుట్ట మీద కూర్చున్నాడు.

వీధిలో రెండు ఎర్రటి కరెంటు బల్బులు వెలుగుతున్నాయి. ఆ కాంతి ఒక చోట కొంచెం మందంగా, మరోచోట పల్చగా పరుచుకొని ఉంది. ఆ వెలుగులో అక్కడున్నవారి ప్రవర్తనలు, మాటలు, నటనలు, గానాలు... వెరసి ఎన్నడూ చూడని దృశ్యంగా [illegible]గోచరిస్తోంది.

దూరంగా కూర్చున్న జంబులునే తదేకంగా పరీక్షిస్తూ.. "మీ [illegible]నతో మాట్లాడదామా? మళ్లీ రేప్పొద్దునే మనం పోవాలిగదా? " అన్నది ఉలిగప్పతో.

"ఇప్పుడా.. ముసలోడు బిర్రుగ పట్టించినట్లుందే. ఏం మాట్లాడుతాడబ్బా"అన్నాడు సందేహంగా ఉలిగప్ప.

"బలే వాడివే. ఇప్పుడే అసలు కత చెప్పేది. మామూలప్పుడు వాళ్లకు తెలిసిన కళే బైటికి వస్తుంది. ఇప్పుడు లోపల వాళ్లకే తెలియకుండా ఉన్న కళలన్నీ తన్నుకోని వస్తాయి" అన్నాడు గిరి.

ఆ సంగతి ఉలిగప్పకు తెలియంది కాదు. తాగి ఏం మాట్లాడతాడో అని కొంచెం బిడియపడ్డాడు. అందరూ వెళ్లి దగ్గర కూర్చున్నారు. వెంకటేశ్వర్లుసారు రెండడగుల దూరంలో నిలబడ్డాడు. వీళ్ల రాకను జంబులు పట్టించుకోలేదు. ఎటో చూస్తుండిపోయాడు.

"జేనాయినా ... నీతో మాట్లాడతారంట.." అన్నాడు ఉలిగప్ప.

జంబులు కొన్ని క్షణాలు ఉలకలేదు, పలకలేదు. ఆ తర్వాత " జానయ్యగాడేడి, పొయినాడా? " అన్నాడు.

"లే. ఈడనే ఉండాల.." అని గిరి వెతికాడు. కనిపించలేదు.

"వాడు పున్యం చేసుకుండాడు..." అన్నాడు ముద్దుగా, గంభీరంగా.

ఆ మాటను అక్కడున్నవాళ్లందరూ చాలా శ్రద్ధగా విన్నారు. ఒకరి ముఖాల్లోకి ఒకరు చూసుకున్నారు. దీని అర్థం ఏమిటి? అనుకున్నారు. వెంకటేశ్వర్లు వచ్చి దగ్గర నేల మీద చతికిల పడ్డాడు. ఇంకా ఏమైనా మాట్లాడుతాడేమో అని ఎదురుచూశాడు.

"నాయినా... పంచాతి బాగ జరిగిందంటవా?" అన్నాడు.

ఏం పలకలేదు.

"ఇట్లా పంచాతి చేయడం నీకిష్టమేనా?" అని లోతుగా అడిగాడు. దానికి ఏమంటాడో అని అందరూ ఎదురుచూశారు. ఇది ఉలిగప్ప ఊహించనిది.

"కులమిడిసిన పక్షి లేదు... వనమిడిసిన కోతి లేదు. వాన్ని ఆ బగమంతుడు మీకాడికి పంపించినాడు. మా బిచ్చాతిగాడికి కూడా తిరగ పంచాతి చేస్తే బాగుండు" అన్నాడు. ఈ మాట కొంచెం దుఃఖంగా వచ్చింది.

విశాల ముందుకు జరిగి " మీ బిచ్చాతి గురించి చెప్పు పెద్దాయినా? ఏమైంది? " అని అడిగింది.

రెండు నిమిషాల దాకా జంబులు .ఏమీ మాట్లాడలేదు. మాటలు వెతుక్కుంటున్నాడా? చెప్పడం ఇష్టం లేదా? అనుకుంటుంటే.. నోరు తెరిచి ఏదో చెప్పడానికి నోరు తెరిచి... ఒక్క పెట్టున ఏడ్చాడు. అక్కడున్నవాళ్లందరూ దిగ్భ్రాంతి చెందారు. విశాల గుండె చెదిరిపోయింది. ఉలిగప్ప అదిరిపోయాడు. అప్పుడు ఏం మాట్లాడాలో తెలియలేదు. జేనాయినతో మాటలు పొసగని సందర్భాలు ఎన్నో. కానీ ఇలాంటిది ఎన్నడూ ఎదురుకాలేదు.

(ఇంకా ఉంది....)

## శ్రీకాకుళం జిల్లాలోని థర్మల్ పవర్ ప్లాంట్‌లకు వ్యతిరేకంగా 24 మార్చి, 2011న హైదరాబాద్‌లోని బషీర్‌బాగ్ ప్రెస్‌క్లబ్‌లో విరసం నిర్వహించిన సభ దృశ్యాలు



ప్రజాకళా మండలి బృందం, కళాకారులు




కె. జీవన్‌కుమార్ (మానవ హక్కుల వేదిక), చిలుకా చంద్రశేఖర్ (ఆం.ప్ర. పౌరహక్కుల సంఘం), బి. అభినవ్ (కులనిర్మూలన పోరాటసమితి), ప్రొ. బాబూరావు (ఐఐసిటి)



గీతాంజలి (విరసం), ఆగమణి (చైతన్య మహిళా సంఘం), రత్నమాల (విరసం)




ప్రజాకళా మండలి బృందం -
ప్రభాకర్, శ్రీనివాస్, కోటి, జాన్ తదితరులు



జాన్, శిల్ప (చైతన్య మహిళా సంఘం) తదితరులు

**ARUNATARA** A Literary and Cultural Telugu Monthly Journal of Revolu... Association (VIRASAM)

● RNI Regn.No.21152/72 ● Published on 18/04/2011 ... March 2011

KLVA101M152

# 28 ఫిబ్రవరి, 2011న శ్రీకాకుళం జిల్లాలోని వడ్డితాండ్ర, ఆకాశలక్కవరం గ్రామాలపై పోలీసులు జరిపిన బీభత్సకాండ దృశ్యాలు





పోలీసు కాల్పుల్లో చనిపోయిన నాగేశ్వరరావు - భార్య, కూతురు







Edited, printed, published and owned by Chalasani Prasad, H.No. 33-13-3, Seetharampuram, Vijayawada - 520 002
Printed at Charita Impressions, Azamabad, Hyderabad - 500 020 for Nagendra Printing Press, Vijayawada - 520 002,
Editor : Chalasani Prasad

మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| పుస్తకం సంఖ్య | KLVA101M152 |
|---|---|
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 117 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Nazma |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | Sharmila |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |